# శ్రీ సాయీ అనుసరణము

# SRI SAI ANUSARANAM






రచయిత: కీ. శే. బాపట్ల హనుమంతరావుగారు

ప్రచురణకర్త: బాపట్ల వేంకట పార్థసారథి
శ్రీ సాయీ నిలయమ్, చెరువు (పి. ఒ.)
గుంటూరుజిల్లా (ఏ. పి.)

ఓమ్

శ్రీ వేంకటేశాయనమః

శ్రీ సాయీ సద్గురవేనమః

# శ్రీ సాయీ అనుసరణము





రచయిత: కీ. శే. బాపట్ల హనుమంతరావుగారు

ప్రచురణకర్త: బాపట్ల వేంకట పార్థసారథి

శ్రీ సాయీ నిలయమ్, చెరువు (పి. ఒ.) Pin. 522 113

గుంటూరుజిల్లా (ఏ. పి.)

సర్వహక్కులు :
ప్రచురణ కర్తవి,

ముద్రణ కూర్పు :
1000 ప్రతులు.



కృతి సమర్పణము

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు
దేవుఁడగు శ్రీ సాయిబాబా
చరణారవిందములకు
అంకితముఁ గావింపబడినది.

శ్రీ సాయిశరణ్
రచయిత.

శాస్త్ర గురు బోధలను మఱి స్వానుభవము
తలిమి నెద్దాని నరుఁ డేడుగడఁగ నమ్ము
నదియె శ్రేష్ఠంబుఁ, బరమమౌనదియు, యదె జ
గంబునన్ వాని కవలంబనంబు, సాయి!

కృతిభర్త

# శ్రీ సాయిబాబా





రచయిత: శ్రీ బాపట్ల హనుమంతరావుగారు

# శ్రీ సాయిబాబా ఏకాదశ సూక్తులు

1. శిరిడిగ్రామముజేరినవారిని - జెనకవు వ్యసనములు

2. ద్వారకామాయిని నడుగిడు మాత్రన ప్రాపించున్సు సితులు.

3. భౌతిక దేహము వదలితి ననియే - భయమును గననేల?
బ్రాతిగనావారికి జాగృతితో బ్రాపిడు దెవ్వేళ.

4 ఆసక్తి సమాశ్రయించు వారల - నన్నివేళలందు
ఈ సమాధియందుండియె రక్షణ - మిచ్చెద నికముందు

5. మెలకువతో నీ సమాధినుండియె మిమ్మెల్లర గందు

6. మెలపున నిందుండి మనుజభాషల - మీతో వాకొందు

7. శ్రితుడై శరణొందిన వానిని ర - క్షించుట నా వ్రతము.

8. వ్రతమతి నను జూచువాని యెడ నే - బఱపుదు కటాక్షము.

9. భక్తి పరుండై యెవండు నాపై భారంబుల నునుచు
సక్తిని నే నిర్వహింతు వానికి - సౌఖ్యంబుల నిడుచు

10. సాయంబేనియు బోధనేని యే - జను డాసించినను
త్రోయక వానికి హితగతి నే దో - డ్తో సమకూర్చుదును.

11. ఈ రహస్యమిక మీరలు నమ్ముడి! యెందు మఱువరాదు

దారిద్ర్యము నా భక్తునింట నె - త్తఱి నిల్వగబోదు.

తే॥ సాయిబాబా ముఖోద్గతము లీ - సత్యాభయసూక్తులను
శ్రేయస్కాములు విశ్వసించి యార్జింపుడు సుఖశాంతులను.

— గ్రంథకర్త.

ఓం

శ్రీ సాయినాథాయనమః

శ్రీ సాయీ ప్రసన్న!

# శ్రీ సాయీ శరణ్యాష్టకమ్

సకల విధఘోర కలికల్మషములబాపు
సకల కామితార్థముల కాంచంగజేయు
సకల మంగళాస్పదములై సతము వెలుగు,
సాయి చరణాబ్జములె నాకు శరణు! శరణు!

ధనము, ధాన్యంబు, పశుసంపదయు యశంబు
బంధుతతిగల్గియును మోహపరచునాశ!
జన్మరాహిత్య కర్మల సలుప నిపుడు
సాయి చరణాబ్జములె నాకు శరణు! శరణు!

గడియగడియ సమస్యలు కలతబెట్టు,
వెలితి కనుపించు బ్రతిచర్య, వెతను బఱపు,
పొందజాల బ్రశాంతి నేమందు, నింక
సాయి చరణాబ్జములె నాకు శరణు! శరణు!

"తనయ! నాకు నీకును, భక్తజనుల కవవి
చిత్తశాంతిని గూర్చు బ్రసిద్ధమణులు
అవియే! పూజింపు" మనే తండ్రి! అట్టి దివ్య
సాయి చరణాబ్జములె నాకు శరణు! శరణు!

3

దేహదార్ఢ్యము తఱిగెడు దినదినంబు,
కరుడుగట్టిన కాంక్షలు కలచు మదిని,
గమ్యమును జేర నన్యమార్గంబు లేదు
సాయి చరణాబ్జములె నాకు శరణు! శరణు!

బంధములఁ బాపి, నిత్యశుభంబు లొసగు,
మతిని సన్మార్గమున నిల్పి హితవు గఱపు,
శాశ్వతానంద మిచ్చు, ప్రశాంతి గూర్చు
సాయి చరణాబ్జములె నాకు శరణు! శరణు!

దేవదివ్యరూపంబున తేజరిల్లు
షిర్డిపురమున ప్రీతి వాసిను డగుచు,
సద్గతికి త్రోవ వామహస్తమున జూపు
సాయి చరణాబ్జములె నాకు శరణు! శరణు!

మోహమూలంబులకును నిర్మూలనములు,
ఘనవిరక్తి శాంతుల కాది కారణములు,
భవభయంకర కర్మనివారణములు,
సాయి చరణాబ్జములె నాకు శరణు! శరణు!

శ్రీ సాయీ సమర్థ.

— ప్రచురణకర్త

ఓమ్

# తొలిపలుకు

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధి కలుగునో అప్పుడెల్ల నేనవతరించుచుందును అని భగవానుని సూక్తి. 'సత్యాన్నాస్తి పరో ధర్మః, అహింసాపరమోధర్మః' అనుసూక్తుల ప్రకారము ధర్మమనగా సత్యాహింసలని ముఖ్యార్థము. కనుక సత్యము, అహింస లోకములో తగ్గి, అసత్యము, హింస వృద్ధిచెందినప్పుడు భగవంతుడేదో ఒక రూపములో అవతరించి, వానిని వరిచేయును అని తెలుచున్నది. అట్లయిన నేడు అట్టి పరిస్థితి ఏర్పడియే యున్నదిగదా! భగవంతు డవతరింపలేదేమి? యని కొందరడుగుచుందురు. దీనికి సమాధానము, భగవంతు డవతరించుచునే యున్నాడు; కాని మనము గుర్తించుట లేదు అని చెప్పవలసియున్నది. భగవంతుడెప్పుడును చతుర్భుజములతోను, శంఖ చక్రములతోను అవతరించ నక్కఱలేదు. సామాన్య మానవునివలెగూడ అవతరించవచ్చును. రామావతారము, బుద్ధావతారము అట్టివే. అట్టియెడ అతనిని అవతారముగా గుర్తించుట యెట్లు? అని అడుగవచ్చును. దానికి సమాధానము గీతలోనే చెప్పబడియున్నది.

"యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా
తత్తదేవావగచ్ఛత్వం మమతేజోంశసంభవమ్!"

సామాన్య మానవులకంటె విశిష్టమైన తేజస్సు, ప్రభావము, ధర్మస్థాపన సామర్థ్యము, గలవారందఱు భగవదంశతో జన్మించినవారనియే చెప్పవచ్చును. యుగానుసారముగా అధర్మమును నిరసించి ధర్మమును ప్రబోధించి, జనులను సన్మార్గమున ప్రవర్తింపచేయువారెల్లరు భగవదవతారములేయని చెప్పవచ్చును. కనుకనే శ్రీశంకరా

చార్యాది మహాపురుషులను మనము భగవదవతారములుగా భావించి పూజించుచున్నాము.

అదే విధముగా ఆధునిక కాలమున భగవదవతారముగా పూజింపబడిన మహాపురుషుడు షిర్డి సాయీబాబా. ఆయన హిందువులైన తల్లిదండ్రులకు జన్మించి, ఒక మహమ్మదీయ ఫకీరుచే పెంచబడి, చిన్నతనము నుండియు జ్ఞాన వైరాగ్య సంపన్నుడై అన్ని మతముల వారి చేతను గురువుగా ఆరాధింపబడిన మహాత్ముడు.

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం
మమవర్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః"

'ఎవరు నన్నే విధముగా కొల్చిన వారి నావిధముగా పొందుదును. లోకములోని మనుష్యులందఱు ఎట్లు కొల్చినను నన్నుకొలిచిన వారే యగుదురు' అను గీతావాక్యము ప్రకారము ఈశ్వరుడన్నను, అల్లా అన్నను ఒకే దేవుని పేర్లను విషయమును ప్రత్యక్షముగా ప్రబోధించుటకు అవతరించిన ప్రవక్తగా శ్రీసాయీ బాబాను ఎంచ వచ్చును. 'మందిర్ - మస్జిద్' - తేరేధామ్' అన్నట్లు ఆయన నివాసముగా ఏర్పఱచు కొన్న మసీదుకు "ద్వారకామాయి" అని ఆయనపేరు పెట్టినాడు. హిందువులైన భక్తులచే (జ్ఞానేశ్వరి మహారాష్ట్ర భాషలో భగవద్గీతకు వ్యాఖ్యాన గ్రంథము). విష్ణు సహస్రనామములు మొదలైనవి చదివించినాడు. మహమ్మదీయ భక్తులచే 'కొరాన్' చదివించినాడు. తాము రెండింటికి అతీతులుగా నుండి సర్వసమత్వమును బోధించినాడు. మా మతము గొప్పది. మా మతము గొప్పది, అను మత దురహంకారము గల రోజులలో, దానిని రూపుమాపి అన్ని మతములును ఈశ్వరుని జేరుటకు మార్గములే యనియు, ఈశ్వరుని యెడ నిజమైన భక్తి ఉన్నచో ఏ మతము వారైనను, ఈశ్వర సాన్నిధ్యము పొందగలరనియు ప్రబోధించి, ఎందఱో భక్తులను తరింపజేసినాడు. ఈ విధముగా తరించిన భక్తుల చరిత్రము లన్నియు "ఏమిా? నిన్నుపేక్షింతునా!" అను పేర 5 సంపుటములుగా ఈ గ్రంథ రచయితయైన కీ. శే. బాపట్ల హనుమంత

రావుగారిచేతనే రచింపబడినవి. "శ్రీసాయీ అనుసరణము" అను ఈ గ్రంథము శ్రీ సాయిబాబా తత్త్వమును భక్తులకు సుబోధము కావించుచున్నది. కీ. శే. హనుమంతరావుగారు షిర్డి సాయిబాబా ఆస్థాన కవియేగాక, వారి భక్తులలో అగ్రగణ్యులైనవారు. శ్రీసాయి తత్త్వామృతమును తాము గ్రోలి తరించుటయే కాక, "స్వయం తీర్ణః పరాంస్తారయతి" అను న్యాయమున ఇతరులను గూడ తరింప జేయ వలెనను ఉదాత్తాశయముతో, ఎంతో శ్రమ కోర్చి యా గ్రంథము లన్నిటిని రచించిరి. వారు గీర్వాణాంధ్ర భాషలలో పండిత ప్రకాండులగుటచే చక్కని భాషాసౌష్ఠవము, భావశుద్ధి, ప్రసన్నమగు శైలి - ఈ గ్రంథ మందంతటను కన్పించుచు, పాఠకులలో చివర వఱకు చదువ వలెనను ఉత్సాహమును కల్గించు చున్నది. నడుమ నడుమ, గీతా శ్లోకములు, సాయి కబీరు సూక్తులు, ప్రబోధామృతము, మల్లెదండలో గులాబీలు గ్రుచ్చినట్లు పరిమళించు చున్నవి. ఇట్టి పవిత్ర గ్రంథమును రచించి ఆంధ్ర భాషకు, ఆంధ్రులకు మహోపకారముచేసిన శ్రీ హనుమంతరావుగారి పవిత్ర స్మృతికి నమోవాకములు.

'ఆత్మావై పుత్రనామాసి' అను శ్రుతి వాక్యము సార్థకమగునట్లు తాము వ్రాసిన గ్రంథములను, తమ సుపుత్రులైన శ్రీ పార్థసారథి గారు ఎంతో భక్తి శ్రద్ధలతో, ఇతర భక్తుల తోడ్పాటుతో శ్రమకోర్చి ముద్రింపించుటచేత గూడ ఈ రచయిత సార్థక జన్ములు.

ఇట్టి ఉత్తమ గ్రంథమునకు తొలిపలుకు వ్రాయవలసినదిగా కోరి, నాకు గూడ ఈ సుకృతములో పాలొసంగినందుకు, మిత్రులు శ్రీ పార్థసారథిగారికి కృతజ్ఞుడను. ఆంధ్ర మహాజనులు ఈ గ్రంథము నాదరించి, తాముగూడ ఈ సుకృతములో పాలుపంచుకొందురు గాక!

కొవ్వూరు
15–10–1976

ఇట్లు విధేయుడు,
'కళాప్రపూర్ణ'
**కేశిరాజు వేంకటనృశింహ అప్పారావు**
**Retired Sanscrit College Principal**

# ప్రశంస

"శ్రీసాయీ అనుసరణము"
భాసిల్లెడు నిహము సతము భక్తజనవరా
భ్యాస గ్రంథమ్మై; యిడు
వ్రాసిన హనుమంతకవికిఁ బాయని యశమున్

అనుసరణము భవహరణము
జనతామయ సంభరణము శరణము షిర్డీ
శుని చరణము "శ్రీసాయీ
అనుసరణము" భక్తవరుల కగుఁదారణమున్

సాయీనాథుని మనమునఁ
బాయక శ్రద్ధం జదివెడు వారల మదికిన్
హాయిని సుగతిని నీ "శ్రీ
సాయీ అనుసరణ" మిడుత సతతము జగతిన్.

సాయనిపల్లి,
వేటపాలెం.
13–10–76

— B. V. V. రాఘవేంద్రరావు,
M. A. B. Ed;

# శ్రీ బాపట్ల హనుమంతరాయ కవికి
# జోహార్లు

పలికెడు నీహనుమత్కవి
పలికించెడిగురుడు సాయిబాబా; దీనిం
బలికిన తొలఁగున్ శిలుగులు,
కలుగు కలుములు మహాత్ముకరుణన్ వెలుగున్.

సాయీ! శ్రీనాగేశ్వర
శాయికి సదృశుండవీవు, సద్గురు! హాయీ
దాయీ! భవాబ్ధితరణో
పాయీ! శ్రీషిరిడి సాయిబాబా! ప్రణతుల్.

హనుమంతరాయ కవీ!

పిలిచినపలుకున్సాయీ
సలలిత దయ జూపి సర్వసౌఖ్యము లిడు నీ
యిల నీకృతి జదివెడు భ
క్తులకున్; హనుమంతరాయ తుల్యులుగలరా?

మీరు గీచిన గీతకు మారులేక
సాయిచరిత్ర రచనల సారమెఱిగి
మీ కుమారుడు ప్రచురించు మించువేడ్క
ఎంత పుణ్యమూర్తివో! హనుమంతరాయ!

సరళకవిత్వతత్వమును, శాంతి మహెూక్తుల నాంధ్రలోక మం
దరకును పాఠయోగ్యమయి, పావనమౌచు మహార్థమై ధరన్
చిరముగ సాయిభక్తులకు చింతనమంతనమై విరాజిలున్
గురుహనుమంతరాయకవి కోవిద! మీకు జోహారు మిత్రమా!

సాయించితివి షిర్డి సాయీచరిత్రము,
నాంధ్రులు తలలూపి యాదరింప,
పండితోపాధ్యాయ పదమందు, విద్యార్థి
బృంద గౌరవమును బొందినావు,
దైవజ్ఞమణివయి, తరచిజాతక లక్ష
ణంబులదెల్పి యశంబుగొంటి
వార్య! లౌకికమైన వ్యవహారముల మంచి
సలహాలతోడుత సర్దినావు,
ఎందరెందరో దేవుళ్ళ నెందరెంద
రెటులో గొలుచుచు విడుచుచు దిటములేక
యున్న యటుబోక సాయీశునొకని నమ్మి
నిలచి తమిగొల్చి, భక్తి నిష్ఠలను వెలసి
నాడవీవు శ్రీహనుమంతరాయసుకవి!

బాపట్ల,
1—12—76.

ఇట్లు,
జిగర్లపూడి వేంకట సుబ్బయ్యశాస్త్రి,

ఓం శ్రీసాయి చరణం శరణంమమ

ఓం శ్రీసాయి ప్రసన్న!

# పరిచయము

శ్రీసాయి సారస్వతవాచస్పతి, భగవదుపనిషత్కార, బ్రహ్మ విద్యాధిపత్యసార్వభౌములు, అద్వైత సిద్ధాంత గీతాప్రవచన నిరూపణ స్థితప్రజ్ఞులు, పూర్వజన్మ సుకృత కర్మ విపాకముచే కృష్ణసాయి ఆదేశిత కర్తగ, దూతగ ఆవిర్భవించి, అనుంగు బిడ్డగ అలరారుచు, వారి సంకల్పానుసారంగా గీతాకల్ప మకరందాన్ని ఉగ్గుపాలతో గ్రోలి, జీర్ణించుకొని, 1944 సంవత్సరమున షిరిడీశ్వర దివ్యసాక్షాత్కార మహద్భాగ్యము నొంది, బాబా కృపాకటాక్ష ప్రసారప్రబోధితుడై శ్రీసాయి ఆస్థాన కవీశ్వరుడుగ పేర్కొనబడి, శ్రీసాయి సారస్వత వాఙ్మయమును మథించి, కూలంకష ప్రజ్ఞాన్వితుడై, అధికవ్యయ ప్రయాసలతో సాయి భక్తకోటి అనుభవములు సంతరించుకొని, సమీక రించుకొని, ఏర్చి, కూర్చి అనేక గ్రంథరూపముల అందించి, హృదయ ములు స్పందించి, పారవశ్యము నొంది, అనుభూతి పొంది, విభూతి జెంది తరించు యోగ్యతను కల్గచేసి అలరారిన ధన్యజీవులు పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు - యీ గ్రంథ రచయిత!

వీరి సాయి సారస్వత ప్రవచనధోరణి, నిరూపణయందు స్థితప్రజ్ఞత, విశ్వవ్యాప్త మొనరించుటలో అంతర్లీన నిర్దేశితాన్వయ సమీ కరణ గణనీయమైనదనుట అతిశయోక్తి కాజాలదు. సులభమై, సుబోధ కరమై సూటిగ హృదయమునకు హత్తుకొని, లోకాంతర, దృష్టాంతర సంయుతమై సాయి విజ్ఞాన ప్రచారధోరణి, మనోరంజితమైన వారి అమృతమయ మధురవాక్కులు స్మృతి పథము వీడనివై, ఏతత్ విజ్ఞాన కౌతుకము కృశింపనిదిగ, నశింపనిదిగ ప్రతిష్ఠాపన మొనరించి విధ్యుక్త ముగా నాచరింప చేసి తరింపజేయుననుట సత్యవిదూరము కాదు.

గురుదేవులు, పితృసమానులు నగు పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావు గారిని గురించి వివరించుటకు నాకు భాషచాలదు. "కొండఅద్దమందు కొంచమై యుండదా" అను వేమన నుడి ఎంతయు నిప్పట్ల సమంజసము. బహుభాషా కోవిదులు, ఆశుకవితాగ్రగణ్యులు, పవిత్ర చరిత్రగల పునీతవ్యక్తులు నిష్కపట నిరాడంబర జీవనులు, విశ్వజనీనమైన ప్రేమకు ప్రతిరూపులు, ప్రశాంత మనస్కులు, నిష్కాములు, సద్గుణసంపన్నులు, తేజోమూర్తులు, సుకృతకారణజన్ములు నన వీరికి జెల్లును.

బాబా తన అంకిత బిడ్డల నెన్నోరీతుల శోధించుట అందరకు తెలిసిన విషయమే! అట్లే శ్రీసాయీ ప్రభువు వీరిని అనేక అగ్నిపరీక్షలకు గురిచేసి యుండెను. బాబాకు సర్వత్ర శరణాగతి పొందిన బిడ్డడగుటచే యెన్ని వొడుదుడుకులు జీవితకాల పరిధిలో సంఘటించినను చలింపక 1. నిష్ఠ 2, సబూరి లను కలిగి, సాయీ తారక మంత్రాంకితమై, త్రికాలముల త్రికరణశుద్ధిగ అనుసరించి, అధిగమించి, అనుగ్రహ పాత్రులైనారు. ఈ సత్యము ననేకరీతుల గ్రంథముల వివరించి, అనుభవైకవేద్యమగు ననుభూతిని ప్రతిరూపముగ పాఠకుల హృదయపీఠమందు చెఱగని ముద్రగ ప్రతిష్ఠాపన మొనరించి, అమరజీవులై, గురుమూర్తిగ వెలుగొందుచున్నారు.

దిగంత విశాల విస్తృతమైన వీరి వాఙ్మయ పరిశోధనామృతము నాస్వాదించు భాగ్యము 1964 నుండి నాకు లభించినది. వారిని దర్శించి, తరించవలెనను తమకము కలిగినది. వారికి, నాకును, "ఏమీ! నిన్నుపేక్షింతునా?" అను గ్రంథముద్రణ కారణముగ నుత్తర ప్రత్యుత్తరములు ప్రారంభమైనవి. విరాట్ స్వరూపుడైన శ్రీసాయీప్రభువుయొక్క అమృతతుల్యమైన బోధనామృతము లేఖల రూపమున లభించెను. శ్రీషిర్డీసాయీ ప్రేమమందిర్, చిక్కడపల్లి నుంచి శ్రీసాయీప్రభువు నాదేశానుసారముగ కొంతధనము ముద్రణ కందించుట జరిగినది. 1970లో శ్రీసాయీప్రభువు మహారుద్రయాగ, దేవీయాగత్రితయి జరిపించుకొనుచు, తన అంకిత బిడ్డడైన బాబు

గారిని పిలిపించుకొనుట జరిగెను. ఆ సందర్భమున నా హృదయ కాంక్షితమైన వారి దర్శన, స్పర్శన భాగ్యము కలిగెను. 1972 ప్రాంతము మున బాబుగారికి శరీర రుగ్మతకలుగుట నే నెఱిగి కన్నులశ్రుపూరిత ములై తెలియని ఆవేదనతో, చూడవలెనను కుతూహలముతో, చిన్న గంజాము, శ్రీసాయీకుటీరమున కేగి, వారిని దర్శించి, వారిస్థితికి నా హృదయము ద్రవించి పలకరించితిని. ఆనాడు బాబుగారిని సేవించి పుణ్యదంపతులకు వస్త్రముల సమర్పించి వారి ఆశీస్సులను పొందితిని. అనాడు నా జీవితమున పర్వదినము. అక్కడ నాకు లభించిన ఆదరణ, ప్రేమ, అనురాగము అప్యాయతలను వివరింపలేను. కాని వాటి నిజస్వరూపములను గుర్తింపగలిగితిని. నా మాతృశ్రీ (పంతులుగారి సహధర్మచారిణి) కామేశ్వరమ్మగారి ఓర్పు, దైవిక మైనమాతృత్వము, పునీత, వేదమాతవంటి సుందరరూపము, ఆదర్శ గృహిణీమతల్లియొక్క అప్యాయత చవిచూడగల్గితిని. అప్పుడు అనుకొంటిని - పంతులుగారిని ఒక మహోన్నతమైన, గణనీయమైన, సాయి అంకిత బిడ్డగ, ఉత్తమ మనీషిగ, అమరజీవిగ, వెలుగొందు టకు దైవనిర్ణయముతో సహధర్మచారిణిగ పంపబడిన యిల్లాలని ఆమె సహచరిత్వ సంసేవాభాగ్యముచేత వారాస్థానము నధివసింపగల్గిరనుట సత్యము. అట్టిపుణ్యదంపతుల ప్రతిరూపముగ జ్యేష్ఠకుమార రత్న ముగ ఉపాధినిపొంది, మాతా పితరుల పవిత్ర ఆశీః ప్రభావముతో వారి అడుగుజాడల ననుసరించి, భారమైన కుటుంబమును, వృత్తి ధర్మము ననుసరించి, పోషించుకొనుచు (నిమిత్తమాత్రుడై), అధిక కాలము సాయీ సారస్వత సేవయందు వెచ్చింపుచూ, పునీత వ్యక్తిగ అలరారుచు ఐహికాముష్మిక సిరిసంపదలంది తరించు ధన్యజీవి చి॥ వేంకటపార్థసారథి సార్థక నామధేయులు.

అమరజీవి పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావు పంతులు గారిచే రచింపబడిన "శ్రీ సాయీ అనుసరణము"నకు పరిచయ వాక్య ములు వ్రాయవలసిన బృహత్తర బాధ్యత చి॥ వేంకటపార్థసారథిగారి ద్వారా యీ అల్పజ్ఞునకు విచిత్రముగ ప్రాప్తించినది. ఈ సదవకాశము

వినియోగించుకొన నుత్సహించితినేగాని యియ్యది సాహసవంతమే కదా!

శ్రీ సాయీ ప్రభువు ఆజ్ఞలేనిది అకైనను కదలనట్లు నా కలము కదలలేదు. ఆ స్వామి పాదపద్మముల హృదిని నిల్పి "సర్వ భార తంత్రుడవు! అనంతలీలావినోదివి! 'నీ దృష్టి నా యందు కేంద్రీ కరించి, నీ భారము నాపైమోపి, శంకాత్మ విడనాడితివా! నీ భారము వహింతు'నన్న ప్రత్యక్ష సాక్షీ భూతుడవు' ప్రేమమూర్తివి! నీవు కాని దేదియూ లేదు! ఈతరాని చెనటి సముద్రమున రత్నముల వెలికి దీయ యత్నించుట వలె యీ భారము నిర్వహింప బూనితిని. ఏమి వ్రాయించినను నీవే! "పలికెడివి బాబా పలుకులు - పలికించెడువాడు సాయిబాబయేగా!" అని శ్రీసాయీ బాబాను ప్రార్థించి ఆ స్వామి వ్రాయించిన పలుకుల నుడివెదను.

శ్రీసాయీ ప్రభువు ఆదేశించి, ఆచరించి తరించమన్న తారకమంత్రము 1. నిష్ఠ (గాఢ విశ్వాసము) 2. సబూరి (ధైర్య ముతో కూడిన ఓర్పు) శ్రీసాయిరామా! నీలీలు అచింత్యములు, అనూహ్యములు! నీ విచిత్ర అవతార ధారణ అతిగుహ్యమైనది. నిన్నెఱుగ మాయా కల్పితమైన మస్తిష్కముల కెట్లు సాధ్యము ప్రభూ!

కలివీరస్వైర విహారముచే ప్రమాద భరితమై, స్వార్థ పూరితమై, సంకుచితమై, మానవత మృగ్యమై, తమోగుణ ప్రధానమై పశుత్వమే తాండవించు ప్రస్తుత విపత్కర పరిస్థితులలో భగవదాశ్ర యమే శరణ్యముగదా! స్వామీ! ఆత్మ పరిశోధనమే విద్యుక్త ధర్మము కదా ప్రభూ!

కంటికి కనుపించునదే సత్యము. పరోక్షమైనది ఏదీకాదు - అనుచూ ప్రత్యక్ష ప్రమాణములను కోరువారికి "సంభవామి యుగే యుగే," అను వాక్యానుగుణ్యముగ, కలియుగ భారము వహించి, మానతకు జీవంపోసి, తీర్చిదిద్దుట కవతరించిన మర్త్యరూపి, నిర్వికార, నిరంజన, నిర్గుణ, అఖండ సచ్చిదానందమూర్తి; స్మరణ మాత్ర

సంతుష్టి, స్మృతి మాత్ర ప్రసన్నత - పూజించువారికి కల్పవృక్షము అనుసరించువారికి కామధేనువు - "అనురక్తితో, భక్తితో ప్రపత్తితో ఆశ్రయించిన వారి నుపేక్షించ"నన్న అభయ ప్రదాత శ్రీసాయిబాబా

శ్రీసాయిబాబా దివ్యచరిత్ర ఎందరో భక్తులు వ్రాసియున్నారు షాబీ ఆదేశాను గుణ్యముగ హేమాద్రిపంతు అను దాసుగణూ మహరాజు వ్రాసిన చరిత్ర - సంపూర్ణ కటాక్ష లబ్ధతత్త్వులు, కూర్చు ప్రియ భక్త, అనుంగు బిడ్డ, అయిన పూజ్యశ్రీ నృశింహస్వామిజీ, గుణాజీ పండితులు వ్రాసిన ఆంగ్ల చరిత్ర యిత్యాదివి గలవు. బహుభాషా కోవిదులు శ్రీసాయి సంస్థాన పండితులు, అంకిత బిడ్డ, అమరజీవి, పూజ్యశ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు విపులముగ, బహుళముగ, సంపూర్ణముగ, అనేక గ్రంథ రూపములుగ విరచించిన కట్టడపటిది, శ్రీసాయి సారస్వత సారాంశరూపమైన "శ్రీసాయి అనుసరణము" సువర్ణాక్షర సుమమాలను రూపొందించి. అందించి, ఆస్వాదించి, మథించి తరించమన్నారు.

శ్రీ సాయిబాబా మహాసమాధి నొందిన యనంతరం 6 దశాబ్దులుగ వారి యొక్క మహిమ కటాక్షము భక్తపాలనా దీక్ష, అనంతమై, అపారమై, విధ్యుక్తముగ అనుభవించువారికి అనుభవైక వేద్యమై ఎన్నో రూపముల వెల్లి విరియుచున్నది. బాబాను పెక్కురు పెక్కురీతుల చిత్రించిరి. (వింతయోగి - సాధువు - సత్పురుషుడు - సిద్ధపురుషుడు - అవధూత - పరమహంస ) పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామి, తదితర భక్తుల చరిత్రల నాధారముగ రచయిత బాబా వారి జన్మ వృత్తాంతము ఆధునికుల సంశయము పటాపంచలగునట్లు "శ్రీసాయిబాబా జీవిత చరిత్ర, భక్తుల అనుభవములు "ఏమి! నిన్ను పేక్షింతునా?" అను పేర 5 సంపుటములలో మనకు అందించిరి. ఇది బాబా భక్తులు ప్రతి వొక్కరు పఠింపదగిన పరమ పవిత్ర గ్రంథము. "ఎవరని నిర్ణయించేది స్వామీ? శివుడవో! మాధవుడవో!" అని ఎవరెవరి భావనల కందిన రీతిగ వారు నిర్వచించిరి. శ్రీసాయి పరిపూర్ణమగు భగవదవతారము. దీనికి గీతావాక్కులే ప్రమాణములు. "తన్నెఱిగిన భక్తులను

గుర్తింపుడని, తనకు, తన భక్తునకు భేదమేమియూ లేదని." కృష్ణ భగవానులు పలికినారు. తన శక్తినే ప్రదర్శించి, ప్రసాదించి, సృష్టి, స్థితి లయకారులకాధారమైన పరాశక్తియే శ్రీసాయి. బాబా తానే రాముడని, కృష్ణుడని, దత్తుడని, మహాలక్ష్మినని, మహాకాళినని, అనసూయనని తెలిపినాడు.

పిలిచిన పలికే దేవుడు, మ్రొక్కిన వరమిచ్చు వేలుపు శ్రీసాయి. శ్రీసాయినామము తారకమంత్రము. "సర్వమును ప్రేమించుట నీకర్తవ్యము! నీవు అహంభావము, అభిమానము వదలుకొని, సర్వము నీవే అని శరణుజొచ్చి నా అభయము కోరితివా! నీవెంట, జంటగ, తోడునీడగ, వెన్నంటి నీకు యెట్టిలోటును కలుగనీయను." అన్న అభయ ప్రదాత శ్రీసాయి! శ్రీసాయీ కటాక్షము పిలిచి తెచ్చునది కాదు. వొకరిచ్చునది కాదు. ఎవరికివారు ఆత్మసాక్షిగ, అవేదన - నివేదన, సాధనలతో పొందవలసినదే.

బాబా కర్మధ్వంసి. బాబాను సంపూర్ణ విశ్వాసముతో ఆశ్రయించి, సర్వము నీవేయని కర్తవ్యపాలన చేసితివా! నీవు సుఖశాంతులతో వర్థిల్లగలవు బాబా భక్తవత్సలుడు - ప్రేమ స్వరూపి - బాబా వలన పొందలేని కోరికలేదు - భక్తులకు కామధేనువు - కల్పవృక్షమను సత్యమును ఈ రచయిత యీ గ్రంథమున విపులముగ వివరించెను.

యీ గ్రంథమును చదివిన ప్రతియొక్కరు గ్రంథస్థ విషయములు శిరోధార్యములుగ భావించి, అనుసరించి, అచరించిన, తరించుననుటకు సందేహము లేదు. బాబా అడుగుజాడల ననుసరించి, పయనించిన భక్తుల ఎన్నోరూపముల ఎన్నోరీతుల కోరికల తీర్చి తరణోపాయము ప్రసాదించి, భక్తుల కష్టములు తాను స్వీకరించి, తరింపజేసినది విస్పష్టముగ హృదయమునకు హత్తుకొనునట్లు వ్యావహారిక భాషలో పసికందుల పసిడినుడులవలె విశదీకరించి పాఠకుల మనస్సులో బాబావారి భక్తిభావ మందారములు వెలయించినారు.

అనంతమైన భక్తి విశ్వాసములు "శ్రీసాయీ అనుసరణము" అందివ్వ గలదనుట నిస్సందేహము.

"శ్రీసాయీ అనుసరణము"వలె పితృదేవులనడుగు జాడల ననుసరించుచూ వారి రచనలనన్నిటిని ముద్రింపించి, భక్తుల కదిం చుచూ శ్రీసాయీభక్తుల కెన్నో విధముల సేవల నందించుచు ఎన్నో కష్టముల కోర్చి "శ్రీసాయీ అనుసరణము" ముద్రణ పూర్తి కావించిన చి॥ శ్రీ బాపట్ల వేంకట పార్థసారథిగారికి శ్రీసాయీ ప్రభువు దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యములు నొసగి, వారిచే పితృదేవతాశయానుగుణ్యా మైన గ్రంథముల రచింపజేసి, ఆదర్శ కుమార రత్నముగ వర్ధిల్లచేయు గాక!

ఈ గ్రంథముద్రణలో సహకరించిన ప్రతియొక్కరిని శ్రీ సాయీశుడు దీర్ఘ ఆయురారోగ్య భోగభాగ్యముల నొసగి సర్వదా సర్వథా కాపాడుగాత! ఈ గ్రంథము భక్తులకు కరదీపికయై అన్ని విధముల మార్గ దర్శకమగుగాక.

నేను అల్పాతి అల్పుడను, మందభాగ్యుడను. శాస్త్ర గ్రంథ పరిచయములు సున్న, భాషాప్రజ్ఞ హుళక్కి; ఎన్నియో దోసములిందు పొసగుట సహజము. హంసక్షీర న్యాయముగ పాఠకులు భావింతురు గాక. నన్ను మన్నింతురుగాక! పరిచయ వాక్యములు నావికాదుగదా!

శ్రీ షిర్డీసాయీప్రేమమందిర్,
1-8-426,
చిక్కడపల్లి, హైదరాబాదు-20,
1-12-1976.

ఇట్లు,
చోడవరపు సాంబమూర్తి.

# విజ్ఞప్తి

శ్రీసాయినాథాయనమః

సోదరీ సోదర సాయిబాబా భక్తులారా !

శ్రీ సమర్థ సచ్చిదానంద సద్గురు దేవుడగు శ్రీ సాయి ప్రభుని కరుణవలన, మీ అందరి సహాయ సంపత్తితోను ఉభయభాషా ప్రవీణులు, శ్రీసాయి ప్రసన్న బిరుదాంకితులు, పూజ్యులు, కీర్తిశేషులు నగు మాతండ్రి శ్రీ బాపట్ల హనుమంతరావు పంతులుగారు రచించిన "శ్రీసాయి అనుసరణము" అను గ్రంథరాజము మీకు అందించు భాగ్యము నాకు కలిగినది.

మనదేశమున శ్రీ సాయినాథునియందు భక్తి దినదినాభివృద్ధి నొందుచున్నది. లక్షలకొలంది జనులు శ్రీ సాయినాథు మాహాత్మ్యమును తెలుసు కొనుచుండిరి. పూజామందిరములు, భక్త సమాజములు, భజన మండలులు విరివిగా వ్యాపించు చున్నవి. శ్రీసాయిబాబా జీవితము, వ్యక్తిత్వము, ఆచరణలు, బోధలు విశ్వజనీనములు. జాతి మత కుల వర్గాదుల కతీతములు, సమస్త జీవరాసులయందును సమదృష్టి కలిగి, ప్రేమించుటయే బాబా ముఖ్యముగ బోధించెను. 'దైవమును మన మాశ్రయించిన, దైవము మనలను రక్షించును' అను విశ్వాసము సాధకు నకు అవసరము, శ్రీ సాయి ప్రభువు అనుగ్రహమును బడయుటకు శ్రీసాయి అనుసరణము మార్గదర్శకము.

శ్రీ సాయిప్రభువు తనశక్తి సంపదలు, సిద్ధులు, తన అంకితు లైన బిడ్డలను రక్షించి, చక్కదిద్దుటకే వినియోగించెను. అట్లే దైవాంశ సంభూతులగు మహాపురుషులు తమ భక్తులకొఱకే తమ అద్భుత శక్తు లను ప్రదర్శింతురు. అట్టివారు గావించు ప్రతిచర్యయు స్వార్థ రహితము. శ్రీ సాయిబాబా తన బిడ్డల హృదయ పరివర్తనము చేసి

ప్రేమతత్వమును బోధించి, దైవమునం దచంచల భక్తి విశ్వాసములు కలిగించుటకే ప్రదర్శనలు చేసెను. దైవమే - ప్రేమ, ప్రేమయే - దైవము అను సత్యసిద్ధాంతమును బాబా విశదపరచినాడు. ప్రతి మానవుడు గడ్డికకంటె తక్కువగ తనను భావించుకొని, వృక్షమువలె సహనము కలిగి, అవమానమును సమ్మానముగ నెంచుకొని, ప్రతి చర్యయు తాను దైవప్రేరణ వల్లనే చేయుచున్నానను తలంపుతో శ్రీసాయీ ప్రభుని సేవించిన ఏకాగ్రతయు ననుభవింపడు.

అట్టి శ్రీ సాయీనాథుని ప్రసన్నతబొంది, ఆ స్వామి యాజ్ఞాను సారముగ పెక్కు గ్రంథములు రచించి, 50 సంవత్సరముల ఆధ్యాత్మిక జీవితానుభవములను పురస్కరించుకొని మా తండ్రిగారు యీ గ్రంథమున పొందు పరచి సోదర భక్తులకు మార్గదర్శకులైరి. ఖరగ్‌పూరు **(W.B.)** నివాసి యగు సోదర సాయీ భక్తుడు శ్రీ టి. ఆర్. నాయుడుగారు నాతో సంభాషించుచు "ఆంధ్రదేశమున శ్రీసాయీ ప్రభుని చిత్రపటము యే యింటనుండునో, పూజలెచ్చ టెచ్చట జరుగుచుండునో అట్టి ప్రతి యింటను, ప్రతి మందిరమున మీ తండ్రిగారి రచనలు పఠించి తరించు నట్లు మీరు సాయీ భక్తి ప్రచారము చేయవలయును" అని పలికిరి. ఇది శ్రీసాయీ ప్రభుని ప్రేరణగ దలంచి, యీ గ్రంథముద్రణ భారమును మీ అందర సహాయమున నిర్వహించుచుంటినిగాని యిందు నా యోగ్యత లవమేనియు లేదు.

మా తండ్రిగారి ఆత్మీయ సోదరులు, శ్రీ సాయీ భక్తాగ్రేసరులు నగు శ్రీ కొప్పరపు రామారావు పంతులుగారు నాయందు గల అపార ప్రేమతో నా విధ్యుక్త ధర్మమును బోధించి నన్ను ప్రోత్సహించి కార్యోన్ముఖునిగ చేయుచుందురు. వారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్కారములను సమర్పించు కొనుచున్నాను. విజయవాడ పట్టణ మున గవర్నమెంటు పాలిటెక్నిక్ కాలేజి యెదుట శ్రీసాయీబాబా మందిరము బహు ప్రశంసనీయముగ, మనోహరముగ నుండునటుల స్థాపించి, ఆ మందిరమున శ్రీసాయీ ప్రభునికి త్రికాల సేవలు శ్రీ కొప్పరపు రామారావు పంతులుగారిచేత జరిపించుచున్న శ్రీ **Dr. U.**

వెంకటరత్నంగారు, M.D., మరియు వీరి ధర్మపత్నిగారు నెంతయు పుణ్యాత్ములు. ఆ మందిరమున ఆ దివ్యమంగళ స్వరూపుని, శ్రీసాయీశుని దర్శించి, శ్రీ రామారావుగారు చేయు సేవలను తిలకించి నా మానసము ఆనందమ్మున మునిగిన సందర్భమున బాబా యిట్లు పలికించెను,

మెప్పులకు నేను చెప్పను
తప్పిదమగు వాస్తవంబు దాచుట లేనిన్
"కొప్పరపు" వారు సాయికి
ముప్పొద్దుల సలుపుసేవ మోదముగూర్చున్.

ఈ మందిరమున శ్రీసాయీ ప్రభుని సేవింప వచ్చిన భక్తులు శ్రీ చోడవరపు కృష్ణారావు పంతులుగారు మా తండ్రిగారి రచనల విషయమెఱిగి "ఏమీ! నిన్ను పేక్షింతునా?" అను గ్రంథ ముద్రణకు రు 1116-00 లు సమర్పించిరి. వీరి యుదారత యిదివరకు ప్రకటించితిని గాని బాబా పలికించిన పలుకులు తిరిగి యుందు తెలుపుచుంటిని,

అడుగకె వేయినూరును పదారును రొక్కము చెక్కువ్రాసి, నీ యెడఁగల భక్తిఁ దండ్రి రచియించిన గ్రంథము నచ్చువేయ, నీ యడుగులమ్రోలనుంచెను ప్రియంబున 'చోడవరంపు కృష్ణరాయడు! సకలార్థముల్ గలుగ నాతని బ్రోవుము సాయిసత్ప్రభూ!

ఈ గ్రంథముద్రణ భారమును అధికముగ వహించుటకు శ్రీసాయీప్రభువు ఏదోయొక పనికల్పించి మాగ్రామ కాపురస్తులగు శ్రీ కొమ్మినేని శ్రీరాములుగారిని నాకడకు పంపి, అతని కార్యము నెరవేర్చి యీ గ్రంథమునకు ప్రధానపోషకుని జూపెను. వీరికి నా కృతజ్ఞతలు వేరుగ ప్రకటించుకొంటిని.

హైదరాబాదు చిక్కడపల్లిలో శ్రీషిరిడిసాయీ ప్రేమమందిర సంస్థాపకులు, మాతండ్రిగారికి ప్రియశిష్యులు, శ్రీసాయీ

సత్యాన్వేషకులు నగు శ్రీ చోడవరపు సాంబమూర్తిగారు మా తండ్రిగారి రచనల ప్రచురణయందు భాగస్వాములై సహాయమిచ్చు రీతిగ నీ గ్రంథమునకు ధనసహాయముజేసిరి. వారికి నానమోవాకములర్పించుచు కృతజ్ఞతలు వేరుగ తెలుపుకొంటిని,

మాతండ్రిగారివద్ద విద్యల నభ్యసించి శ్రీసాయీప్రభునియం దపారభక్తి ప్రకటించు సోదరభక్తుడు చి॥ G. శ్రీరాములు, B. Com., యీగ్రంథ ముద్రణకు రు 400–00 లు విరాళమిచ్చిరి.

చినగంజామున 'సోపురాల' నెలవై 'శ్రీరాములా'ఖ్యన్‌జనిం
చెను "గుండ్రెడ్డి" కులంబునన్; పితకగున్ శిష్యుండు; నీయందు భ
క్తిని ద్రవ్యంబిడినాఁడు గ్రంథమును ముద్రింపించునాసక్తి; నీ
తని వంశంబును ప్రేమ నేలుము! సమర్థా! సాయినాథప్రభూ!

ఇంకను సోదరీ సోదర సాయీభక్తులు శక్త్యానుసారముగ విరాళములు పంపిరి. శ్రీసాయీబాబాజీవిత చరిత్ర "ఏమీ! నిన్నుపేక్షింతునా?" అనుగ్రంథమును కోరినవారికి పంపగ వారు పంపిన మూల్యమును పొందుపరచి యిందు పోషకుల జాబితాలో చేర్చి ప్రకటించితిని. వీరలందఱకు నాకృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

నీ యెడ నిశ్చల భక్తిని
సాయంబొనరించినారు శక్తికొలందిన్
సాయీ అనుసరణముకై
సాయీ! పోషకులు, వీరి సాకుము సతమున్.

'శ్రీసాయీ అనుసరణము'నకు నాయందుగల అవ్యాజ ప్రేమతో 'తొలిపలుకు' వ్రాసిన కళాప్రపూర్ణ శ్రీ K. V. N. అప్పారావు గారికి, 'పరిచయము' పలికిన శ్రీ చోడవరపు సాంబమూర్తిగారికి తండ్రికి, 'జోహారులు' రచించిన బ్రహ్మశ్రీ జగర్లపూడి వేంకటసుబ్బయ్య శాస్త్రిగారికి, పెక్కుశ్రమలకోర్చి యీ గ్రంథమును శ్రద్ధగ మాతృశ్రీ

ప్రింటర్సు, బాపట్లవారిచే ముద్రణచేయించిన శ్రీ అచ్యుతుని రామకృష్ణ శర్మగారికి, నా హృదయపూర్వకనమస్కారముల నర్పించుచున్నాను. 'ప్రశంస' పలికిన సోదరుడు చి॥ B. V. V. రాఘవేంద్రరావును శ్రీసాయీప్రభువు సర్వదా సర్వథా కాపాడుగాత అని నా ప్రార్థన.

మా తండ్రిగారు రచించిన

1. శ్రీరామా! ఆపదుద్ధారకా! (శతకము, రామకథాత్మకము)
2. శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము. (తెలుగు గీతలు)
3. శ్రీ హనుమాన్ చాలీసా. (తెలుగు ద్విపద)

యీ మూడు పుస్తకములు 1977లో పునర్ముద్రణ గావించి భక్తుల కందించవలెనని యిందుకు సోదరీ సోదర భక్తులు సహాయ మివ్వగలరని నా సంకల్పము.

శ్రీసాయీ బక్తులు గ్రంథ ముద్రణలో యున్న దోషములు నావిగభావించి నన్ను మన్నింతురుగాక అని ప్రార్థించుచున్నాను.

సాయీ అనుసరణంబును
పాయీ హనుమ రచియించి సాయి కొసంగెన్
సాయీ జన ప్రకటనమున
సాయీ అనుచరులు చదివి సద్గతిఁ గనగన్.

సాయినాథుని బోధల సారమిదియ,
మధుర సుధలు చిలికె "హనుమంతసుకవి"
తనివితీరఁ గ్రోలుడు! సత్పథంబుఁగనుడు!
"హనుమ" రచనలు ప్రకటింప నాదుకొనుడు!

ఎచట యోగేశ్వరుండు సాయీశుడుండు!
నెచట సాయీశ్రితుల్ భక్తులెసగుచుంద్రు!
అచట, శ్రీయును, భూతి, జయంబు, నీతి
నిలచియుండు నెల్లపుడిది - నిజము! నిజము!

ఇట్లు విన్నవించు
శ్రీ సాయీ భక్త పాదరేణువు,
బాపట్ల వేంకట పార్థసారథి.

చెరువుగ్రామము.
1-12-1976.

శుడుండు!

గుచుంద్రు!

సంబు, నీతి

జము! నిజము!

ఇట్లు విన్నవించు

సాయీ భక్త పాదరేణువు,

పట్లు వేంకట పార్థసారథి.

శ్రీ చోడవరపు సాంబమూర్తిగారు, వీరి ధర్మపత్ని



# శ్రీ చోడవరపు సాంబమూర్తిగారికి
# నమస్కారపూర్వక కృతజ్ఞత

అవని పరోపకారులు మహాత్ములు పుణ్యులునుందు, రందు, చో
డవరపు సాంబమూర్తి యొకడౌ! షిరిడీశుని ప్రేమమందిరం
బు వెలయఁజేసె భాగ్యపురి సొంతన, చిక్కడపల్లెలో; యటన్
పవలును రేయి పూజలను భక్తి యొనర్చునతండు నిష్ఠతోన్.

చేతికి జోలెకట్టుకొని, చిత్రగతిన్ పురమందు పోవుచున్
దాతలు, సాయిభక్తులు నుదారతనిచ్చు ధనంబు, బియ్యమున్
బ్రీతిగొనున్; కురూపులకు పేదలకున్ బలహీనవర్గ సం
జాతులకిచ్చు సత్కృతుని సన్నుతిజేసెద సాంబమూర్తినిన్.

కోరిన యటు ద్రవ్యము సమ
కూరిచి ఈకృతి వెలువడు కోరిక దీర్చెన్
కోరుమ! యీతని సేవలు
కూరిమి పెక్కేండ్లు నిన్ను కొలిచెద సాయీ!

జనకునకున్ ప్రియ శిష్యుడు,
అనఘుండీ సాంబమూర్తి! అనుపమ సాయీ
ఘన పద సేవా నిరతుడు
వినయగుణోపేతు డితని వినుతింతు మదిన్.

ఇట్లు
ప్రకటన కర్త.

# శ్రీ కొమ్మినేని శ్రీరాములు (జమ్ములపాలెం) గారికి అభినందనలు

కష్టపడి భూమి పండించు కర్షకుండు,
ఆడితప్పి తెలుగని సత్యవ్రతుండు,
గర్వమిసుమంత, లేదు; నిష్కల్మషుండు,
కరుణగలవాడితండు 'అంకమ్మ' సుతుడు.

'కొమ్మినేని' వంశఘనుండు, కమ్మకులుడు,
రామభక్తి తత్పరుడు 'శ్రీరాములా'ఖ్య
పరగు పుణ్యుడు; జమ్ములపాడు వాసి,
ముద్రణకు తోడ్పడిన ముఖ్య పోషకుండు!

కలిగె 'పున్నమ్మ' సతికి, అంకమ్మ, సుబ్బ
రావు, మరియు నాగేశ్వరరావులనగ
బరగుసుతులును, కమలమ్మ మరియు ద్రాక్ష
వతియన నెగడు యిర్వురు సుతలు నవని.

తల్లిదండ్రుల, వీరివృద్ధాప్య దశను
నిష్ఠ పూల పూజించు కనిష్ఠసుతుడు
నితని భార్య సుబ్బాయమ్మ లిచ్చు తోడ
పూర్వజన్మార్జిత విశేష పుణ్యగరిమ!

అట్టి శ్రీరాము నితని యర్ధాంగి, బిడ్డ
లందర కరుణబరపి వంశాభివృద్ధి
ఆయురారోగ్య భోగభాగ్యముల గూర్చి
సతము కాపాడగదవె! శ్రీసాయిదేవ!

ఇట్లు
ప్రకటన కర్త.



శ్రీ కొమ్మినేని శ్రీరాములుగారు

జమ్ములపాలెం



ప్రచురణ కర్త



**జి. శ్రీరాములుగారు**

చినగంజాము

సర్వశ్రీ
చోడవరం
జి. శ్రీరా
సి. కృష్ణ
సిహెచ్.
బాపట్ల శ
గానుగపా

కె. వి.
కె. ఆంజ
కలగా శ
పొత్తూరి
చుండూర
కామరాజ
సిహెచ్.
ఆర్. సీత
చీరాల స
బాపట్ల శ్రీ
కొప్పరపు
బాపట్ల ర
పాటిబండ్ల
ఎ. వేంక
నిరం

# పోషకులు

| సర్వశ్రీ | రూ. |
|---|---|
| చోడవరపు సాంబమూర్తి పంతులుగారు, హైదరాబాదు | 1116 |
| జి. శ్రీరాములు సన్ ఆఫ్ రమణయ్యగారు, చిన్నగంజాము | 400 |
| సి. కృష్ణమూర్తిగారు, బి. యి , ఇంజనీర్ | 131 |
| సి హెచ్. విస్సావధానులుగారు, బిక్కవోలు | 126 |
| బాపట్ల శీతారామయ్యగారు, కరణం, నర్సాయపాలెం | 116 |
| గానుగపాటి సత్యనారాయణగారు, బి. ఎ, బియిడి; రిటైర్డు హెడ్మాస్టరు, బాపట్ల | 116 |
| కె. వి. యన్ అప్పారావుగారు, కళాప్రపూర్ణ. వాల్టేరు | 116 |
| కె. ఆంజనేయులుగారు, హైదరాబాదు | 116 |
| కలగా శీతారామయ్యగారు, నల్గొండ | 116 |
| పొత్తూరి పాండురంగ విఠల్, బొంబాయి | 116 |
| చుండూరు రామయ్యగారు, రాజుపాలెం | 116 |
| కామరాజు వీరరాఘవరావుగారు, బాపట్ల | 116 |
| సి హెచ్. రామారావుగారు, హైదరాబాదు | 116 |
| ఆర్. సీతారామయ్యగారు, ఖరగ్పూర్ | 80 |
| చీరాల సత్యనారాయణమూర్తిగారు, హైదరాబాదు | 58 |
| బాపట్ల శ్రీరామచంద్రసాయి, బొంబాయి | 58 |
| కొప్పరపు బాలభాస్కరరావు, విజయవాడ | 58 |
| బాపట్ల రాజశేఖరసాయి, బొంబాయి | 50 |
| పాటిబండ్ల రామచంద్రరావు, చెరువు | 50 |
| వి. వేంకటేశ్వరరావుగారు, పటమట | 50 |
| [illegible]. నిరంజన్గారు, బేతంచర్ల | 50 |

| సర్వశ్రీ | రూ. |
|---|---|
| యస్. నారాయణశెట్టి అండ్‌సన్సు, మడకశిర | 50 |
| కె. మార్కండేశ్వరరావుగారు, విజయవాడ | 50 |
| దుంపల నాగేశ్వరరావుగారు, చెరువు | 50 |
| ఎ. యస్. కిషోరుగారు, హైదరాబాదు | 45 |
| పి. యస్. రామానుజరావుగారు, ఒంగోలు | 36 |
| అర్. రామారావుగారు, విశాఖపట్టణము | 35 |
| సావడి సుబ్బారావుగారు, నందితవారె. | 35 |
| సవరం నాగభూషణంగారు, నరహరిశెట్టి రామారావుగారు చింతా శేషాచలపతిరావుగారలు, | 35 |
| ఎ. ఎ. అప్పారావుగారు, ఖరగ్‌పూర్ | 30 |
| జి. వి. యస్. సాయికుమార్, హైదరాబాదు | 25 |
| దేవత సుబ్బారావుగారు, హైదరాబాదు | 25 |
| యన్. వేణుగోపాలనాయుడుగారు, హైదరాబాదు | 25 |
| యం. వి. అప్పారావుగారు, బి. ఎ. బియిడి. వేటపాలెం | 25 |
| శ్రీమతి జి. విజయలక్ష్మిగారు, వైఫ్‌అఫ్ రామమోహనరావు, కొవ్వలి | 25 |
| శ్రీమతి యస్. వనజాక్షిగారు, అనంతపురం | 25 |
| ములుపూరి సుబ్బారావుగారు, మాధవరం | 25 |
| బొడ్డు రామయ్యగారు, విశాఖపట్టణము | 25 |
| సి హెచ్. రామచంద్రరావుగారు, కంచకచర్ల | 25 |
| జె. శీతారామయ్యగారు, తహశీలుదారు నర్సరావుపేట | 25 |
| డాక్టర్. సి. వి. పరమేశ్వరాచార్యులుగారు, హైదరాబాదు | 25 |
| జె. వి. పి. రావుగారు, మద్రాసు | 25 |
| యన్. వెంకట్రావుగారు, విశాఖపట్టణము | 25 |

| సర్వశ్రీ | రూ. |
|---|---|
| ఎ. సూర్యప్రకాశరావుగారు, బంధాలులంక | 25 |
| జి. ఆర్. రావుగారు, మద్రాసు | 25 |
| టి. వి. రమణయ్యగారు, మద్రాసు | 25 |
| టి. వి. కె. శాస్త్రిగారు, మద్రాసు | 25 |
| టి. సత్యనారాయణగారు, ధర్మవరము | 25 |
| ఆర్. వి. జి. కె. రంగారావుగారు, మద్రాసు | 25 |
| పి. నాగేశ్వరరావుగారు, హైదరాబాదు | 25 |
| పి. వెంకట రాజయ్యగారు, హైదరాబాదు | 25 |
| ఎ. భాస్కరరెడ్డిగారు, సుళ్లూరు పేట | 25 |
| ఉడుసుమల్లి వెంకటేశ్వరరావుగారు, | 25 |
| వై. సుబ్బరాయుడుగారు, రాయదుర్గ, | 25 |
| యం. రామమోహనరావుగారు, యల్లందు | 25 |
| పి. దశరధరామయ్యగారు, కనికాల్ | 25 |
| జి. రామారావుగారు, ఖరగ్‌పూర్ | 25 |
| శ్రీమతి యం. ప్రమీలాదేవిగారు, విశాఖపట్టణము | 25 |
| వై. వి. నరసింహారావుగారు, అనందపురం | 25 |
| వై. సత్యనారాయణరావుగారు, వనపర్తి | 25 |
| జి. లక్ష్మణరావుగారు, ప్రొద్దుటూరు | 20 |
| నూనె వెంకటేశ్వర్లుగారు, కావలి | 20 |
| కె. సుబ్బారావుగారు, హైదరాబాదు | 20 |
| యం. యస్. నాయుడుగారు, తిరుపతి | 20 |
| పి. సత్యనారాయణగారు, హైదరాబాదు | 20 |
| జె. వెంకటేశ్వరరావుగారు, క్రొవ్విడి | 15 |
| యం. వెంకట్రావుగారు | 15 |
| పి. వెంకట్రామయ్యగారు, విజయవాడ | 15 |

సర్వశ్రీ | రూ.
---|---
శ్రీమతి డి. సుశీలగారు, మద్రాసు | 15
పి. వి. యం. కృష్ణమూర్తిగారు; మదనపల్లి భక్తులు | 15
పి. బి మొదలియార్, ఖరగ్‌పూర్ | 11
వి. వెంకయ్యశర్మగారు, బందరు | 11
వి రాధాకృష్ణమూర్తిగారు, స్టేట్‌బ్యాంకు ఆఫ్ ఇండియా, రాజోలు | 10
అనంతపద్మనాభమూర్తిగారు, మద్రాసు | 10
పత్తిరాజు రామచంద్రరావుగారు, విజయనగరం | 10
చింతల బుచ్చిరాజుగారు, ఖరగ్‌పూరు | 10
కీ. శే. శ్రీ జి. బి. వి. జోగారావుగారు, వెదుర్రుపాక | 10
వై. బ్రహ్మయ్యగారు, మచిలీపట్టణము | 10
యం. శ్రీనివాసరావుగారు, నెల్లూరు | 10
పి. మాలెకొండయ్యగారు, నెల్లూరు | 10
సి. రామకృష్ణయ్యగారు, ఖరగ్‌పూర్ | 10
సి. పి. రావుగారు, ఖరగ్‌పూర్ | 10
ఎ. వి. సుబ్బారావుగారు, సికిందరాబాదు | 10
సి. యస్. రావుగారు, మద్రాసు | 10
జి. సుబ్బారావుగారు, వాల్టేరు | 10
యస్. యస్. ఆర్. ఆంజనేయులుగారు, ఢిల్లీ | 10
కె అరుణాచార్యులుగారు. | 10
బి శంకరరావుగారు, రాజమండ్రి | 10
సి హెచ్. శ్రీహరిరావుగారు, వరంగల్లు | 10
బాపట్ల నాగేశ్వరరావుగారు, కురుబలకోట | 10
బాపట్ల నాగేశ్వరరావుగారు, కురుబలకోట భక్తులనుండి వసూల్లుచేసినది. | 62

# విషయ సూచిక

## తృతీయ పాదము



## చతుర్థ పాదము

## పంచమ పాదము



## షష్టపాదము

## సప్తమ పాదము

ఓమ్

# శ్రీ సాయీ అనుసరణము

"గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్
సమర్థ సచ్చిదానంద భగవాన్ సాయి సద్గురుః"

కర్మఫలము, పోషకుఁడు, స్వామి, ప్రాణులు కావించు, సకల కర్మములకు సాక్షి, సకల ప్రాణుల నివాసస్థానము — ఆర్తులు ప్రపన్నులగువారి యార్తినిఁబాపి రక్షణమిడువాఁడు, ప్రత్యుపకార మపేక్షింపకయే ఉపకారము చేయువాఁడు, చేయుటకుఁ జేయకుండుటకు మఱియొక విధముగఁ జేయుటకుఁ జాలినవాఁడు శాశ్వతుఁడు, జ్ఞాన స్వరూపుడు, ఆనందమయుఁడు షడ్విధైశ్వర్య సంపూర్ణుఁడు, సద్గురువునైన 'శ్రీ సాయి' కలడు.

ప్రార్థన.

"నన్ననుసరించు నాశ్రితుఁడెన్నడేని
మోహతమమున, బడి చెడిపోవ" డంటి
సాయినాథ! నీవే వీని శరణమైతి;
జ్ఞాన భానూదయంబెట్లు కలుగునయ్య!

హృదయ గాఢాంధకారంబదెట్టు లడగు?
స్వామి! నీ యనుసరణ యే సరణిఁబొసఁగు
ప్రేమ నీ కటాక్షముఁ బ్రసరింపవేని!

నీదు చరితంబు నెపుడు ధ్యానింపనిమ్ము—
ప్రీతి నీ నామమెపుడు స్మరింపనిమ్ము—
అనుసరణ కింకలేదు మార్గాంతరమ్ము.

'మనన' మొగిఁగూర్చుచుండు నీ 'స్మరణ' నెపుడు
స్మరణమునఁ గాని నీదగు 'కరుణ'ఁ గనము
'కరుణ' పొడమదేన్ నీయనుసరణలేదు;
శరణమిడవె! సద్గురుదేవ ! సాయి ! శరణు !

## ఉపక్రమణిక

ఈ సకల విశ్వసృజన పోషణ లయములను గావించు సర్వేశ్వరుఁడు సర్వవ్యాపియై సర్వత్ర సర్వకాలముల గలడు. సకల జీవులను సృజించి, యాయా జీవుల హృదయాంతర్వర్తియై యా స్వామి జీవముల నన్నిటిని భ్రమింపజేయుచున్నాఁడు. ఈ జీవులు త్రిగుణాత్మకమగు ఈశ్వరమాయకు (ప్రకృతికి) లోఁగి, యీశ్వర సత్తా మాత్రమున వివిధ కర్మములందు ప్రవర్తించుచు, తత్తత్ఫల రూపములగు సుఖ దుఃఖముల ననుభవించుచు, చచ్చుచు మరల బుట్టుచు నెడ తెగని సంసృతి బంధముల జిక్కికొని యున్నవి. సకల జీవములకు శరీర పోషణ జ్ఞానమును భగవానుఁడు కలిగించి యున్నాడు కాని సృష్టియందు మానవునిలో విశేషజ్ఞాన మొకటి కలదు. అది యుక్తాయుక్త వివేకము. ఆ కారణమున సకల జీవములలో మానవుడు శ్రేష్ఠుఁడని చెప్పఁబడు చున్నాఁడు. ఈ వివేకము నాధారము చేసికొని, విశ్వకర్త, విశ్వభర్త, విశ్వహర్తయై, సర్వభూత హృదయస్థుఁడైన ఈశ్వరు నెఱిఁగి, మానవుఁడు సంసృతి బంధములనుండి విడివడి, సచ్చిదానందపదము, ఈశ్వరైక్యమును బడయుటకు యత్నింపఁదగును.

సర్వవ్యాపి, సర్వాంతర్యామి యగు నీశ్వరుని ప్రకృతి బంధములఁ జిక్కుకొనిన జీవి గుర్తించి, ఆశ్రయించి, యనుసరింపఁజాలడు. సర్వేశ్వరుఁడు ప్రేమస్వరూపుడు, కరుణామయుఁడు నగుటచే ఈ

జీవకోటియందు అవ్యాజ కరుణ వహించి యెల్లదేశముల నెల్లకాలముల నవతరించి తన యునికిని 'ఈశ్వరుఁడనగు నేనున్నాను' — అను సత్యమును ప్రకటించుచునే యున్నాఁడు. పురాకృత సుకృతముగల జీవి యట్లవతరించిన, అనఁగా తన నిర్గుణస్థితి సర్వవ్యాపకస్థితి, నుండి యొక మెట్టు దిగి, సగుణుడైన యా పరతత్త్వము నెఱిఁగి, యాశ్రయించి, సేవించి, యనుసరించి కృతకృత్యుఁడై యవ్యయానంద పదమును బడయును.

ప్రపంచమునఁగల సకల వాఙ్మయములు ఈశ్వరావతార తత్త్వరహస్యములను ప్రకటించుచునే యున్నవి. విశ్వమునఁ బ్రకటమైన అవతారములన్నియు సమర్థమైనవే వాని నెఱిఁగి, యాశ్రయించి యనుసరించినవారు తరించిరనుటలో సందేహము లేదు. సర్వవ్యాపకత్వ సర్వనియంతృత్వ, సర్వజ్ఞత్వ సర్వసమర్థత్వము లెందెందు ప్రకటమగునో అది ఈశ్వరావతారమే. ప్రత్యక్ష దైవమే. అనంతశక్తి సంపదలు కలిగి, యెల్లరప్రార్థనలను సమగతి నాలకించుచు, విశ్వజననివలె అదుకొని రక్షించు వస్తువే మన దృష్టియందు "దైవము" అగుచున్నాఁడు. అట్టి అపార శక్తి సంపద లెందుఁగలవని మానవుఁడు స్వానుభవమున గ్రహించునో ఆ వస్తువును, ఆ సద్గురువును సమాశ్రయించి అనుసరింపఁ దగును.

ఇది యెవరికి వారు నిర్ణయించుకొనఁదగినది. "ఇతడు సమర్థ సద్గురువు, నీ కాశ్రయమిడి రక్షించును. పొమ్ము పొమ్ము"- అని యెవరును వెనుకనుండి పోద్రోయవలసిన పనిలేదు. గ్రీష్మాతపతప్తున కెచట శ్రమనివారణమై సుఖశాంతులు కలుగునో వాఁడా వృక్షచ్ఛాయనే ఆశ్రయించి యానందించును. ప్రభూతపు సీతునఁ గొంకుపోవువాని చలి బాధను నివారించి, యానందమును గూర్చునది 'అగ్ని' యని యితరులు ప్రత్యేకించి చెప్పవలసిన పనిలేదు. ఏ వస్తువును సమాశ్రయించిన దుఃఖరాహిత్యము, సత్య సుఖానుభము మనః ప్రశాంతి కలుగునో అదియే 'దైవము.'

ఆశ్రయించు వస్తువును గూర్చిన 'ఎఱుక' 'గతిర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్" అను విశ్వాసము గలిగి ఆశ్రయింప వలయును. అట్టి సమర్థత ఒక దైవమునందు మాత్రమే కలదు. అట్టి శక్తి సంపద లెచట ప్రకటితమగునో అది దైవము. త్రిసత్యముగ దైవము, అని మానవుఁడు విశ్వసింపవలయును.

దైవము పలుదేశముల వివిధ కాలముల అనేకములగు అవతారములఁ బ్రకటమైనను మానవ సమాజము ఆ వస్తువును గుర్తించి, సత్య సుఖశాంతులను బడయనేరక పరిభ్రమించుచునే యున్నది. ఆ కారణముననే కరుణామయుడఁగు భగవానుఁడు మరల మరల నవతరించి, సంసృతి సాగరమునఁబడి, తరుణోపాయముఁ గానక పరితపించు మానవులను సముద్ధరించుటకు యత్నించుచునే యుండును. ఇట్టి యవతారములలో శ్రీసాయీనాథావతారము సర్వోత్కృష్టమైనది. ఇందు సౌలభ్యము విశేషముగఁ గలదు. విశ్వమానవప్రేమ, సర్వభూత హితాసక్తి ప్రదర్శించి వివిధమతస్థులను వారివారి పరస్పర వైషమ్యములను విస్మరింపఁజేసి, సకల మతములందుఁ బ్రతిపాదింపబడిన 'పరవస్తువు' — 'ఇదే' అను ఎఱుక కలిగించుచు ఆశ్రితులను సక్రమ మార్గమున నడిపింపఁజాలిన అవతారము శ్రీ సాయీనాథావతారము.

శ్రీసాయీబాబా సందేశమును గమనింపుడు. "ప్రేమ విశ్వాసములు" సాధనములుగ నెల్లరు తరింపఁజూడుడు, మీరు సర్వేశ్వరు నే పేరునఁ బిలిచినను, ఏ మూర్తిని ధ్యానించినను లోపము లేదు. ఏ మత మవలంబించినను హానిలేదు. మీమీ మతముల నుండి మార్పు నొందవలసిన అవసరములేదు. అన్ని మతములు ఆ భగవానునిఁ జేర్చితీరును. సామరస్య సమన్వయములు మాత్ర మవసరము. అవిలేనినాఁడు పతనము తప్పదు. ఎవరి యాచారముల చొప్పున వారు నడువుడు. ద్వేషభావము వీడుడు. 'రాం - రహీములు' 'కృష్ణ - క్రీస్తులు' ఒక్కరేకాని భిన్నులుకారు." అని సాయీప్రభువు మనకు విస్పష్టముఁ జేసినాడు. అన్ని దైవరూపములు తానే యని

ఆత్మలీలలఁ బ్రకటించినాడు. 1918కి పూర్వమే కాదు, నేటికి నిఁకేనాటికి తన సంశ్రితుల నుద్ధరించుచున్నాఁడు. ఉద్ధరింపగలఁడు.

'శ్రీ సాయీభక్తి' యనిన, ఎల్లరయెడ సహనబుద్ధి, దైవమునం దచంచల విశ్వాసము, బాబాయందు సద్గురు భావము గలిగి, వివిధ మతములందు ప్రతిపాదింపబడిన మూలసూత్రములను సమన్వయ పఱచుకొనుట అని శ్రీ సాయీ భక్తులు తెలిసికొనగలిగిరి.

శ్రీ సాయీబాబా స్థాపించిన మతమేమి? ఆ సద్గురువు ప్రతిపాదించిన సిద్ధాంతము లేవి? అని సాధకుఁడు సందేహ నివృత్తికై ప్రశ్నింపవచ్చును. 'మతము అనునది మానవ కల్పితము. "దైవము కలడు", అని తెలుపునది యేమతమైనను సాధుసమ్మతమే. ఈ ప్రపంచమున నే జాతికిఁ జెందినవాడైనను మానవుడు తన ఇష్టదైవ మును నిర్ణయించుకొనుటలో నితరుల అధికారము లేశమేనియు లేదు. లోకములోని మతములన్నియు జ్ఞాన, భక్తిమార్గములని రెండు తెగలుగ విభజింపనగును. ఆ విధముగనే వేదాంతులను **(Philosophers)** అద్వైతులు, ద్వైతులు అని రెండు తరగతులుగఁ బలుకవచ్చును. అద్వైతుల మతానుసారముగ జీవి పరబ్రహ్మ స్వరూపుడగుట; ద్వైతుల మతానుసారముగ జీవి, పరబ్రహ్మము నెఱుగుట. ఈ రెండే వేదాంత సారము. వేదసారము, పరమార్థము. మిగిలిన మతములన్నియు నీ రెంటికి మధ్యేమార్గమునఁగల సాధకుల స్థితిగతులను తెలియఁజేయు నవి యని గ్రహింపఁదగును.

కావున 'సాయీబాబా' మతమేమి? ఆయన ప్రబోధించిన సిద్ధాంతము లేవి? అనిన, భగవానుని మతమేమని మనము నిర్ణ యింప గలము? అన్ని మతములు శ్రీ సాయీభగవానునకు సమ్మత ములే. ప్రపంచమున గోచరించు వివిధ మత సంప్రదాయములందు పలుకుల భేదములేకాని, వస్తు తత్త్వభేదము లేదు. చక్కని నైతిక ప్రవర్తనము కలిగి, సకలభూతములందు ద్వేషము విడిచి, మైత్రి కరుణలు పెంపొందించుకొని, సకలభూత హృదయాంతర్వర్తి ఈశ్వ రుడు అని గుర్తించి ఆ పరతత్త్వము నే పేరునఁ బిలిచినను స్మరించి

నను పరమశాంతిశోభిత సచ్చిదానంద స్థానమును ప్రాపింపగలము అనుగాఢ విశ్వాసము, ధైర్యోత్సాహములతోఁ గూడిన ఓర్పుగలిగి వారి వారి విధ్యుక్త ధర్మములను శక్తివంచన లేక పొనరించుచు మానవులు తమ జీవయాత్ర జరుపనగుననియే బాబా బోధలలోని సారము. సకల అవతారములు, సకల సద్గురువుల బోధలలోని సారము - ఇదియే. ఈ సిద్ధాంతమునకు, ఈ మతమునకు (అభిప్రాయమునకు) ఏ పేరైన పెట్టుకొనుడు. లోపము లేదు.

శ్రీ సాయీ ప్రభువు - అన - ప్రేమ పవిత్రతల రూపమని - దైవశక్తి సంపదల ఆగారమని, ప్రత్యక్షదైవము, (చల్తేబోల్తే దేవ్) అని బాబా ఆశ్రితులు గ్రహించిరి. "నేను మీ యెల్లరను ప్రేమించు చున్నట్లు మీ రొండొరులు ప్రేమించుకొనుడు", అని బాబా పలు మాఱులు పలికినాడు.

ప్రేమయే దైవము - దైవమే ప్రేమ", అని సకల వేదశాస్త్ర పురాణములు, సకల మతములు బోధించు చున్నవి. ప్రపంచమున సకల భూతములు వర్ధిల్లుటయు నీ ప్రేమబంధ మూలముననే. కాని, ఈ ప్రేమ, ప్రపంచమున మనము సామాన్యముగ గుర్తించు ప్రేమ, ప్రాకృతప్రేమ, కారణ సహితమైన ప్రేమ, కారణము తొలఁగిన అ ప్రేమయు నంతరించును. అట్టి సహైతుక, ప్రాకృత ప్రేమకు స్థిర మైన యునికిలేదు.

భగవానుడు తన బిడ్డలపై ప్రకటించు ప్రేమ అవ్యాజ ప్రేమ. (కారణ రహితమైన ప్రేమ) ప్రతిఫలాపేక్షలేని ప్రేమ. మన యోగ్యతలు గుణములు మొదలగువానితో దైవమునకెట్టి సంబంధము లేదు. మనమెట్టి అయోగ్యులమైనను దైవము మనలఁ ద్రోసిపుచ్చడు. ప్రేమించుచునే యుండును. మన లోపముల నేదొక విధమునఁ జక్కదిద్దుచునే యుండును. మనము చక్కఁబడుటకుఁ దగిన అవకాశములఁ గల్పించుచునే యుండును.

ప్రతి మానవుడు అనేకములగు లోపములను గావించుచునే యున్నాడు. అట్లు కావించి తన్ను దాను బహిష్కరించుకొనుట లేదు. తన ప్రవర్తనముఁ దాను సరిచేసికొనుటకు ప్రయత్నించుచునే యుండును. జీవిత పర్యంతము తన లోపములను దాను సంస్కరించుకొనుచునే యుండును. తనపైఁ దాను అసూయ, అసహనము వహింపడు. ఆ విధముగ నితరులయందు సైతము మానవుఁడు సహనభావము వహింపవలయును. అవ్యాజప్రేమ స్వరూపుడగు సర్వేశ్వరుని మనము అనుసరించవలయును. అట్టి 'అనుసరణమే' — 'భక్తి' యగును. "పరానురక్తిరీశ్వరే" - శాండిల్యః, 'సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా' - నారదః, 'అనురక్తిః పరేతత్త్వే భక్తిరిత్యభిధీయతే-శంకరభగవత్పాదులు, నిర్వచించిరి.

సాయీబాబా సమక్షమున నెట్టి మత నిబంధనలు లేవు. వివిధ మతావలంబులయ్యు శ్రీ సాయీ ప్రభువు నాశ్రయించినవారు బాబాను ప్రత్యక్షదైవముగ తమ ఆత్మలోని ఆత్మగ గ్రహింపజాలిరి. సకల భూత హృదయాంతర్వర్తియై, యెల్లడల నెల్లవేళల నేమి జరుగుచుండెనో తెలిసికొని తన బిడ్డలకు 'ఏడుగడయై' తన్నాశ్రయించియు పెడ మార్గమునఁ బోవు వారిని చక్కదిద్దుచు, అసాధ్యములను సాధించుచు, సత్ప్రేమామృతమెల్ల వేళల వర్షించు బాబాయెడ గాఢమగు ప్రేమఁ బఱపుటయే బాబా ఆశ్రితులకు సమాన ధర్మమైనది. ఆ ప్రేమ - నిర్వంచిత నిరవధిక ప్రేమ శ్రీ సాయీ కరుణా ప్రసాద సిద్ధికి, సచ్చిదానంద స్థితికి 'ఉపాయోపేయము' లైనది.

## నిష్ఠ — సబూరి

ఒక వ్యక్తిని సమాశ్రయించి, యనుసరించుటకు ఆ వ్యక్తి యొక్క శక్తిసంపదలను ఆశ్రయించువాఁడు లెస్సగ గ్రహింపవలయును. 'ఈ మహాత్ము నాశ్రయించిన మనల నితఁడు క్షేమకరమగు మార్గమున నడిపించి గమ్యమును జేర్పగలఁడు'- అను దృఢవిశ్వాసము కలిగియుండవలయును. బాబా కోరిన మొదటికానుక "నిష్ఠ"

(గురువునందు గాఢ విశ్వాసము) ఇదియే ఆశ్రయించి యనుసరిప ప్రారంభించిన తరువాత 'మన గమ్యమింకను సమీపింపలేదే. ఈ దారిన గుంటలు, ఆ దారిన మెట్టలు, కంటకములు క్రూరమృగాదు లిందందు గానఁబడుచున్నవే. ఇంకను జేరలేదే యని తహతహ నిస్పృహలు పొందరాదు. సకలభారము లారక్షకుని యందుంచి, ఎట్లీడ్చిననుసరే, అది మనకు మేలే యను ధైర్యోత్సాహములతోఁ గూడిన ఓర్పుగలిగి ఆ సమర్థ సద్గురువు ననుసరించుటయే ఆశ్రితుడు చేయదగినపని. బాబా తనవాని వలన కోరిన రెండవకానుక 'సబూరి' (ధైర్యోత్సాహములతోగూడిన ఓర్పు) ఇదియే.

ఒక సోదర భక్తుఁడీరచయిత కొక ఉత్తరము వ్రాయుచు నిట్లు ప్రశ్నించినాఁడు. శ్రీసాయీబాబా చిత్రపటములలో నొక పటము నందు 'బాబా ముందుభాగమున నొక కుక్క, వెనుకభాగమున గుఱ్ఱము చిత్రింపఁబడియున్నవి. అందలి అభిప్రాయమేమి?' అని. ఆ చిత్ర పటమీరచయిత పలుమాఱులు చూచియుండెను. ఈ సంశయము తోచియుండలేదు. ఆ ఉత్తరము చదువుచుండగనే బాబా వెంటనే సమాధానము స్ఫురింపఁ జేసినాడు.

"ఈ సృష్టియందున్న జీవములలో విశ్వాసముయొక్క రూపము, 'కుక్క'. దానినిమించిన విశ్వాసముగల జంతువు లేదనియే చెప్పవచ్చును. కావున బాబాను సమాశ్రయింపఁదలచువాఁడు, తన రక్షకుడు యజమాని యందెంత విశ్వాసము వహించి కుక్క ఆశ్రయించి యనుసరించునో అంత విశ్వాసముఁ గలిగి యుండవలెనని బోధించుటకే 'కుక్క' చిత్రము బాబా చిత్రమునకు ముందు భాగ మునఁ జిత్రింపబడినది. సృష్టియందుగల జంతువులలో ధైర్యోత్సాహ ములతో గూడిన 'ఓర్పు' యొక్క రూపము, 'గుఱ్ఱము' అని చెప్ప దగును. యుద్ధములందు ఫిరంగులు మ్రోయుచుండనీ, ఖడ్గములు తళుకులీనుచుండనీ యెట్టి కఠిన దుర్గమ పథములనైన ధైర్యో త్సాహములతోగూడిన ఓర్పు గలిగి యజమానుని భారము వహించి ముందుకుఱుకునది గుఱ్ఱము. కావున అట్టి ధైర్యోత్సాహములతో

గూడిన ఓర్పుగలిగి బాబాను ఆశ్రితుడు సమాశ్రయించవలయును, అని తెలియజేయుటకు బాబా చిత్రమునకు వెనుక భాగమున గుజ్జము చిత్రింపబడినది. అని సమాధాన మారచయిత వ్రాసిపంపినాడు.

శ్రీ సాయీ కబీరు సూక్తులు గమనింపుడు,
"నేహనివాహై హీ బనే – సోబైబనేన అన్,
తనదే మనదే శీశదే – స్నేహననీజైజాన్,

స్నేహంబు నిలుపుట నేర్పరితనము
ఐహికసుఖము లేవైనఁబోనిడుము.

తనువేని – మనమేనిఁదలయేనిఁ దుదకుఁ
జననిమ్ము - కాని, నీ సఖ్యమ్ము విడకు !
"స్నేహో భక్తి రితి ప్రోక్తః" - (వల్లభాచార్యః)

మానవుఁడు తన ఉరమున నొకే హృదయము గలిగి యున్నాడు. ఆ యేకైక హృదయ కుహరమునందొకే స్నేహితునకు స్థానమీయవలయును. ఆ యేకైక అప్తమిత్రుఁడే యీ సమస్త విశ్వమునై యున్నాఁడు. అంతకంటె భిన్న వస్తువే విశ్వమున లేదు.

శ్రీ సాయీ ప్రభువు తన ఆశ్రితున కట్టి విశ్వాస సహనములు కలుగుటకే తన అద్భుతలీలలను ప్రదర్శించినాడు. ప్రదర్శించు చున్నాడు. అవి ఐంద్రజాలికుల మాయలుకావు. కేవలము, తన బిడ్డ లను పెడదారులఁబోనీయక సక్రమమార్గమున నడిపించి, గమ్యమును జేర్పించు నిమిత్తము ప్రదర్శించినవేకాని, స్వలాభాపేక్షతో పేరు ప్రతిష్ఠల కొఱకు ప్రదర్శింప బడినవికావు.

"ఐశ్వర్యస్య సమగ్రస్య ధైర్యస్య యశసః శ్రియః
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగఇతీరణా"

సమగ్రమగు ఐశ్వర్యధైర్యయశశ్శ్రీ జ్ఞాన వైరాగ్యము లనబడు ఆరు విధములగు సామర్ధ్యములను ఆశ్రితుడు తన ఆశ్రయమందు

గమనింప వలయును. ఆశ్రయించువారు వారివారి యనుభవములచే తమ ఆశ్రయమందు అట్టి శక్తి సంపదలను దెలిసికొనఁ దగినవేకాని, యితరులుచెప్పి బోధపఱుపఁదగినవికావు. శ్రీ భగవానుని అవతారము లనినను సమర్థ సద్గురువులనినను భేదములేదు. వారి మహిమ లనంతములు-అద్భుతములు. అట్టి అద్భుతశక్తి సంపదలు గలిగియు వారు తమ మహిమలను విచ్చలవిడిగఁ బ్రదర్శింపఁబోరు. వారు 'నీరు కొలఁది తామర' వంటివారు. ఆశ్రితులు తమవలన నెంత గ్రహింపఁ అంతమాత్రమే ప్రకటింతురు. అదియు తనపై సకల భారములు నిలిపి, సమాశ్రయించిన తన ఆశ్రితునిఁ జక్కదిద్దుటకు, సరియైన మార్గమున నడిపించుటకేకాని, తన దగ్గఱ 'యీ సిద్ధికలదు, ఆ సిద్ధి కలదు' - అని ఘనతకై ప్రదర్శించుటకుకాదు.

బాబా ఆశ్రితులు పలువురు లౌకికార్థములందు కాంక్షచేత, వ్యాధులు కష్టములు నివారించుకొనుటకు ప్రాపంచక సుఖములను బడయుటయే ప్రధానముగ నుద్దేశించి ఆశ్రయించిరి. ఆశ్రయించు చున్నారు. ఏ తలంపుతో బాబాను ఆశ్రయించినను మహదాశ్రయము వ్యర్థముకాదు. కరుణామయుఁడగు సాయీ ప్రభువు తనవానికి అభయము ఆశ్రయ మొసంగి తీరును. ఎవరెవరికెట్టి హితము (మేలు) కూర్పనగునో ఆ తండ్రి అనుగ్రహించును. తాను కోరిన వన్నియును బాబా సమకూర్పలేదే - యని ఆశ్రితుఁడు విచారపడరాదు. అవి తనకు (ఆశ్రితునకు) మేలుకాదనియే బాబా సమకూర్పలేదని విశ్వసింప వలయును.

'జీవి' సచ్చిదానంద స్వరూపుఁడగు ఈశ్వరుని అంశమైన కారణమున సంతతము సుఖానందములను గోరుట సహజము. ఆ సుఖానందములు ప్రాపంచకములు. క్షణికములు కానిండు లౌకిక అప్రాకృతములు శాశ్వతములు కానిండు, జీవి కోరునది సుఖానందానుభూతియే. దానినిఁ బడయుటకు పాత్రతాశుద్ధి అవసరము. మహా పురుషుల సమర్థ సద్గురువుల ఆశ్రయము అట్టి పాత్రతాశుద్ధిని సమకూర్చును. దానివలన మనశ్శాంతి; దాన సచ్చిదానంద స్థితి కలుగును.

శ్రీ సాయీ ప్రభువు తన ఆశ్రితుఁడే కోరికతో ఆశ్రయించినను కాదనఁడు. చేరఁదీయును. వారి వారి కోరికలొక కారణమేకాని, యది యంతయు దైవస్వరూపుడగు బాబా సంఘటనమే. దైవాభిముఖుఁడై, బహుజన్మపుణ్య విశేషమున బాగుపడఁదగిన తనఁ వాడెం దెందు ఎన్నివేల మైళ్ళ దూరముననున్న నేదోయొక కారణముఁ గల్పించి, తనచెంతకుఁ జేర్చుకొనును. శ్రీ సాయీనాథుఁడు తన వానికి ప్రప్రథమమునఁ గూర్చునది 'ఆస్తిక్య బుద్ధి' - (దైవము కలఁడు అను ఎఱుక)

# శ్రీ సాయీ అనుసరణము

## ప్రథమ పాదము

## ఆశ్రితుడు – సాధకుడు

**ఆస్తిక్య బుద్ధి :-**

శ్రేయోమార్గమునఁ బయనించి గమ్యము పరమధామముఁ జేరఁదలంచు మనుజునకు ప్రప్రథమమున ఆస్తిక్యబుద్ధి (దేవుఁడు-భగవానుడుకలఁడు అను నిశ్చయాత్మక బుద్ధి) కలుగ వలయును. ఈ విషయమున అవంతయు సందేహము వహింపఁదగదు.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."
యంత్రమందునున్న యంత్రచోదకునటు
లీ సమస్త భూత హృదయములను
నిలిచి, యీశ్వరుండు నిజమాయచేఁ బ్రాణు
లను భ్రమింపఁజేయు; ననఘచరిత !

భగవద్గీతామృతము 18 - 61)

అని భగవాఁనుడు గీతలందు స్పష్టముగఁ దెలిపినాడు. అఖిలభూత హృదయములందధివసించిన యీశ్వరుని యునికి మాత్రమున జీవులాయా కర్మములందుఁ బ్రవర్తిల్ల గలుగుచున్నవి. అని వేదశాస్త్ర పురాణాదులు బహుముఖముల ప్రవచించుచున్నవి. ఆ దైవమునందు ఆదైవవాక్కులగు వేదములందు వాని వివరణములగు శాస్త్ర పురాణాదులందు దృఢ విశ్వాసము కలిగి యుండుటయే ఆస్తిక్య బుద్ధికలిగి యుండుట.

మాయ:-

మాయ - అనునది యీశ్వరుని లీలాశక్తి. అది సత్య వస్తువును గప్పివుచ్చును ( ఆవరణము ). ఆ సత్యవస్తువును మఱి

యొక విధముగఁ గన్పింఁప జేయును (విక్షేపము). దీనినే భ్రాంతి యందురు. ఈ మాయా బంధమునుండి విడివడుటకు మార్గము, "తమేవశరణం గచ్ఛ సర్వభావేన భారత!" ఆ సర్వేశ్వరుని సర్వభావముల సంపూర్ణ శరణాగతి చేయుటయే. దీనినే 'ప్రపత్తి' యందురు. ఆ కారణముననే శ్రీకృష్ణ భగవానుఁడు గీతలందిట్లు విశదపఱచినాఁడు.

"దైవీహ్యేషాగుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే"

దేవసంబంధియును మఱి, త్రిగుణమయము
నైన నా మాయ దాటఁగానలవి కాదు;
ఎవరెఱింగి నన్నే యాశ్రయింపగలరొ
వారలీ మాయను దరింత్రు; పాండుతనయ!

(భగవద్గీతామృతము. 7:14)

సర్వవ్యాపియైన దైవమును మాయా బద్ధుఁడగు జీవి తెలిసికొన జాలఁడు. ఇక దైవమును శరణుజొచ్చుట యన సకల దైవ సంపదలు గలిగి దైవమున కందుబాటగు దైవత్వము మానవున కందుబాటగు మానవత్వము గలిగిన అవతారమును, సమర్థ సద్గురువును శరణొందుటయే.

మన అజ్ఞానమే మనల పెడదారుల కీడ్చుచున్నదనియు, మన బుద్ధిని పరతత్త్వమునందు నిలిపి, మనముజేయు ప్రతికార్యము దైవముచే కావింపఁబడుచున్నది, అనగా దైవమే 'కర్త' యనియు, మనకుఁ గావలసిన సాధనము గురుఁడొక్కడే యనియు, ఆ సమర్థ సద్గురువు బోధలు - ఉపదేశాదులచే గాక తన అద్భుతశక్తి ప్రేమలను తనవానిపైఁ బఱపి తన ఆశ్రితుని సముద్ధరింపగలఁడు అని సాధకుఁడు తెలిసికొనవలయును. సమర్థ సద్గురువు తన అద్భుతమైన ఆత్మశక్తిచే ఆశ్రితుని ఆత్మను తన కైవసము చేసికొని, చక్కదిద్ది, తన యందు లయము గావించుకొని, తనకుఁగల జ్ఞానశక్తులను ప్రసాదించి

"అపనాగుసరికాకరితత్కాల్" తనయంత వానిఁగాఁ గావించును. దీనినే భ్రమరకీటక న్యాయమందురు.

ఈ సత్యము బాబా గురువగు శ్రీ వేంకుశుఁడు (గోపాలరావ్ దేశముఖ్) శ్రీ సాయీబాబాయెడ నెఱపిన విధానములలోను, శ్రీ సాయీ ప్రభువు తన అంకిత సంతతివారగు మహల్సాపతి, నానాసాహెబ్ చందోర్కర్, ఉపాసనీబాబా, కాకాదీక్షిత్తు మొదలగు ఆశ్రితులను చక్కదిద్దుటలోను విశద మగుచున్నది. బాబాను ఆశ్రయించిన జనులలో పలువురు సామాన్యులు కలరు. వారికి అధ్యాత్మిక శాస్త్రములు వేదవేదాంతములు బోధపడవు. వారి యెదుట నెట్టి శాస్త్ర ప్రవచనములు కావించిన ప్రయోజనము లేదు. అందుచే బాబా సర్వ సాధారణముగ 'మాయా' — 'మిథ్యా' - అను పదముల నుపయోగించినవాఁడు కాఁడు. 'మామేవయే ప్రపద్యంతే మాయా మేతాం తరంతితే" - అని శ్రీకృష్ణ భగవానుఁడు పలికినటుల ఆ సర్వేశ్వరుని సమర్థ సద్గురు రూపమున నున్నవానిగ గుర్తించి, గాఢముగ విశ్వసించి ఆశ్రయించుటయే జీవి కావించవలసిన పనియని బాబా పలుమాఱులు విశదపఱచినాఁడు. ఇదియే 'గురుమార్గము'. ఆ పిదప మాయను తరింపజేయువాడు ఆ సద్గురుమూర్తి యగు భగవానుఁడే.

సర్వవ్యాపియైన భగవానుని ఈ జీవి యెట్లు గుర్తించి, ఆశ్రయించి శరణాగతి చేయగలడు? ఈ సకల జీవులందు అపార నిర్వ్యాజ కరుణ వహించి సర్వేశ్వరుఁడొక కాలముననే కాదు. ఒక దేశముననే కాదు. ఎల్లకాలముల నెల్లయెడల నవతరించి తన ప్రేమామృతమును జీవులపై వర్షించుచుఁ దన బిడ్డలను జేరఁబిలుచుచునే యున్నాఁడు. కాని బలీయములగు ప్రారబ్ధ దుష్కర్మములకులోఁగి దూరదూరమున కేగువారిఁగూర్చి యేమిచేయ గలడు? ఇన్ని యవతారములు - ఇందఱు సాధు సద్గురువర్యులు భగవత్స్వరూపులే (చత్తే జోత్తే దేవ్ - కదలుచు పలుకు దైవమే). ఏ యవతారమును ఏ సమర్థ సద్గురువును సమాశ్రయించి సేవించినను ఫలము సమానమే. ఈ మాయను తరించుటకు ప్రప్రథమ సాధనము 'మహత్కృప' - మహా

త్ముల యొక్క కరుణ - భగవత్కృపాలేశము - అని నారద మహర్షి వక్కాణించినాడు.

"ముఖ్యతస్తు మహత్కృపయైవ - భగవత్కృపాలేశాద్వా"

పరమసాధు మహాత్ముల కరుణయేని
హరికృపాలేశమేని ముఖ్యమగు దీన
'మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ'
ఆ మహాత్ముల సాంగత్యమనిన - దుర్ల
భం బగమ్య మమోఘమై పఱగుచుండు
"లభ్యతేఽపి తత్కృపయైవ'
ప్రాప్తమగుటయు నా పరాత్పరుని కృపయు.
'తస్మింస్తజ్జనే భేదాఽభావాత్'
స్వామికిఁ దదీయునకు భేదమేమి లేమి,
'తదేవసాధ్యతామ్ - తదేవ సాధ్యతామ్:
ఇదియ సాధింపు డిదియ సాధింపుడెపుడు.

(ప్రేమామృతము - నారదభక్తి సూత్రములు 38-42)

భగవానునకు ఋతంభర ప్రజ్ఞుఁడగు బ్రహ్మవిదునకు భేదములేదు. బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి - బ్రహ్మజ్ఞుఁడగువాఁడు బ్రహ్మమే యగుచున్నాడు. అని వేదములు పలుకుచున్నవి. ఆతఁడేక దేశగతుడుగ, ప్రాకృతదేహధారిగ గోచరించు చున్నను ఆతడు సర్వ వ్యాపియే. ఆవరణ శూన్యుడే యగు చున్నాడు. బాబా ఒక సంద ర్భమున నిట్లు పలికెను.

'ఈవు చూచునట్టి యీ శరీరంబొక
గృహమటంచు నీవు నెఱిగికొనుము,
ప్రేమనాగురుండు వేంకుశుండెప్పుఁడో
యెత్తుకొనుచుఁబోయె నింటనుండి·'

(శ్రీసాయీ కరుణ - పుట 33)

కావున సాధు సద్గురువులు ప్రాకృత దేహము లందున్నట్లు కనబడుచున్నను వారు దేహబద్ధులుకారు. దేహబుద్ధులుకారు. ఆ కారణముననే బాబా అప్పుడప్పుడు 'మై అల్లాహూమ్' - నేను దేవుడను, అని పలుక గలిగినాడు. 'అహం బ్రహ్మాస్మి' — నేను బ్రహ్మమును, అని అందఱు పలుకఁ జాలరు. పలికినను ప్రయోజనము లేదు. ఆ స్థితి ఆ వ్యక్తియందు ప్రకటము గావలయును. విశ్వవ్యాపకత్వము విశ్వనియంతృత్వము సర్వజ్ఞత్వము ఎందు ప్రకటమగునో ఆ వస్తువు 'బ్రహ్మము' - అని వేఱుగ జెప్పనక్కరలేదు. బాబా సర్వసాధారణముగ 'నే నీశ్వర సేవకులలో నొకడను' అనియే పలుకువాఁడు. "అల్లా మాలిక్ అల్లా అచ్ఛా కరేగా" - 'భగవానుఁడు మహా ప్రభువు దైవము నీకు మేలుచేయుగాక!" అనియే పలుకువాడు.

శ్రీ సాయీ ప్రభువును జేరిన వారందఱు నేదొక కోరిక కారణముగ నాశ్రయించువారు. ఇట్టివారితో "తత్త్వమసి' (ఆ పర బ్రహ్మమే నీ వగుదువు). ఇత్యాది మహావాక్యములు పలికిన ప్రయోజనము లేదు. వారికి మేలు చేకూర్చు కోరికల ననుగ్రహించి, తన సామర్థ్యమును బ్రకటించి 'ఈ సత్పురుషు నాశ్రయించిన మనము గమ్యము క్షేమముగఁ జేరగలము' అను గాఢమగు విశ్వాసము పాదుకొనఁ జేయ వలయును. "నేను బ్రహ్మమును - నీవు బ్రహ్మమవు - ఈ ప్రపంచము మిథ్య" - అను పలుకులను సామాన్యులగు పామరుల యెదుట బలికిన ప్రయోజనము లేదు. వారికవి బోధపడవు. వారికి గావలసినది కష్ట నివృత్తి - అభీష్టావాప్తి - శాంతి సుఖములు. ఇవి ఏ ఆశ్రయము వలన కలుగునో ఆ వస్తువును 'దైవము' - అను బుద్ధితో ప్రజానీకము సేవించి యనుసరించును. శ్రీమచ్ఛంకర భగవత్పాదులు ఈ విషయమును గుర్తించియే యిట్లు శాసించినారు.

"అకృత్వా వృత్తి విలయం - అజ్ఞాత్వా తత్త్వమవ్యయమ్
అహంబ్రహ్మేతి యో బ్రూతే - తస్యజిహ్వావికర్తయేత్" - అని.

చిత్తవృత్తిని విలయము చేయక అవ్యయమైన సత్యవస్తువును యథార్థముగఁ దెలిసికొనక "నేను బ్రహ్మమును" అని పలుకువాని నాలుకను ఛేదింపఁదగును."

చిత్తవ్యాపారమును నిరోధింపలేక, సత్యవస్తువును దెలిసికొనలేక జల్పములాడువాఁడు తాను వంచితుఁడై లోకమును వంచించు ననుటలో సందేహములేదు. ఆధ్యాత్మిక విద్యయందుఁ గొంత ప్రవేశము గడించి శ్రీశంకర భాష్యము, జ్ఞానేశ్వరి (భగవద్గీతలకు మహారాష్ట్రభాషలో వ్యాఖ్య) మొదలగు వేదాంత గ్రంథపరిశోధనము గావించిన నానాసాహేబ్ చందోర్కరు, ఉపాసనీబాబా మొదలగు వారితోనైన శ్రీసాయీ ప్రభువు మాయా సిద్ధాంతము మొదలగు తాత్త్వికవిషయములను చాల అరుదుగ చర్చించువాఁడు. ఇన్ని చదివియు చందోర్కరు మొదలగువారు స్వకీయానుభవములందు - స్వీయకర్మాచరణమందు నెట్లు భ్రమపడిరో - బాబా వారల నెట్లు చక్కదిద్దెనో ఆయా భక్తుల వృత్తాంతములందు దెలిసికొనగలము. "ఏమీ, నిన్నుపేక్షింతునా?" (శ్రీసాయీ చరిత్రము — భక్తుల అనుభవములు) అను గ్రంథమునందు విపులముగ నీ విషయములు వివరింపబడినవి.

భాష్య ప్రవచనములు చదివిన వినిన మాత్రమున జ్ఞానోదయము కలుగఁబోదు. నిత్యానిత్య వస్తు వివేకమే జ్ఞానము. ఈ విశ్వమున నిత్యవస్తువేదో - అనిత్యవస్తువేదో స్వానుభవమువలన (శాస్త్రములందు పఠించుటవలనగాదు) దెలిసికొనఁజాలినవాఁడు జ్ఞాని. ఆ కారణమున మిథ్యావాదము, మాయా సిద్ధాంతమునుగూర్చి బాబా తన ఆశ్రితులతో నెప్పుడు భాషించువాఁడు కాడు. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అనుటలో సత్యవస్తువు ఒకటిగాని రెండులేవు. సత్యమైన వస్తువు బ్రహ్మమొక్కటే. ఈ విశ్వము (మనకు గోచరించునది) మిథ్య యనుటలో 'శూన్యము'—అని కాదు. మిథ్యాశబ్దమునకు మధుసూదన సరస్వతులు 'సత్యాఽనృతాభ్యామనిర్వచనీయత్వం మిథ్యా' — అని ప్రవచించిరి. అనగా సత్యమని అంగీకరించుటకు — అసత్యమని త్రోసివేయుటకు సాధ్యముకానిది 'మిథ్య' అని తెలిపిరి. మూడు కాలములందు అసాధ్యమైన వస్తువు 'సత్యము'. అది యెల్లప్పుడు- అనగా పూర్వము, ఇప్పుడు, ఇఁకముందు నొకే విధముగ నుండునది.

అని భావము. అట్లు లేనిది మిథ్యయని తెలిసికొనవలయును. ఆ సత్య వస్తువును యథార్థముగ నెఱుగఁజాలిన వానికే యీ జగత్తు 'మిథ్య' అగునుగాని యెల్లరకు మిథ్యకాజాలదు. దీనిని త్రోసివేయుట, సాధ్యముకాదు. ఆ కారణమున బాబా తన ఆశ్రితుల కెవరికిని ఈ జగత్తు మిథ్యయని చెప్పి యెఱుగఁడు. బాబా గ్రహించినది - ఆచరణానుభవమునఁ దానెఱుఁగఁజాలినది తన వారికి బోధించినదియు నగు పరమరహస్యము ఒక్కటియే. "గురువును గాఢముగ విశ్వసింపుము. అనుసరింపుము." ఈ సూత్రమును బాబా పలుమాఱులు తనవారికి నొక్కి పలికినాఁడు,

"గురువును నెఱనమ్ముటయే
పరమంబగు సాధనముగ భావింపుము! నీ
గురువే దైవము - సకలము;
పరికింపుము నన్ను - నిన్నుఁ బరికింతుఁగృపన్.

(శ్రీ సాయీకరుణ - పుట 19)

ప్రేమతత్త్వము :

వికసనము జీవనము, ముకుళనము మృతి. సకల భూతములయెడ ప్రేమ వికసనము. స్వార్థచింతనము ముకుళనము. కావున ప్రేమ జీవన ధర్మము - ప్రేమించువాఁడు, జీవించును. స్వార్థపరుఁడు ప్రతి క్షణము క్షయించును. జీవించుట కూపిరి పీల్చునటుల, జీవనాధారము ప్రేమకావున ప్రేమకొఱకే మనము ప్రేమించవలయును. స్వార్థరహిత బుద్ధితో మనము కావించు ప్రతికార్యము విజయవంతమగును.

ఈ విశ్వమును నిలుపఁజాలు శక్తి, ప్రేమ. సర్వాతంకముల నిరోధింపఁగలశక్తి, ప్రేమ. మన అసంపూర్ణ నాగరకతా ప్రపంచమున వ్యక్తికి వ్యక్తికి, సంఘమునకు - సంఘమునకు, జాతికి - జాతికి దేశమునకు - దేశమునకుఁగల ప్రతిబంధములఁ దొలఁగించి యైక్యమొనర్పఁజాలినశక్తి ప్రేమ - అట్టి నిస్వార్థ ప్రేమ ప్రకాశించునెడ

వైషమ్యము, ద్వేషము, అసూయ మొదలగునవి పటాపంచలగును. ఆ ప్రేమ యంత్రము చిచ్ఛక్తి - శ్రీసాయిబాబా. శ్రీసాయీప్రభువు నాశ్రయించి యనుసరించు తన బిడ్డలకు సర్వకాల సర్వావస్థలయందుఁ దన్ను జ్ఞప్తియందుంచుకొని స్మరించుచు, సేవించు నవకాశములు-సంఘటనలు బాబా కల్పించుచునే యుండును. తనవారిని క్షణమేనియు విడువఁడు. వారిని చక్కదిద్దు భారమా తండ్రియే వహించును. శ్రీసాయీనాథుని సర్వభూతాంతర్యామిగ భావించి ధ్యానింప నేర్చిన భక్తుఁడు తాను స్వయముగ సర్వభూతాంతర్యామి యగుచున్నాఁడు. భాగవతమున ప్రతిపాదింపఁబడిన మూలసూత్రము. శ్రీసాయీనాథ బోధలలోని సారామృతము ఇది యొక్కటే. 'నీనుండి యితరుల నెంతెంత దూరము చేయుదువో అంతలంతలు కష్టవ్యసనములను, ఎంతెంత నీలోనికి స్వీకరించి ప్రేమ పరవుదువో అంతలంతలు సుఖానందములను పొందఁగలవు. ప్రతి జీవియందును నీ ప్రేమను కేంద్రీకరింప నేర్చిన నీ ఆత్మ వృత్తముయొక్క పరిధికి అంతమెందును గలుగదు.'

ఈ సత్య రహస్యమును బాబా కేవలము మాటలతో చెప్పక తన వారికి వారి వారి దైనిక ప్రవర్తనములందు స్వానుభవముల బోధపడునట్లు కావించి వారినిఁజక్కదిద్దినాడు. ప్రేమయే దైవము. దైవమే ప్రేమ. ఆ ప్రేమ యేసగుణరూపమున ప్రకటమైనదో ఆ రూపమును అవతార మనినను, సద్గురువనినను మఱియే పేరునఁబిలిచిన నొకటే. ఆరూప మాపాదమస్తకము సేవనీయము, స్మరణీయము అని భక్తులు విశ్వసింప నగును. దైవప్రేరణముచే ఆ సగుణ రూపమునకుఁ గలిగిన నామము అనంతఫలప్రదము. 'నామి' యగు ఆ సగుణరూపము మనలనుండి దూరమైనను, అదృశ్యమైనను నామబలముచే నతి సర్వదా ఆకర్షింపబడి, భక్తాభీష్టప్రదము, అప్రతిహతావలంబనము, రక్షణదక్షము నగుచునే యుండును. అట్టి అవతారములకు, సద్గురువులకు జనన మరణముల నాపాదింపరాదు. ఏ నామముల సర్వవ్యాపియగు దైవమును భక్తుడు ఆర్తుడై స్మరించునో ఆ క్షణమున ఆ సగుణరూపము ఆశ్రితునకు రక్షణమిడుచునే యుండును. నామమును

గల మహత్త్వము భక్తులెవరికి వారు స్వకీయానుభవముల గుర్తింప దగినదేకాని పలుకులకు సాధ్యముగాదు.

శ్రీసాయీ ప్రభువు తన ఆశ్రితునకు, తన్ను విశ్వసించి యనుసరించు వానికి తన సర్వవ్యాపకత్వము సర్వజ్ఞత్వము వారి వారి యనుభవముల నెఱుకపఱచు చుండును. ఏ జీవి కెట్టి హాని కలిగించి నను అది దైవమునెడ దైవస్వరూపుఁడగు సద్గురువునెడ మహాప చారము గలిగించుచున్నాఁడనను ఎఱుక తన వానికి బాబా గలిగిం చును. ఏ జీవిని ఏమాత్రము సంతోషపెట్టినను తాను సంతుష్టి సంతృ ప్తులఁ బొందినట్లు బాబా విశదపఱచును. మనము కావించు ప్రతి కార్యము బాబా మనచెంతనుండి పరీక్షించుచునేయున్నాడు. ఆ తండ్రి "కన్నుఁ గప్పుజాలము", అను బుద్ధి ఆశ్రితునకుఁ గలుగుచునే యుండును.

శాస్త్రగురు బోధలను మఱి స్వానుభవము
కలిమి నెద్దాని నరుఁడేదుగడగనమ్ము,
నదియె శ్రేష్ఠంబుఁ బరమమౌనదియ, యదె, జ
గంబునన్ వాని కవలంబనంబు; సాయి!

'ఇది యెవరు చెప్పినారు? అది ఎవరు చెప్పినారు?' అని యన్వేషింపఁదగదు. ఆ చెప్పఁబడిన విషయమును మాత్రము గమనింప నగును. శ్రీ సాయీ ప్రభువు తన జీవిత మంతయు సంఘమునకు దూరమై యేకాంతముగ నిర్వికల్ప సమాధియందుఁ గడపినవాఁడు కాఁడు. జన సమాజమునఁ గలిసిమెలిసి నిరంతరము తన ఆశ్రిత బృందమును వేయికనులఁ గనిపెట్టి సర్వ విధముల రక్షించినాడు. నిరంతర నిర్నిద్రుడు. నిరంతరము జన సమాజమునకు మేలు చేయువాఁడు. బాబా సంతతబ్రహ్మనిష్ఠుఁడయ్యును 'తనవారితోఁ గూడి ప్రవర్తించినవాఁడని మనము గుర్తించవలయును. బాబా ప్రక టించిన యద్భుతలీలలు తనవారికిఁ దనయందు గాఢ విశ్వాసము పాదుకొలుపుటకేకాని, కీర్తి ప్రతిష్ఠలు కోరికాదు. అంత మహోన్నత

స్థితి యందున్న సాయీ ప్రభువును అనుసరించుట యెటులా? - యను సందేహము జనులకు సాధారణముగఁ గలుగవచ్చును. దానికి సమాధానము బాబా జీవిత చరిత్రమే. దానిని శ్రద్ధతో గమనించితి మేని ఆ తండ్రిని మన మనుసరింపఁ గలము. ఈ యనుసరణముననే శ్రీ సాయీ ప్రభువునందు భక్తిద్యోతక మగును. బాబా ప్రత్యక్షముగ ఉపన్యాసములిచ్చి బోధించినదెప్పుడు లేదు. మహా సమాధికిఁ బూర్వముగాని, తరువాతగాని, ఆ తండ్రి అచరణమే మనకు బోధగ, బాబా జీవితమే సద్గ్రంథముగ గుర్తించి యనుసరింప నేర్వవలయును.

అధ్యాత్మిక నిష్ఠ గలిగి యంతర్ముఖుఁడు కాఁదలచినవాఁడు బాహ్య ప్రకటనలకు, ఆడంబరములకు దూరము కావలయును. భక్తుఁడగువాఁడు లౌకిక విషయములకుఁ బ్రాకులాడఁడు. ప్రేమ, సేవ, విధేయతలతో భగవానునకై నిరీక్షించును. పురాకృత దుష్కర్మకలుషితమైన జీవికి హృదయమును బుద్ధిని దైవ విషయమునఁ జొనుపుట మిక్కిలి కష్టమైన పనియే యగును కాని, సచ్చిదానంద శాంతిశోభిత ధామమును జేరుటకేకైక మార్గ మదియే. నిష్కాపట్య, పవిత్రత లను రెండుఱెక్కల నాధారముఁ జేసికొనియే మానవుఁడు లౌకిక పథము నుండి పైకెగుర గలఁడు. నిష్కాపట్యము సంకల్పములందు - పవిత్రత ప్రేమయందు వహింపవలయును. సరళత (నిష్కాపట్యము) దైవమును - గమ్యమును చేర్చును. పవిత్రత దైవామృతము నాస్వాదింపఁజేయును. మనశ్చాంచల్యము, దైవమునందు గాఢ విశ్వాసము లేకపోవుట, అను నీ రెండే జీవిని దుష్పథమున కాకర్షించునవి. కావున మానవుఁడు ముముక్షువైనవాఁడు దైవమునకు హత్తుకొనవలయును. లౌకిక భాగ్యభోగముల నపేక్షింపరాదు. సరళ స్వభావులు ధన్యులు. వారికి సత్యశాంతి కరతలామలకము. సరళము, పవిత్రమైన భక్తి మనస్సున కడఁకువఁ జేకూర్చును. మనస్సునం దడఁకువ హెచ్చినకొలఁది సద్భక్తి పెంపొందును.

సకల లౌకిక విషయములకు దూరుడై, యీ విశ్వమున దన్ను సకలమునకంటె నిమ్న స్థానమందున్నట్లుగ భావించుకొను వాని

కంటె భాగ్యశాలి - ప్రభావోపేతుడు - మిక్కిలి స్వతంత్రుఁడు లేఁడు. “ఎఱుకబడక యుండుట యందతృప్తి గనుము” అను సూక్తిని పాటింప దగును. తన్ను దానుద్ధరించుకొనఁ జాలనివాఁడు ఇతరులను సుముఖుల గావించుకొన నేరఁడు. ఇతరులు సన్మార్గులుగ నుండగోరుదుమే కాని మన లోపములను చక్కబఱచుకొన యత్నింపము. కొందఱ విషయమున రోగము యోగమునకు దారితీయును. ఇతరుల పొగడికలచే మనము పవిత్రులము కాజాలము. తెగడికలచే అల్పులము కాఁబోము. శాంతిధామము నపేక్షించువాడు కష్టసహనము నేర్వవలయును.

కుంతీదేవి తన మేనల్లుఁడగు శ్రీకృష్ణు నర్థించిన వరము గమనింపుడు.

‘విపదస్సంతునః శశ్వత్తత్ర తత్రజగద్గురో
భవతోదర్శనం యస్స్యాదపునర్భవ దర్శనమ్’

ఓ జగద్గురూ! శ్రీకృష్ణా! అప్పుడపుడు మాకు కష్టములు కలుగునట్లు అనుగ్రహింపుము. అట్టి కష్టములవలన తిరిగి పుట్టుక జాడలు కననీని నీదర్శన భాగ్యము ప్రాప్తించుచుండును.

కష్టములలోగాని మానవుఁడు దైవమును తలంపఁడు. తల్లి బిడ్డకు ఆరోగ్యకరమని అప్పుడప్పుడు కటుపున కాముదము పెట్టుచుండును. ఆ విధముగ అవ్యాజకరుణా సింధువగు దైవము తా నను గ్రహింపఁ దలచిన వానికిఁ గష్టములప్పుడప్పుడు కలిగించుచు వాని మనస్సును తన చక్కి కాకర్షించుకొనుచుండును. కావున భగవానుని నిగ్రహముసైతము అనుగ్రహముగ భక్తుఁడగు వాఁడు తలంచి యా ప్రభువునే తన కష్టనివృత్తికై ప్రార్థించును. కష్టములలోగాని లౌకిక విషయములందు విరక్తి కలుగదు. ఆ విరక్తి క్రమక్రమముగ సద్భక్తికి దారితీయును. సహజవిరక్తి కలిగినగాని మానవుఁడు ప్రవృత్తి మార్గమును విడిచి నివృత్తి మార్గమున కభిముఖుడు కాఁజాలడు.

ఎన్ని జన్మములకైన నట్టి సహజ విరక్తి పాదుకొనినపుడే జీవి సంసృతిబంధములనుండి విడివడుటకు యోగ్యత గడించును. అది భగవత్కృపా లేశమున మహాత్ములగు సద్గురువుల అనుగ్రహమున లభ్యమగును.

3. సంసృతి - జనన మరణములు :

"అస్తీత్యేకే నాయమస్తీతిచైకే - దేహపతనానంతర మీ జీవి ఉన్నాఁడని కొందఱు - లేడని కొందఱు వాదింతురు. మన ఊహల కతీతములైన విషయములగూర్చి తర్కించుట వ్యర్థము. కావుననే మానవుఁడు తొలుదొలుత ఆస్తిక్య బుద్ధి గలవాఁడు కావలయునని తెలుపఁబడినది. అస్తిక్య బుద్ధిగలవాఁడు, దైవమును, దైవజ్ఞులగు మహాత్ములను, వారి వాక్కులను విశ్వసించును. బంధువధ చేయఁ జాలక యుద్ధ సమయమున ఖిన్నుడైయున్న అర్జునునిఁజూచి శ్రీకృష్ణ భగవానుఁడు తెలిపినది గమనింపుడు.

'నత్వేవాఽహం జాతునాసం - నత్వం నేమేజనాధిపాః
నచైవ నభవిష్యామః సర్వేవయ మతఃపరమ్.
నేను మును లేనివాఁడనుగాను పార్థ !
నీవు లేనట్టివాఁడవు కావు; భూమి
పాలురగు వీరలును లేనివారుకారు;
ఇంకమీదేని లేకపోమిందఱమును'

(శ్రీమద్భగవద్గీతామృతము – 2-12)

ఆత్మ శ్రేయస్సు నపేక్షించు జీవి నాస్తికుల పలుకులను పాటింపరాదు. జ్ఞానసిద్ధి కలుగు పర్యంతము జనన మరణ చక్ర భ్రమణమునుండి జీవి విడివడజాలఁడనియే మానవుడు విశ్వసింప వలయును.

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః
పెక్కు జన్మంబులెత్తిన పిదప, జ్ఞాన
వంతుడై 'యీ సమస్తము వాసుదేవుఁ
డొక్కడే' - యంచు నరసి నన్నొందఁగలుగు
నా మహాత్ముడు దుర్లభుం; డనఘచరిత!

(శ్రీ మద్భగవద్గీతామృతము 7-19)

ఈ విషయమున శ్రీసాయీ మహాప్రభువు మనకుఁ దెలిపిన విషయములు గ్రహించుదము.

నానాసాహేబ్ చందోర్కరు అసిస్టెంట్ కలెక్టరు. చందోర్కరును బాబా స్వయముగ కోరి, తన దగ్గఱకు పిలిపించుకొనినాఁడు. కోపర్గాం తాలూకాలో జమాబంది కార్యము నిర్వహించుచు అసిస్టెంట్ కలెక్టరు హెూదాలోనున్న చందోర్కరును తన దగ్గఱకు రావలసినదిగ శిర్డిలోని అప్పాకులకర్ణి (కరణము) ద్వారా బాబా పిలువనంపినాఁడు. అసిస్టెంటు కలెక్టరైన తన్నొక సామాన్య ఫకీరు పిలువనంపుట యేమి? అని చందోర్కరు ఆశ్చర్యపడెను. సరే ఆలోచించెదను లెమ్ము - అని ఆ కరణముతో ననెను. అటుల రెండు పర్యాయములు జరిగెను. బాబా విడువలేదు. మూఁడవ పర్యాయము మరల పిలువనంపెను. చందోర్కరు శిర్డికి వెళ్ళి ద్వారకామాయి మసీదుజేరి శ్రీ సాయీ ప్రభువునకు మ్రొక్కి 'బాబా! నా కొఱకు వర్తమాన మంపితివట! ఏమి కారణము?' అని అడిగెను. 'అవును ఈ ప్రపంచములో నున్నవారి నందఱను బిలువనంపుదునా? నీతో నాకు నాలుగు జన్మములనుండి సంబంధము కలదు. అందుచేతనే నిన్ను పిలుపనంపవలసి వచ్చినది' అని బాబా సమాధాన మిచ్చెను.

ఇచట నొక విషయమునుగూర్చి మనము బాగుగ గ్రహించవలయును. 'నీతో నాలుగు జన్మములనుండి సంబంధము గలదు,

అని బాబా, చందోర్కరుతో ననెను. ప్రొఫెసరు జి. జి. నార్కేను శ్యామా (మాధవరావు దేశపాండే) బాబాకు ఎఱుకపఱుపఁగా "ఏమి, శ్యామా! ఈతని నా కెఱుక పఱచుచున్నావా? ముప్పదియేడు జన్మములనుండి యీతని నేనెరుగుదును'. అని బాబా పలికినాడు. ఇట్లు పలువురు ఆశ్రితులనుగూర్చి అనేక జన్మములనుండి వారితో సంబంధము కలిగియున్నట్లు బాబా వారితో చెప్పినాడు. ఇన్ని జన్మముల నుండి చందోర్కరు - నార్కే సాయిబాబాలుగ నున్నారా? యని పాఠకులు సందేహింప వచ్చును. ఆ యాజీవులు వారి వారి కర్మములకు బద్ధులై పెక్కు జన్మములెత్తుచునే యుందురు. ఒక్కొక్క జన్మలో నొక్కొక్క అవతార పురుషునిఁగాని, సమర్థ సద్గురువునుగాని, ఆశ్రయించి సేవించి యుండవచ్చును. ఏ సాధు సద్గురువును సేవించినను దైవమును సేవించినవారే యగుచున్నారు. భగవానుడు, తదీయులు అభిన్నులు కావున ఆ యా జీవులతో సద్గురువగువానికి సంబంధము కలిగియేయున్నది. సద్గురువులలో నొండొరులకు భేదము లేదు. వారి యెఱుక దేశకాల కారణబద్ధముకాదు. జీవుల యెఱుక దేశకాల కారణపరిమితమైనదిగ మనము తెలిసికొనవలయును.

భగవద్గీతలందు "నేనీ యోగమును తొలుత వివస్వతునకు (సూర్యునకు) ఉపదేశించితిని" - అని శ్రీకృష్ణుడనఁగా "నీవు ఇప్పుడు జనించితివి. సూర్యుఁడెప్పుడో జనించెను. ఈ యోగమును నీవు సూర్యున కుపదేశించితివనిన నేనెట్లు నమ్మగలను?" అని అర్జునుఁడు ప్రశ్నించెను. దానికి శ్రీకృష్ణుఁడిచ్చిన సమాధానము గమనింపుడు!

'బహూనిమేవ్యతీతాని జన్మాని తవచార్జున
తాన్య హంవేదసర్వాణి నత్వం వేత్థ పరంతప"
నీకు నాకును పూర్వ మనేకములగు
జన్మములతిక్రమించెనో సవ్యసాచి!

నేనెఱుంగుదు వాని నన్నింటి నిపుడు
నీవు వాని నెఱుంగఁగాలేవు - నిజము.

(శ్రీమద్భగవద్గీతామృతము. 4—5)

కావున దైవము యొక్క యెఱుకవలె బ్రహ్మజ్ఞుఁడగు వాని యెఱుకయు దేశకాల కారణబద్ధము కానిది. ఆవరణ బద్ధుల - జీవుల యెఱుక పరిమితమైనది. ఆవరణశూన్యుఁడు ఋతంభర ప్రజ్ఞుఁడు. విశ్వవ్యాపియగు సద్గురు వెల్లప్పుడెల్లవేళల నెల్లెడల నున్నవాఁడే. ఏ సాధు సద్గురువైనను, ఏ యవతారమైనను శ్రీ సాయీ ప్రభువునకు భిన్నముకాదు.

4. సమదర్శిత్వము :

'ఈశ్వరుఁడు, భగవానుడు అగువాఁడు కలఁడు. అతఁడు సర్వవ్యాపియై, సర్వభూత హృదయాంతర్వర్తియై యున్నాఁడు.' అను ఎఱుకను తన ఆశ్రితునకు వాని స్వానుభవము సద్గురువు బోధపఱచును. సద్గురువు అద్భుతమైన తన ఆత్మశక్తిచే తన ఆశ్రితుని ఆత్మను తనకైవసముఁజేసికొని, చక్కదిద్ది, తనయందు లయముఁ గావించుకొనును. తనకుఁగల జ్ఞాన శక్తులను ప్రసాదించును. 'అపనా సరికా కరితత్కాల్' - తనయంత వానిఁగ జేయును.

శ్రీ సాయీనాధుఁడెప్పుడు నెవరికి ఉపదేశాదులఁజేసి యెఱుగడు. తన వాఁడు సమీపమున నుండనీ దూరమున నుండనీ వానికి యుక్తమార్గము, సత్యమార్గము నెఱుకపఱచు సంఘటనలే కూర్చును. వాని దైనందిన జీవితమున అట్టి యనుభూతులనే కలిగించుచుండును. బాబా ఒక సందర్భమున నిట్లు పలికినాఁడు.

'అమాచ ఘరాణే నిరాళా ఆహే' - మా పద్ధతులు ప్రత్యేకములైనవి. అనగా తన బిడ్డలను సత్క్రమమార్గమున నడిపించు విధానములే వేఱు అని భావము.

'మీ కానాలా ఇస్‌ణారా గురునవ్హే' మా దగ్గఱ చెవిలోనూదు బోధలులేవు. (మేము చెవికొఱుకు గురువులముకాము) బాబా యెవరికిని చెవిలో మంత్ర తంత్రోపదేశములుచేసి యెఱుఁగఁడు. ఈ విషయము రాధాబాయి దేశముఖిన్ వృత్తాంతము చదువుడు.

(శ్రీ సాయీకరుణ - పుట 84, 85)

'యోమాం పశ్యతి సర్వత్ర - సర్వంచమయి పశ్యతి
తస్యాహం నప్రణశ్యామి - నచమే నప్రణశ్యతి'

ఎవఁడు సకలంబునందు నీక్షించుచున్న
నెవఁడు నాయందు సకల మీక్షించుచుండు,
జగతి వానికి నేఁబరోక్షంబునొంద
వాఁడు నాకుఁ బరోక్షంబుగాఁడు ; విజయ ;

(శ్రీమద్భగవద్గీతామృతము - 6-30)

'విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః'

వినయ విద్యలు గలిగిన విప్రునందు
గోవునందు నేనుగునందు, గుక్కయందు
నట్టిది భుజించు చండాలునందుఁ దుల్య
భావమును గనువారలే ప్రాజ్ఞులనఘ !

(శ్రీమద్భగవద్గీతామృతము. 5-18)

శాస్త్రములందు దెలుపఁబడినఁ బోధలను పలువురు చదివియు, వినియు నున్నవారే. కేవలము చిలుకపలుకులవలె వల్లించిన ప్రయోజనము లేదు. అవి వారి వారికి స్వానుభవమున వేద్యములు కావలయును. సమర్థ సద్గురు పట్టి ఎఱుకను పలుకులచేఁగాక

అనుభవపూర్వకముగఁ దనవాని కెఱుకపఱచును. శ్రీసాయీ ప్రభువు మన ఆత్మలోని ఆత్మయై, మనవెంటనుండి మనము కావించు ప్రతి కార్యము, పలుకు ప్రతి మాట, గమనించుచున్నాడు అను విషయము బాబా తన బిడ్డలకు వారి వారి యనుభవముల నెఱుక పఱచువాఁడు. అట్టి సంఘటనలఁగొన్ని యిటఁ బేర్కొనఁ బడినవి గమనింపుడు !

ఎ) ఒకపరి నానాసాహేబ్ చందోర్కరుతో బాబా యిట్లనెను. 'ఎవరేని నిన్ను జేరి యాచించిన ఈయఁగలిగినది యిమ్ము. యాచకుఁడు తృప్తినొందక అధికముగఁ గోరిన వీలుకాదని సౌమ్యముగఁ జెప్పుము. నీ ఆగ్రహావేశములు - అధికార దర్పములు అట్టివానిపై ప్రకటింపకుము.' ఆ మాటలకు చందోర్కరు వల్లెయనెను. కల్యాణ్ అను పురమున చందోర్కరు కుటుంబముతో నివసించుచుండగా నొక బిచ్చగత్తె వారింటికివచ్చి బిచ్చమడిగెను. చందోర్కరు భార్య ఆమెకు బిచ్చము పెట్టెను. దానితో తృప్తినొందక అధికముగఁ బెట్టుమని ఆ అభాగ్యురాలు మంకుఁబూనెను. ఆ గృహిణి విసుగున తన పతితోఁ జెప్పెను. చందోర్కరు ఆగ్రహోదగ్రుఁడై లేచివచ్చి 'పెట్టినది తీసికొని వెళ్ళినావసరే - లేకున్న మెడపట్టి వెలుపలకు గెంటు' మని సేవకున కాజ్ఞాపించెను. సేవకుఁడా బిచ్చగత్తెను వెడలనడిపెను.

కొన్ని నెలలు గడచిన తరువాత చందోర్కరు శిర్డికివెళ్ళి బాబాకుమ్రొక్కి సమీపమునఁ గూర్చుండెను. బాబా అతనివంక చూడక మౌనము వహించెను. 'బాబా! ఏల మాటాడకున్నావు?' అని చందోర్కరు ప్రశ్నింప "నాయనా! నా మాట పాటింపని వానితో నాకేమి మాటలు కలవు?" అని బాబా సమాధాన మిచ్చెను. 'బాబా! నేనేమి అతిక్రమించితిని? నీ బోధలన్నియు పాటించుచుంటినిగదా?" అను చందోర్కరును జూచి, 'కల్యాణ్‌లో నీ యింటికి వచ్చిన బిచ్చగత్తెపైన యధికారదర్పములు ప్రకటించుచు మెడపట్టి వెలుపలకు గెంటుమని నీ సేవకు నాజ్ఞాపించ లేదా? నీవు పెట్టదలఁచిన మఱి కొంచెము పెట్టుము లేదా మానుకొనుము. నీ వాకిట నా బిచ్చగత్తె

కూరుచున్న నీకు గలుగు కష్టమేమి? కొంతసేపు కూర్చుండి వెళ్ళును గదా? మంచిగ చెప్పక నీ బంట్రౌతునకట్టి ఆజ్ఞనిచ్చుట నీకు యోగ్యమా? 'అని బాబా మందలించెను. నానాసాహెబు సిగ్గుపడి యిఁక మీఁద నెన్నఁడా విధముగ ప్రవర్తింపను. క్షమింపు' మని బాబాను ప్రార్థించెను.

శ్రీసాయీ ప్రభువు నాశ్రయించిన వాఁడు త్వరలో నీ సత్యమును "బాబా మనల నెప్పుడు విడువఁడు - మన వెంటనుండి మన కేడుగడయై మనము పలుకు పలుకులు, చేయుపనులు గమనించుచునే యుండును. బాబా కనుల్ఁ బ్రామి మనమేమియుఁ జేయఁజాలము." అను ఎఱుకను పొందఁగలఁడు. ఆశ్రితుఁడు పెడమార్గమున నడువఁ దలచినను వానికి సాధ్యముగాని సంఘటనలను బాబా కల్పించి వానిని మరలించును. ఒక సమయమున మధ్యాహ్న హారతి అయిన పిదప సాయీ ప్రభువొక ఆశ్రితునుద్దేశించి యిట్లనెను.

ఎచటనున్న నీవదేమి చేయుచునున్న
నేమి పలుకుచున్న నెంచుచున్న
నేను వాని నెల్ల నెఱుగఁగాఁజాలుదు
ననుచు లెస్స తెలిసికొనుము - బిడ్డ!

(శ్రీసాయీకరుణ - పుట 128)

ఇది ప్రత్యక్షర సత్యము - అని సోదర భక్తులు గ్రహింపఁదగును. శ్రీ సాయీ ప్రభువు తమ 'అంతర్యామి' - అను సత్యము బాబా అంకిత సంతతి గ్రహింపఁజాలెను.

బి) ఉపాసనీ బాబా శిర్డీకిఁజేరి శ్రీ సాయీప్రభువు నాశ్రయించిన క్రొత్తలో సాతేవాడలో విడిది యేర్పాటు చేసికొని స్వయముగ వంటచేసికొని భుజించువాఁడు. ఒక దినమున నతఁడు వంటకముల సిద్ధపఱచు కొనుచుండ నొక నల్లకుక్క దూరముననుండి యా పదార్థములఁ జూచుచుండెను. ఉపాసనీ ఆ కుక్క కొకింతేని పెట్టక

ద్వారకామాయి మసీదునకుఁ గొనిపోయి ఆ పదార్థముల స్వీకరింపు మని బాబాను ప్రార్థించెను. 'నేనచటనుండ నింతదూరమేల కొని వచ్చితివి'? అని బాబా అడిగెను. 'అచట నొక నల్లకుక్క తప్ప మరెవ్వరు లేరు బాబా! ఇది నిజము, అని ఉపాసనీ పలికెను. నేనే ఆ నల్లకుక్కగ వేచియుంటిని. ఏ కొంచెమేని పెట్టక యింతదవ్వు కొని వచ్చితివి? వీనిని గొనిపోయి నీవే భక్షింపుము' అని బాబా పలికెను.

మఱునాఁడు ఉపాసనీ వంట సిద్ధపరచుకొని కుక్కకొఱకు నిరీక్షించుచుండెను. అపుడొక శూద్రుఁడా సమీపమున గోడనానుకొని యా పదార్థముల నాసక్తితోఁ జూచుచుండెను. కర్మఠుఁడు శ్రోత్రియుఁడైన కాశీనాథుఁడు (కాశీనాథగోవింద ఉపాసనీ) ఆ శూద్రుని గద్దించి యావల కనిపి భోజ్యములఁగొనిపోయి బాబా ముందుంచెను. 'నాయనా! నిన్న రవంతేనిఁ బెట్టకుంటివి. ఈ దినము వచ్చిన కోపించి వెడలనడిపితివి అట్టి నీవు శ్రమపడి యింత దూరమేల కొని వచ్చితివి? తీసికొని పొమ్ము' అని బాబా పలికెను, 'బాబా! నీ వెక్కడ నుంటివి?' యని ఉపాసనీ ప్రశ్నింప - 'ఆ గోడ నానుకొని నిలిచి యున్నవాఁడను నేను కానా?' అను బాబా మాటలకు కాశీనాథు డాశ్చర్యచకితుఁడై, బాబా! నీవట్టివాఁడవగుదువా? యను ఉపాసనిఁ జూచి, "నాయనా! నేనీ విశ్వమున నెల్లెడ నెల్ల జీవులయందు నధివసించి యున్నవాఁడను. నేనులేని తావు లేదు. నీవే జీవినిఁ దనిపినను నన్ను సంతృప్తి పఱచినవాఁడ వగుదువు" - అని బాబా తన సర్వాంతర్యామిత్వము ఉపాసనీ బాబాకు స్వానుభవ పూర్వకముగ వ్యక్తపఱచెను.

(సి) జి. యస్ కపర్దే భార్య ప్రతి దినము ద్వారకామాయి మసీదునకు నైవేద్యముఁ గొనివెళ్ళి బాబాకు సమర్పించుచుండెను. ఒక దినమున బాబాను తన విడిదికి విందున కాహ్వానించెను. అలాగే వచ్చెదనని బాబా పలికెను. కాని వెళ్ళలేదు. ఆ తల్లి ఆ దినమున వంటకములు సిద్ధపఱచుకొని బాబాకొఱకు నిరీక్షించుచుండెను. ఆ యెడ నొక కుక్క అచటకు వచ్చెను. దాని అసహ్యరూపమును

చూచి, యది ఆ పదార్థముల దాకునేమోయని ఒక కొఱవి కట్టెను చేఁబూని దానిపై ఆ తల్లి విసరెను. ఆ కుక్క వెడలిపోయెను. ఆమె ఆ పదార్థముల మసీదునకు గొనిపోయి బాబా ముందుంచి 'బాబా! నీవు వచ్చెదనని చెప్పియు రాకుంటివిగదా!' అనెను. 'అమ్మా నీ పిలువు మన్నించి నేను వచ్చినపుడు కాలుచున్న కొఱవి కట్టెలను నాపై విసరుచుండుము' అని బాబా పలికెను. సర్వభూత హృదయ వాసి శ్రీ సాయీ ప్రభువు అను ఎఱుకలేక తాను గావించిన అకార్య మునకు సిగ్గుపడి ఆ తల్లి బాబాపాదములపై వ్రాలి క్షమాభిక్ష కోరెను. శ్రీ సాయీ నాధుఁడా తల్లి ననుగ్రహించెను.

(డి) ఆర్. ఎ. తార్కాడ్ బొంబాయిలో ఒక ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరెక్టరు. మన్మాడ్ రైలుస్టేషన్ దగ్గఱ రైలుపెట్టెలో నెక్కి పోలీసు కానిస్టేబిల్‌తో స్థలము కొఱకై తగవులాడెను. అతఁడు శిరిడీఁ జేరి బాబాను సందర్శించి మ్రొక్కెను. 'నీవు ఉదయమున నెవరితో కలహించు చుంటివి? అట్లు కలహించుట యెప్పుడును తగదు. మేవరము? అని విచారించు కొనుము - స్వపరభేదబుద్ధి - భిన్న భావము పొంది కలహించుట కూడనిపని. సకలభూతములందు ఆ పరమేశ్వరుడు కలడు. పరమేశ్వరునందీ జీవకోటి కలదు. అని లెస్సగా దెలిసికొనుము' - అని బాబా బోధించెను. తార్కాడ్ తన అవివేక ప్రవర్తనమునకు సిగ్గుపడి, యిక నెన్నఁడట్లు ప్రవర్తింపను క్షమింపుమని బాబాను ప్రార్థించెను. బాబా ఆ బిడ్డ ననుగ్రహించెను.

(ఇ) ఒక దినమున లక్ష్మీబాయి సింధేతో "అమ్మా! నన్నా కలిబాధ దహించు చున్నది" అని బాబా పలికెను. అంత నా తల్లి వేగముగ బసకేగి పలువిధములగు రుచ్యపదార్థములు సిద్ధపఱచి పళ్ళెరమున పెట్టుకొని వెళ్ళి బాబా ముందుంచెను. అంతలో నొక కుక్క అక్కడకు వచ్చెను. శ్రీ సాయీ ప్రభువా పళ్ళెరమును కుక్క ముందుంచెను. అంత లక్ష్మీబాయి ఆశ్చర్యపడి 'ఇదేమి? బాబా! నీకని కొనివచ్చిన పదార్థములను కుక్కకు పెట్టితివి!' అని అడిగెను.

'అమ్మా! కుక్కయు నొక జీవము కాదా? మనము చెప్పుకొందుము అది చెప్పుకొనలేదు. అదియు ఆకలిచే బాధ పడుచుండెను. అదియు నేను ఒకరమే. దాని ఆకలితోబాటు నా ఆకలియు శమించినది' అని బాబా పలికెను. లక్ష్మీబాయి బాబా బోధలలోని సారము గ్రహించెను.

(ఎఫ్) హన్సిరాజ్, అను నతడు ఉబ్బసము వ్యాధిచే బాధపడుచుండెను. "పెరుగు త్రాగవలదు. పులుపు వస్తువులు తినవలదు" అని బాబా చెప్పెను. కాని యతఁడా మాటల పాటింపక ప్రతిదినము రాత్రి పాలను తోడుపెట్టి ఉదయము పెరుగు త్రాగవలెనని తలంచెను. ప్రతిదినమా గిన్నెలో నుంచిన పెరుగు నొక పిల్లి త్రాగి పోవుచుండెను. ఒక దినమా పిల్లి పెరుగు త్రాగుట పొంచి యుండి చూచి కర్రతో కొట్టెను. ఆనాడతడు బాబాను జేరి నమస్కరించి కూర్చుండెను. అచట చేరినవారితో బాబా యిట్లనెను. "ఒక గ్రామమున నొక మూర్ఖుడు కలఁడు. పెక్కుమాఱులు పెరుగు త్రాగవలదంటిని. కాని యతడు త్రావ నెంచెను. వాని ప్రాణములను కాపాడు తలంపున ప్రతి దినము పిల్లిరూపమున వానియింటి కేగి యతడు భద్రపఱచుకొనిన పెరుగును త్రాగుచుంటిని. ఈ దినము నేనట్లు కావించుచుండగ నతఁడు కసరి కర్రతో భుజముపై కొట్టినాడు. చూడుడు" అని భుజముపైగల కర్రవ్రేటు నచటివారికి చూపెను. హన్సిరాజు ఏదో ఒక పిల్లినిఁ గొట్టితినిగదా! యని తలచినాఁడు కాని ఆ దెబ్బ బాబాకు తగులుట చూచి మిక్కిలి ఖేదపడి 'క్షమింపుము' అని బాబాపాదముల వ్రాలి మ్రొక్కెను. శ్రీ సాయీ ప్రభువాబిడ్డ నను గ్రహించెను.

ఒక జీవిని హింసించిన, సర్వేశ్వరునకు బాధ కలిగించు చున్నారమని, ఒక జీవిని సంతృప్తి పఱచిన, సర్వ భూతాంతర్యామి యగు భగవానునకు సంతుష్టి కలిగించు చున్నారమను ఎఱుకను తన ఆశ్రితులకు శ్రీసాయీప్రభువు వారి వారి యనుభవములందు బోధ పఱచినాడు. శాస్త్ర పురాణాదులు చదివిన మాత్రమున నీ విషయము

బోధపడదు. దానిని వారి యనుభవములలో మానవులు గుర్తించు కొనవలయును. సమర్థ సద్గురువు తన ఆశ్రితుఁడగు సాధకునకు సత్య శోధన బోధనములకు వలయుసాధనసామాగ్రిని సమకూర్చుచుండును. ఆ సత్య వస్తువు స్వానుభవైకవేద్యము. ఈ జీవికి మనము బాధ కలిగించుచున్నామే, ఇది సర్వేశ్వరునకు బాధ కలిగించుటయే యగును. అను విషయమును సాధకుఁడు గుర్తించి, యే జీవికి హాని కలిగింపక తాను జేయఁగల మేలు చేయుచు జీవయాత్ర సాగింపఁ దగును. మేలు చేయజాలకున్నను ద్వేషబుద్ధిని, ద్రోహబుద్ధిని. విడ నాడి యితర జీవములకు హాని కలుగు మార్గమునుండి దూరముగఁ దొలగుటకైన ప్రయత్నము చేయవలయును.

'ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం సయోగీ పరమో మతః'

వ్యసనమైనను మఱి సౌఖ్యమైనఁగాని,
సంభవించినచో నాత్మసామ్యముగను
సకల భూతములందున సామ్యబుద్ధి
గనెడివాఁడె పరమయోగి యని తలంతు.

(శ్రీ మద్భగవద్గీతామృతము 6-32)

'నా సుఖము - నా ప్రియము ఎట్టిదో సకల భూతములకు అట్టిదే సుఖము - అట్టిదే ప్రియము. నాకు ఏది దుఃఖమో - అప్రియమో సకల భూతములకు అది దుఃఖము అప్రియమునై యున్నది' అను ఎఱుక గలిగి తనవలె సకల భూతములను జూడనేర్చుట- 'ఆత్మౌపమ్యము'. తన విషయమున జీవి యెట్లు భావించునో యితర జీవముల విషయమున నట్టి తలంపు గలిగియుండువాఁడే 'సమదర్శి'- అతఁడే శ్రేష్ఠుఁడగు యోగి - యని తెలుపబడినది.

వ్యాసభగవానుఁడు 'ధర్మము' అను దానికి నిర్వచనముఁ జేయుచు నిట్లుపదేశించినాఁడు:—

"శ్రూయతాం ధర్మ సర్వస్వం - శ్రుత్వాచాప్యవధార్యతామ్
అత్మనః ప్రతికూలాని సర్వేషాం న సమాచరేత్.
నతత్ పరస్య సందద్యాత్ ప్రతికూలం యదాత్మనః
ఏషాసామాసికో ధర్మః - కామాదన్య ప్రవర్తతే"

సకల (మత) ధర్మసారమును వినుడు. వినినదానిని లెస్సగా మనస్సున నిలుపుకొనుఁడు. తనకు ప్రతికూలములగువాని నితరులకు గావింపదగదు.

ఇతరులేమి కావించిన తనకు కష్టముగ తోచునో దానిని తానితరులకు గావింపఁదగదు. సంగ్రహముగ (మతము) ధర్మము అనుదానికి ఇది అన్వయము అని గ్రహింపఁదగును. తక్కిన (మతములు) ధర్మములు ఏదో స్వార్థపరత తెరమఱుగునఁ గలిగినవని గ్రహింపఁదగును.

"జీవితం యః స్వయం చేచ్ఛేత్ - కథం సోన్యం ప్రఘాతయేత్.
యద్యదాత్మ నిచేచ్ఛేత - తత్పరస్యాపి చింతయేత్.

బ్రతుకగోరువాఁడన్య ప్రాణముల హరింప నెట్లు సాహసింప గలడు? తానభిలషించునది యితరులకుఁగూర్ప యోజించుచుండ ఫలయును.

ప్రథమ పాదము సమాప్తము.

ఓమ్

# శ్రీ సాయిబా అనుసరణము

## ద్వితీయ పాదము

### 1. లౌకిక కామితములందు విరక్తి

"వైరాగ్యభాగ్యభాజః ప్రసన్న మనసో నిరాశస్య
అప్రార్థిత ఫలభోక్తుః పుంసోజన్మని కృతార్థతేహస్యాత్"

ఘనవిరక్తి భాగ్యకలితుండు, నాశా వి
హీనుఁడును ప్రసన్నమానసుండ
యాచిత ఫలభోక్త యౌనరుజన్మ మి
హంబునందె సార్థకంబు నొందు.

(ప్రబోధసుధాకరము - వైరాగ్య ప్రకరణము)

శ్రీ సాయిబా మహా ప్రభువు పలుకులను గమనింపుడు! "ఇచట నేనుండ నిఁక భయమేల? మీ బరువుల నాపై నిడుడు! వాని నన్నిటిని నేనే నిర్వహింతును. నన్ను గనుడు! వేయి కన్నుల మిమ్ముఁ గందును. నన్ననుసరించువాఁడు అజ్ఞానాంధకారమునఁ బడఁడు - చెడడు."

బాబా పలికిన పలుకులను గాఢముగ విశ్వసింపుఁడు. మన హృదయ కుహరముల నలముకొనిన మోహాంధకారమును శ్రీ సాయిబా ప్రభు ప్రబోధ ప్రభలచేఁ దొలఁగఁ జేసికొని, యా స్వామి ననుసరించు విధానమును గమనింపుడు! బాబా ఆచరించినవి మనకు బోధించిన ధర్మములు మూఁడు మాత్రమే. 1. ప్రేమ. 2. సేవ. 3. విధేయత. వీని నాధారముగ గైకొని దైవమునకై నిరీక్షించుడని తెలిపినాఁడు.

శ్రీ సాయీనాధుఁ డాచరించి మనకు విశదపఱచిన జీవితము నందు దృష్టి నిలుపుట ముఖ్యము. ఇది మన ప్రప్రథమ ప్రయత్న ముగఁ బాటింపవలయును. ఆ తండ్రి మన కే నూతన సిద్ధాంతము లను బోధింపలేదు. సకల మత సిద్ధాంతములలోని సారము బోధ రూపమునగాక ఆచరణ రూపమున విశదపఱచినాఁడు. నిర్మలాంత రంగులైనవారికి బాబా ప్రసాదించిన ప్రేమామృతము లభ్యమగును.

శ్రీ సాయీ ప్రభువును యథార్థముగ గ్రహించి యనుసరిం చుటకు విధేయత (అడఁకువ) అలవరచు కొనవలయును. బాబా యొక్క సర్వవ్యాపకత్వ సర్వజ్ఞత్వ, సర్వనియంతృత్వ సర్వ సమర్థత లను గ్రహించి, మన యకించనత్వమును గుర్తించుకొనవలయును. మానవుఁడు విద్యాధన పదవీ ప్రాభవాదులవలన అధికుఁడు కాఁజా లఁడు. త్రికరణశుద్ధి ఋజు ప్రవర్తనల చేతనే యితఁడధికుఁడై భగ వంతునకుఁ బ్రేమపాత్రుఁ డగును. దైవభక్తి, దానివలన దైవకరుణఁ బడయజాలఁడేని సకల వేదవేదాంత శాస్త్రములను, తత్త్వశాస్త్రజ్ఞుల సూక్తులను వల్లించిన మాత్రమున మానవునకెట్టి ప్రయోజనముఁ గలుగఁబోదు. దైవప్రేమ, దైవసేవ, దైవ విధేయతలు తక్క తక్కిన లౌకికార్థములు సర్వము నిష్ప్రయోజనములు. లౌకిక విషయములందు పూర్ణమగు విరక్తిగలిగి మనస్సును బుద్ధిని దైవాభి ముఖముఁ గావించుటయే ఉత్తమోత్తమ జ్ఞానము.

అస్థిరములు, క్షణికములునగు లౌకికభాగ్యభోగ గౌరవాదుల విశ్వసించి, వానికై ప్రాకులాడుట లవివేకము. నైతిక ప్రవర్తనము లేక చిరకాలము జీవించ వలయునను కోరిక వ్యర్థము. పరమునందు దృష్టిలేకయే యీ జీవితమును నమ్ముకొనుట కేవల మజ్ఞానము. విషయానుభవములచే నింద్రియములు తృప్తిపఱుపఁ జాలమను సూక్తి జ్ఞప్తియందుంచు కొనఁదగును.

కావున నీ దృశ్యప్రపంచమునుండి దృష్టిని మఱలించి యంతర్ముఖముఁ గావింపఁదగును. ఇంద్రియ మార్గముల బాహ్య విషయములందు మనస్సుఁ జొనుపువాఁడు వంచితుఁడై తన ఆత్మకుఁ

గళంకముఁ గూర్చుకొని భగవదనుగ్రహమునకు దూరుఁడగును. బాబా భక్తుల విషయము గమనింపుడు.

సాధుభయ్యా - బడేబాబా:

సాధుభయ్యా (సదాశివదండిరాజు) 15–2–1915 నహార్దా యందొక స్నేహితునిఁగూడి సాయంత్రము 4 గంటలకు విహారమేగెను. బాబా అతని కెదురుగ వచ్చి అతని చేతిలో పల్లుకుట్టుపుడకనిడి యదృశ్యుఁడయ్యెను. నాస్తికుడగు స్నేహితుఁడు 'అదియేమి'? అని అడిగెను. 'మనము వచ్చునపుడు నాచేతిలో పల్లుకుట్టు పుడకలేదు, అది నిజము. ఇప్పుఁడుకలదు. బాబా దీనిని నాకిచ్చినాఁడు' - అని, భయ్యా సమాధాన మిచ్చెను. ఈ విషయము శిర్డికి ఉత్తరము వ్రాసి కనుగొనుమని అ స్నేహితుఁడనెను. భయ్యా - మాధవరావు దేశపాండే (శ్యామా) కు ఉత్తరము వ్రాసెను. శ్యామా భయ్యాను శిర్డికి రావలసి నదిగ తిరిగి జాబు వ్రాసెను. శిర్డికిఁజేరి భయ్యా బాబా యెదుట నా విషయము తెలుప, అ వృత్తాంతము బడేబాబాకుఁ నెఱిగింపుమని శ్రీ సాయీశుడు నియమించెను. భయ్యా - అ వృత్తాంతము బడే బాబాకుఁ దెలిపెను. బడేబాబా ఖిన్నుఁడై శ్రీసాయీ ప్రభువునుజేరి "ఏమీ? బాబా! నీవు నాకెప్పుడు ధనము మాత్రమే యిచ్చుచుంటివి. భయ్యాకు సాక్షాత్కార మొసఁగితివి" - అని విలపించెను. 'నేనేమి చేయగలను? ఎవరేమి కోరిన వారికవి లభించును.' - అని పలికెను.

"భావసదృశ మనుభవమును గూర్తువు
సేవకజనులకుఁ జిద్విలాసుఁడవు"

(మధ్యాహ్నహారతి)

బడేబాబా చాల ధనము సంపాదించెను. రాబడిపన్నులు హెచ్చెను.' తుదకు సర్వమును గోల్పోయి దుఃఖమున మరణించెను.

"అస్థిరంబు స్వల్పమౌ లోకవిషయాళి
నంద నాతురతయు నాసలెంత

లెంతలుండు నీకు - నంతంత దూరంబు
నగుదు వీశ్వరునకు ననుచు గనుమి!"

(శ్రీసాయీకరుణ - పుట 100)

ఈ సంసారము మనలను బాధించదు. ఈశ్వరాభిముఖులమై మన మెంతెంత ముందుకు సాగుదుమో యీ సంసృతి మన కంతంత వెనుకఁబడి పోవునని మనము గుర్తించఁ దగును.

ప్రార్థన.

పరతంత్రుడను సాయిబాబ! నిన్జేర
పఱపు యత్నములు సఫలము గావౌర!
బంధంబులను ద్రెంచు పాటవమెఱుఁగ
నంధకారమున నిట్టటు లేను దిరుగ
ప్రాకృతు నను ప్రలోభము హత్తఁ దొడఁగె
లోకవాసనలు పెల్లుగ నేఁపసాగె;
మోహబంధముల నిర్మూలించి మించి
ఐహిక కాంక్షల నఖిలంబడంచి
వెలుపల దృష్టిని వెనమగిడించి
తెలివిఁగూరిచి లోని దృష్టి సారించి,
అంచితప్రేమ నహర్నిశలెంచు
కొంచెపువాన జుగుప్స హత్తించి

స్వార్థ ప్రయోజనాసక్తి మాయించి
వ్యర్థలౌకిక భోగ వరితలఁ ద్రెంచి
ఓరిమిన్ విశ్వాస మొనరఁ గీలించి
పారమార్థికశాంతి భాగ్యమొందించి

ప్రార్థనీయావ్యయపదమిడి, జనన
సార్థకతఁ గూర్పఁజాలు నీ కరుణ.
ఇతర శరణ్య మేనెఱుఁగను సామి!
పతితపావన! సాయిబాబ! నన్నోమి
ప్రేమ నీ శాంతి శోభిత పరానంద
ధామముఁజేర్పు; వందనము - ముకుంద!

2. ఆశ్రితుఁడు తన అకించనత్వమును గుర్తించి యడఁకువ గలిగి యుండవలయును.

లఘుతామే ప్రభుతా బసే - ప్రభుతాసే ప్రభుదూర్
కీడీసీ మిస్రీ చుగే - హాథీకే శిర్ దూర్.

అధికత సిద్ధించు నఁడకువఁగనిన
అధికతఁగన ప్రభు వరుగు దూరమున;
చిన్నదై చీమ భక్షించు గుడంబు
మన్ను నెత్తినఁ దాల్చు మత్తగజంబు.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు 115)

ఆస్తిక్య బుద్ధిలోక విషయ విరక్తి గలిగి శ్రీ సాయీ ప్రభువు నాశ్రయించి యనుసరింపఁ గోరు జీవి విధేయత (అడఁకువ) గలిగి యుండవలయును. సాధారణముగ మానవులు జిజ్ఞాసువులై యుందురు. జ్ఞానోపార్జనమం దాసక్తి గలిగియుందురు. దైవభీతిలేని తెలివివలన నెట్టి లాభములేదు. తన విషయ ముపేక్షించి విశ్వసృష్టి రహస్యములఁ దెలిసికొనవలయునని శ్రమించు వేదాంతికంటెఁ దన శక్తికొలఁది దైవమును స్మరించుచు సేవించు కృషీవలుఁడు (కాపు) అధికుఁడు.

తన్ను దానెఱిఁగిన వాఁడు తన యకించనత్వమును గుర్తించు కొని తనను గర్హించుకొనును. ఇతరుల పొగడికల కుబ్బఁడు. ప్రపంచ

జ్ఞాన మపారముగ గడించుకొనినను త్యాగబుద్ధిలేనియెడ దైవదృష్టి యందు వాని వలన ప్రయోజనము లేదు. ఇచట మనము కావించిన గొప్ప గొప్ప కార్యముల నెవరును లెక్కింపరు. అసాధారణ ప్రజ్ఞా లబ్ధికై ప్రాకులాడుట వ్యర్థము. అట్టి విద్యల నార్జించిన కొలఁది భ్రమనొంది వంచితుఁడగును. పండితుల మనుకొనువారు విద్యా ప్రపూర్ణులమని తలంచి యితరులచే నట్లు పరిగణింపఁబడవలయునని కోరుకొనుచుందురు. నేర్వఁదగిన యనంతము గలవు. ఇవన్నియు ఆత్మోద్ధరణకు లవమేని యుపయోగపడవు. ఆత్మోద్ధరణకు గాని విద్యల గడింపఁ జూచువాఁడు అవివేకి యగును. మాటలనేర్పు ఆత్మ సంతృప్తిఁ గూర్పజాలదు. చక్కని నైతిక జీవనము మనస్సునకు శాంతిని బ్రసాదించును. ఎంత చదివిన నెంత గ్రహించిన నిర్మలమైన వర్తనము అలవరచు కొననియెడల నదియంతయు వ్యసనకారణమే యగును.

కావున పెక్కు విద్యల (కళల) యందు ప్రావీణ్యము సంపాదించితిమని గర్వింప దగదు. నేర్చిన విద్యలు మనకు జాగ రూకత అడఁకువ గలిగించునవిగ జూచుకొనవలయును. సకల మెఱుగుదుమని తలంపఁ దగదు. ఎఱుకజాలదనియే ప్రకటించు కొనవలయును. ఇతరులకంటె నధికుడనను భావము వహింపదగదు.

తన కంటె నధికులు పెక్కురు గలరనియే నమ్మదగును. ఏమేని ఫలప్రదమైనది గడించుకొనిన యెఱుగనట్లే యుండుటమేలు. "జిన్నేపాయా ఉన్నే ఛుపాయా" - (కబీరు) ఇతరుల స్తుతుల నపేక్షింపరాదు. విద్యలన్నిటిలో నుత్తమోత్తమమైనది ఆత్మవిద్య. తనను తాను చక్కగఁ దెలిసికొనుట, స్వార్థపరత విడిచి, పరహితము-పరార్థప్రేమ మనస్సున పాదుకొలుపుకొనుటయే జ్ఞానముయొక్క పరమావధిగ గుర్తింపదగును. చెడుమార్గమున ప్రవర్తించుచు, పాప కార్యములఁ గావించు ఇతరులనుగాంచి తన అధిక్యతకై తాను గర్వింపఁ దగదు. ఎంతకాలము తాను యుత్తమ స్థానమున నిలువఁగలఁడో జీవి తానెఱుఁగఁజాలడు. ప్రపంచమున జనులందఱు

సాధారణముగ మనోదౌర్బల్యము గలవారలే. కాని తనకంటె నధిక దుర్బలమతులు లేరనియే మానవుఁడు తాను తలంచవలయును.

శ్రీ సాయీ ప్రభువు ఆచరణపూర్వకముగ మనకుఁ గావించిన ప్రబోధము లొకటి రెండు గ్రహింపఁదగును.

1. బాబా తన ఆశ్రితులగు భక్తులను గాంచి—

"మీ సేవకుల సేవకుఁడను నేను. మీ కెంతయు ఋణ పడితిని. మీ దర్శన భాగ్యమున పవిత్రుడనైతిని. మీపాదముల సందర్శించు నవకాశమిడి మీరు నన్ననుగ్రహించినారు' - అని పలికెను.

2. రివిన్యూ కమీషనర్ 'కర్టిస్' - సపరివారముగ బాబాను సందర్శింప వచ్చునపుడు -

'అవివేకులు - నన్ను జూడనిచ్చుట కిట నా యందేమి కలదు? సర్వసాధారణ కరచరణాద్యవయవములు గల ఒక పేదఫకీరు, వీడు.' - అని బాబా తన్ను గూర్చి పలికినాడు.

3. మౌలానా జవరాలీ (రహతా) వృత్తాంతము గమనింపుడు!

'నా గురువుగ నతఁడు (జవరాలీ) భావించిన భావింపనిమ్ము. మనము శిష్యులవలె విధేయులమై యుండుదము. మాన మితరులపై నాధారపడి యుండవలయును. ఇతరులు మనపై నాధారపడి యుండనగును. ఇంక నితర మార్గములు గమ్యమగు పరమధామమును జేర్పఁజాలవు'— అని బాబా పలికెను.

4. నానావాలీ వృత్తాంతము గమనింపుడు !

నానావాలీ బాబా దగ్గఱకేగి 'బాబా! ఆ గద్దెమీఁదనుండి నీవు లెమ్ము. నేను కూర్చుండవలయును' అనిన వెంటనే బాబా తన గద్దెమీదనుండి లేచి యావలకు దొలఁగెను. నానావాలి ఆ

గద్దెపై కొంతతడవు కూర్చుండి, లేచి, "బాబా! నీ గద్దెపై నీవే కూర్చుండుము" అనెను. బాబా కూర్చుండెను. నానావాలీ బాబా పాదములకు వ్రాలి నమస్కరించెను.

ప్రార్థన.

ప్రాణికోటిహృదంతరవర్తి వీవ
యనెడు నెఱుక వీనికిఁ గూర్చి, కనికరించి,
ప్రతిపదంబున వినయ జాగ్రతలఁబఱపి
చక్కదిద్దవె! సద్గురు! సాయిదేవ!

3. సత్యవస్తు ప్రాప్తి – గ్రంథ పఠనము.

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో
నమేధయా నబహునా శ్రుతేన
యమేవైష వృణుతే తేనలభ్య
స్తస్యైష ఆత్మావివృణుతే తనూగ్ం స్వామ్"

(కఠోపనిషత్తు – ౨-౨౩)

ఈ ఆత్మ వేదాభ్యాసముచేతను చదివిన దానిని మఱువకుండు బుద్ధిచేతను, విస్తారముగ వినుటచేతను పొందఁ దగినవాఁడు కాఁడు. ఈ పరమాత్మ ఏ జీవిని వరించునో ఆ జీవికే లభ్యుఁడు. ఆ జీవికే పరమాత్మ స్వరూపమును ప్రకాశింపఁజేయుచున్నాడు.

విశ్వరూప ప్రదర్శనానంతరము శ్రీ కృష్ణభగవానుఁడు అర్జునునితో పలికిన మాటలను గుర్తించదగును.

"నాఽహం వేదైర్నతపసా నదానేన నచేజ్యయా
శక్యం ఏవం విధోద్రష్టుం దృష్టవానసి మాం యథా.
భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప"

దాన యజ్ఞములను దపముల శ్రుతులను
బ్రతిభఁగాంచినట్టి వారికేని
నిపుడు నీవు గనిన యిట్టి నా విశ్వరూ
పంబుఁగనఁగ దుర్లభంబు; పార్థ!

అన్యచింతలేని యట్టి సద్భక్తి న
న్నరయఁదెలియఁ బొంద నగునుగాని
వేఱు సాధనమున నేరరు నన్ యథా
ర్థముగఁ గాంచ; వైరిదర్పహరణ!

(శ్రీమద్భగవద్గీతామృతము. —11-53,54)

సత్యవస్తువు - పరతత్త్వము తన యథార్థస్థితిని క్షయించి పోవు పలుకులు, అంకెలతోగాక సహజప్రబోధ మెవరికిఁగల్పించునో వాఁడు ధన్యుడు. మన యింద్రియములు, మన తలంపులు తఱచుగ మనల వంచించుచుండును. అవి యుచితానుచితములఁ దెలిసికొననీయవు. మన కగమ్యములు దృష్టి గోచరములు గాక గోప్యములగు వానినిఁ గూర్చి వాదోపవాదముల వలన ప్రయోజనము లేదు. వానినిఁ దెలిసికొనకున్న మాత్రమున బంధముక్తికి హాని లేదు.

లాభదాయకములు అవసరములగు వానిని విడిచి మన మనస్సును చోద్యములు హానికరములైన విషయములందుఁ జొనుపుట తెలివిలేనితనము. మనకు కన్నులున్నను చూడలేము. మెట్ట వేదాంతములవలన, స్వానుభవదూరులైన తార్కికుల తర్కవాక్కులతో మనకు ప్రయోజనము శూన్యము. ఎవనికా పరతత్త్వము, సత్యవస్తువు వేద్యమగునో వాఁడీ వ్యర్థభావ ప్రపంచమునుండి విముక్తుఁడగును. ఆ పరమాత్మ నుండియే సకల ముత్పన్నమగును. సకల మత గ్రంథములు ఆ పరతత్త్వమును గూర్చియే పలుకును. సకలమునకావస్తువే మూలకారణము. ఆ పరమాత్మయే మనకు ప్రబోధ కల్పించును.

ఎవని కీవిశ్వమున సకల వస్తువులు ఏకమో సకలమును ఆ ఏకముగ పరిణమింపఁజేసికొనునో, సకలమును ఆ ఏకముగఁ జూడ గలుగునో వాఁడు ప్రశాంతుఁడై దైవమున విశ్రాంతి నొందును. మానవు డెంతెంత అంతర్ముఖుఁడై నిరాడంబరుఁడు ఋజుమార్గవర్తనుఁడగునో, అంతలంతలు శ్రమలేకయే ఆ దైవ పరమరహస్యమును గ్రహింపఁ గలఁడు. అట్టివానికి దైవానుగ్రహమువలన జ్ఞానజ్యోతి ప్రసాదింపఁ బడును.

పవిత్రము స్థిరము ఋజువైన బుద్ధిని ఎన్నెన్ని పనులందుఁ బ్రవేశపెట్టినను చలింపదు. అది దైవప్రీతి కొఱకే ఎల్లపనులను చేయునుగాన తాను గావించు పనులందుఁ దగులుపడక అంతశ్శాంతి, స్థిరత్వములను పడయును. మానవుని హృదయమున చెలరేగు కామి తములకంటె వాని బాధించి బంధించు నితరములు లేవు. దైవచింతన తత్పరుఁడైన సాధువు తన బాహ్య వ్యాపారముల నన్నిటిని ముందుగ హృదయమున త్యజించును. ప్రతిఫలాపేక్షను విడుచును. కావున ఆ బాహ్యావ్యాపారము లాతని లోభపరుపలేవు. వాని నన్నిటిని తన అదుపులో నుంచుకొనును. ఆత్మవశీకరణ కృషికంటె మించిన సంగర ము లేదు. దినదినము హృదయ నైర్మల్యమును పెంపొందించుకొనుచు, నింద్రియగోచరములగు విషయముల బాఱిపడనీయక ఆత్మబలము వృద్ధిగావించుకొనుచుండవలయును.

ఈ జీవితమున మానవుఁడు 'పొందితిని' అని తలంచు సంపూర్ణతయందు అసంపూర్ణత కలదనియు, గడించిన జ్ఞానము నందింకను మోహము అజ్ఞానము కలదనియుఁ దెలిసికొనఁదగును. సకల విద్యాప్రపూర్ణత గడించుటకంటె తనను గూర్చియే లవమేని గ్రహింపఁజాలిన నది దైవప్రాప్తికి మార్గమని విశ్వసింపదగును. అట్లని పలుకుట విద్యల నిరసించుట, ద్వేషించుట కాదు. విద్యల నేర్చుట మంచిదే; దైవసమ్మతమే కాని ఋజుబుద్ధి నైతిక ప్రవర్తనములే విద్యల నన్నిటికంటె శ్రేష్ఠములు. ప్రవర్తనము పాటింపక విద్యల నేర్వ జూచువాఁడు, తాను వంచితుఁడై లోకమును వచించును.

అటుల కష్టించి నేర్చిన విద్యలవలన వానికి ప్రయోజనము స్వల్పము. శ్రమకుఁ దగిన ఫలము కలుగకపోదు. లౌకిక సమస్యల పరిష్కరించుటకై మానవుడు కావించు శ్రమము తన దోషముల రూపుమాపుకొని గుణముల పాదుకొలుపుకొనుటకై కావించిన, నింత నింద. హాని, మోసములకు గురికాఁడు.

భగవానునకుఁ గావలసినవి మనము గడించు విద్యలు, మన వాచా ప్రాగల్భ్యములు, మన మతాచారాడంబరములు కావు. మనము కావించు నిస్స్వార్థ సేవలు మాత్రమే. మహావిద్వాంసులు కళాప్రపూర్ణులై లోకము సుజ్ఞాతలూపి కీర్తి ప్రతిష్ఠల గడించిన వారీనాఁడేరీ? లోక విఖ్యాతి యెంత త్వరలో రూపఱునో మనము గుర్తించుకొనవలయును. అట్టి మహా విద్వాంసులు గడించిన విద్యలే ఆచరణరూపము దాల్చిన నవియెంత సార్థకములై యుండెడివో! భగవత్సేవకుగాని విద్యలు స్వోదరపోషణమున కుపయోగపడునేమోకాని అంతకుమించి ప్రయోజనము లేనివి. నరుఁడు తన అకించనత్వమును గుర్తించక, అడఁకువ జాడఁబోవక జగత్కీర్తి ప్రతిష్ఠలకై ప్రాకులాడిన కారణముననే వ్యర్థసంకల్పుఁడగుచున్నాఁడు.

త్యాగబుద్ధి కలిగి అడకువ వహించి తన ఆధిక్యతను కీర్తినిఁ బ్రకటించుకొనబోనివాఁడే ఉత్తమోత్తముఁడు. ప్రపంచ వస్తువులను తృణప్రాయములుగ భావించి నిర్లిప్తుడై యుండువాడే జ్ఞాని. వాఁడే భగవత్ప్రాప్తికి అర్హుఁడు. తన ఇచ్ఛానుసారమునఁగాక భగవదిచ్ఛానుసారమున ప్రవర్తింప నేర్చినవాఁడే పండితుఁడు. సకల విద్యా రహస్యముల నేర్చినవాడగుచున్నాడు.

పవిత్ర గ్రంథముల వల్లించి సభలయందు వాచాప్రాగల్భ్యమును ప్రదర్శించుటకు గాక యందుఁ బ్రతిపాదింపఁబడిన సత్యతత్త్వమును గ్రహింపవలయును. సకల నిగమాగమ శాస్త్రపురాణాదులందుఁ దెలుపబడిన విషయముల నా యా సందర్భోచిత్యముల గుర్తించి, యవి యే తలంపుతో ప్రవచింపఁబడినవో గ్రహింపవలయును. ఆ యా గ్రంథము లందుగల భాషాపాటవము కవితా

చమత్కృతుల సరకుసేయక ఆత్మోజ్జీవనమున కుపకరించుచు ఆధ్యాత్మికాభ్యున్నతిని గూర్చు విషయములనే అన్వేషించు చుండ వలయును. సులభగ్రాహ్యములై భగవద్భక్తిని ప్రబోధించు గ్రంథములే ఉత్తమోత్తములుగ భావించవలయును.

ఏ సద్గ్రంథము చదువుచున్నను, ఆ యా రచయితల విద్యా యోగ్యతలు గూర్చికాని, యందు దెలుపఁబడిన విషయముల కాధారములు, ప్రమాణములఁగూర్చికాని తర్కింఁప దగదు. అందుఁగల సత్యవిషయములనే గ్రహింపనగును. ఎవరు చెప్పిరని కాక ఏమి చెప్పబడినదో తెలిసికొనవలయును. మనుష్యుఁడు మఱుఁగుపడినను భగవానుని సత్యతత్త్వము స్థిరముగ నిలుచును. ఇతర వ్యక్తులతో నిమిత్తము లేకయే భగవానుఁడు మనకు బోధించుచునే యుండును. సద్గ్రంథపఠన ఫలము బడయగోరువాఁడు అడకువ విధేయత విశ్వాసము గలిగి పఠింపవలయును. ఆ యా గ్రంథములందు సాధు సత్పురుషులు వచించు నీతి కథలను అనాదరింపఁ దగదు. అవి కారణరహితములుగ తెలుపఁబడినవికావు.

ఇఁక శ్రీ సాయీప్రభువు తన బిడ్డలకు బోధించిన విషయము ఈ సందర్భమునఁ దెలిసికొనుఁడు.

భగవానునిగూర్చి టి. ఎ. కార్ణిక్ మొదలగువారు సాఠే వాడలో నేమేమో చర్చించి తుదకు ద్వారకామాయి మసీదుఁజేరి బాబాను సందర్శించిరి. సర్వాంతర్యామియగు ఆ తండ్రి యెఱుగనిది లేదు. బాబా కార్ణిక్‌ను చూచి 'భగవంతునిఁగూర్చి యేమి చర్చించు చున్నారు? భగవంతు డంత దూరమునఁ గలఁడా?

గగనోపరి స్థలంబున
నెగడఁడు పాతాళమందు నిలువడ, సతమున్
దగనీదు దఱినిఁ గలఁడా
భగవంతుని నెమకి నెందుఁబఱతువు బిడ్డా!'

అని బోధించెను.

గురువు అవసరమని తన అనుభవమునుగూర్చి బాబా తెలిపినాడు, గమనింపుడు. గురువు అనుగ్రహము అవసరము. గురు కృపా దృష్టిచేతనే జీవి తరింపవలయును. మఱియొక మార్గము లేదు. నా దృష్టియందు గురువుతప్ప మఱియొక వస్తువులేదు. నాప్రాణము చూపునందు, చూపు గురువునందు, లీనమొందినది. నా ధ్యానము ధ్యేయము గురువు. ప్రశాంతముగ వినతి గావించితిని. గురువు అనుగ్రహము చేతనే తనకు దా యెఱుక గలిగినది. నా ప్రయత్నము లేశ మేనిలేదు.

"గురు వినా కోను బతావేవాట్". (కబీరు)
"గురువు లేక మార్గ మెఱుక పడదు"

ఇతర గురువు లెంతెంత గొప్పవారైనను నీ గురువునే నమ్మి హత్తుకొని యుండుము. నీ గురువును విస్మరింప రాదు, ఎప్పుడంటి యుండవలయును. దృఢముగ నాతనియందే మనస్సును లగ్నము చేయ వలయును.

శిష్యుడే - భక్తుఁడే తనకుఁ దా గురుదైవమును నిర్ణయించు కొనవలయును. ఈ సంఘటనము గమనింపుడు.

ధనికురాలొకర్తుక పళ్ళెరము నిండుగ రూపాయలను నింపి, బాబానుజేరి, ఆ దక్షిణను స్వీకరించి, తన్ను శిష్యురాలుగా నను గ్రహింపుమని బాబాను కోరెను. ఆమె యొసఁగు దక్షిణను నిరాకరించి బాబా యిట్లనెను.

"గురువు తనకుఁ దానీ, నీకు గురువుకాడు.
విశ్వసించి నీవాతనిఁ బ్రేమఁగొలిచి
చేసికొనఁదగు గురువుఁగా। చిల్లపెంకుఁ
గొలిచి కనుగొమ్ము! సిద్ధిచేకురునొ లేదొ!"

బాబాను ఆశ్రయించిన బిడ్డలు - ఆ తండ్రిని 'చల్తే బోల్తేదేవ్' చరియించుచు పలుకుచున్న దైవముగ విశ్వసించి ఆశ్రయించినారు. అనుగ్రహింపబడినారు. శ్రీ దాస్‌గణూ మహారాజు బాబానుగూర్చి

"నరరూపుడఁగు జగన్నాథుఁడీతండు !
చరియించు పలుకు చిత్సాక్షి యీతండు !
అనతభక్త కష్టార్తివారకుఁడు
ఆనంద సుఖధాముఁడౌ సాయివిభుఁడు" అని తెలిపినాడు.

ఆశ్రితుఁడగు సాధకుఁడు తన ధ్యేయము, ప్రేష్టవస్తువునందు పఱపు గాఢవిశ్వాస ప్రేమలే ఆ లక్ష్యవస్తువుయొక్క కృపకు పాత్రునిఁ జేయును.

బాబా జ్ఞాన సిద్ధికి సాధనములుగ పురాతన విగ్రహములు, ప్రతిమలు, పాదుకలు, తాను స్పృశించి యిచ్చిన నాణెములు, పటములు (శ్రీరామ శ్రీకృష్ణాది రూపములు గలవి, బాబా చిత్రపటములు) పూజింపదగునని బోధించెను. సద్గ్రంథములుగూడ (పోటీ) పారాయణ చేయఁదగునని శ్రీసాయీప్రభువు తన బిడ్డలకుఁ దెలిపినాడు.

నానాసాహెబ్ చందోర్కరుతో నిత్యము భగవద్గీతలందు ఒక అధ్యాయము పారాయణము చేయుమని మరాటీ వ్యాఖ్యయైన జ్ఞానేశ్వరి పఠింపుమని తెలిపెను.

కాకా దీక్షిత్తుతో భావార్థ రామాయణము, ఏకనాథ భాగవతము, నిత్యము పారాయణము చేయుమని నియమించెను. ఒక సందర్భమున ఉపాసనీబాబాతో, మఱియొక సమయమున కపర్దేతో 'పంచదశి' గ్రంథమును గూర్చి 'ఏతో హమారా ఖజానా హై' (ఇది మా ధనపు కొట్టు) అని బాబా పలికినాఁడు. ముకుంద లేలేశాస్త్రితో నారాయణోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు పారాయణము చేయుమని, బి. వి. దేవ్‌తో జ్ఞానేశ్వరి (భగవద్గీతలకు మరాటీ వ్యాఖ్య) పారాయణము చేయుమని బాబా నియమించెను. మఱియొక భక్తుని 'రామవిజయము' పఠింపుమని బాబా నియమించెను.

గురుపూర్ణిమనాఁడు శిర్డియందు భక్తులు చేరుదురు. బాబా స్పృశించి తిరిగి ప్రసాదించుటకు వారి వారి కభీష్టములగు గ్రంథములను వెంటగొని వచ్చువారు. బాబాముందుంచువారు. శ్రీ సాయీ ప్రభువు ఆ తేఁబడిన గ్రంథములలో నెవరు తెచ్చినవి వారికిగాని, ఒకరు తెచ్చినవి మఱియొకరికిగాని యిచ్చెడివాడు. ఒక గురుపూర్ణిమ నాఁడీ విధముగ గ్రంథములను స్పృశించి ప్రసాదించుచుండగా జస్టిస్ యం. బి రేగే, తానేమియు గ్రంథము కొనిరాకుంటినే! యని మనస్సున విచారముతో గొంత దూరమున గూర్చుండెను. సర్వహృదయాంతర్వర్తియగు బాబా రేగేవంక చూపునిలిపి నీవుమంచిపని చేసితివి. "నీ వే గ్రంథమును చదువ నక్కరలేదు. నన్ను మనస్సున నిలుపుకొనుము చాలును. గ్రంథములందు భ్రమము తప్ప బ్రహ్మము లేదు" అని బోధించినాఁడు.

"గ్రంథ సముదయంబు గాలించి శోధించి
బ్రహ్మనెమక నేల శ్రమలఁ బడెదు?
గ్రంథ శోధనంబు భ్రమ కారణంబని
యెఱిఁగి తలఁపుమెప్పుడు హృదిని హరిని."

అని బాబా పలికెను.

ప్రార్థనము :

చదువుల్ గోరను గోరబోఁవ వివిధైశ్వర్యంబులన్ భోగభా
గ్యధశల్ కోరను, సర్వమీవగుదు; నీ యవ్యాజకారుణ్యా వ
ర్షదపాంగేక్షణ, నీదు దివ్యపదకంజధ్యానమున్ నీ శుభా
స్పద రూపానుభవంబుఁ గోరెదను దేవా! సాయినాథప్రభూ!

ఓ సాయీ! సత్యస్వరూపా! నీ వరము నిర్వ్యాజ కృపను ప్రసరించి నన్ను నీయందు లయింపు జేసికొనుము. ఈ చదువులు

వినుటలు నాకు విసుగు కలిగించుచున్నవి. నాకు కావలసినవన్నియు నీయందే కలవు. కళాప్రపూర్ణుల బోధలన్నియు నీ యందే నిలువ నిమ్ము. సకల జీవములు నీ దృష్టియందే తనరనిమ్ము. నీ వొక్కడ నాకు బోధింపుము.

4. శాంతి – సాధనము :

విహాయ కామాఞ్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి.

సర్వకామములను సమయంగఁజేసి తా
నాశలేనివాడునగుచు మిగుల
నిర్మమత్వము - మఱి నిరహంకృతిని గల్గి
సంచరించు నతడు శాంతి బొందు.

(శ్రీ మద్భగవద్గీతామృతము 2-71)

లోకులు కాకులు. వారు వాకొను మాటలకు, చెవి యొగ్గ రాదు. వివేకము గలిగి, సావధానముగ దైవేచ్ఛను గూర్చి యోజించు కొనవలయును.

ఇతరులలోని గుణములకంటె దోషములను విని, నమ్మి ప్రకటింప జూచుటయే మన మనోదౌర్బల్యము. వివేకియైనవాఁడు ఇతరులు చెప్పుమాటలు తేలికగ విశ్వసింపడు. మానవులు సహజ ముగ హృదయ దౌర్బల్యము గలవారగుటచే దోషాచరణమునకు గడంగుదురనియు, మాట తప్పుదురనియు వారెఱుంగుదురు.

అహంకృతితో మూర్ఖపు పట్టుదల వహింపకుండుట, త్వరపడి యేపనియుఁ జేయకుండుటయే వివేకము. వినిన వన్నియు విశ్వసిం చుట. అటుల విని విశ్వసించిన వానిని తోడనే యితరులకుఁ జెప్పుట

అవివేకము. ఇంగితజ్ఞతగల బుద్ధిశాలురను మనకంటె బుద్ధిమంతులని మన మెఱింగిన, వారినిఁజేరి, వారి బోధలను పాటించు చుండవలయును. నైతిక ప్రవర్తనము మానవుని దైవదృష్టియందు విజ్ఞునిగావించి వివిధ విషయానుభవములను ప్రసాదించును. మానవుఁడు తననుగూర్చి యెంతెంత అడకువ వహించి, దైవాధీనుడై యుండునో వాఁడంతంత వివేకముతో శాంతిని బొందును.

వస్తుదృష్టిజేఁసి అసహజముగ దానిని కాంక్షించు మానవునకు శాంతి గలుగదు. గర్వితులు అత్యాశాపరు లెప్పుడు శాంతి బొందలేరు. పేదలు అధ్యాత్మికముగ వినయ విధేయతలు గలవారు. రాగద్వేషములకుఁ బాల్పడక శాంతి గలిగియుందురు. దేహబుద్ధి - దేహమే తానను తలంపుగలవాఁడు త్వరితగతి లోభపఱుపఁబడి యే స్వల్ప విషయమునకేని లొఁగిపోవును.

దైవభీతి - ఆత్మబలము లేక దేహవాసనగలవాఁడు ఇంద్రియార్థముల కధీనుడై ప్రాకృత విషయములనుండి మనస్సును మఱలింపజాలఁడు.

ప్రాపంచిక విషయములను వదలించుకొనఁ జూచియు నష్టుడు కాలేఁడు. ప్రతిఘటనమునకుఁ బాల్పడునపుడు కుపితుఁ డగును. అనగ కామితవస్తువు లభింపనియపుడు కోపము రేకెత్తును. అట్టులవిషయతృష్ణ, ఆకలి తీర్చుకొనఁగడంగు కొలఁది అశాంతి హెచ్చును. కోరికలకు లొంగి వానిని పూరించు కొనుటకు యత్నము జేయక వానిని ప్రతిఘటించుచు, మనస్సు కోరని పదార్థములను సమకూర్చుట చేతనే మానవుని మనస్సు శాంతి నొందును.

“తాస్మాచ్ఛుద్ధ విరాగో మనోఽఖిలషితం త్యజేదర్థం
తధనఖిలషితం కుర్యా న్నిర్వ్యాపారం తతో భవతి”

కానశుద్ధవిరక్తికై కడఁగువాఁడు
చిత్త కామితములను త్యజించి, యద్ధి

కోరని పదార్థముల సమకూర్చునేని
నఖిల సంకల్ప శూన్యత్వమందు మనసు.

(ప్రబోధసుధాకరము - మనోనిందాప్రకరణము)

కావున ఆధ్యాత్మిక చింతనము లేక బాహ్యవిషయాసక్తుడైన వానికి హృదయ శాంతి లేదు.

దురాశ - గర్వము

విషయలంపటులగు మానవులను విశ్వసించి యనుసరించు వాడు వ్యర్థుడు. దైవస్వరూపములను సేవించుట లాఘవముగ దలంపరాదు. మనమటుల కావించుట ప్రాపంచిక దృష్టియందు అల్పత్వమని భావింపదగును. మానవుడు తనపై తా నాధారపడక దైవముపై నాధార పడుట నేర్వ వలయును. దైనందిన జీవనమున నేదియెటుల పరిణమించుచున్నను దానిని "దైవేచ్ఛ"గ భావించి మనస్సమాధాన మొందుచుండవలయును. నరుడు తన శక్తివంచన లేని విధమున తన విధులను నలుపు చున్నచో దైవము తప్పక తోడ్పడును. మనుష్యుని ప్రయత్నము తెరచాప యెత్తుట వంటిది. దైవ కరుణ గాలి వంటిది. కావున నరుడు తన తెలివితేటలపై నాధార పడక దైవ కరుణపై ఆధారపడి విశ్వసించుట శ్రేయము.

'వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్, తథాహిదర్శయతి.'

(బ్ర. సూ. 2-1-34)

'ఈశ్వరస్యాప్యభిమానద్వేషిత్వాద్దైన్యప్రియత్వాచ్చ'
ద్వేషమభిమానులన్ ప్రీతి దీనులందు
నా పరాత్పరునకు నేని నలరు కతన.

(ప్రేమామృతము, నా. భ. సూత్రములు 26)

దైవము దీనజనులను రక్షించువాఁడు. గర్వాహంకార పూరితులను శిక్షించువాఁడు. అనుటలో రాగద్వేషములను భగవాను నందు కల్పించరాదు.

'న మోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి న ప్రియః'

(భగవద్గీత - 9-28)

కావున సకలభూతములందు దైవము సమాన దృష్టిగలవాడే. అందఱను సముద్ధరించువాఁడే. కాని ఆ విధానము వేఱు. దీనుల రక్షణరూపమున దురభిమానులను శిక్షణరూపమున అనుగ్రహించును. ఫల మిరువురకు సమానమే, దైవప్రాప్తియే.

మనుజుఁడు తన విద్యా రూప ధన జన బల పదవులను జూచుకొని ధనవంతులగు మిత్రులను జూచుకొని ఉప్పొంగరాదు. ఎల్లరకు సకలము ప్రసాదింపజాలిన భగవంతునిఁ దలచుకొని సంతో షించవలయును.

"మాకురు ధన జన యౌవనగర్వం హరతి నిమేషాత్కాల స్సర్వమ్' అని శ్రీ శంకరభగవత్పాదులు బోధించినటుల క్షణములో నేదొక కారణమున నివి యన్నియు రూపఱును. తన సహజ బహూకృతు లగు జ్ఞాన విశేషాదుల గూర్చియు మానవుఁడు గర్వింపరాదు. అట్లు గర్వించుట భగవానుడు సహింపడు. ఇవియన్నియు భగవద్దత్తములని నమ్రత వహించవలయును. ఇతరులకంటెఁ దానధికుఁడననియుఁ దలంచుట తగని పని. ఏ మనుజునందేమి కలదో ఎఱుఁగజాలు దైవ దృష్టియందు తానే మిక్కిలి అల్పుడేమో! అను విషయము మనుష్యుఁ డెఱుంగలేడు. తాను గొప్ప గొప్ప పనుల నొనర్చినవాఁడనియు నరుఁడు తలంపరాదు. మానవ నిర్ణయమును భగవన్నిర్ణయము త్రోసిరా జనును. తరచుగ నరున కిష్టమగునది దైవమున కనిష్టము కావచ్చును. తనయందే గుణలేశమున్నను అంతకంటె నధికములగు గుణము లితరు లందున్నవని నరుఁడు భావించుటచే వాని హృదయమున నమ్రత పెంపొందును. అట్లితరులకంటె తానల్పుఁడనని తలంచుటచే మానవు

నకు లాఘవము కలుగదు. వినమ్రులగువారు నిరంతరము శాంతి నొందుదురు. గర్వితుల హృదయములు ఈర్ష్యాద్వేష పూరితములై యుండును.

ప్రతి వ్యక్తితోడను మన హృదయములు విప్పి చెప్పుకొనరాదు. సత్పురుషులు దైవభీతి గలవారితోడనే మన విషయముల గూర్చి చెప్పుకొనఁదగును. ధనికులను శ్లాఘించుటగాని, గొప్పవారి దగ్గఱ కేదొక పని కల్పించుకొని తఱచుగ వెళ్ళుటగాని తగనిపని. సద్గుణ సంపన్నులు నిర్మలహృదయులు నిష్కపటులు అడకువగల భక్తుల సాంగత్యము కలిగియుండుట మేలు. వారితోడనే జ్ఞానము పెంపొందించు విషయములగూర్చి సంభాషింపఁ దగును. శ్రేయస్సును గోరు పురుషులు కాంతలతోడను కాంతలు పురుషుల తోడను అతిపరిచయము కల్పించుకొనరాదు. దైవముతోడ భగవత్ప్రతినిధులగు సాధుసత్పురుషులతోడ పరిచయమును మనము కాంక్షింపవలయును. ఎల్లఱయెడ ఔదార్యము కలిగియుండుట తగునుగాని అతి పరిచయ మభిలషణీయముకాదు. ఇతరుల పొగడికల తెగడికలకు కలత పొందరాదు.

ఇక శ్రీ సాయీనాథుఁడు తన బిడ్డలకుఁ దెలిపిన విషయములు శ్రద్ధతో గమనించుదము.

"భగవానుడే అత్యధికుఁడు. మహాప్రభువు. 'అల్లా మాలిక్' అద్వితీయుఁడు. ఆ ప్రభువుతో సరిపోల్చ నెవరు తగరు. సృష్టిస్థితిలయకారకుఁడాతఁడు. ఆ స్వామి లీల లనూహ్యములు. ఆ ప్రభువు మనకు ప్రసాదించినవానిలో సంతృప్తి సంతుష్టులను మనము పొందవలయును. ఆ తండ్రి యిచ్ఛకు మన మధీనులమై యుందము. 'అల్లా రఖేగా వహీ సారహేనా'- ఏది యెట్లు పరిణమించుచున్నను స్వీకరించి తృప్తి సంతోషములను మనము పొందవలయును. కలత పొందరాదు. ఆ ప్రభువు ఆజ్ఞలేక ఆకేని అల్లాడనేరదని గుర్తింపవలయును. ఋజుప్రవర్తనము, నిష్కాపట్యము గలిగి మంచి చెడులు గుర్తించుచు వారి వారి విధులను శక్తివంచనలేని విధమున నిర్వర్తించుచుండవలయును.

కాని మనము విమోహితులమై మనము కావించు కర్మములకు మనమే స్వతంత్రులము, కర్తలమని తలంచరాదు. కర్త భగవానుడే. ఆ మహాప్రభువు స్వాతంత్ర్యము, మన పారతంత్ర్యము గుర్తించి సకల కర్మములు ఆ స్వామివిగ విశ్వసింపవలయును. అట్లు కావించిన సకల కర్మబంధములఁ జిక్కువడక వానినుండి విడివడుదుము." అని బాబా దామియా (రసానే) ను గూర్చి పలికి, 'దామియా ఆకాశమున కెగబ్రాకజూచుచున్నాడు. భగవానుఁ డనుగ్రహించిన దానిని కాపాడు కొని సంతృప్తి సంతోషము లొందదలపఁడు అని సాయినాథుఁడు, మనకు బోధించినాడు.

"సకల జీవములను ప్రేమించుము. ఎవరితోడను కలహించ వలదు. ప్రతీకార బుద్ధి తగదు. ఎవరిని నిందింపరాదు. ఎవరేని నీకు విరుద్ధముగ నిందగఁ బలికినఁ గలతపడక తొలగిపొమ్ము. వారి పలుకులు నీ తనువున గ్రుచ్చుచనవు. ఇతరుల పలుకులు పనులు ఇతరులను, నీ పలుకులు నిన్ను బాధించును."

"ఎవడేని ఇతరులపై నాగ్రహించెనేని అతఁడు వైళమ నన్ను బాధించును. ఇతరులనెవడేని నిందించిన నేను నొచ్చు కొందును. ఇతరుడెవడేని దూషించిన సహించువానినిఁ జూచి మిక్కిలి సంతోషింతును. పరదూషణమును సహించి, ప్రతీకారమునకుఁ గడంగ కుండువేని దైవము నిన్ను రక్షించును. కీడునకు కీడుచేయకుము. కీడునకు మేలు చేయుము," అని బాబా పురందరౌతోడను, ప్రధాణ్ పత్నితోడను పలికినాఁడు.

పురుషులు స్త్రీలతో, స్త్రీలు పురుషులతో అతిపరిచయము తగదు. అని బాబా సన్న్యాసియగు దేవదాసుతో నిట్లనెను.

"సాయనా! వైరాగ్యము పాటించుము. ముఖ్యముగ యతులకు కాంతలు ప్రమాదకారణములు. మోహాద్యుపాధులను విసర్జించుము. దైవచింతనముచే మోహమును నిర్మూలించుము. కామినీ కాంచనము

లందు వ్యామోహము విడలేనివాఁడు దైవము నెఱుఁగలేడు. దైవప్రాప్తి కర్తుఁడు కానేరఁడు".

(ప్రాకృతాకర్షణలు - వానినుండి తొలగుట;
చూడు ద్వితీయపాదము నెం. 7)

పుణ్యక్షేత్ర తీర్థయాత్రలు గావించితినని మిక్కిలి గర్వించిన యొక 'హాజీ'ని, తాను బ్రాహ్మణుడైన రామభక్తుఁడనని యితరులకు తలనొగ్గఁబోనని గర్వించిన దక్షిణాఫ్రికానుండి వచ్చిన డాక్టరును, మద్రాసునుండి వచ్చిన రామదాసిని, వేదవిశారదుఁడనని గర్వించిన మూలే శాస్త్రిని, గీతాభాష్యాదులను అధ్యయనము చేసితినని గర్వించిన సంస్కృత విద్యావంతుఁడగు చందోర్కరును, ఇట్లు బాబాను ఆశ్రయించిన భక్తులందుగల, జాతికులవిద్యాగర్వములను తొలగించి వారిని చక్కదిద్ది బాబా తాను యోగసంపూర్ణ అవతారుఁడను విషయమును నిరూపించిన వృత్తాంతములు "ఏమీ నిన్నుపేక్షింతునా? అను గ్రంథమున విశదీకరింపబడినవి.

అరిషడ్వర్గమును, కామక్రోధాదుల బారి పడనీయక బాబా తన బిడ్డలను కాపాడిన విధము 'శ్రీసాయీ కరుణ' 96-100 పుటలందు సంగ్రహముగ దెలుఁపబడినవి. గమనింపుడు.

'అసలీసులు లోభము నన్యనింద
కపటము నసత్యమును కాముకప్రవృత్తి
ఆగ్రహంబను నెనిమిది యవగుణముల
నవలఁద్రోయనో సాయీపదాంకితుండు."

(శ్రీ సాయీకరుణ - విజ్ఞప్తి)

సత్య సుఖ శాంతులు :

ఇఁక సత్యసుఖశాంతులను పొందు విషయమై శ్రీ సాయీ ప్రభువు తన బిడ్డలకు బోధించిన విషయములను గూర్చి దెలిపి

కొందము. నానాసాహెబ్ చందోర్కరు ఒక సందర్భమున బాబాను జేరి 'బాబా! యీ సంసారమున సుఖదుఃఖములు మనుష్యుని తారుమారు చేయుచున్నవే కావున ఈ సంసారము పరిత్యజించుట మేలు కదా?' అని ప్రశ్నించెను. శ్రీ సాయీనాథుడు తెలిపిన సమాధానము గమనింపుడు.

'నానా! సుఖదుఃఖములు కేవలము భ్రాంతి మాత్రము. ప్రాపంచిక సుఖము సత్యసుఖముకాదు. ప్రాకృత పురుషుడు దానిని సత్యసుఖమని తలంచి, దానిచే బలాత్కారముగ నాకర్షింపబడుచున్నాడు. ఆయా జీవుల ప్రారబ్ధకర్మముల ననుసరించి యొకనికి పరమాన్నము, ఒకనికి రొట్టెముక్క మఱియొకనికి గంజినీరు లభించును. మొదటివాడు సర్వము లభించెనని ఊహించును. తక్కిన యిరువురు తమ లేమిని తలంచుకొని వగతురు. ఇందఱు పొందు ఫలము ఆకలి తీర్చుకొనుటయే. ఒకడు జలతారు దువ్వలువలు ధరించును. మఱియొకడు నారవస్త్రములు తాల్చును. దేహమును కప్పుటయే యిరువురకు కలుగు ఫలము. ఈ సుఖము, దుఃఖము వారి వారి తలంపుల ననుసరించి కలుగును. అదియే భ్రమ. అది వినాశహేతువు. ఇట్టి సుఖదుఃఖములఁ గూర్చిన తలంపు రేకెత్తిన దానిని నిగ్రహింపఁ బ్రయత్నింపుము. దానికి తావీయకుము. అది కేవలము భ్రమ.

షడ్రిపులు:— (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు) ఇవి యన్నియు భ్రమజనితములు. నిన్ను వంచించునవి యని తెలిసికొనుము. అసత్యమును సత్యముగ ఆభాసింపఁజేయును. ధనవంతుడు సువర్ణాభరణముల ధరించిన చూచి పేదవాడు తాను ధరించుటకు లేకపోయెనుగదా! యని ఈసు వహించును. ఇది లోభము. తక్కిన రిపుషట్కమిదే విధము. కావున ఈ అంతశ్శత్రువులను జయింప వలయును. ఇవి జయింపఁబడిన నీ హృదయమున

ఆశాతరంగములు పొడమవు. నీలో దాగియున్న శత్రువులను జయింపఁజూడవేని నీవు వానికి బానిసీడ వగుదువు. వానిని నిర్జించి నీ బుద్ధికి లొంగినవానిఁగ చేసికొన నేర్చిన యీ భ్రమ జనిత సుఖదుఃఖములు నిన్ను వశ్యునిగఁ జేసికొన జాలవు, జననమరణ రూపమగు చక్రమున భ్రమించుటయే దుఃఖము. దానినుండి విడివడుటయే సత్య సుఖము. సత్యమైన శాంతి అదియే.

సంసారము :

యన్. జి. చందోర్కరు ఒకపరి బాబాను జేరి "బాబా! ఈ సంసారము వలదు. శాస్త్రములు వచించునట్లు ఇది నిస్సారము. నిష్ప్రయోజనము. దీనినుండి నన్ను తప్పింపుము. ఇందు ఏది మొదట సుఖముగ గోచరించునో అది దుఃఖాంతమే యగును. ఆ యా జీవుల కర్మములు వీనిని వికృతతాండవము కావింపఁబంపును. సుఖము లవమేనియు యిందుఁగానరాదు. నాకు విసుగు జనించినది. ఇంక దీనినుండి నన్ను విడివడజేయుము." ఆ మాటలు విని బాబా చందోర్కరునకుఁ దెలిపిన విషయములు గమనింపుడు.

"నానా! నీ పలుకులు భ్రమజనితములును ప్రలాపములు సుమా! కాని యొకింత సత్యము లోపసహితమై ద్యోతక మగును. ఈ తనువుగల యంతవరకు సంసారము తప్పదు. ఎవరును దీనిఁ దప్పించుకొనఁజాలరు. నీవేమి? ఇట్టి నేనుకూడ దీనియందుఁ దగులుకొనియున్నవాఁడను. ఇచట మన మొక రహస్యము జ్ఞప్తి యందుంచుకొనవలెను, సంసృతినుండి వెలువడుటకు మనము ప్రత్యేకించి యేమియు ప్రయత్నముచేయ నక్కఱలేదు. మన మనస్సును దైవమునం దెంతెంత లగ్నము చేయుదుమో సంసారమునకు మనమంతంత దూరమగుదుము. శ్రీ రామకృష్ణ పరమహంస తెలిపినట్లు మనము తూర్పుదిశ కెంతెంత పురోగమింతుమో పడమరదిశ మనకంతంత దూరమగును." తన శ్రేయస్సుకోరు భక్తుని కామిత మెట్లుండవలయునో యీ క్రింద దెలుపఁబడిన బాబా భక్తుల వృత్తాంతములను గమనింపుడు!

1) ఒక సందర్భమున బాబా తన భక్తుడగు యం. వి. రేగేను చూచి "బిడ్డా! నా ఖజానా బీగము నీయధీనమునందుంచితి. నీకు కావలసినది కోరుకొనుము. ఎంత ధనము కావలయునో - లేదా! యేమి కావలయునో - కోరుకొనుము, ఈ క్షణమున నిత్తును."

రేగే:- బాబా! నాకేమియు వలదు.

బాబా:- ఏమేని కోరుకొనుము. నేను నీకీయ మిక్కిలి కుతూహల పడుచున్నాఁడను.

రేగే:- నేను కోరునది యనుగ్రహింప నీవు సమ్మతింతువా?

బాబా:- సందేహమేమి? తప్పక ఇత్తును.

రేగే:- బాబా నా కోరిక ఇది. వినుము. ఈ పుట్టువున - ఇఁక ముందు నాకు కలుగనున్న పుట్టువులందు నన్ను నీవు విడనాడకుండ వలయును, నీవెప్పుడు నాతో నుండవలయును. నా కామిత మిదియే!

బాబా:- తప్పక ఉందును, నీతో, నీ లోపల, నీ వెలుపల, నీ వెక్కడ నేమి చేయుచున్నను నిన్ను విడనాడకయుందును.

2) 1918 లో (తార్కాడ్ సతి) **Mrs. T,** (ఆమె కుమారుడు) **Master T.** బాబాను సందర్శించిరి.

బాబా:- (ఆమెతో) అమ్మా! ఈ రోజులలో నేను మిక్కిలి కలత పొందుచున్నాఁడను. కొందఱు ధనము, కొందఱు కాంతలు, బిడ్డలను కోరి నన్ను బాధింతురు. కటా! నా దగ్గర కలది, నేనీయఁ గోరునది కోరువారు లేరు. నేనిటుల వేచియున్నవాఁడను. ఎప్పుడో తిరోహితుఁడ నగుదును. నాకు విసుగు జనించుచున్నది.

తార్కాడ్ సతి:- బాబా! నీవట్లేల పలుకుచున్నావు? నీవదృశ్యుఁడవైన మా గతి యేమగును?

బాబా:- అమ్మా! నీ కాందోళన మేల? దైవము నీ యోగ క్షేమము లరయుట లేదా? నా బిడ్డలు నన్ను జేరవచ్చిన మిక్కలి సంతోషింతును. ఈతనువు నిలుపుకొనుటకై వడివడిగ ఏవో రెండు మెతుకులు మెసవుదును.

మాష్టర్ టి.:- బాబా! నీ దగ్గఱుఁగలది కోరుటకే మేము వచ్చితిమి. నీకుఁదెరియును.

బాబా:- అవును. నీవు తప్పక పొందుదువు!

మాష్టర్ టి. :- బాబా ! మేమెఱుగుదుము. కాని, ఎప్పటికి పొంధగలము?

బాబా:- త్వరలోనే!

మాష్టర్ టి:- బాబా! దానిని పొందుటకు ఇంక ఎన్ని పుట్టువులు కావలయును.?

బాబా:- మూడు పుట్టువులు చాలును.

మాష్టర్ టి. :- కాని, బాబా! మమ్ము విడనాడక నాతో నుందువా?

బాబా:- బిడ్డా! ఇప్పటికెన్ని పుట్టువులనుండి మీతో నున్నవాఁడను? మన మెప్పుడును కలియుచునే యుందుము. నా బిడ్డలను గూర్చి దివారాత్రములు నేను జాగ్రత్తపడుచుందును. ప్రతి పైసాకు నేను భగవానునితో లెక్క చెప్పుకొనవలయును."

భక్తుని దృష్టి యీ విధముగ నుండ వలయును. ఇఁక సంసారమునుగూర్చి బాబా తెలిపిన విషయములను గమనింపుడు!

బాబా:- "నానా! ఈ సంసృతి పలు విధములు. ఇది దేహముయొక్క ఉపరిభాగము వంటిది. కామక్రోధాదుల యొక్క వికారమే సంసారము. ఏ రెండు వస్తువులు చేరిన అది సంసారము. అడవులకు పరువెత్తిన సంసారమునుండి తప్పుకొనలేవు. ఈ నీ యిప్పటి

స్థితి నీవు తెచ్చిపెట్టుకొనినదే. దీని కాగ్రహించిన ప్రయోజనమేమి? నీ పూర్వకర్మ సంజనితమైన దేహప్రారబ్ధమిది. కావున ఈ దేహము కలిగినది. ఆ పూర్వకర్మ ఫలానుభూతికి జీవి ఈ దేహమున జేరినాడు. ఆ ప్రారబ్ధ కర్మము ననుభవింపకయే దీనినుండి తొలగఁగఁ జాలవు. సకల మానవులు, సకల జీవములు భిన్న భిన్న ఆకారములను కలిగియుండును. ఏల? ఆయా జీవుల కర్మఫలముల ననుసరించియే. ఈ జీవకోటియందు అన్యోన్య భిన్న ప్రవృత్తులు ఆయా కర్మ సంజనితములే. చూడుము! భాగ్యవంతుని కుక్క పరుపులపై పరుండును. పేదవానికుక్క, వీధులవెంట పారవేసిన రొట్టె ముక్కల కొఱకై యటునిటు పరువెత్తును. ఇది దేహ ప్రారబ్ధము."

శ్రీసాయీనాథుఁడు చందోర్కరును గాంచి యిట్లు పలికెను.

సంసారమునందు ప్రవర్తింపఁదగు విధము:

దేహ ప్రారబ్ధములుగ భావించి బుద్ధిమంతులు వారి వారి జీవితముల లభ్యములైన వానితో సంతృప్తి సంతుష్టులను పొందుదురు. కంటకములను కాలదన్నఁబోవరు. సంపదలు కలిగిన నమ్రత వహింపుము, ఫలభరితములైన తరువులు వంగియుండును కదా! ఎల్లరయెడ నమ్రభావము తగదు. క్రూరులు దుర్మార్గులగు వారితో కఠినముగ ప్రవర్తింప వలయును. సాధులు పేదలయెడ ప్రేమ ఆదరణల వహింపుము.

భగవద్దత్తమైన విత్తనములను సత్కార్యములకు వినియోగింపుము. కాని మితిమీఱి వెచ్చింపఁదగదు. ఈ విశ్వము నశ్వరమను మాట సత్యమే, దేహధారణమునకు పైత్యరసమటుల ఈ విశ్వమున్నంత వరకు ధనము వలయును. ధనమును జూచుకొని ఉబ్బి తబ్బిబ్బు కారాదు. ధనలంపటుఁడవు, లోభివి కాకూడదు. మితిమీఱి వ్యయపెట్టరాదు. నీ ప్రాపంచక విధులను నిర్వర్తించుచున్నను దైవమును విస్మరింపక సర్వవేళల దైవమును జ్ఞప్తియందుంచుకొనుము. "ఈ సంసారము నాదికాదు. దైవమునకుఁ జెంధినదే" — అని నీవు

జాగృతి వహించునంత వరకు తలంచుచుండుము, పేదలు, దీనుల యందు కనికరము వహించుము. వారిని నిరాకరించి యీసడింపకుము. 'నే' నెవడను?— అని ఎల్లవేళల చింతించుచుండుము?

ప్రార్థన :

శ్రీ సాయిప్రభూ! నిన్ను శరణుజొచ్చిన వీని అహంకార మమకారములను నిర్మూలింపుము. పరాపవాదము లపహరింపుము; ఇతరులందుగల గుణములను మాత్రము గ్రహించు బుద్ధిని ప్రసాదింపుము. ప్రపంచమున ప్రతివస్తువునందు నీవధివసించి యున్నవాఁడవని లెస్సగఁ దెలిసికొననిమ్ము. కామక్రోధాది శత్రుషట్కమునకు వీని నధీనునిఁ గానీయకుము. ఈ సంసారము వీనిదికాదు. ఇదియంతయు నీదే. నీ యిచ్చవచ్చినట్లు దీనిని ప్రవర్తింపఁజేయుచున్నాఁడవు. ఏది యెట్లు పరిణమించినది వీని మేలుకొఱకే - యను ఎఱుకను కలిగింపుము. వీనిచే నీవేమి చేయించుచున్నను కర్తవు నీవే యను బుద్ధి వీనికిఁ గూర్పుము. నీ స్వాతంత్ర్యము వీని పారతంత్ర్యము ప్రతిపదమున బోధపడునట్లు చేసి వీనికి సత్యసుఖశాంతులను ప్రసాదింపుము. బాబా! నీకు వేయి నమోవాకములు.

౯. పరనింద - పరాపకారములు తగవు.

శబ్ద శబ్ద బహు అంతరా - సారశబ్ద చితదేయ్
జాశబ్దే సాహిబ మిలే - సోహిశబ్దగహిలేయ్.

పలుకు పలుకునకెంతో వాసి చొప్పడును
తలపు మేల్పలుకుఁ జిత్తమున నెప్పుడును,
పరమాత్మ లబ్ధమౌ పలుకులే సతముఁ
సిరికించి వాని నుపార్జించుకొనుము.

శీతల శబ్ద ఉచారియే - అహం అనియే నాహి
తేరా ప్రీతిమ తుఝు హి మే - దుశ్మన్ భీ తుఝుమాహి.

పలుకుము చల్లని పలుకుల సతము
మలయనీయకు మభిమాన మేలవము:
మిత్రులు నీలోన మెలఁగుచున్నారు
శత్రులు నీలోనఁ జాగుచున్నారు.

(సాయీకబీరుసూక్తులు)

సాధ్యమగునంతవరకు ప్రాపంచక అల్లకల్లోలములనుండి దూరముగఁదొలఁగనగును. ఋజుభావముతో వానియందుఁ బాల్గొనుట పొసగినను లౌకిక విషయములు ప్రతిబంధకములే యగును. అవి నరుల నవలీలగ మాలిన్యమునుగూర్చి గర్వితులఁజేసి లోఁగొనును. నోరు మెదల్చిన హృదయశాంతి గోల్పోవుదుము. సాంగత్య దూరుల మైన బాగుండునుగదా! యనిపించును. పనిగల్పించుకొని యితరులతో ప్రసంగింప నేల? ఇతరులతో లౌకిక ప్రసంగములందు బాల్గొంటిమా - మన మనస్సును నొవ్వజేసికొని తిరిగి శాంతి వహించుటకు చాల బాధపడుదుము.

ఇతరులతో మాటలాడు బుద్ధి పొడముటకు కారణము ఇతలరువలన మన మనునయ సుఖములను బడయదలఁచియే. మన హృదయమున నావరించి బాధించు వివిధ విషయముల భారము పోదట్టుకొనుటకే, మనము మిక్కిలిగ ప్రేమించి యభిలషించు విషయములగూర్చియే యెల్లప్పుడు తలఁచుకొనుచు పలుకుచుందుము. లేక, మనకు ప్రతిబంధకములు, విరుద్ధములుగ తోచు విషయములను గూర్చియేని చర్చించుము. కాని వీని కంతములేదు. ఇట్టి సంభాషణలు వ్యర్థములు. ఈ వెలుపల ప్రపంచము నుండి మనము బడయజూచు ఓదార్పులు, ఊరటలు అంతరంగిక దైవిక హృదయశాంతికి మిక్కిలి హానికరము.

లౌకిక విషయలంపటులను వారిదువుర్కు చేరిన ఒకరి నొకరు ప్రశంసించుకొనుచు దూరమునమున్న వ్యక్తుల నిందించుట జరుగును,

ఆత్మప్రశంస పరనిందలు రెండును అనర్థకములు. ఆత్మ శ్రేయమును దలపక దురభ్యాస వశమున అనుచిత సంభాషణలకు లోనగు చుందుము. కావున మనస్సునకు కళంక మాపాదించు కార్యకలాప ముల వ్యర్థ సంభాషణముల మనకుగల కాలమును పోఁద్రోయ నీయ కుమని దైవమును ప్రార్థించుచు మెలకువ గలిగియుండ వలయును. కాలము గడుపుటకై మాటాడవలసి వచ్చెనా, దైవచింతన తత్పరులై ఐకమత్యముగల సజ్జనులతో ఆధ్యాత్మికాభ్యున్నతిని, హృదయశాంతిని సమకూర్పజాలు సంభాషణలు గావించుట శ్రేయస్కరము.

మనకెట్టి సంబంధము లేని యితరుల పలుకుల పనులఁ గూర్చి మనము ప్రవేశము కల్పించుకొనకుండుట మేలు. తన ప్రవ ర్తనము గూర్చి యోజించుకొనక ఇతరుల విషయముల జోక్యము కల్పించు కొనువానికి మనశ్శాంతి కలుగదు.

'ఏకబుద్ధిర్విశిష్యతే' - ఏక బుద్ధిగలవారు ధన్యులు.

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన!
బహుశాఖాహ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్.

అమల మగుచు నిశ్చయాత్మకమౌ బుద్ధి
యొకటి ముఖ్యమిట్టి యోగమునకు;
వివిధశాఖలధిక వృత్తముల్ సంస్కార
హీనజనుల బుద్ధు: లింద్రతనయ!

(శ్రీమద్భగవద్గీతామృతము 2-41)

సాధుసత్పురుషులు కొందఱు సంపూర్ణులై ధ్యాననిమగ్నులై యుండుటకు కారణమేమో యోజించుకొనదగును. ప్రాపంచక కామి తములకు వారు పూర్ణముగ విముఖులు. అందుచే నిండుమనస్సును భగవానునందు నిలుపుకొనగలరు. పరమ విశ్రాంతిని బడయఁగలరు. మనము లోక విషయములందు మనస్సు నిలిపి కామ క్రోధాదులకు

(అరిషడ్వర్గమునకు) బానిసీలమగుచుందుము. ఇతరులలోఁగల లోప ముల దోషముల నెన్నుచుండుటయేకాని మన లోపములగూర్చి తలంచు కొనము. మనలోఁగల యే యొక దోషమేని నిర్మూలించుకొనఁ జూడము. ఆధ్యాత్మిక జీవనము దినదినము ఉత్తేజపఱచుకొన యత్నిం పము. అందుచే మనము స్తబ్ధులము బద్ధులమై యున్నారము. దైవీ సంపదల నొక్కొక్కటి పడసి దైవధ్యానానుభూతిని గడించుదుమేని ఆ దివ్యామృతమును చవిచూడగలము. మన మనోవికారములనుండి విడివడక పోవుటయే మన ప్రతిబంధము. సత్పురుషులింతకు బూర్వము చరించి పాదచిహ్నములు నిలిపిన నివృత్తి మార్గము వైప వకు దృష్టిని సారించఁజాలము. ఏ మాత్రమేని కష్టము కలిగెనా మనము ప్రపంచాభిముఖుల మగుచుందుము. మనల నలుదెసల గ్రమ్ముకొను కష్టములను దైవమునందు విశ్వాసము, ధైర్యముతో గూడిన ఓర్పు, (నిష్ఠ-సబూరి) కలిగి ఎదుర్కొన యత్నింతుమేని దైవము తప్పక చేయూఁత నొసగి తోడ్పడును.

మన ఆధ్యాత్మిక జీవనము యొక్క పరమావధి యేదో బాహ్య విషయ సముపార్జనమునఁ గలదని భావింతుమేని మనకు పతనము వైళము ప్రాప్తించును. ఈ సంసృతి వృక్షమూలముల (మనో వికారములను) ముందుగ నొక్క టొక్కటి జ్ఞాన ఖడ్గమున ఛేదించ వలయును. అపుడు మనకు క్రమముగ ఆత్మశాంతి చేకూరును. సావ ధానముగ మనము పరిశీలించుకొందుమేని సాధన ప్రారంభ దశకంటె క్రమముగ పతనమగుచున్నారమే కాని ఒక్క మెట్టేనియు నధిరోహిం చుట కానము. ప్రారంభస్థితినుండి దినమునకో నెలకో లేక ఒక్క సంవత్సరముకేని ఒక్క మెట్టయిన ఎక్కగలుగుదుమేని మనము ధన్యు లమే. తొలుత కొంచెము కష్టముగ దోచినను క్రమముగ నధిరోహించు కార్యము తేలికయగును. ఉత్సాహము పెంపొందును. మనకుఁగల అలవాటులను త్రోసిపుచ్చుట కష్టము. స్వల్పవిషయములనే నిరోధింపఁ జాలమేని కఠినముల నెట్లధిగమించఁగలము! కావున మనలోఁగల

దోషముల నొక్కటొక్కటిగ పరిత్యజించుచు ముందుకు సాగిపోవల యును. సాధకుడు తన అకించనత్వమును గుర్తించి యంతర్ముఖు డైనకొలది తన కంతస్సుఖ శాంతులు, నితరుల కానందము గలుగుట గమనింపగలడు. శ్రేయస్కాముడగువాడు ఆధ్యాత్మికోజ్జీవనము నెడ జాగ్రత వహింపదగును.

శ్రీ సాయీప్రభువు మనకు నిరంతరకృషి - సహన విశ్వాసములు కలిగియుండుమని బోధించినాడు. యోగయాగ తపోజ్ఞానములు లేని మానవజీవితము వ్యర్థమని తెలిపినాడు. ఒక భక్తునిజూచి "నీవు తిని ఊరక కూర్చుందువా? (నిష్ఠ) దైవమునందు గాఢ విశ్వాసము, (సబూరి) ధైర్యముతోగూడిన ఓర్పుగలిగి, నీ విధులను నీవు నిర్వర్తించు చుండవలయును" అని సూచించినాడు. బాబా నిద్రించి యెరుగడు. అతంద్రి కావించునది నిరంతర తపస్సు, నామస్మరణము గావించుచు రేయింబవళ్ళు జాగృతి వహించువాడు. అబ్దుల్ మొదలగు సాధకులకు "మితముగ భుజింపుడు, అల్లాను స్మరింపుము. దైవమును పొందగోరుదురేని నిరంతరము హరినామము స్మరింపుడు" అనియే బోధించినాడు. పరదూషణము, జీవహింస నిరసించువాడు. ఇతరుల కేవిధమైన బాధ కలిగించు ప్రవర్తనలు తనవారియందున్న గర్హించువాడు. ఎవరెవరెక్కడ ఎవరెవరిని గూర్చి నిందించుచున్నది బాబా ఎఱుగును.

యస్. యమ్. నాయక్ తేయాకు దుకాణము దగ్గర మధురదాసు ఎవరినోగూర్చి యేమేమియో నిందించెను. ఆ తరువాత మధురదాసు బాబాను సమీపించి నమస్కరించెను. బాబా అతనిజూచి, "సగుణ్ ఏమి పలుకుచున్నాడు?" అని ప్రశ్నింప మధురదాసు సిగ్గున తలవంచుకొనెను. బాబా అతని నుద్దేశించి "ఇచటకు మంచివారు చెడ్డవారు వచ్చుచుందురు. వారి తప్పిదములను దోషములను నలుగురిలో ప్రకటించుటేల?" అని పలికెను.

కాకా దీక్షిత్తు తన నివాసమున (దీక్షిత్‌వాడ) జీసెస్ క్రైస్తును గూర్చి యేమేమో నిందగా పలికినాడు. అపిదప ద్వారకామాయి

మసీదునజేరి బాబాకు మ్రొక్కెను. దీక్షిత్తు తన చెడు ప్రవర్తనమునకు పశ్చాత్తాపము వహించునంతవరకు బాబా అతనిని దగ్గర రానీయలేదు.

ఒక సమయమున శిర్డిలో నొక భక్తుడితర భక్తులనుగూర్చి చాటుగ నేమేమో నిందించెను. బాబా లెండీ వనమునకు వెళ్లుచు దారిలో ఆ పరదూషణ యందాసక్తిగల యాతనిని గలిసెను. అచట నొక పంది మలమును భక్షించుట చూపి, "అది యేమి చేయుచున్నది?" అని ప్రశ్నించెను. అది అశుద్ధమును భక్షించుచున్నది" యని యతడు సమాధానమిచ్చెను. "ఆ పంది యా మలభక్షణమందెంత ఆసక్తి వహించుచున్నదో గమనించితివా? కాని, మన సాదృశ్యము నేవగింతుము - కాదా? నీ ప్రవర్తనము ఆ విధముగ నున్నది. జనులు కొందరు వారి మనస్సులు సంతృప్తి నొందునట్లుగ వారి సోదరుల నిందింతురు, వారికి బాధ కలిగింతురు. ఎన్ని పుట్టువుల పుణ్యఫలితముగనో మానవ జన్మ కలిగినది. అట్టి మానవ జన్మము నొంది వారు శిరిడికి జేరుట నైతిక ఆత్మహత్య గావించుకొనుటకేనా?" అని బాబా అతనికి బుద్ధి గరపెను. బాబా కావించిన మందలింపు గ్రహించి యా భక్తుడు బాబా పాదముల వ్రాలి క్షమింపుమని ప్రార్థించెను.

దాదాకేల్కారు హెచ్. వి. సాఠే మామ. అతడు శిర్డిలోని సాఠేవాడలో నివసించువాడు. అతడు ఈర్ష్య - స్వాతిశయము గలవాడు. ఉల్లి భక్షణము నేవగించుచుండెను. శిరిడికి జేరి సాఠే వాడలో విడిసిన యాత్రికులు ఉల్లిపాయలు భక్షించుట సహించువాడు కాడు. అచ్చట ఉల్లిపాయలు తేరాదని వారించు వాడు. బాబా భక్తుడు యస్. బి. నాచ్నేయొక్క అత్తగారు ఉల్లిపాయలు తినుగుట చూచి కేల్కారు ఆమెపై నసూయ వహించి తిట్టెను. తరువాత కేల్కారు మనుమరాలికి కండ్లకలక ఏర్పడెను. కేల్కారు బాబాను సమీపించి—

దా. కే:- బాబా! మనుమరాలికి కండ్లకలక యేర్పడెను. ఏమి చేయుమందువు?

బాబా:- కండ్లపై ఉల్లితో కాపు కాయుము.

డా. కే:- ఉల్లి కొఱకెక్కడకు పొమ్మందువు?

బాబా:- (ఆ సమీపముననున్న నాచ్నే అత్తగారివంక వ్రేలు చూపి) ఈ తల్లి నడిగి తీసికొనుము.

నాచ్నే అత్త:- ఈ కేల్కారు నన్ను తిట్టినాఁడు; కావున అతని కిచ్చుట నాకు సమ్మతము కాదు. నీవు ఆజ్ఞాపించుదువేని ఇచ్చెదను.

బాబా:- ఈయుము!

ఆమె కేల్కారునకు ఉల్లిపాయలిచ్చెను. బాబా దగ్గఱ ఉల్లిపాయలు చాల కలవు. కాని బాబా ఆ కేల్కారునకు నీతి పాఠము గఱపఁదలఁచి యట్టుల గావించెను. శ్రీసాయీ ప్రభువు తన బిడ్డలకు గావించు బోధలన్నియు నీ విధముగ నుండునని పాఠకులు గుర్తింతురు గాక!

'రామదాసి' యను నతఁడు సమర్థ రామదాసుయొక్క అనుయాయి. అతఁడు కొంత కాలము శిర్డియందుండెను. నిత్యము వేకువ జామున లేచి కాలకృత్యములు దీర్చికొని స్నానము సలిపి కావి వస్త్రములు ధరించి, భస్మములలదికొని మిక్కిలి నిష్ఠతో విష్ణు సహస్రనామములు, భగవద్గీత, అధ్యాత్మ రామాయణము, పారాయణము చేయుచుండును. ద్వారకామాయి మసీదునందుంచు నాతని గ్రంథములలోని విష్ణుసహస్ర నామము అను గ్రంథమును బాబా శ్యామాకు (మాధవరావు దేశపాండేకు) ఈయఁదలచెను. సోనాముఖి ఆకు తెమ్మని రామదాసిని బాబా అంగడికి పంపి, రామదాసి యొక్క విష్ణు సహస్రనామ గ్రంథమును తీసికొనివచ్చి శ్యామాకు ప్రసాదించి దీనిని నిత్యము పారాయణముచేయుము. నీకు సకల శుభములు గలుగునని యాశీర్వదించెను.

"బాబా! యిది నాకు వలదు. యిది రామదాసిది. అతఁడున్మాదుఁడు, కోపి, మూర్ఖపువట్టుదలగలవాఁడు. నాతో కలహించును."

అని శ్యామా పలుక, బాబా ఆ గ్రంథముయొక్క మహత్త్వముఁ దెలిపి మాఱు మాటాడక నిత్యము పారాయణము చేయుమని ఆజ్ఞాపించెను. బాబాఆజ్ఞకు బద్ధుఁడై శ్యామా ఆ గ్రంథమును స్వీకరించెను. రామదాసి బజారునుండి తిరిగి వచ్చెను. అచటనున్న 'అన్నా చిచిన్కర్' నారదునిపాత్ర వహించి జరిగినదంతయు రామదాసికిఁ జెప్పెను. రామదాసి అగ్రహోదగ్రుడై శ్యామాను పెక్కువిధముల దూషించి యా గ్రంథమును తిరిగి యీయకున్న తల వ్రయ్యలు చేయుదునని తెగఁబడెను. శ్యామా ప్రశాంతముగ జరిగిన దంతయుఁ జెప్పినను ఆ రామదాసి కోపమంతకంతకు హెచ్చెను.

అంతట బాబా రామదాసిని చేరబిలిచి మిక్కిలి ప్రేమతో — "ఓ రామదాసి! ఇదేమి ఆగడము? ఏల నీవిట్లు తబ్బిబ్బు లగు చుంటివి? శ్యామా మన బిడ్డ కాడా? వ్యర్థముగ నతని నేల నిందించెదవు? నీవు రామదాసివే! నీకట్టి కలహస్వభావమెట్లు తగును? మృదుమధుర వాక్కులు పలుకలేవా? నిత్యము నీవిట్టి పవిత్ర గ్రంథములను పారాయణము చేయుచుంటివిగదా? నీ మనస్సు నిర్మలము కాకుండెను. ఇంద్రియములవశము జేసికొనజాలవైతివి? నీ విట్టి స్వల్ప విషయములకు విముఖుడవుగ నుండవలయును. ఈ పుస్తకముపైన నీకింత లోలుపత్వమేల? వాస్తవముగ రామదాసికి దేనియెడ మమత తగదు. ఎల్లరయెడ సమత కలుగువలయును. ఒక బాలుడగు శ్యామాతో నొక చిన్న పుస్తకము కొఱకై తగవులాడుచున్నాడవు. పొమ్ము! నీ స్థానమున నీవు కూరుచుండుము! ధనము వెచ్చించిన పుస్తకములు కోకొల్లలుగ దొఱకును. కాని మిత్రులు దొరకరు. లెస్సగ ఆలోచించుకొని సమాధాన పడుము! నీ పుస్తకము విలువయెంత? శ్యామాకు దానితో నెట్టి సంబంధము లేదు. నేనే స్వయముగ ఆ గ్రంథమును తెచ్చి శ్యామాకు బహూకరించితిని. నీవా గ్రంథమును కంఠస్థము చేసికొంటివి. శ్యామా దానిని పఠించి బాగుపడగలఁడని నేనే యిచ్చితిని" అని సాయీ ప్రభువు పలికెను.

బాబా పలుకులెంత మృదుమధురములు, అమృతోపమాన ములో గమనింపుడు! వాని ఫల మమోఘము. రామదాసి శాంతించెను. శ్యామా దగ్గఱగల 'పాంచరాత్రగీత' అను పుస్తకమును గ్రంథమునకు బదులుగ నిమ్మని కోర, ఒకటికాదు పది ప్రతులు నిచ్చెదని శ్యామా పలికెను. ఈ సంఘటనమటు రామదాసి ప్రవర్తనమును చక్కదిద్దుటకు, విష్ణు సహస్రనామము యొక్క మహత్త్వమును శ్యామాకు ఈ రూపమున బోధించుటకు బాబా కల్పించిన ఒక అద్భుత లీలగా పాఠకులు గ్రహింతురుగాక! సర్వజ్ఞుడు. సర్వనియంత, సర్వసమర్థుడగు శ్రీసాయీ ప్రభువు తనవారెవరిని ఏ రూపమున జక్క దిద్దవలయునో ఆ తండ్రికే యెఱుక. తన ఆశ్రితులను చిత్రవిచిత్రసంఘటనల గల్పించి బాబా చక్కపఱచినాడు, చక్కబఱచుచున్నాడు. మానవ సమాజమునందే కాక సకల భూతములయెడను సహన ప్రేమలు వహింపఁదగునని తన వారికీ విధముగ దెలిపినాడు,

"ఏదొక ఋణసంబంధము లేనిదే యే జీవియు మన దాపునకుఁ జేరదు. మానవుఁడుగాని యే జీవియేని నీ దగ్గఱకుఁజేరిన అమర్యాదతో తఱిమివేయకుము. తగిన విధమున నాదరింపుము. దప్పికఁ గొనినవానికి చల్లని మంచినీరము, ఆకలి నొందినవానికి పట్టెడన్నము, వస్త్రవిహీనునకు వస్త్రము నొసగి, మార్గాయాసమున డస్సినవారికిఁ గూర్చుండి విశ్రమించుట కింటి పంచ, యరుగుఁజూపి, ఆదరింతువేని భగవానుఁడు మిక్కిలి సంతోషించును. ఎవరేని యాచకులు నీవలన ధన మపేక్షింతురేని నీ కిచ్చుటకు శక్తి సంకల్పములు కలిగెనా యిమ్ము, లేదా, ఈయకుము. అంతియేకాని అట్టి యాచకుల విచ్చు గాంద్రపైన ఆగ్రహించి నిరసింపకుము. నీకు విరుద్ధముగ నెవరెన్ని మాటలాడినను నీవు కటువుగ మాఱుమాటాడకుము. అట్టి సందర్భముల నీవు ఓర్పు వహింప నేర్చుదువేని సత్యముగ సుఖశాంతులు బడయఁగలవు. ఈ ప్రపంచమంతయుఁ దలక్రిందులగుచున్నను నీ స్థానమునుండి నీవు చలింపఁజూడక నీయెదుట గోచరించు అట్టి దృశ్యమంతయు ప్రశాంత మనస్సుతో చూచు చుండుము. నిన్ను నన్ను వేర్పఱచు ఈ భేదభావమను (గోడను) కూల్చి వేయుము.

అప్పుడు మన మొండురులము సమీపించుటకు మార్గము విస్పష్ట ముగ గోచరించును. 'నేను' — 'నీవు' —అను ఈ భేదబుద్ధియే స్వామి నుండి సేవకుని వేర్పఱచు అడ్డుగోడ. దానిని తొలఁగఁజేసినగాని తత్పరిహారము ఐక్యత లభ్యము కాదు. 'అల్లా మాలిక్' — భగవానుడే సర్వస్వామి - మన రక్షకుఁడు. మఱెవ్వరును కారు. ఆ ప్రభువు కావించు పనులసామాన్యములు. అమూల్యములు. అనూహ్యములు. ఆ తండ్రి యిచ్ఛప్రకారము సకలము జరుగును. ఆ విభుఁడే మనకు మార్గముఁజూపి, మన హృదయ కామితములఁగూర్చి సంతృప్తి పఱచును. మన పూర్వ ఋణానుబంధముననే మన మిచటఁ జేరి కలిసినాము. మన మొండొరులను ప్రేమించుకొనుచు సేవించుచు సుఖానందములు బడయుదము. జీవితమున గమ్యస్థానముఁ జేరుకొనఁ జాలినవాఁడు సంతృప్తి సంతుష్టులఁ బడసి 'యమృతు'ఁ డగును. తక్కిన జీవులు బ్రతికియుండి యూపిరి పీల్చునవియే" అని బాబా మనకు బోధించినాఁడు.

శ్రీ సాయీప్రభువు సర్వసద్గుణముల అగారము. బాల్యము నుండి గురుదైవమును ప్రేమించుటతప్ప మఱియొండెఱుఁగఁడు. తానాచరించినవే తనవారికి బోధించినాఁడు. బాబా ప్రేమ దేశకాల కారణబద్ధముకానిది. అది యిది యననేల? - తుదకు ప్రాణముల నేనియు త్యాగముఁజేయఁజాలినది యా ప్రేమ. కృతజ్ఞత, సేవ, సమత, ఋజుత్వము, సహనము, మొదలగు విశిష్ట గుణములు బాబాయందు మూర్తీభవించినవి. ఇవన్నియు ఆ ప్రేమతత్త్వమే ఆలవాలముగ గలవి. శ్రీ సాయీ ప్రభువునుగూర్చి ముఖ్యముగ గుర్తింపఁదగినది. యిదియే. ఇదీ క్రమక్రమముగ ఆశ్రితునకు గురుసామ్యము సమకూర్చును.

శ్రీసాయీనాథునందు మనస్సు లగ్నముచేసి ధ్యానించుట వలన ఆత్మసామ్యమును ప్రసాదించి 'తుకారాం పలికినట్లు 'అపనా సరికా కరితత్కాల్' గురువు శిష్యుని తనయంతవానిఁ గావించును. నైతిక ఆధ్యాత్మిక పరిపూర్ణతఁ గల్పించి సకలసిద్ధి ప్రపూర్ణునిఁ గావించును.

ప్రార్థన :

తలఁపుల్ పల్కులుఁ జెయ్వులన్ వివిధ భూత శ్రేణి కే మాత్రమేన్
గలతన్ గూర్పఁగఁబోని మార్గమునఁ జాగన్జేసి, యీ యెల్ల జీ
వులు నీవే యను బుద్ధిగూర్చి, యనయంబున్ సాత్విక త్యాగసే
వల నీ ప్రేమ గడించు భాగ్యమిడు: దేవా! సాయినాథ ప్రభూ!

6. ఆపదలు - వానివలన లాభములు

విపదస్సంతునః శశ్వత్తత్రతత్ర జగద్గురో!
భవతోదర్శనం యస్యా దపున ర్భవ దర్శనమ్.

(భాగ. 1-8-2)

"ఓ జగద్గురూ! శ్రీకృష్ణా! మా కప్పుడప్పుడు తెన్నగ కష్టములు కలుగునుగాక! అట్టి ఆపదల పాల్పడిన మేము గత్యంతరము లేక నిన్ను ధ్యానింతుము. నీవు కనికరించి మాకు నీ దర్శనభాగ్యముఁ బ్రసాదించు చుందువు. నిన్ను చూడఁగలిగితిమా తిరిగి పుట్టువును చూడఁబోము." — అని కుంతీదేవి పలికిన పలుకులు. "అత్తా! నీకేమి కావలయునో కోరుకొనుము!' అనిన శ్రీకృష్ణునితో కుంతీదేవి విన్నవించు కొనిన కోరిక యిది.

అప్పుడప్పుడు ఆపదలు బాధలు కలుగుట మన మేలునకే. ఏలన - అవి మనుష్యుని అంతర్ముఖునిఁ గావించును. కష్టముల పాల్పడినవాఁడు తననొక ప్రవాసితుఁనిఁగ భావించును. ప్రాపంచిక వస్తువులపై విశ్వాసము వహించుటవలన ప్రయోజనము లేదని గుర్తించును.

తఱచుగ మనతో ప్రతిఘటనలు మనకు కలుగుటయు మేలే. అవి మనము తెలిసికొనఁబోని, తెలిసికొనఁజాలని, మనలోని దోషములను, అహంకారదర్పములను శమింపఁజేయును. అడకువను వృద్ధినయించును.

వ్యర్థములగు కోరికల పాల్పడనీయదు. ఇతరులు మనల ప్రతిఘటించునపుడు మన మనన్యశరణులమై దైవమువైపునకే దృష్టి మరల్చి, ఆ దైవకృప కొఱకే నిరీక్షింతుము. కావున మనుష్యులవలన సుఖానందముల నపేక్షింపక, బుద్ధిమంతుఁడగువాఁడు సంపూర్ణముగ భగవానునిపైననే ఆధారపడి విశ్వసించియుండవలయును.

మనుష్యుడు బాధింపబడి చెడు మార్గమునకుఁ బ్రేరేపింపబడి, కష్టములచే కలతపెట్టఁబడినపుడు దైవానుగ్రహముయొక్క ప్రాధాన్యతను గుర్తించును. ఆ మహాప్రభువుయొక్క కృపలేనిదే తానేమియుఁ జేయసమర్థుఁడు కాఁడని తెలిసికొనును. సంకటపరిస్థితులాపాదించి బాధపడునతఁడు విచారపడును. విలపించును. భగవానుని ప్రార్థించును. వానికీ ప్రాపంచక జీవితముపైవిసుగు జనించును. ఎపుడు మృత్యువాసన్నమగునా, ఎపుడు పంచత్వమొంది, ఆ జగత్ప్రభువును జేరుకొందునా యని వాఁడు నిరీక్షించుచుండును. పూర్ణ శాంతి శ్రేయములీ ప్రపంచమున లేవు. అను సత్య విషయమతఁడనుభవరూపమున గ్రహించును.

ఇఁక శ్రీసాయీ ప్రభువును ఆశ్రయించినవారిలో నూటికి తొంబది తొమ్మిదిమంది కష్టములు, బాధలు కారణములుగా నాశ్రయించినవారే. అదియు ఆ మహాప్రభువు లీల. ఎవరిని అనుగ్రహింపఁ దలచునో వారికేదొక సంకటముఁగూర్చి తన చక్కికి నాకర్షించును. ప్రతి జీవియుకష్ట నివృత్తి, అభీష్టసిద్ధినే కోరుచుండును. దానికొఱకే ప్రయత్నించుచుండును. అటుల ప్రయత్నము చేయుటలో పురాకృత సుకృత విశేషముగల జీవి భగవానుని తదభిన్నులగు అవతారుల సాధుసత్పురుషుల సమాశ్రయించును. అట్టి ఆశ్రయము దొఱకుటయు భగవత్కృపయే. కష్టములు బాధలు కారణముగ బాబాను సమాశ్రయించినవారిలో ముప్పురను ఉదాహరణముగ తీసికొని వారెట్లుద్ధరింపబడినది గ్రహింతము.

1. డాక్టరు సి. పిళ్లై.

డాక్టరు సి. పిళ్ళే బాబా ఆశ్రితులలో నొకడు. అతడు నారకురుపుచే మిక్కిలి బాధపడుచుండెను. శిర్డియందుండగా హా. సీ. దీక్షిత్తుతో నతడిట్లనెను. "కాకాసాహేబ్! నాకీ కురుపుబాధ మిక్కుట ముగ నున్నది. ఇది పూర్వకర్మ ఫలమనుట సత్యము. ఈ బాధ నింతట దొలగించి, ఆ కర్మఫలము మఱి పది జన్మలలో ననుభవించు నట్లు చేయమని బాబాతో విన్నవింపుము. నా కిపుడు మరణమే మేలనిపించు చున్నది" - అని చెప్పుకొనెను.

దీక్షిత్ ఆ విషయము బాబాకు విన్నవించెను. అంతట బాబా "భయపడవలదని చెప్పుము. పది జన్మము లేల? పది దినములలో ఆ బాధ తొలగిపోవును. ఆశ్రితులకు ఆధ్యాత్మిక లౌకిక శ్రేయములను గూర్చుటకే సాధువు లవతరించుచుందురు. 'పిళ్లై'కు మాత్రము మర ణము కావలయునా? అతని నిటుగొని రమ్ము" - అని పిలువ నంపి, అతడు జేరిన తరువాత బాబా తన దిండు నాతనికిచ్చి దానిపై ఆనుకొని పరుండుము. కాళ్ళు చాపుము. విశ్రాంతి తీసికొనుము" అనెను. అతడు విశ్రమించిన పిదప బాబా అతని కిట్లు బోధించెను.

వాస్తవముగ ననుభవింపకయే కర్మము విరగడ కాదు. అది సత్యము. సుఖదుఃఖములకు కర్మమే కారణము. నీకేది యెటుల ప్రాప్తించుచున్నను సహింపుము. అల్లా మాలిక్! దైవము సర్వనియంత, రక్షకుడు. ఎల్లపుడా ప్రభువునే తలంపుము. ఆతడెల్లరను కాపాడును. ఆ స్వామికి సంపూర్ణ శరణాగతిచేయుము. ఆ ప్రభువును గూర్చియే తలంచుము. ఆ స్వామి యేది యెట్లు కావించునో తెలిసికొనగలవు" అని బాబా బోధించెను.

అంతట నా. గో. చందోర్కరు ఆ గాయముపై కట్టు కట్టగా, బాబా "దానిని తీసివేయుము. అది నీకు ప్రాణాపాయము. ఇపుడొక కాకి వచ్చి నీ గాయమును పొడుచును. అది నీకు క్షేమము కలిగించును" అనెను. మఱునాడు 'అబ్దుల్' క్రింద మెట్లు దిగుచు, చూడక తన

పాదమును పిళ్ళె కురుపుపై నిలిపెను. వాచిన ఆ పుండు త్రొక్క బడెను. అందలి చీము, పురుగులు వెలుపలకు త్రోయఁబడెను. డాక్టరు పిళ్ళె పెద్దబాధతో పెద్దపెట్టున కేక పెట్టెను.

తరువాత పిళ్ళె, "బాబా! ఇఁకమీద కాకివచ్చి నా పుండు పొడుచునా?" యని యడుగ "రాదు. ఆ కాకి (అబ్దుల్) వచ్చినది. ఆ పుండున గల పురుగులు వెలార్చబడినవి. పొమ్ము. వాడలో విశ్రమింపు" మని బాబా పలికి ఊదిని ప్రసాదించెను. ఊదిని లోపలకుఁ గొనుచు పుండుపై అలదుటచేత ఏ ఇతర ఔషధములతో నిమిత్తము లేకయే పది దినములలో ఆ నారకురుపు పూర్తిగ నివారణమయ్యెను.

2. భీమాజీపటేల్

పూనాజిల్లా జన్నేరు గ్రామమున భీమాజీపటేల్ విడువని జ్వరము, నెత్తురుకళ్ళె, జీర్ణాశయ బాధతోఁగూడిన క్షయరోగి. కావించిన చికిత్సలన్నియు వ్యర్థములు కాగా, నా. గో. చందోర్కరు ఆదేశమున నతడు శిర్డికి వెళ్ళెను. టాంగాపొదనుండి భీమాజీని నలుగురు పట్టుకొని దింపిరి. శ్యామా అతనిని బాబా దగ్గఱకుఁ జేర్చెను.

"శ్యామా! ఈ దొంగను నా దగ్గరకుఁ గొనివచ్చి ఎంత బాధ్యతా రూపమగు బరువు నాపై నిలుపుచున్నాడవు!" అని బాబా పలుక భీమాజీ తన తలను బాబా పాదముల మోపి, "ఓ దీనబంధూ! నేను దీనుఁడను. నాపై జాలివహించి అనుగ్రహింపఁ బ్రార్థించుచున్నాడను" అని ఏడ్చెను.

అంతట బాబా తన వైఖరిని మార్చి, చిరునగవుతోడ నతనితో "నీవు శిర్డిని మెట్టినతోడనే నీ పూర్వకర్మఫలానుభవములు తీరినవి. అతి కఠిన కష్టములచే కృశించి కృంగిన జనులు ఈ మసీదు నందలి మెట్లెక్కినతోడనే ఉద్ధరింపఁబడి సుఖానందములు పడయుదురు. ఆ ఫకీరు (దైవము) మిక్కిలి దయామయుఁడు. నీ వ్యాధిని నిర్మూలించును. తన ప్రేమను ప్రదర్శించును. సకల జీవులయెడ దయగలవాఁడు. పొమ్ము. భీమాబాయి యింట నుండుము. అని పలికి,

ఊధి నతని నుదుట నలది, తన వరదాభయ హస్తమతని మస్తముపైఁ జేర్చి అనుగ్రహించెను. ఆ పటేల్ ఎవరి సహాయము లేకయే తన బండి దగ్గరకు నడిచి వెళ్ళెను. భీమాబాయి యింట నుండెను.

బాబా ఏ ఔషధము తీయలేదు. అన్నిటికంటె బలీయము సమర్థమైన దానినే ప్రసాదించెను. భీమాజీ రెండు కలలు కనెను. మొదటి స్వప్నము నందతఁడొక బాలుఁడుగ నుండెను. గురువతనికి పాఠములను బోధించుచు బెత్తముతో నతి కఠినమైన దెబ్బలు కొట్టెను. అతఁడా నిద్రలో పెద్దపెట్టున అఱచుచు నేడ్చెను. రెండవ కలలో నెవరో అతని ఱొమ్ముపై కెక్కి దానిపై పెద్ద రుబ్బుడు బండను అటు నిటు పొరలించినట్లుకనెను. ప్రాణములు పోయినంత బాధ అతనికిఁ దోచెను. అంతట నతఁడు మేల్కొనెను. ఈ రెండు స్వప్నములతో నతని జాడ్యము నిర్మూలమయ్యెను, అతఁడు మెల్లగ మసీదునకు వెళ్ళి బాబా పాదములకు మ్రొక్కెను. ఒక నెల బాబాదగ్గఱ గడిపి సంపూర్ణా రోగ్యము పడసి స్వస్థలముఁజేరుకొనెను.

## 8. జి. యస్. కపర్దే

జి. యస్. కపర్దే - మధ్యప్రదేశ్‌లోని అమ్రోట్ నగరమున న్యాయవాది. ఇతఁడు రాజకీయ కారణములవలన, ప్రభుత్వమువారు తనను బంధించి చెరసాలలో నుంచుదురని, ద్వీపాంతరవాస శిక్ష విధింతురని భయమున, తనకు ప్రశాంతి క్షేమముల గూర్పఁగల స్థానము శ్రీ సాయీ ప్రభువు పాదకమలములే యని 1910 డిసెంబరులో బాబాను సమాశ్రయించెను.

సాయిబాబా "ఇది నీ గృహము. నేనిచటనుండ నెవరు నే విషయమునుగూర్చి భయపడవలసిన పనిలేదు" అని కపర్దేకు అభయ మిచ్చెను.

ఈ విశ్వమున నెచటేమి జరుగుచున్నదో సకలము నెఱుగఁ జాలి, తన బిడ్డలను సకల బాధలనుండి రక్షింపఁ జాలినవాఁడు సాయీ ప్రభు వొక్కఁడే యనియు, సకలముఁ దనయధీనము నందుంచుకొని

తన యిచ్ఛ చొప్పున ప్రవర్తింపజేయగల సమర్థుడని, బాబా సమక్షమున సకల భద్రములుగలుగునని కపర్దే తెలిసికొనినాడు. అమ్రోట్ నుండి పుత్రులు, బంధుమిత్రులు ఎందఱు వచ్చి కపర్దేను తిరిగి యింటికిఁ దీసికొని పోవ ప్రయత్నించినను ప్రభుత్వమువారి వలన ఆపదలు తొలగు నంతవరకు బాబా, కపర్దేను శిర్డి విడిచి వెళ్ళనీయ లేదు. మూడున్నర నెలలు శిర్డియందు కపర్దేను నిలుపుటయే బాబా కావించిన రక్షణక్రియ. ఆధ్యాత్మిక సంపదల జోడింపక లౌకిక సంపదలను సాయీప్రభు వెప్పుడు ప్రసాదింపఁడు. కాని ఆయా జీవుల సంస్కారముల ననుసరించి ఎంతవరకు ఆధ్యాత్మిక పథమున పురోగమింపఁ గలరో అంతవరకే గమింతురు. బాబా కావించు ప్రతి లీలయందు అంతో యింతో ఆధ్యాత్మిక ప్రబోధము, తన గురుదైవమునందు విశ్వాసము, వివిధవిషమ పరిస్థితుల నెదుర్కొనుటకు ధైర్యముతో గూడిన ఓర్పు (నిష్ఠ-సబూరి) ఈరెంటును మిళితములై యుండును.

బాబా ఒక సమయమున కపర్దేను జూచి, 'కా సర్కార్!' - అని సంబోధించుచు "అల్లా రఖేగా - వైసా రహేనా'' దైవము మనల నెట్లు నడువపమచునో, అటుల మనము నడువ నేర్వవలయును. అని ఒక కథ తెలిపెను. సకల సంపత్సమృద్ధి గలిగిన ధనికుఁడొకఁడు కొన్ని కష్టకారణములవలన సాయంత్రమువరకు పస్తుపడియుండి తానే వంటఁజేసికొని చప్పిడి మెతుకులు తిని పడియుండిన వృత్తాంతము. సర్కార్! అని సంబోధించుటలో అమ్రోటియందు కపర్దేకు సకల రాజభోగములు పొందుటకు వసతులున్నను కారణాంతరములచేత, తన క్షేమము కొఱకే శిర్డియందు కష్టసహనముగలిగి యుండుమని బాబా కావించిన బోధ అది.

బాబా చెరసాలనుండి కపర్దేను తప్పించుటయేకాక వైరాగ్యమతని హృదయమున పాదుకొలుపఁ జూచెను. కపర్దే ప్రసిద్ధ న్యాయవాది యయ్యును, మరాటి సంస్కృతభాషలందు సంపూర్ణ పాండిత్యము గడించి పంచదశి మొదలగు వేదాంత గ్రంథముల భాష్యప్రవచనము చేయగల ఆధ్యాత్మిక విద్యాప్రపూర్ణుడు. ఉపాసనీమహారాజంతటి

వాఁడు కపర్దేను గూర్చి తన గురువని పూజ్యశ్రీ నరసింహస్వామిగారితో చెప్పినాఁడు. ఇంత విద్యాప్రపూర్ణుఁడయ్యును లోకవాసన, ధనము, పదవులు, కీర్తి మొదలగువాని యందాసక్తి యాతని హృదయమున పాదుకొనినవి.

కపర్దే శిర్డియందున్న కాలమున బాబా అప్పుడప్పుడు తన యోగదృష్టిని ప్రసరించువాఁడు. ఆ దివ్యదృష్టి ప్రభావమున కపర్దే కొన్ని గంటలవరకు సచ్చిదానంద సాగరమున నోలలాడు చుండుఁవాడు. ప్రాపంచక విషయ విముఖునిఁ గావించి, హృదయమున వైరాగ్యము పాదుకొల్పి, అతని నంతర్ముఖునిఁ గావించుటకే బాబా తన యోగ దృష్టి పఱపినాఁడు. కాని అతని మనస్సు లోకవాసనల విడనాడజాల కుండెను. లౌకికాభ్యున్నతియే కపర్దే దృష్టియందు ప్రాధాన్యత వహించినది.

"సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కింకరిష్యతి"

జ్ఞానియు నిజ ప్రకృతికి సమానముగను
విషయములఁ బ్రవర్తించును; పృథివిభూత
సంచయము ప్రకృతి ననుసరించుఁగాన
నిగ్రహంబేమి యొనరింప నేర్చునందు?

(భగవద్గీతామృతము - 3-33)

కపర్దే యెంతలెంతలు లౌకిక కాంక్షలు గలిగిన వాఁడైనను బాబా ఆశ్రయము, 95 దినములు బాబా సన్నిధిఁ గడిపినది వ్యర్థ మెన్నటికినిగాదు. ఈ జన్మమునఁ గాకున్న మఱు జన్మమునైన సంపూర్ణ సిద్ధిని ప్రసాదింప దక్షమైనదని మనము గ్రహింపఁదగును.

7. ప్రాకృతాకర్షణలు - ప్రతిఘటనము

(మనోవికారమూలములగు ఎరలను ప్రతిఘటించుట)

"డంభాభిమాన లోభైః కామక్రోధోరు మత్సరైశ్చేతః
అకృష్యతే సమంతాత్ శ్వభిరివపతితాస్థివన్మార్గే"

త్రోవఁబడినయెముక తునకను శునకబృం
దంబు పగిది, మతిని, ధంభమత్స
రాభిమాన కామలోభ దోషంబులు
నట్టులిట్టు లాగి పట్టివేఁచు.

(ప్రబోధసుధాకము)

ఈ ప్రపంచమున జీవించి యున్నంత కాలము కష్టముల నుండి, ప్రాకృతాకర్షణలనుండి తప్పుకొనలేము. క్షితిపై మానవుని జీవితము ప్రకృతి ప్రేరితమనియు, ప్రబోధ పరంపరలతోఁ గూడిన దనియు శాస్త్రములు తెలుపుచున్నవి. మానవుఁడు ఆకర్షణభూతమును జాగ్రత్తగ గమనించు చుండనగును. దైవప్రార్థన మేమఱక వీని నొక కంటఁ గనిపెట్టి యుండవలయును. ఈ ఆకర్షణభూతమునకు నిద్ర - విశ్రాంతి - లేదు. ఎవరిని వంచించి గ్రసింతుమా అనియే ఇది వెదకు చుండును, ఈ ఆకర్షణభూతమున కెప్పుడో ఒకప్పుడు వశుఁడుకాని వాఁడు - నేను పవిత్రుఁడను - నిర్లిప్తుడను - అని చెప్పుకొనఁ జాలిన వాఁడు బ్రహ్మజ్ఞుఁడు తప్ప మఱెవరును లేరు.

ఈ ప్రాపంచకాకర్షణ లొకవిధముగ మిక్కిలి మేలు కూర్చు నవియగుచున్నవి. కష్టములు దుఃఖములు కలిగించునవియైనను, కాలక్రమమున నరులకడఁకువ కలిగించి నిర్మలులఁగావించి చక్కని ప్రబోధఁ గలిగించు చున్నవి. వీనికి లోగినవానికి వానిద్వారా ఇతరులకు ప్రబోధ గల్పించుచున్నవి. పరమ సాధువులైనవారు సైతము ఎప్పుడో యొకప్పుడు ఏ జన్మమునందైన యీ ఆకర్షణల పాల్పడి కష్టముఁ బొంది,

ఆ యా యనుభూతులవలన దైవసత్పురుషుల కరుణావిశేషమున ఉజ్జీవితులై కృతార్థులైనవారే.

ఈ మనోవికారములఁగూర్చు ఎరలకు గురియైనవారు పతితులు గాక తప్పదు. ఈ ఆకర్షణలకు కష్టములేని పవిత్రస్థానము గాని, అట్టి పవిత్రకాలము, స్థితిగాని లేదనియే చెప్పఁదగును, జన్మమొందినతోడనే ఈ ఆకర్షణబీజ మంకురించి క్రమముగ ఆకుతొడిగి, పెరిగి పెద్దదై వ్రేళ్లు పాదుకొనినది. పుట్టినది మొదలు ఇది జీవిని దుష్కృతులకు మ్రొగ్గజేయును. మనము సహజానందస్థితినుండి కూలినవార మగుటచే ఒక కష్టము తొలగినదియని యనుకొనిన తోడనే మఱియొక కష్టము దాపరించును. ఎప్పుడు నేదొక బాధ యుండనే యుండును. వీని కంతము లేదు. ఈ ఎరలనుండి కొందఱు పాఱిపోవ యత్నించి, యధికములగు వ్యసనములఁ బాల్పడు చుందురు. ఒక బంధమును తప్పించుకొనుటకై చేయు ప్రయత్నమున మఱి నాలుగు బంధములను గూర్చుకొనుచుందురు. పాఱిపోవుటచే వీనిని నరుఁడు జయింపజాలడు. ఓర్పు, నిక్కమగు అడకువ గలిగిననే యీ ఆకర్షణ శత్రువులనుండి తప్పుకొనగలఁడు.

ఇట్టి ఆకర్షణను పైపైన త్రోసివేయఁ జూచుచు ఉన్మూలింప జాలనివాఁడు ఎట్టి ఫలమును బడయలేఁడు. ఆ యెరలు వెంటనే వాని యెదుటఁ బొడమును. మునుపటికంటె నధికములగు బాధల కతఁడు లోనగును. మన తొందఱపాటు మన బలము వినియోగించుట వలన గాక దైవసహాయమును విశ్వసించి, దైవకరుణనే ఊతగాఁగొని, ధైర్యముతో గూడిన ఓర్పు వహించి, శ్రమల సైచి, మెల్లమెల్లగా నీ మనోవికార హేతువులగు శత్రువులను ఎరలను జయింపవలయును.

సాధుసత్పురుషుల సమాశ్రయించి, వారి బోధనలను పాటించి యనుసరింపదగును. ఇట్టి ఎరలకు లోనగువారియెడ కఠినముగ ప్రవర్తింపరాదు. నరుఁడు తన స్వవిషయమున నెట్లుకోరునో అటుల ఈ యెరల పాల్పడి క్రుంగి కృశించువారియెడ జాలివహించి, ఊరట, నొసఁగజూడవలయును. ఎరలకు లోనగుటకు ప్రథమ కార

ణము మనశ్చాంచల్యమే. దైవమునందు, తదభిన్నులగు సాధు సత్పురుషులందుఁ దగిన విశ్వాసము లేకపోవుటయే.

ఇంద్రియాణాంహి చరతాం యన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి.

ఇంద్రియంబుల వెంబడి నేరి చిత్త
మనుసరించుచునుండు నా మనుజు మనసు
వారినిధి నోడగొనిపోవు వాయువటుల
ప్రజ్ఞనంతయు హరియించుఁ బాండుతనయ!

(భగవద్గీతామృతము - 2-67)

చుక్కానిలేని యోడవలె, ఇంద్రియముల కధీనమైన మనస్సు కలవాఁడు, గాలిచే నిటునిటు నీడ్వఁబడు ఓడవలె జీవితమున బహు విధముల నాకర్షింపఁబడును. అగ్ని ఇనుమును శుద్ధిచేయునటుల ఆకర్షణలు నైతికపరుని పరిశోధించును. మన మే పరిస్థితిలో నెట్లు ప్రవర్తింపదగునో యెఱుగఁజాలము. ఈ ఆకర్షణలు మనమెట్టివారమో స్పష్టముగ నిరూపించును. ప్రప్రథమమున మనము తగు జాగ్రత వహింపవలయును, ఈ చెడు తలంపులు మన హృదయ కవాటమును తట్టునపుడే వానిని తరిమివేయవలయును. తలుపు తెఱచి వానిని లోనికి ప్రవేశింప నిచ్చితిమా తిరిగి వెలార్చుట మిక్కిలి కష్టము.

తొలుత విషయ చింతనము, పిదప దానియందాసక్తి, దానినిఁబడయ (కామము) కోరిక, అది లభింపకున్న క్రోధము. ఈ విధముగ విషయ చింతనము సమ్మోహ స్మృతి భ్రంశ, బుద్ధినాశ సర్వనాశనములను గూర్చును. నరులు వారివారి బుద్ధిసంస్కారములు, పూర్వకర్మములు, దైవేచ్ఛల ననుసరించి అధికముగనో, అల్పముగనో యీ యెరలకుఁ బాల్పడుచుందురు. ఏ కారణముచేతనైననేమి యీ

యెరలకు లోగిన మనము నిస్పృహచెందక, దైవకృపను కాంక్షించి, ఆ ప్రభువునే ప్రార్థింప వలయును. ఆశ్రితులకు కష్టముల నెదుర్కొనగల సహనబుద్ధిని ప్రసాదించి తన భక్తుల కేడుగడయై సర్వదా సర్వథా అభయ హస్తమును, చేయూత నిడుటకే సర్వేశ్వరుఁడు సాధుసత్పురుష, సమర్థ సద్గురు రూపమున నెప్పటికప్పుడు అవతరించుచుండును.

కావున మన దైన్యమును దెలుపుకొనుచు భగవదవతారమూర్తి యగు సమర్థసద్గురు దేవుని అభయహస్తము నీడన అడఁగి మడఁగి యుండనేర్వవలయును. ఆ యవతారమూర్తి సద్గురువు అకించనులు, విధేయులగు ఆశ్రితుల నెల్లవేళల వేయికనుల గనిపెట్టుచు, వారిని పెడమార్గములనుండి మరలించి, కనుతెఱపిగూర్చి, వారివారి సంకట పరిస్థితులనుండి రక్షించి, యిహపరసుఖశాంతులను ప్రసాదించుటకు సిద్ధముగనే యుండును. భగవానుని దయ అవతారపురుషుఁడగు సద్గురువు దయ, భాగవతుల దయ ఎప్పుడు గలదు. కాని (నరుని) వానిదయయే వానికి లేదు. తాను చక్కఁబడుట యెట్టులా? — యని యోచించుకొనడు. కష్టానుభవములవలన మానవుఁడెంత శ్రేయము పొందినది - విశదపఱుప ఆ స్వామి బహూకృతులు విశ్వవ్యాప్తమై ప్రకాశించుచునే యున్నవి. సుఖసంతోషము లనుభవించు వేళ మానవుఁడు భక్తి నిష్ఠల సత్ప్రవర్తనల ప్రదర్శించుటలో విశేషము లేదు. కష్టములందు నరుఁడెంతెంత మనోధైర్యము దైవభక్తి అచంచల విశ్వాసము ప్రదర్శింపఁ జాలునో అపుడే వాని ఆధిక్యత అంతంత ప్రకటమగును.

పైనఁ దెలుపఁబడిన ప్రాకృత ఆకర్షణలలో బలీయములైనవి "కాంతా - కాంచనములు". తక్కినవన్నియు ప్రత్యక్షముగనో పరోక్షముగనో వీనికి సంబంధించినవే యగుచున్నవి. శ్రీసాయీ ప్రభువు తన ఆశ్రితులను, భక్తులను, అంకితసంతతిలోని వారిని ఇట్టి ఎరల పాల్పడనీయక ప్రబోధ కల్పించి రక్షించిన విధానముల నొకటి రెండు ఉదాహరణముగ నిటఁ దెలిసికొందము.

1. నానాగోవింద చందోర్కర్.

*( Para 205 Charters & Sayings of Sai Baba*
శ్రీసాయీనాథ ప్రబోధామృతము)

నానా గోవింద్ చందోర్కర్ ద్వారకామాయి మసీదునందు బాబాచెంతఁ గూర్చుండెను. ఇరువురు ముస్లిం కాంతలు (గోషాస్త్రీలు) బాబాను సందర్శించుటకు వచ్చిరి. చందోర్కర్ లేచి, యావలకు వెళ్లఁ బ్రయత్నించెను. బాబా అతని వెళ్ళవలదని వారించెను. ఆ కాంతలు బాబాను సమీపించిరి. వారిలో వృద్ధవనిత ముసుగు తొల గించి బాబా దర్శనము చేసికొనెను. ఆ పిదప రెండవ యువతి ముసుగు తొలఁగించి బాబా పాదములకు మ్రొక్కి మరల ముసుగు కప్పుకొనెను. చందోర్కర్ ఆమె చక్కదనమునకు అబ్బురపడి "ఈ అసాధారణ సుందర ముఖము మఱియొకమాఱు చూడఁగలనా?" అని తనలోఁ దలంచెను. బాబా వెంటనే చందోర్కర్ తొడపై చేతితో చఱచెను.

సా. బా:- నానా! నేనెందుకు కొట్టితినో నీ వెఱుగుదువా?

నా. గో. చం:- సర్వజ్ఞుడైన నా గురుదేవునినుండి నేనేమి మఱుగు చేయగలను? బాబా! మీ సమక్షమున నుండగా అట్టి అల్ప బుద్ధి యెట్లు పొడముచున్నదో నే నెఱుఁగజాల కున్నాఁడను.

సా. బా:- నానా! నీవు కేవలము మానవమాత్రుడవు కాదా? దేహము కోరికలతో నిండినది. ఏదేని విషయము ఇంద్రియ గోచర మైన మాత్రమున ఆ కోరిక వెలికిఁ దోచును. కాని, చిత్రవిచిత్ర శోభితములు, సుందర బాహ్యాకారములు గల దేవాలయములీ ప్రపంచ మున అరుదా? మనమచటకు వెళ్ళునపుఁడు ఆ వెలుపలి రమ్యా లంకారములను జూచి ఆనందించుటా? లేక ఆ కోవెల యందున్న దైవమును దర్శించుటా? లోపలనున్న దైవమును దర్శించు నపుడు సౌందర్యమును పాటింతువా? లేక ఆ పరమాత్మస్వరూపమును లక్షిం

తువా? భగవాను డొక్క దేవళమునందే యున్నాడా? దేవాలయము నందున్నటుల ఈ ప్రపంచమున సకల వస్తువులందు దైవము లేడా? మన మెల్లవేళల గుర్తింప వలసినది ఆ వెలుపలకుఁ దోచు సురూప కురూపములుఁ గాదు. అందధివసించియున్న దైవమునే.

బాహ్య సౌందర్య రూపములఁ జూచుటయందు లోపమేమియు లేదు. కాని, అటులఁ జూచునపుడు అట్టి మనోహరమైన నివాసముఁ గల్పించుకొనఁజాలిన ఆ దైవమెంత శక్తిసంపన్నుడో, ఎంత నేర్పరియైన శిల్పియో మనమూహించుకొనవలయును. ఈ విషయము నీ మనస్సు నందెల్లవేళల నిలుపుకొనుము.

(పేరా 206) హరి వినాయక్ సాఠే:- ఈయన సెటిల్‌మెంట్ ఆఫీసరు. బాబాభక్తుఁడు. ఒకనాఁడు వేడుకకై మంచి నడవడిలేనిదియు బాబాభక్తురాలైన ఒకకాంతను జూడఁబోయెను. వెళ్ళుటకుముందు ఆ ఉదయమున సాఠే బాబాను సందర్శించినాఁడు.

సా, బా:- సాహెబ్! శాలకు వెళ్ళియుంటివా?

సాఠే:- ఏమి! బాబా! నన్ను బడికి పంపకయే డిప్యూటీ కలెక్టరును గావించితివా?

'శాల' అనుపదమునకు స్థానిక అర్థము అతఁడు గ్రహింప లేదని బాబా ఆ విషయమంతటితో నిలిపెను. తరువాత ఆ సాయంత్రము సాఠే 'శాల' అని అచట పిలువఁబడు ఆ చెడిప యింటికి వెళ్లెను. ఆమెతోడి సంభాషణలు క్రమముగ వ్యామోహావేశకరములై అతనికి పతనముగూర్చు స్థితికిఁ గొనివచ్చినవి. తటాలున వాకిలి తలుపు తెఱువఁబడెను. బాబా ఆ తలుపుదగ్గర నిలువఁబడి, "ఆహా! ఇంత దూరము నీ గురువుదగ్గఱకు వచ్చితివి. ఇపుడు నరకమునకు దిగు చుంటివా? ఏమి? ఎంత చక్కని ప్రవర్తనమున!" అను భావము ప్రకటనమగునట్లు ఏవియో సైగెలు చేసెను. అంతట బాబా అదృశ్యు డయ్యెను. ఈ విధముగ తన నియంతయైన బాబాచే అధమున సాఠే

రక్షింపఁబడెను. పాతే ఆ 'శాల' ను వెంటనే విడిచివెళ్ళెను. మరల ఆ చెడిపను చూడలేదు.

(548) దామోదర్ సావల్రాం రసానే - అధిక ధన సంపాదన కాంక్ష.

డి. యస్. రసానే, బొంబాయిలోని ఒక దలారి ద్వారా (ప్రత్తి) దూది చట్టావ్యాపార సంబంధమైన బేరము చేయనెంచెను. ఆ దలారి ఆ చట్టా వ్యాపారమున లక్షలకొలఁది లాభము కలుగునని రసానేకు ఆశ గొలిపెను. ఈ విషయమున బాబా సమ్మతిఁ దీసికొనుమని శిర్డిలోనున్న శ్యామాకు (మాధవరావు దేశపాండేకు) రసానే ఉత్తరము వ్రాసెను. శ్యామా ఆ ఉత్తరమును బాబా దగ్గఱకుఁ దీసికొని వెళ్ళి దానిని తెఱచి యతఁడు చదువు పూర్వమే,

సా. బా:- దామియా (రసానే) ఆకాశమునందుకొన జూచుచున్నాడు. దైవము ప్రసాదించినది నిలుపుకొని దానితో సంతృప్తి నొందుటలేదు. దామియా మతి భ్రమించుచున్నది. అతని ప్రస్తుత స్థితి యెట్టిలోటు లేనిదని వ్రాయుము. అతనికిపుఁడు గల సగము రొట్టె చాలును. లక్షలను గూర్చి ఆందోళనము జెందవలదని తెలుపుము.

అంతట దామియా ఆ చట్టాబేరము చేయవలయునని, అందు కలుగు లాభములో బాబాకు భాగమీయ వలయునను తలంపుతో స్వయముగ శిర్డికి వెళ్ళి, బాబాను సందర్శించి బాబా పాదము లొత్తుచుండెను.

సా. బా:— (బిగ్గరగ) దామియా! నేను దేనిలో లేను. అనగా, నే నీ సంసారమున (ప్రపంచమున) దేనితో సంబంధము (లాభములుపంచుకొనుట మొదలగువానితో సంబంధము) కల్పించుకొనను.

అంతటితో దామియా ఆ చట్టావ్యాపారము మానుకొనెను.

మరల కొంతకాలమునకు దామియాకొక తలంపు కలిగెను. ధాన్యము పెద్ద మొత్తములుగ కొని, నెలలు సంవత్సరములు నిలువ చేసి ధర హెచ్చినపిదప అమ్మవలయునను ఉద్దేశము కలిగెను. దామియా, బాబా దగ్గఱకు వెళ్ళి "ధాన్య వ్యాపారము చేయుదునా?"

సా. బా:— వలదు. నీవు 5 సేర్లు చొప్పునకొని 7 సేర్లు చొప్పున అమ్ముదువు.

కాని, కొన్ని వారములవరకు ధాన్యము ధర హెచ్చుచుండెను. బాబా భవిష్యత్సూచనలు అసత్యములా! - అను నట్లుండెను. ఒకటిరెండు నెలల పిదప శ్రావణమాసమున అంతట వర్షములు సమృద్ధిగ కురిసెను. ధాన్యము ధరలు తలవనితలంపుగ తగ్గుచు అటుల చాల కాలముండెను. ధాన్యము కొని నిలువచేసిన వర్తకులు మిక్కిలి నష్టముల పాలైరి. బాబా రసానేను అట్టి దుర్గతినుండి తప్పించినాఁడు.

ఈ విధముగ ప్రాపంచకాకర్షణలకు గురి కానీయక కష్టనష్టముల పాల్పడనీయక తనబిడ్డలను బాబా రక్షించిన వృత్తాంతము లనేకములు కలవు. మానవుఁడు తనకు శ్రేయమైనదేదియో నిర్ణయించుకొనఁజాలడు. దైవమునందు, ప్రత్యక్ష భగవానుఁడగు సమర్థ సద్గురువునందు సకలభారములను నిలిపి సంపూర్ణ శరణాగతిఁ జేసినవాని కష్టనివృత్తి, హితాభీష్టప్రాప్తి గూర్చుభారము ఆ గురుదైవమే వహించి తీరును. "మా ఉలీచే చిత్ - లేకురాచే హిత్" 'తల్లి జాగరూకతయే బిడ్డయొక్క క్షేమము.

"సుతరా మనన్య శరణాక్షీరాద్యాహార మంతరాయ ద్వత్
కేవల యా స్నేహదృశా కచ్ఛపతనయాః ప్రజీవంతి"

అన్య రక్ష లేశమైనను లేక, క్షీ
రాది భోజ్యవస్తు లందఁబోక
స్నేహదృష్టిమాత్ర జీవింపవే? కచ్ఛ ప
ప్రసవము - లటుల భక్తుఁడలరు.

మన గురుదైవమగు శ్రీసాయీ ప్రభువునకు సంపూర్ణ శరణాగతి చేసిన పిదప మన రక్షణభారమాతండ్రి వహించితీరును. బిడ్డ సంరక్షణ భారము తల్లిపైనుండును. గురుదైవమును గాఢముగ విశ్వసించి, తన విధులను శక్తివంచన లేని విధమున పాటించు భక్తుఁడేకారణముననేని పెడమార్గమున నాకర్షింపఁబడి పోవదలంచినను బాబా వానికేదొక ఆటంకము కల్పించి తన వానినిఁ బడనీయఁడు. చెడనీయఁడు.

"ఏ, కతముననేని నాపదల కందరు, కుందరు మత్పదాశ్రితుల్" అనిన బాబా అభయప్రదానమును సోదరీ సోదర భక్తులు గుర్తింతురుగాత! ఈ కారణముచేతనే బాబా సమర్థ సద్గురువైనాఁడు.

ప్రార్థన :

తలఁపుల్ పల్కులు చెయ్వులే యెడల వ్యర్థప్రాకృతాకర్షణా
వళికిన్ లోఁగఁగనీక, నీదు పద విశ్వాసంబు ధైర్యక్షమల్
కలకాలంబునుఁగూర్చి, భక్తజన రక్షాదక్షమౌ నీపదం
బుల సేవింపఁగ శక్తి నీయగదె! బాబా! సాయినాథప్రభూ!

8. పరాపవాదము - తొందరపాటు తగదు.

అనృతం పరాపవాదం రసనావదతి ప్రతిక్షణం తేన
పరహానిర్లబ్ధ: కా వ్యర్థం మనుజోఽతి పాపభాగ్భవతి.

అన్యదూషణంబు నన్నృత భాషణములఁ
బలుకుచుండు నాల్క ప్రతినిమేష
మేమి హానిపరున? కేలబ్ధి తనకగు?
వ్యర్థముగను నరుఁడు పాపమొందు.

(ప్రబోధ సుధాకరము)

ఎంత సేపటికి దృష్టి తనవైపునకు నరుడు మరలించుకొను చుండవలయును. ఇతర మానవులఁగూర్చి వారి పనులగూర్చి చర్చింపఁ దగదు. అటుల చర్చించుట నిర్ణయించుట వ్యర్థశ్రమమే యగును. తఱచుగ నట్టి ప్రవర్తనములందు పొఱపడుచునే యుందుము. నిష్కారణ ముగ నరుఁడు పాపభాజనుఁ డగును. తననుగూర్చి తన ప్రవర్తనముఁ గూర్చి చర్చించుకొని నిర్ణయించు కొనునేని అపుడు మానవుని శ్రమ ఫలవంతమగును.

మన ఊహల ననుసరించి వెలుపల వస్తువులనుగూర్చి నిర్ణ యించుకొనుచుందుము. స్వపరభేద బుద్ధులు, స్వార్థసహిత ప్రేమలు, సత్యనిర్ణయము చేయనీయక మనకు కలతఁ గలిగించు చుండును. మన దృష్టియందు భగవత్ప్రేమయే ప్రాధాన్యత వహించునేని, మన ప్రాకృత దృష్టికి విరుద్ధములుగ గోచరించు వానినిఁగూర్చి తలంచు కొని యింత సులువుగ బాధల పాల్పడము. తఱచుగ మనలో దాగి యున్నదో లేక వెలుపల మన దృష్టికి గోచరించునదియో యేదియో యొకటి మన మనస్సు నాకర్షించు చుండును.

సాధారణముగ మనుష్యులు తాము కావించు పనులను గోప్యము చేయఁజూతురు. అటుల చేయుచున్నారమని వారెఱుఁగరు. వారి తలంపుల ప్రకారము సకలము జరుగుచున్నంతవరకు ప్రశాంత ముగ నున్నట్లు వెలికిఁ బొడకట్టుదురు. కాని, ఆయా పనులు వారి తలంపులకు విరుద్ధములుగ పరిణమించిన, తారుమారైన ఎంతయు తబ్బిబ్బై బైటపడుదురు. విసుగొందుదురు. ఇట్టి తలంపుల నిర్ణయ ముల భేదములు మిత్రులవిషయమున సామాన్య జనుల విషయమున, మతములందు సాధకులగు భక్తులయందు స్పర్థల జనింపఁజేయును.

సనాతనాచారముల మాన్పుట కష్టసాధ్యము. ప్రతి మాన వుడు తాను జూడఁగలయంత దవ్వునకంటె ముందునకుఁ గొనిపోఁ బడఁడు. తన దృష్టి యెంతదనుక ప్రసరించునో యంతకంటె నొక యడుగేని ముందిడనేరఁడు. సర్వనియంతయైన దైవముయొక్క బల ముపై నాధారపడక తనశక్తి తన కృషిపై నాధారపడి యుండువాఁడు

జ్ఞానతేజమును బడయుటకు పెద్దకాలము పట్టును. మనము సంపూర్ణ శరణాగతి చేయుటయు దైవానుగ్రహమే. ఆ విధముగ దైవపరతంత్ర స్థితిఁబడయగలిగితిమేని సంకుచితములగు మానవబుద్ధిపరిమితుల నతిక్రమింపగలము.

ఈ విషయములగూర్చి శ్రీ సాయీ ప్రభువు తెలిపిన అంశముల గమనింపుడు. **(Charters & Sayings)** శ్రీ సాయీనాథ బోధామృతము: పేరా 152) ఇది పిదప కాలములుగ నేర్పడినవి. జనములితరులను ద్వేషించుచు నిందించు చుందురు. నాకు ప్రతీకారవాంఛ లేదు. అట్టి పలుకులను లవమేని వినఁగోరను. జనులు మఱిమఱి మూర్ఖులగుచున్నారు. వారెంతసేపటికి నెల్లెడ మలినము (చెడు) వైపునకే చూపు పఱపుచుందురు. కోరికలులేని ఫకీరులును అరుదుగనున్నారు. మంచిఫకీరును కనుగొనుట (దుర్లభము) కష్టము.

"(పేరా 153) నేను పెద్దకాలము యోజించుచు రేయింబవళ్ళు తలంచుచునేయున్నాను. అందఱు దొంగలే. కాని, వారితో మనము మెలగవలయును. అట్టివారిని చక్కదిద్దుటయో లేక తొలగించుటయో చేయుమని దైవమును రేయింబవళ్లు ప్రార్థించుచున్నాను. కాని దైవము జాగుచేయుచున్నాడు. నా ప్రార్థనము మన్నించి, యనుగ్రహించుటలేదు. నెల, రెండు నెలలు వేచి చూచెదను. కాని బ్రతికిన, మరణించిన నేను వారిని వీరినిఁ జేరి చెప్పను. ప్రార్థింపను. జనసామాన్యము సాధువర్తనులై దైవభక్తి సలుపరు. వారు స్థిరబుద్ధి లేనివారు. ఏ కొలదిమంది మిత్రులో చేరి, దైవమును గూర్చి భాషించుచు గూర్చుండి యోజింతురు."

9. త్యాగధార్మిక కృతులు.

చార చిహ్న హరిభక్తికే - ప్రకట దిఖాయీ దేత్
దయాధర్మ అధీనతా -పరదుఃఖకో హరివేత్.

ప్రాణులన్ దయయు ధర్మాచరణంబు
ప్రీణనోపకృతి, యింద్రియ నిగ్రహంబు
పఱఁగ నీ నాలుగ వసుమతియందు
హరిభక్త చిహ్నంబులై నెగడొందు.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

ప్రాపంచకార్థమునకుఁగాని, లేక యితర మానవ ప్రేమ కొఱకుఁగాని చెడ్డపని చేయరాదు. సహాయార్థియగువాని మేలుకొఱకు నిస్సంకోచముగ ఏ కాలమందైనను మంచిపని కావించి వానికి పురోభివృద్ధిఁ గూర్చుట శ్రేష్ఠము. అటుల కావింపఁబడు మంచిపని కర్తకు ఎప్పుడును శ్రేయము గూర్చి తీరును. "నహి కళ్యాణ కృత్కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి" నాయనా! మంచిపని చేయువాడెవ్వఁడును చెడడు - అనిన భగవద్వాక్యమును గమనింపఁదగును.

ధార్మికబుద్ధి త్యాగము లేక యే ప్రాకృత కర్మములు ఫలింపవు. ధార్మిక త్యాగ బుద్ధితో నే స్వల్పము కావించిన అది లోక దృష్టియందు తృణప్రాయమే కానిండు, అట్టి ధర్మకృతి పూర్ణఫలకారి యగు భగవానుఁడు "ఈ మానవుడెంత పని కావించినాడని విచారింపడు - ఎంత ప్రేమతో - నిస్వార్థ బుద్ధితో చేసినాఁడు?" అనియే పరీక్షించును. ఎంతలెంతలు త్యాగప్రేమలతో మానవుఁడు పనులఁ గావించునో అవియంతలంత లధికము లగుచుండును. ఎంత చక్కగ శ్రద్ధగఁ జేయునో అంత లంత లధికముచుండును. ఎంత చక్కగ శ్రద్ధగఁ జేయునో అంత అధికముగఁ జేసినవాడగును. తన ఇచ్ఛ ననుసరించి కాక జన సమాజముకొఱకు కావించువాడేఁ చక్కగఁ జేయుఁవాడు.

కొన్ని కొన్నియెడల మనము కావించు పని ధర్మము, త్యాగము, అని వెలికి గోచరించియు (ఇంద్రియతృప్తి రూపమగు) కామ్యకర్మమే యనిపించుకొనును. సహజ సంకల్పము బుద్ధి ప్రతిఫలాపేక్ష, స్వార్థ ప్రయోజనాసక్తి సర్వసాధారణముగ ఆయా పనులనంటు

కానిదే యుండును. యథార్థత్యాగి, ధార్మికదాత తన విషయమును గూర్చి యెందును గమనింపడు. సకల కర్మములందును ఆ దైవ ప్రభావమునకే ఆధిక్యతఁ గల్పింపజూచును. అంతయు ఆ దైవ ప్రభావ మహత్త్వముననే జరుగుచున్నట్లుగఁ బ్రకటింపజేయును. ఎవరి యెడ ఈసు వహింపఁడు. స్వకీయమగు ఘనత నెందును గనఁడు. తనలో దానుప్పొంగఁడు. దైవప్రీత్యర్థ మెల్లర సుఖమునే కోరుచుండును. ప్రపంచమున గల మంచి యంతయు నే మానవునకో చెందినదని గాక - భగవానునదే యని నిశ్చయించుకొనును. ఆ 'చెలమ' నుండియే యివి యన్నియు ప్రవహించు చున్నవని ఆ పరమాత్మ యందే సకల సాధువులు నిరంతరము సకల సుఖానందములనుభవించుచున్నారని వాఁడెఱుంగును. ఏ లవమేని సత్యదాతృత్వ బుద్ధి గలవాఁడీ ప్రపంచమునఁగల సకలమును - అనిత్యము - అసుఖము - అనియే తెలిసికొనును.

10. అన్యదోష సహనము.

తనయందు నితరులందుఁగల లోపములను సరిచేసికొనఁజాలనపుడు మానవుఁడు ఓర్పుతో సహించి దైవమునకే విడువవలయును. దైవము చక్కబఱచునంతదనుక ఓర్పుతో నుండవలయును. అట్టివన్నియు మన ఓర్పు - సహనశక్తి పరీక్షకుఁగా నుద్దేశింపబడినవిగ తలంచ వలయును. అటుల ఓర్పు వహించఁడేని మానవుడు కావించిన మంచి పనులు ప్రశంసనీయములుకావు. అటుల మనము సహింపఁ జాలనపుడు మనకుఁ దోడ్పడి ఆయా లోపములను ప్రేమతో సహించు శక్తినిఁ బ్రసాదింపుమని దైవమునే ప్రార్థింపవలయును.

ఇతరుని లోపములగూర్చి మనము ఒకటి రెండు హెచ్చరిక చేసినను వాఁడు విడువడేని, వానితో కలహింపఁదగదు. దైవమునకే విడువదగును. ఆస్వామి యిచ్ఛయేకానీయుము. అన్నిట ఆ దైవమునే ప్రేరేచి కావింపనీయుము. దైవభక్తులు కీడును మేలుగ పరిణమింపఁ జేసికొను విధానము నెఱుగఁగలరు. ఇతరుల లోపముల, అకృత్యముల ఓర్పుతో సహించ ప్రయత్నింప దగును. వారెట్టివారైన కానిమ్ము.

ఏలన, మన విషయకములగు లోపములను అకృత్యములను ఇతరు లోర్పుతో సహింప వలసినవి పెక్కులుగలవని మనము గుర్తింప వలయును. మన మితరులయెడ నట్టి భావము వహింప లేనిచో మన యెడ నితరులా విధముగ మన తలపులకు, పనులకు అనుగుణముగ వర్తింపదగుననుట యెటుల పొసగును?

ఇతరులను చక్కదిద్ద వలయునని తలంతుమే కాని, మన లోపములను మనము సరిచేసికొనఁ జూడము. ఇతరుల స్వేచ్ఛా ప్రవృత్తి మన కసహ్యమగును. కాని, మనస్వైర సంచారమును త్రోసి రాజనము. కఠిన నియమములకు ధర్మములకు ఇతరులు బద్ధులై యుండునటుల చేయింపవలయునని తలంతుము. ఈకఠిన నియమము లకు మనము గురియగుట కిచ్చగింపము.

మన యిరుగు పొరుగు వారిని మనతో సమానముగ సరి చూచుకొన యత్నింపము. అందరు ధర్మవర్తనులేయైన దైవబుద్ధితో మనము సహింపవలసినదేమి కలదు? ఇతరుల లోపములను సహింపఁ దగునని భగవానుఁడు శాసించినాడు. ఏలన? లోపములేని జీవిరయే లేఁడు. ప్రతినరునకు వాని తలకుమించిన బరువు కలదు. ఎవఁడు పూర్ణుడుకాడు. అందుచే సహనము గలిగి యొండొరు లోదార్చు కొనుచు, తోడ్పడుచు హితవు బోధించుకొనుచుఁ, బ్రేమించుకొనుచు, జీవయాత్ర సాగించవలయును.

మనకు గలుగు కష్టములు మన గుణములను మన బుద్ధి బలమును పరీక్షించు చుండును. ఇట్టి సంకట పరిస్థితులు మనుష్యుని చెఱుపఁజాలవు. వాఁడెట్టివాఁడో లోకమునకు విశదపఱచుచుండును.

ఈ సందర్భమున శ్రీ సాయీ ప్రభుపు దెలిపిన విషయము లను గమనింపుడు. (Sri Sai Baba's Charters & Sayings శ్రీ సాయీ నాథ బోధామృతము పేరా 585) "సమోఽహం సర్వభూతేషు"

ఈప్రపంచము నవ్వు పుట్టించుచున్నది. అందఱు నా ప్రజలే. అందఱయెడ సమదృష్టి పఱపుదును. కాని కొందఱు దొంగ లగు

చున్నారు. వారి విషయమున నేనేమి చేయగలను? వీరు నాయెడ అవజ్ఞత పఱిపి నన్ను మిక్కిలి బాధించుచున్నారు. నేనేమియుబలుకక ఊరకున్నాడను. దైవము మహాప్రభువు. మిక్కిలి సమర్థులైన ఉద్యోగుల నెల్లెడ ఆయన ఏర్పఱచినాఁడు. నరుఁడు తనకుఁ గలదానితో సంతుష్టి సంతృప్తుల నొందియుండవలయును. నేను మిక్కిలి శక్తి వంతుడను 8, 10వేల సంవత్సరములకు బూర్వము నేనిచటనుంటిని.

(జి. యస్. కపర్దే డైరీ)

(పేరా 593) బాబా మతసామరస్యము - సర్వజన్మ సమ్మతత్త్వము - ఉదారబుద్ధి.

సా. భా. ఎల్లదైవములు ఒకరే. హైందవునకు మహమ్మదీయునకు భేదములేదు. మసీదు - దేవాలయము ఒకటే. అట్లయ్యును మీ ఆశయములను నేను గౌరవింతును. (మహల్సాపతి ఆక్షేపణ కారణముగ) ఆ దేవాలయమున నేను ప్రవేశింపను.

చోకామేళుని జీవిత వృత్తాంతము గమనింపుడు!

(పేరా 594) సా. బా:- (తన గృహమున (దీక్షిత్‌వాడలో) అంతకుముందు ఏసుక్రీస్తునుగూర్చి క్రైస్తవ మతమునుగూర్చి నిందించిన హ. సీ. దీక్షిత్తుతో) పొమ్ము- నా పాదముల నొత్తవలదు.

హ. సీ. దీక్షిత్తు - తన ప్రవర్తనమునకు పశ్చాత్తాపమొంది తిరిగి వచ్చినపుడు బాబా అతని నాక్షేపింపలేదు.

ప్రార్థన :—

పరవిద్వేష పరాపవాద కథన వ్యాపారమున్ బాపి, యీ
శ్వరసృష్టంబగు జీవకోటియెడ సద్భావంబు హత్తించి, నీ
పరరూపంబగు ప్రాణిసంతతికి సేవల్ సేయు బుద్ధిన్ నిరం
తరమున్ గూర్పవె! నీకు మ్రొక్కెద; మహాత్మా! సాయినాథప్రభూ!

## 11. ఏకాంత జీవితము

వివిక్త సేవీ లఘ్వాశీ యతవాక్కాయ మానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే.

పొంది విజనస్థలము, లఘుభుక్తిఁ గలిగి
మనసు వాక్కాయముల నియమమున నిలిపి
ధ్యానయోగపరుండునై యన్నివేళ
లందు వైరాగ్యమును సముపాశ్రయించి,
కావరంబు, బలము, కామంబు, మఱియు క్రో
ధము పరిగ్రహంబు దర్పముడిగి
మమతలెల్ల విడిచి మదిశాంతిఁ గనువాఁడు
బ్రహ్మభావమొందఁ బాత్రుఁడగును.

(భగవద్గీతామృతము. 18-52, 53)

ఇతరులలో శాంతి ఐకమత్యము కలిగియుండవలయునని మనము తలంచిన పెక్కు విషయముల మన స్వేచ్ఛను మన మరికట్ట వలయును. ఒక మత సంఘమునగాని, సమాజమునఁగాని జీవిత పర్యంతము ఎట్టి ఆక్షేపణలు లేని విధమున వర్తింపవలయు ననుట సామాన్యమైన పని కాదు. కేవలము దైవకరుణపై నాధారపడి దైవ కృపనే జీవనముగఁ జేసికొని యీ భూమిపై నొక యాత్రికునివలె ప్రవాసి వలెభావించి సాధకుఁడు ప్రవర్తింపఁదగును. మనము ప్రశాంత ఆధ్యాత్మిక జీవనము నెఱపఁ దలచిన ఈ ప్రపంచమున దైవము నిమిత్తమై, దైవ దృష్టి కలిగి ఒక అల్పుడు తెలివిలేనివానివలె పరిగణింపఁబడుటకు కోరుకొనవలయును.

కాషాయ వస్త్రధారణము, శిరోముండనము మాత్రమున ప్రయోజనములేదు. నరుని ప్రవర్తనములో మార్పు కలుగవలయును.

అపుడతడు దైవిక జీవతపరుఁడనఁబడును. సకల బంధవిముక్తి - దైవ ప్రాప్తికంటె నితరమెవడపేక్షించునో కష్టములు వ్యసనములకంటె వానికి గలుగఁబోవునది యితర మేదియులేదు. సాధకుఁడగువాఁడు తన నీ విశ్వమునగల జీవులన్నిటికంటె అల్పుఁడుగ విధేయుఁడుగ నుండ శ్రమించనివాఁడు ఎంతోకాలము శాంతి వహింప లేఁడు.

మానవుఁడు పాలించుటకు కాదు. సేవించుటకే వచ్చినాఁడు. కష్టించి సహించుటకు కిక్కడకు పిలువఁబడినాడు. సోమరిగ వాచాలుఁడుగ నుండుటకుఁగాదు. అగ్నిచే పరిశుద్ధి చేయఁబడిన బంగారమగుటగు ఈ మానవులు సృజింపఁబడినారు. దైవప్రేమకొఱకు నిండు మనస్సుతో అడకువగలిగి ప్రవర్తింపజాలని మనుష్యుల కిచట స్థానము లేదు.

ఈ సందర్భమున శ్రీ సాయీనాథుఁడు మనకుఁ గావించిన బోధలను గుర్తించఁ దగును. (Charters Sayings – Para 268) ఎల్ల ప్రాణులను ప్రేమించుము. దేనితో కలహింపకుము. ప్రతీకారబుద్ధి వహింపకుము. నీకు వ్యతిరిక్తముగ మాటాడిన కలతపడక చలింపక తొలగిపొమ్ము. అతని మాటలు నీ తనువున దుస్సికొనవు. ఇతరులు కావించు పనులు వారినే బాధించును. నిన్ను బాధింపవు. నీవు కావించునవియే నిన్ను బాధించును.

(269) "సోమరితనము వహింపకుము. ఏదొక కృషి చేయుము. దైవనామము స్మరింపుము. సద్గ్రంథముల పఠింపుము."

(పేరా 208.) "ఎవఁడేని ఇతరుని కోపించిన నేను బాధ పడుదును. ఎవఁడేని ఇతరుని నిందించిన నేను నొచ్చుకొందును. ఇతరులు నిందించినపుడు ధైర్యముతో సహించువానినిఁ గూర్చి మిక్కిలి సంతోషింతును."

(పేరా 289) "స్పర్థ - జగడములను మానుకొంటివా - భగవానుఁడు నిన్ను రక్షించును. కీడునకు తిరిగి కీడు చేయకుము. దెబ్బకు దెబ్బ అనకుము. కీడు చేసినవానికి తిరిగి మేలు చేయుము. ఇతరుల మాటలు నీకు హాని కలిగింపనేరవు.

(పేరా 294) బాబా అబ్దుల్‌తో పలికిన మాటలు గమనింపుఁడు. "మితముగ భుజింపుము. ఎక్కువకాలము నిద్రింపకుము. నీవు చదివిన అంశములనుఁగూర్చి ధ్యానింపుము. అల్లాను స్మరింపుము.

పేరా 294 ఎ) హల్ కూల్ (మిరియంబి) పాకీవాఁడు (ద్వారకామాయి మసీదు ఆవరణము ఊడ్చి నీరము చల్లువాఁడు) అని పిలువబడు అబ్దుల్‌నుగూర్చి "1. నీ మట్టి బంగారముగ పరిణమించుచున్నది. 2. సప్తసముద్రముల నీవు దాట గలవు. 3. గొప్ప భవనము నీ కొఱకు నిర్మింపబడుచున్నది" అని బాబా అడకువ, సేవలలోని మహత్త్వములను శ్లాఘించినాఁడు.

12. సాధుసత్పురుషుల ఉదాహరణము

ఆధ్యాత్మిక నిష్ఠులు - ఋతంభర ప్రజ్ఞాపూర్ణులు బ్రహ్మవిదులైన సాధుసత్పురుషుల ఉదాహరణమును పరిశీలింపుడు! 'వారి మార్గమున నొక్క అడుగేని మనము ముందున కేగినవారము కాము" - అని మనకు విస్పష్టమగును. వారితో పోల్చి చూచుకొనిన మన జీవితము లేపాటివి?

సాధుసత్పురుషులు-భాగవతులు ఆకలిదప్పులను శీతోష్ణాదులను శ్రమభారములను, నిందావహేళనములను ఆధివ్యాధులను సైచి, భగవానుని ధ్యానించి సేవించిరి. పరాత్పరుఁడగు భగవానుననుసరించి సేవించుటకే సత్పురుషులు, ప్రవక్తలు' మతాచార్యులు, పొందిన సంకటములు, బాధలు ఎన్నెన్ని కలవో గమనింపుఁడు.

ఈ ప్రాపంచక జీవితములను వారు రోసిరి. పరమ శాంతి సచ్చిదానంద ధామమును జేర శ్రమించిరి. నిర్జన భూములందు వారెట్టి నైష్ఠిక త్యాగ నిస్వార్థ జీవితములను గడపినారో యోజించుకొనుఁడు. ఎంతకాలము కష్ట భూయిష్టములగు బాహ్యాకర్షణముల సహించిరో చూడుడు! శత్రుబాధలకు వారెట్లు గుఱియైనారో గమనింపుడు! దైవమును నిరంతరమెంత ఆర్తితో ధ్యానింతురో కనుగొనుడు! అరిషడ్వర్గమును జయించుటకు వారెట్టి పాట్లుపడిరో - వారి ప్రతిఘటనము లెట్టివో - ఎంత లెంతలు ఉత్సాహజాగ్రతలను తమ ఆధ్యాత్మిక

పురోభివృద్ధికి వహించిరో భగవానునియెడ నెట్టి పవిత్ర ఋజుప్రవర్తనలఁ బాటించిరో పరిశీలింపుడు! పగటివేళల శ్రమించుచు రాత్రముల నిరంతర ధ్యాననిమగ్నులై యుండువారు. పగట కృషి కావించుచున్నను దైవస్మరణము విడుచువారుకారు. వారి జీవితకాలమంతయు సార్థకము, ఫలవంతముఁ గావించు కొనిరి. వారికి ప్రతి ఘటికయు క్షణికముగ భగవత్సేవలో గడచిపోయినది.

ధ్యానామృతమును తనివిదీర గ్రోలుచు వారు దైహిక సుఖ భోగములను మఱచువారు. అభిమానము సంపదలు బిరుదులు మిత్రులు. స్వజనములు వారి దృష్టిలో లేరు. ప్రాపంచక వస్తువులం దాసలఁ ద్రోసిపుచ్చిరి. జీవనాధారములగు వానియందును విరక్తి వహించిరి. అవసర సమయములందును దేహరక్షణము నేనియు బాటించినవారుకారు. ప్రాపంచక దృష్టిలో వారు మిక్కలి పేదలు. గుణసమృద్ధి దైవానుగ్రహప్రాప్తియందు వారు మహాధనికులు. అశేష సౌభాగ్యతములు. బాహ్యమునకు వారు దిక్కులేని నిరుపేదలు. అంతరంగికముగ దైవానుగ్రహౌదార్య ప్రపూర్ణులు. ప్రపంచమునకు పరమాప్తులు. తా మకించనులమని వారు తలంచుకొనువారు. ప్రపంచముచే నిరసింపఁబడువారైన నట్టివారు భగవానుని దృష్టియందు అత్యంత ప్రేమపాత్రులు, అమూల్యములైనవారు.

నిక్కమైన అడకువ కలిగి, మిక్కిలి విధేయతతో జీవించుచు, సహన ప్రేమలతోఁ జరించుచు, ఆధ్యాత్మిక జీవితమున ప్రత్యహము నవనవోన్మేష తేజప్రపూర్ణులై, దైవదృష్టియందు సంపూర్ణానుగ్రహ పాత్రులుగ తోఁచువారు.

ఇట్టి సాధుసత్పురుషులు ఆధ్యాత్మిక మార్గగాములకు ఒజ్జబంతులై తమ్మనుసరించువారి ఆధ్యాత్మికసాధనసంపూర్ణతకు అనుగ్రహ కిరణములను ప్రసరించుచుందురు. సకల మతాచార్యుల - ప్రవక్తల సాధుసత్పురుషుల ప్రేమాదరణములు వర్ణనాతీతములు. వారి భక్తి

గుణవిశిష్టతలు - వారి క్రమశిక్షణములు అనుపములు. వారెట్టి ప్రపూర్ణులో వారి యడుగుజాడలే నేటికిని మనకుఁ దెలుపుచున్నవి.

తన నియతి నతిక్రమింపక తన పూనికను సహనముతో సాధించువాడు ధన్యుడు. మన అలసత - అస్థిరత - ద్వంద్వప్రవర్తనము మనజీవితములపై మనకే విసుగును జుగుప్సను గలిగించుచుండును. ఇందఱ సాధుసత్పురుషులఁగూర్చి చదివి, విని తమతమ దృష్టిని దైవాభిముఖము గావించుకొన ప్రయత్నింపనివారు మందభాగ్యులుగదా!

ప్రార్థన:—

మైమాంగూ యహ్ మాంగ్‌నా - మెహిదీజియేసోయ్
సంతసమాగమ హరికథా - హమరే నిశి దినహోయ్.

హరిభక్త సఖ్యంబు - హరిచింతనములుఁ
బొరి లభ్యమగునుగావుత! అహర్నిశలు;
నా కోరఁదగినది - నా కోరునదియ
ఈ కొలందిమ్ము! సాయీ! దయాహృదయ!

8. సాధుసత్పురుషుల అభ్యాసములు.

స్వర్గమృత్యుపాతాళమే; పూరతీ న సుఖసాహి
సుఖసాహిబకే భజనమే - అరుసంతనకే మాహి.

తగ స్వర్గమర్త్య పాతాళలోకముల
నెగడదు సుఖము గణింప నే గతుల;
సాయిచింతనమున - సాధుసంగమునఁ
బాయని సుఖము చొప్పడు నెందుజవిన.

(శ్రీసాయీ కబీరు సూక్తులు)

సాధుసత్పురుషు లాపాదమస్తకము పూజనీయులు. వారు వెలికి గోచరించు విధముకంటె మహోన్నతస్థాయి నొందినవారు, వారి బాహ్యరూపముల ననుసరించి వారిని నిర్ణయించుకొనరాదు. అంతఃకరణపరిశుద్ధి గలవారే సాధువులు. దైవము మన వేషభాషలను గమనింపడు, మన హృదయమును పరిశీలించును.

సాధకులు ప్రతిదినము తమ విధానముల నిర్ణయించుకొన వలయును. ధృత్యుత్సాహములతో ఈ దినమే తమ సదాచరణముల ప్రారంభించుచున్నట్లు నిర్ణయించుకొని ఆ పనికి గడంగవలయును. తమకు తగినబుద్ధి శక్తులను ప్రసాదింపుమని భగవంతుని ప్రార్థించ వలయును.

"సాయీ! మహాప్రభూ! తోడ్పడుము. నేను సంకల్పించిన నీ సేవా రూపమైన సత్కృతిని చక్కగ నిర్వర్తించుటకు సద్బుద్ధిని సచ్ఛక్తిని బ్రసాదించి నన్ను కృతకృత్యునిం గావింపుము. నేనింత వరకు చేయఁజాలిన మంచి పని లేశమేనియు లేదు. నీ అవ్యాజ కరుణానుగ్రహములు లేకున్న నా బుద్ధి నా శక్తి చాలదు." అని ప్రార్థింపవలయును.

మన నిశ్చిత కార్యసంకల్పములు ననుసరించి మనకు అధ్యాత్మిక జయమును దైవము ప్రసాదించును. మన కార్యోత్సాహ దీక్షల కనుగుణముగ ఫలితములు చేకురును. మానవుని దృఢసంకల్పములు తఱచుగ విచ్ఛిన్నము లగుచుండును. దాని కనేక కారణము లుండును. మన పూనికయం దేమాత్రమేని అలసత వహించితిమా అది మన ఆధ్యాత్మిక పురోగతికి నే కొంచెమైన న్యూనతఁ గల్పింపక పోదు.

సాధకుల తలంపులు - ఆచరణములు వారివారి తెలివి తేటలపై, బుద్ధిబలముపై నాధారపడియుండును. అవి దైవానుగ్రహైతుకములై యుండును. వారు పూనిన ప్రతికార్యమునకై దైవముపై నాధారపడి యుండక తప్పదు. మానవుఁడు సంకల్పించును. దైవము నిర్ణయించును. మానవుని వలన కాఁదగిన దేమియులేదు. వాని మార్గము వానికగోచరము, ఒక పవిత్ర కార్యము నుద్దేశించి

గాని లేక సోదర భక్తులకొఱకుగాని ఒక నిర్ణీతమగు అభ్యాసమును తాత్కాలికముగ విడిచినను అంత లోపము గలుగదు. ఆ లోటును సాధకుడు త్వరలో పూర్తిచేసికొనఁ గలఁడు. బుద్ధి జాడ్యము అజాగ్రతల వలన సక్రమాభ్యాసమునకు అంతరాయముఁ గలిగించుకొనిన అది మనకు హాని గలిగించును. మన శక్తి వంచనలేని విధమున చేయుచుండ వలయును. అటుల చేయుచున్నను ఏవియో లోపములు కలుగుచునే యుండును. మనకు గలుగనున్న ఆటంకములను గుర్తునందుంచుకొనియే మన మొక మార్గమును నిశ్చయించు కొనవలయును.

దైవమార్గము ననుసరించుటకు బాహ్యాభ్యంతరములు రెండును ప్రధానములు. కావున బాహ్య ఆంతరంగిక మానవత్వములను ఎప్పటికప్పుడు శుద్ధిచేసుకొను చుండవలయును. నిరంతరము ఆత్మ చింతనము సాధ్యము కాదయేని, ఏ కొలఁది కాలమేని ఆత్మచింతనమునకుఁ గడంగదగును. తుదకు ఉదయము నిద్ర మేల్కొనినతోడ, రాత్రి నిదురించుటకు ముందు ఏ కొలది నిముసములైన ఆత్మ ధ్యానము - (దైవధ్యానము) చేయదగును. ధ్యానానంతరము ఉదయమున విధ్యుక్తములను - నిశ్చిత కార్యములఁగూర్చి, రాత్రముల మనమా దినమునఁ గావించిన వానినిఁగూర్చి - తలపుల, పలుకుల - పనులను గూర్చి పరిశీలించుకొనవలయును. ఏలన? మనమా దినమున దైవమునకు- తోడి ప్రాణులకు కావించిన ద్రోహము లనేకము లుండవచ్చును. తెలిసియో తెలియకయో మనము కావించిన యట్టి ద్రోహములను క్షమింపుమని దైవమును ప్రార్థింప వలయును.

దైవమునందు గాఢవిశ్వాసము (నిష్ఠ) ధైర్యోత్సాహములతో గూడిన ఓర్పు (సబూరి) కలిగి మనమెదుర్కొన వలయును. కలత కలిగించు క్షుత్పిపాసాదుల నరికట్టు చుండఁ దగును. అపుడు మన మీ ప్రాకృత సంక్షోభములకు గురికాక విడివడగలుగుదుము.

సాధకుఁడగువాఁడెప్పుడు సోమరిగ నుండఁదగదు. పఠన పాఠన రచన ప్రార్థన మనన లోకహితాచరణ కార్యముల నేదొక రూపమున కాలము గడుపుచుండవలయును, దేహపరిశ్రమ మాయా

మానవుల తత్త్వముల ననుసరించి కావించుచుండఁదగును. సర్వసాధారణముగాని సాధనలను వెలికి ప్రకటనము చేయరాదు. అట్టి రహస్య సాధనలను ఏకాంతముగ గోప్యముగ చేసికొనుచుండఁదగును. పలువురను చక్కఁబఱచు సాధనలను గోప్యము చేసికొనవలసిన పనిలేదు. అందఱునొకే విధమగు ఆధ్యాత్మిక సాధనములను చేయఁజాలరు. ఒక్కొక్కరకొక్కొక్క విధము తగియుండును. ఇతరుల సాధన విధానములఁగూర్చి అధిక్షేపింపఁ దగదు. వారి వారికి యుక్తమని తోచిన మార్గమున వారిని నడువనీయవలయును. దేశకాలపాత్రల ననుసరించి, పని దినముల సెలవు దినముల కనుగుణముగ నొక్కొక్క విధానము తగియుండును. అలజడుల తరుణమున ప్రశాంత పరిస్థితులందు నొక్కొక్క సాధనము అపేక్షణీయము. కష్టసమయముల విచారముగ నున్నపుడొక విధానము - సుఖసంతోష దైవపరానందమున నోలలాడునపుడొక విధ మనుసరణీయము.

ప్రతి పర్వదినముల - ముఖ్యములగు పండుగలందు సదభ్యాసముల పునరిద్ధరించు కొనుచుండఁదగును. దైవమును, అవతార పురుషుల సాధుసద్గురువులను ప్రార్థించుచు వారి అనుగ్రహమును కాంక్షించుచుండవలయును. ఒక పర్వదినమునుండి మఱియొక పండుగ దినము లోపల యీ యీ సత్కృతులఁ జేయుదమని, మన జీవిత శేషమత్యల్పమని త్వరలో శాశ్వత పర్వదినము ననుభవింపఁ బోవుచున్నవారమను తలంపుతో మనము కావింప సంకల్పించిన మంచి పనులను శక్తివంచన లేక పూర్తిచేసికొన నుత్సహింపవలయును. అట్టి పర్వదినములందు అతి జాగ్రతతో మన ఆధ్యాత్మిక సాధన పూర్ణతకు శ్రమించి, భగవానుని కృపఁబడయుట కింక వ్యవధి లేదని, మన పరీక్షాదినము - బహూకృతి ప్రదాన దినము సమీపించుచున్నదను తలంపుతో దైవమునందు భారమునిలిపి యత్నించుచునైన యుండవలయును. మోక్షసామ్రాజ్య పట్టాభిషిక్తులై దైవసంపూర్ణానుగ్రహపాత్రులై, దైవసన్నిధిని, సచ్చిదానందము ననుభవించు నిత్యసూరులు ధన్యులు!

శ్రీసాయీ ప్రభువు ఈ విషయములగూర్చి మనకుఁ దా నాచరణ పూర్వకముగఁ దెలిపిన బోధలను గ్రహించుదము.

శ్రీసాయీనాథుఁడు తన అనేక పూర్వజన్మ వృత్తాంతములను గూర్చి తెలిపిన విషయములు (Sri Sai Baba's Charters & Sayings) "శ్రీసాయీనాథ బోధామృతము (శ్రీసాయీబాబా అభయ ప్రదానములు- సూక్తులు) అను గ్రంథమున పేరా 474 మొదలు 479 వరకు వివరింపబడినవి. సోదరీ సోదర భక్తులు వానిని శ్రద్ధతో చదివిన బాబా తన పూర్వజన్మములం దెట్టుల నిరంతర నిస్వార్థసేవ కావించినాఁడో విశదములగును. అందొకటి రెండు సందర్భముల నుదహరింతును.

(పేరా 494) ఒక పూర్వ జన్మమున బాబా సాధనము:— "నేను మిక్కిలి కష్టించి నెలల పర్యంతము భోజనములేక వేప మొదలగు చెట్ల ఆకులను తిని జీవించితిని, దైవము నాయెడ దయవహించినాఁడు. దేహమున రక్తమాంసములు క్షీణించినవి. శల్యమాత్రావశిష్టుఁడ నైతిని. ఎముకలు సైతము చూర్ణముకానున్న స్థితి పట్టినను ప్రాణములు నిలిచినవి".

"పరిశ్రమము, సహనము"ను గూర్చి బాబా తెలిపిన విషయములు గ్రహింపుఁడు. (పేరా 290) యోగ యాగ తపోజ్ఞానములను సముపార్జింపజాలని మానవ జీవితము వ్యర్థము."

(పేరా 291) ఒక భక్తునకు సందేశ మంపుచు బాబా ఈ విధముగ దెలిపెను.

"నీవు భోజనము చేయుచు నూరక కూరుచుందువా? (సబూరి) ధైర్యముఁతో గూడిన ఓర్పును పాదుకొలుపు కొనుము. భగవానుని సేవింపుము."

(పేరా 282) బాబా ఒకనిని గూర్చి వాని యెదుట నిట్లనెను,

“నీ గతి తుదకు మిక్కిలి దుస్సహము. హేయము నగును. ఒకటి రెంట నేను హెచ్చరిక చేయుదును. ఇచ్చిన సలహాను పాటింపఁ డేని అతని గతి దుర్ఘటమగును. గర్భమున పెడతిరిగిన పసికందు నేని కండ తుండెములుగ ఖండించి వెలికి పాఱవేయవలయును.”

కావున సాధుసత్పురుషుల యడుగుజాడల గుర్తించి మానవుఁడు నిరంతర నిస్స్వార్థసేవలతో దైవధ్యానమున జీవితము గడపి జన్మసాఫల్యము పడయ యత్నింపఁ దగును.

ప్రార్థన :—

పరమ ప్రేమను, సర్వభూతహిత సేవాసక్తబుద్ధిన్, నిరం
తర నిర్నిద్రత, నీ పదాంబుజపరిధ్యానంబు హత్తించి, స
త్పురుషుల్ మెట్టిన జాడలన్ దెలిపి, ప్రాపున్ గాపునై, వీనిచే
బరిచర్యల్ జరిపించుకోఁగదవె! దేవా! సాయినాథప్రభూ!

14. ఏకాంతవాసము — మౌనమునందు అనురక్తి.

స్వీయోద్గమ తోయ వహా సాగర ముపయాతి నీచమార్గేణ
సా స్వీయోద్గమ ఏవస్థిరాసతీ కిం నయాతి వార్ధిత్వమ్.

ఏవం మనః స్వహేతుం విచారయత్సుస్థిరం భవేదంతః
న బహిర్వ్యేతి తదా కిం నాత్మత్వం స్వయంయాతి.

తనకు దాన వెడలి తటిని నిమ్న మగు మా
ర్గంబుఁ ద్రొక్కి సాగరంబుఁ జేరు;
అదియె వెల్లిగొనక యచట స్థిరీభూత
మైవ సాగరత్వ మందకున్నె?

అట్టుల మదీయ స్వకారణంబరసి లిప్త
బాహ్య సంచార కర్మముల్ వదలఁజాలి

లోన సుస్థిరత్వంబును బూనెనేనిఁ
బడయకుండునె? యాత్మరూపంబుఁదాన.

(ప్రబోధసుధాకరము - మనోనిగ్రహ ప్రకరణము)

భగవానుని కరుణాతత్త్వమును దలంచుచు ఆత్మచింతన ధ్యానములు సేయుటకు నిత్యమొక కాలమును మనము నిర్ణయించు కొన వలయును. మనస్సు నాకర్షించు వింతలు ఆశ్చర్యకరములగు విషయములతో జోక్యము కల్పించుకొనక మనస్సునకు శాంతిని ప్రసాదించు పనుల యందే నిమగ్నులమై యుండవలయును. సద్గ్రంథములనే చదువుచుండ వలయును. అలసత్వము వహించుట వ్యర్థ సంభాషణలు కావించుట, వింతలగు లోకవార్తలను వినుట మొదలగు వానినుండి విడివడితిమా మన ధ్యాననిష్ఠలకు మంచిపనులకుఁ దగిన అవకాశము లభించును.

సజ్జనులు వీలుపొసగునపుడెల్ల జనకూటములనుండి దూరమగుటకు యత్నింతురు. దైవచింతనము - దైవప్రీతికరములగు కార్యముల కన్వేషింతురు. ఏకాంతముగనుండ నిచ్ఛింతురు. "నేను జన సంపర్గమునుండి తిరిగి యింటికిఁ జేరునపుడు అంతకుఁ బూర్వమున నున్న స్థితికంటె మిక్కిలి హీనస్థితిఁ బొందినవాఁడ నగుచుందును." అని, ఒక సాధువు పలికినాఁడు. ఇది త్రిసత్యము. మన మెక్కువ కాలము జనులతోఁ జేరియున్న ఈ మాట సత్యమని మనకుఁ దోఁచును. మనము మాటాడవలసినదాని మించి మాటాడుటకంటె మౌనముగ నుండుటయే తేలిక - మేలు. ఇతర ప్రదేశముల నుండుటకంటె నింటి పట్టున మానవునకు మేలు. తేలికయగు పని. ఆధ్యాత్మికౌన్నత్యముఁ బడయఁజూఁచువాఁడు దైవయుక్తుఁడై (దైవమే తోడుగ) జనసంపర్గము నుండి దూరమగుట శ్రేయము.

ఆంతరంగికముగ ప్రశాంతి వహింపఁజాలనివాఁడు భద్రముగఁ బలుకఁజాలఁడు. వినయపూర్వకముగఁ బాలింపఁబడుట కిచ్చగింపనివాఁడు క్షేమముగఁ బాలింపలేఁడు. సత్యముగు అతఘువలేని

వాఁడు యుక్తగతిని ఆజ్ఞాపింపలేఁడు. సమీచీన బుద్ధిని పాదుకొలుప కొన నేరనివాఁడు సత్యముగ ఆనందింపలేఁడు. సాధుసత్పురుషుల భద్రత యెప్పుడు దైవభీతితో గూడియుండును. అంతరంగిక శాంతి వినయములను పాదుకొలుపు కొనఁజాలిన వారగుటచేతనే సాధువులు దైవకృప - కల్యాణగుణములను ప్రకటింపగలుగుచున్నారు. గర్వము- అహంకారము - దురభిమానము వహించువారగుటచేతనే దుర్జనులు వంచింపబడుచున్నారు. మనుష్యులలో అత్యంత గౌరవపాత్రులై పేరెన్నికగన్నవారు సైతము అతిమానిత్వము వలన గొప్ప ప్రమాదముల పాల్పడుచుందురు. క్షణభంగురములగు సుఖము లాసింపక నిరోధించుటకు - లౌకిక కాంక్షలనుండి విడివడుట కెంతయో సద్బుద్ధి సంపాదించుకొనవలయును.



వ్యర్థకామితముల నిర్మూలించి, ఆత్మోద్ధరణమున కుపయుక్తములగు దైవీసంపదలనే తలంచుచు దైవమునందు సంపూర్ణ విశ్వాసము నిలుపుకొనుట కెంతయేని ప్రశాంతి తృప్తి విధేయత లవసరము. నరుఁడు కావించిన అకార్యములఁగూర్చి పరిపూర్ణమగు పశ్చాత్తాపము నొందఁజాలనివాఁడు దైవానుగ్రహపాత్రుఁడు కాఁడు. నిజమైన పశ్చాత్తాపము పడయఁగోరువాఁడు తన ఏకాంతసేవామందిరము ప్రవేశించి స్వామిపాదములఁ బడి ఏడువ వలయును. "గురుద్వారమువద్ద గోవు వలె పడియుండుము." అని 'పవహరిబాబా' పలికినట్లు సమర్థ సద్గురువు తన ఇష్టదైవము పాదతలమునఁబడి తన అవినీతి ప్రవర్తనమును క్షమింపుమని యేడ్చిన కరుణామయుఁడగు ఆ తండ్రి తనవానిని క్షమించును.



సాధకుఁడగువాఁడు నిత్యము తన ఏకాంత సేవామందిరమున కొంతకాలము తన గురుదేవుని యెదుటఁ గడుప నభ్యసింప వలయును. వెలుపల మనము చూడజాలనివానిని మన రహస్య మందిరమునఁ జూడగలము. స్వామి సన్నిధిని ఏకాంతముగ ఎంతెంత కాలము గడుపఁ జాలుదుమో మన మంతంత ఆనందము పొంద

గలుగుచుందుము. అటుల గురుదేవునిఁజేరి ఏకాంతముగ సాధన ప్రారంభించినకొలది ఆ స్వామి మనకు పరమాప్తుఁడుగ ఆనంద ధాముండుగ నగును. స్వామి యెడబాటును క్షణమేని సహింపఁ జాలని మనఃస్థితి యేర్పడును.

ప్రశాంతి మౌనములు వహించి స్వామి సన్నిధి ఏకాంత మందిరమున సాధకుఁడు గడపిన కొలది సకల శాస్త్రరహస్యముల నెఱుఁగఁజాలును. శాస్త్రముల గుప్తమైన వస్తువు తెలియక బడును. భగవానుని పరిచయభాగ్యము కలుగును. బంధుమిత్రాదులతోడి సంసక్తి విడనాడి అనన్యభక్తిమై సేవించు ఆశ్రితుని భారములు వహించుచు భగవానుఁడు తన అంతరంగిక పరివారముతో సన్నిహితుఁడై యుండును. లోకవిషయ వాసనల విడువ మనమెక్కుడు శ్రమింపవలసిన పని లేదు. మన మనస్సు, మన బుద్ధి యెంతెంత దైవాభిముఖ మగు చుండునో విషయవాసనలు మన కంతంత దూరములగుచుండును. తూర్పుదెస కెంతెంత ముందుకు పయనింతుమో పడమరదెస మన కంతంత దూరమగును.

ఈ సందర్భమున శ్రీ సాయీ మహాప్రభువు శిర్డికిఁజేరిన తరు వాత చాలకాల మెటుల నేకాంతవాసము - మౌనము వహించి నిరంతర మాత్మధ్యాననిష్ఠుడై ప్రవర్తించిన విషయము సోదరీ సోదర భక్తులు గ్రహింపదగును. (శ్రీ సాయీ విజయము 34 మొదలు 38 పుటలు చూడుడు.)

శ్రీ సాయీ బాబా సహజస్థితి.

సతత మైకాంతిక సంసక్తిఁ గోరి
యతివరేణ్యుండు బోధాధ్వవిహారి
నింబమహీజంబు నీడనే యాల
యంబుఁగఁగూర్చుండు నద్భుతలీల,

అనుపమజ్ఞాననిష్ఠాత్ముని ప్రోల
'మునిి' యెప్ప వెల్గు నొందును పవల్ రేల

శ్రీకమౌ వల్కకేలు చేర్చి చెక్కిలిని
మోకాలిపైన నా మోచేతి నూని

నాసికాగ్రంబునన్ దృష్టినుంచు
గాసిల్లకంతర్ముఖస్థితిన్ గాంచు
ఆ సచ్చిదానందు నాత్మ ధ్యానించు
సన్నుత నింబవృక్షము గృహంబుగను

కొన్నినాళ్లౌనరె నా గురుదేవునకును,
వింతగోడలు దిశల్ - పెక్కు దూలములు
దంతె లల్లకము లందలి కొమ్మగములు.

జగదుద్ధరణకు యోగసంభవతల్లి - సాకారంబును బూని,
నెగడెనో యన శ్రీసాయి తనర్చును నిగమాంతైకాస్థాని,

అనయంబు కోట్లగృహంబుల లోని
తన బిడ్డలందు వాత్సల్యంబుఁబూని,
వారలందఱఁగూడి వర్తించు సామి
భూరుహచ్ఛాయఁగాపుర ముండునేమి?

అభినవంబును గడు నద్భుతావహము
ప్రభుసాయి గురు కుటుంబప్రవర్తనము
పరిశీలనము సేయువారికిఁబోడము
పరివార బాంధవ వర్గంపు భరము.

క్షమ మాత; ధైర్యంబు జనకుఁడు - త్రాత;
తమి, శాంతి దయితయౌ, దయ సహజాత,
సువిచార ప్రజ్ఞావిశుద్ధులు భ్రాత,
అవనియె తల్పమై యలరు; విఖ్యాత

యోగివర్యుఁడు స్వభక్తోద్ధారకుండు
ఆగమాంత ప్రబోధైకవేద్యుండు
స్వానందరాజ్యభాగ్యానుభూతుండు
జానుగవెలుగొందు సాయీప్రభుండు.

సాయీబాబా సహజస్థితిఁ గనఁ జాల రెంతవారేనిఁ
బాయని విశ్వాసక్షమలలవడు భక్తులుగందురుగాని

దశదిశలే జలతార్పట్టు సాలు
విశదతారకలె చొన్పిననేతపూలు
సాక్షాత్పరాత్మ విజ్ఞానామృతంబు
అక్షయపానీయ మాప్యాయనంబు,

రంగద్వివేక వైరాగ్యముల్ రెండు
సంగరక్షకులునై యలరుచునుండు
విడువని సత్త్వప్రవృత్తి కత్తిగను
కడు సాత్త్విక ప్రేమ కానుకట్టుగను

నెటి మోక్ష మందిర నిశ్రేణి యగుచు
వఱచు సమాధానపరత మేలిడుచు
కరముల రెంటి చక్కఁగ మోడ్చుకొనుచు
దఱినిల్చు మంత్రి సత్తముఁడన పొలుచు.

సకల రాజాధిరాజపదంబు వడసి
ప్రకటయోగేశ్వరత్వస్థితిఁజేసి
సాయిహృత్సామ్యమ స్థైర్యముల్ గనుచు
దాయక దుష్ప్రవర్తన లెల్ల పఱచు.

ప్రపంచమున సాయిని లోఁగొనఁగల వస్తువేదేదియు లేదు.
ప్రపూర్ణసంవిత్స్ఫురన్మూర్తి బాబా కన్నుబ్రామనరాదు.

అరయ యోగేశ్వరుండగు సాయియందు
నిరపేక్షకతను వర్ణింపఁగా నెందు
విపులమౌ వాక్శక్తి వెదకిన లేదు
ఉపమాన మొక్కటియును గానరాదు.

సాయీశు బాహ్య వేషాదికంబులకు
నేయెడ సామ్యమొండెదేని దొరకు
కాని, సాయి అపరోక్షజ్ఞానమునకు
కానము పోల్కి నొక్కటియు మందునకు.

బిచ్చగాడని సాయి పేర్కొనఁదగడు
లచ్చికేల్మోడ్చి మ్రోలను పనివినెడు,
అచ్చపు శ్రీమంతుఁడని పల్కరాదు
బిచ్చమెత్తకయ జీవికసాగఁబోదు.

నరరూపుఁడగు జగన్నాథుఁడీతండు
చరియించు పలుకు చిచ్ఛక్తియీతండు
అనత భక్తశ్లార్తి వారకుఁడు
ఆనంద సుఖధాముఁడౌ సాయి విభుఁడు.

తన సంశ్రితులను రాజాన్నంబులఁ దనుపఁజాలు ప్రభువితఁడు
అనయము భిక్షాశనుఁడై మోదంబందుచు సాయీ విభుడు.
బాలచలోభన మోహామద ఏకలభతా అనీహ
హరిజన ఐసా చాహియే జైసావనకాసింహ.

లోలత్వమును మోహలోభముల్ మదము
దూలించి నిత్య సంతుష్టుఁడై చిరము

హరిభక్తుఁ డేకాకి యగుచు లోకమున
జరియించు - వని మృగస్వామి చందమున.

(శ్రీసాయీ కబీరు సూక్తులు)

15. మానవవ్యసనములు:

లిఖామిటే నహీ కర్మకా గురుకర భజ హరినామ్
సీధేమార్గ నిత్యచలే దయాధర్మ విశ్రామ్.

చెఱుపలేవోయి! వ్రాసినవ్రాత నొసట
అరయవ్యర్థము సుమ్మి - ఆరాటపడుట;
శరణొంది గురు హరిస్మరణంబు విడక
ప్రబపు దయాధర్మ పరత నేమరక,

(శ్రీసాయీ కబీరు సూక్తులు)

ఆధ్యాత్మికాభివృద్ధిని కాంక్షించువాఁడు దైవభీతి విడువరాదు, యథేచ్ఛగ వర్తింపరాదు. మనము తలంచు తలంపులను పలుకు పలుకులను, కావించు పనులను సకలము జగదంతర్యామియగు పర్వేశ్వరుఁడు మన హృదయాసీనుఁడై, సాక్షీభూతుడై గమనించుచునే యున్నవాఁడని మనము గ్రహించవలయును. ఇంద్రియములను క్రమ శిక్షణ మందుంచు కొనవలయును. వ్యర్థవ్యాసంగములందుఁ బాల్గొన రాదు. మనల క్రమ్ముకొనిన అపాయములఁ దలంచుకొని, మన మెటుల ప్రవాసితుల గావింపబడితిమో గ్రహించి. మన సంకట పరిస్థితుల సరితూచుకొనఁ గలుగుదుమేని "నే నానందించు చున్నాఁ డను" - అని చెప్పకొనఁ జాలువాఁడు మనలో నెవ్వఁడు లేడు.

హృదయమున యోజనలేక మన లోపములను పరిగణింపక మనకు గలుగనున్న దుఃఖములగూర్చి మనము తలంపఁ బోవని కారణ మున మనము పరితపించవలసిన దానికి బదులు వ్యర్థముగ సంతో

షించుచున్నారము. నిర్మలమైన బుద్ధి, దైవభీతి లేనిచో యథార్థమగు స్వేచ్ఛ, సత్యమగు ఆనందము కలుగదు. తన మనస్సును లోఁగొని, బరువులఁగూర్చు విషయముల నన్నిటిని త్యజించువాడే సుఖి. అభ్యాస వైరాగ్యముల నూఁతగా గొని లౌకికవిషయములను క్రమక్రమముగ ప్రతిఘటించుచుండదగును. ఇతరులను వారిమార్గమున వారిని నడువ నిచ్చిన మన మార్గమునకు వారు ప్రతిబంధకము కారు. ఇతరులకు సంబంధించిన విషయముల మనము జోక్యము కల్పించుకొనరాదు.

ఎంతసేపు మన విషయమున మన దృష్టిని నిలుపుకొన వలయును. మన ప్రియ బంధుమిత్రులకు హెచ్చరికలు చేయఁ జూచుటకంటె మన విషయమున మనము హెచ్చరికఁ జేసి కొనుచుండ వలయును. ఇతరుల గౌరవాదరణల పొందకయున్న మనము విచార పడనక్కరలేదు. సక్రమ మార్గమున - భక్తుఁడు భగవానుని సేవకుని వలె ప్రవర్తించు చుంటిమా? లేదా? యనియే యెవరికివారు పరిశీలించు కొనవలెను. లౌకికములగు ఓదార్పుల కాసించుచుందుమేకాని మనో నైర్మల్యము వడసి దైవసంబంధమైన ఓదార్పులను మన మపేక్షింపము. దైవాభిముఖులమై దైవానుగ్రహ మపేక్షింపని కారణముననే మనకీ కష్టవ్యసనములు దాపరించినవిగ మనము గ్రహించవలయును.

బుద్ధిమంతుఁడు విచారదుఃఖములకు కారణముఁ దెలిసి కొనును. తన విషయముఁ గూర్చికాని, యిరుగు పొరుగువారి విషయ ముల గూర్చికాని యోజించుకొనిన యీ ప్రపంచమున సంకటవ్యసన ములు లేనివాఁడు లేడనియే ప్రతి మానవుఁడు గ్రహింపగలఁడు. తన విషయమై యెంతెంత సంకుచితబుద్ధి మానవుఁడు వహించునో అంత అధికముగ విచారము పొల్పడును. మనము కావించియున్న పాపములు క్రౌర్యకృత్యములు దైవదృష్టిని దైవభీతినిఁ గలిగించి అంత రంగిక పశ్చాత్తాపము కలిగించునవిగ నుండదగును. దీర్ఘకాలము బ్రతుకఁదలచుట కంటె మానవుఁడు తన మృతిని గూర్చి తాను తలంచు కొనిన అపుడు తన ప్రవర్తనము మార్చుకొనుటకు ఆతురత, ఉత్సుకత నతఁడు వడయుననుటకు సందేహము లేదు.

పరమునందు నరుఁడు పొందనున్న బాధలను తలంచుకొనిన యీ ప్రపంచమునఁ గలుగు కష్టముల దుఃఖముల నతడు సహించి, యెంత కఠిన నియమములకైన వెనుకాడఁడనుట సత్యము. ఈ విషయములు మన తలకెక్కని కారణమున మన కానందముఁ గలిగించు ననుకొను లౌకిక విషయములకై నిరీక్షించుచుందుము. అందుచే భక్తి విషయమున స్తబ్ధత - సంకుచిత బుద్ధి కలిగియున్నారము. అట్టి ఉత్సాహము కృషి లేకపోవుటచే యీ భౌతిక దేహము శ్రమకు జంకుచున్నది. కావున మనము నిశ్చయ పశ్చాత్తాపముఁ బ్రసాదింపుమని దైవమును ప్రార్థింప వలయును. "స్వామీ! బాష్పామృత భోజనము పెట్టుము. సమృద్ధిగ బాష్పజలములఁ గ్రోల ననుగ్రహింపుము!" అని మనము దైవమును ప్రార్థింపవలెను.

దైవాభిముఖులమైన తప్ప మన మెచట నున్నను వ్యసనములు కష్టములు క్రమ్ముకొనుచునే యుండును. మనము తలంచు విధమున మన కనుకూలముగ పనులు సంఘటిల్లుచున్న మనము బాధపడబోము. తన తలంపు ప్రకారము సర్వము నిర్వర్తించుకొనఁ జాలినవాడెవ్వడు లేఁడు. అటులఁ గావించుట కెవరివలన గాదు. చక్రవర్తిగాని మత పీఠాధిపతిగాని కష్టములు ఆందోళనలు లేనివాఁడీ ప్రపంచమున లేనే లేఁడు. ఉత్తమోత్తమ స్థితిలో నెవడున్నాఁడు? దైవప్రీతికై ఏదేని కొంత త్యాగముఁ జేయఁగలిగిన నెవనికి సర్వసమృద్ధిలేదు.

బుద్ధిబలములేని చంచలచిత్తులు పలుకుచుందురు- "చూడుము! వాఁడెంత సుఖజీవనముఁ గడుపుచున్నాడో? ఎంత భాగ్యవంతుఁడో? ఎంత గొప్పవాఁడు! ఎంత అధికారము! ఎంత గౌరవము!" అని, ఆ భగవానుని సంపదలవైపునకు దృష్టి మరల్చుదుమేని ఈ ప్రపంచమునగల వస్తు సంపదలన్నియుఁ దృణప్రాయముగ మనకు తోచును. ఇవి అస్థిరములు. బరువుచేటు. వ్యసనము - భీతితో గూడినవి. ఈ భౌతిక సంపదలను గూర్చుకొనుచున్న కొలది వ్యసన భయములు హెచ్చుచుండును. మానవుని సుఖము ఈ భౌతిక సంపద్విశేషములలో లేదు. వానికెంత కావలయునో అంతమాత్రములో నున్నది.

ఈ భూమిపై మానవుఁడు చిరకాలము ఉండుటయు వ్యసనమే. ఆధ్యాత్మికవర్తనుఁడై మానవుఁడున్న కొలఁది యీ భౌతిక జీవన మసహ్యామగుచుండును. ఏలన లౌకికవిషయలంపటులైన యీ మానవుల దుర్నీతి దురాగతములను తెలివితో స్పష్టముగ గ్రహింప గలఁడు. ఎప్పుడెప్పుడు పాపవిముక్తులమై బంధములఁ ద్రెంచుకొందుమా!- యని నిరీక్షించు భక్తులకు (ముముక్షువులకు) తినుట - త్రాగుట - నిద్రించుట మేల్కొనుట - శ్రమించుట యింకను పెక్కు లౌకికావసరములకు లోఁగుటలు, నిశ్చయముగ వ్యసనములే యగుచుండును. ఈ ప్రపంచమున జీవించియున్నంత వరకు ఈ లౌకికావసరములు - ప్రాకృతకాంక్షలు ఈ జీవినిఁ గ్రుంగఁదీయుచునే యుండును. ముముక్షువైన భక్తుడు త్రికరణశుద్ధిగ దైవము నిట్లు ప్రార్థింపవలయును. "స్వామీ! ఈ లౌకికావసరములనుండి నన్ను వెలుపలకుఁ దార్చుము" - అని.

స్వకీయ వ్యసనము తెలియఁగనేరనివారు దౌర్భాగ్యులు. ఈ వ్యసన పూరితము దుర్నీతియుక్తమైన యీ జీవితమును ప్రేమించు వారంతకంటె నధిక దౌర్భాగ్యులు. కష్టించి యార్జించినను వారికి చాలినంతమాత్రమైన అవసరములు సమకూరుట కష్టమనుకొనువారు కొందఱు కలరు. వారెల్లకాలము స్థిరముగ నిందుందురేని దైవసన్నిధిఁ గూర్చి అట్టివారు తలంపనైన తలంపరేమో! ఆత్మవిశ్వాసములేక యీ నేల నంటిపెట్టుకొని ప్రాకృత విషయములు తప్ప ఇతరమున ఆనందింపలేని నరులు మిక్కిలి దుఃఖభాగులు. అటుల వ్యసనభాజులై తుదకు జీవితమంతయు ధారపోసి తాము ప్రేమించినవి ఎంత వ్యర్థములు నీచములో కదా! యని పరితపింతురు.

సాధులు - సత్పురుషులు - భాగవతులు ఈ ప్రాకృత వస్తువుల లెక్కింపక స్థిరసంపదలకై వారు నిండుకాంక్షతో శక్తివంచనలేక శ్రమింతురు. లౌకిక విషయములపై వారి చూపుమరలదు. శ్రేయస్కాముఁడు దైవప్రాప్తికై ఆత్మవిశ్వాసముఁ గోల్పోవ తగదు. ఇంకను వ్యవధి

కలదు. ఆ గడయు ఇంకను గడచిపోలేదు. మంచి పనికి రోజులు వచ్చుట అవివేకము. మేల్కొని యీ క్షణమున ప్రారంభింపఁ దగును. ఈ క్షణమే ప్రయత్నమునకుఁ దగిన సమయము.

కష్టములు కలిగి మనశ్శాంతిలేని కాలమే దైవధ్యానము నకు ఉత్తమోత్తమకాలము. నరుఁడు విశ్రమస్థానముఁ జేరుకొనుటకు నిప్పు నీరు దాటి రావలయును. ప్రతిఘటించి ముందుకు చొఱఁబడ వలయును. ప్రశాంత మనస్కులమై విశ్వాసధైర్యక్షమలతో మన ప్రయత్నమునకు గడంగవలయును. అకృత్యముల, దుర్వర్తనల గడచి మృత్యుజీవితమును గ్రసించు వరకు ఓర్పుతో వేచియుండవలయును. మానస దౌర్బల్యము మిక్కలి హేయము. ఎల్లవేళల చెడువైపునకే మనస్సు మ్రొగ్గుచుండును. ఈ దినము తన పూర్వపాపములఁగూర్చి పశ్చాత్తాపము పొందును. మరునాడు మరల పాపములకే నరుడు తొడగుచుండును. ఈ క్షణమున కృతనిశ్చయుడగును. మఱుక్షణ మున ఆ నిశ్చయమును విస్మరించును.

కావున మన మడఁగి యుండవలసిన అవసర మెంతేని కలదు. మన ఔచిత్యము ఘనతనుగూర్చి గర్వము తగదు. శ్రమించి పడపిన ఈ దైవానుగ్రహము కొంచెము త్వరలో చెడిపోవును. మన పలుకులలో పనులలో పవిత్రత లేక అంతయు శాంతిభద్రతలతో నున్నట్లు తలంచి అలసులమై యుపేక్ష వహించిన తుదకు విచారపడ వలసివచ్చును. ఆధ్యాత్మికాభ్యున్నతిఁ బడయఁదలఁచువాఁడు ఉత్సాహ బలపూరితులైన యువకులవలె నేటినుండి ముందుకు సాగు యత్నమున నుండవలయును.

ఈ సందర్భమున నానాసాహెబ్ చందోర్కరు ప్రాపంచిక కష్టవ్యసనములఁ గూర్చి బాబాకు విన్నవించినది. శ్రీ సాయీనాథుఁడు ఈ వ్యసనములఁగూర్చి తెలిపిన సమాధానము "శ్రీ సాయీనాథ బోధా మృతము" - **Charters and Sayings of Sri Sai Baba. Para 113, 114** నందు పాఠకులు చదువవలెను.

కహత సునత జగజాతహై - విషయనసూఝుయికాల్
కహైఁకబిర సున ప్రాణి యా - సాహిబ నామ సంహాల్,

ప్రాకృత విషయముల్ పలుకుచు వినుచు
నీకాలమెల్ల డిందెను; మోసమనుచు,
ఆసక్తిమై నిఁకనైఁన ద్రోయకుము
శ్రీసాయి కీర్తి భాషింపుము - వినుము!

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

ప్రార్థన :—

అనిశంబన్యజన ప్రవర్తన విమర్శాసక్త చిత్త ప్రవృత్తినిఁ బోకార్చి, నిజాత్మ సంస్కరణ బుద్ధిన్‌గూర్చి ప్రారబ్ధ కర్మవియుక్త వ్యసనాదులన్నిటి సహింపన్ శక్తిఁ జేకూర్చి, నిత్య నిరూఢిన్ నినుగొల్చు భాగ్యమిడుముయ్యా! సాయినాథ ప్రభూ!

16. మృతి తలంపు.

కబీర సూతా క్యాకరే - జాగీ జపో మురార్.
ఏక్ దిన హై సోవనా లంబే పాంవ్ పసార్.

అలస! నల్పుము సాయి హరినామ జపము
మెలఁకువ గనుము! ప్రామిని నిద్రవిడుము!
కాళులఁ జాపి దీర్ఘ సుషుప్తిఁగాంచు
కాలంబు చేరువఁ గలదని యెంచు!

నీంద నిశానీ మీాచకి - ఉఠో కబీరా జాగ్
ఔర రసాయన ఛాదికే - రామరసాయన లాగ్.

నిద్దుర మృతికి సన్నిహితమౌ మచ్చు
నిద్దుర విడి భవ నిర్వృతి నిచ్చు
హరి రసాయన మిదే యానుమో! భేల!
పెర రసాయనము లన్వేషింపనేల?

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

ప్రతి మానవుఁడు త్వరలో తన జీవిత సమాప్తి కానున్నదని, ఇఁక పరలోకమునందు తన స్థితియేమి కానున్నదో యోజించుకొనఁదగును. ఈ రోజున నిట మనము చూచు మనుష్యుఁడు రేపట అదృశ్యుఁ డగుచున్నాఁడు. దృష్టిపథమునుండి వాఁడు తొలఁగినపుడు మనస్సునుండియు నతఁడు శీఘ్రముగ తొలగిపోవును. మానవ హృదయము కఠినము, అవివేకపూరితమగుటచే ప్రస్తుత విషయమునే తలంచునుగాని, రానున్నదానినిఁగూర్చి లెక్క చేయదు. మృతి సన్నిహితమై యున్నదనియే మన తలంపులను మన పనులను నిర్ణయించుకొనఁదగును. బుద్ధి నిర్మలమైయున్న మృతినిఁగూర్చి నరుఁడు భయపడఁడు. మృతి బాఱినుండి తప్పుకొని పాఱిపోవఁ జూచుటకంటె పాపకృతులనుండి తొలఁగఁ జూడఁ దగును. ఈరోజున సిద్ధపడనేరనివాఁడు రేపట నెటుల సిద్ధపడఁగలడు? 'రేపు' అనునది నమ్మఁదగనిది. రేపటివరకు బ్రతికియుండఁగలమను నమ్మకమేమి కలదు? మన సాదన ప్రవర్తనలలో నేలవమేని మంచిమార్పు కలుగనియెడ చిరకాలము జీవించినను ప్రయోజనము శూన్యము. దినములు గడచిన కొలఁది పాపములు హెచ్చునేకాని జీవితము చక్కబడదు. మన జీవితమును చక్కగ నొక్కరోజు ఈ ప్రపంచమున గడపనేర్చినను చాలును.

మనము భగవానుని శరణుఁజొచ్చి యెంతకాల మైనది? యని లెక్కించువారలే కాని, మన జీవితము ప్రవర్తనలలో నెంత మార్పు కలిగినదని తలంచువారు అరిది. మృతియే యింత భయాస్పదముగ గణింపఁబడునెడ సత్ప్రవర్తన లేక యెక్కువకాలము

జీవించ తలంచుట ఇంతకంటె సహాయకరముగ పరిణమించును. ప్రతిక్షణము మృతిని తన దృష్టిపథము నందుంచుకొని, ప్రతి దినము ప్రాణ ప్రయాణమునకు సిద్ధపడువాఁడు ధన్యుఁడు. మృతి నొందిన వానినిఁ జూచునపుడు ఆ విధముగ మనముఁ జనవలసినవారలమే యని గుర్తించుకొనవలయును. ఉదయమైన రాత్రిలోపలనో, లేక అస్తమయమైన తెల్లవాఱులోపలనో మరణింపవలసి యుండుననియే జీవి తలంచవలయును. కావున సర్వసిద్ధముగనుండి మృతి తనను అజాగ్రతస్థితిలో గ్రసింపకుండునటుల జీవి తన జీవితము గడప నేర్వ వలయును. ఆ తుది క్షణము సమీపించిన నరుఁడు తన గత జీవితమునుగూర్చి మిగుల హతాశుఁడై ఆలోచించుకొనును. మిక్కిలి అజాగ్రతతో తన సదవకాశ మంతయుఁ గోల్పోయినవాడుగ చింతించును. మృతి సమయమున నెట్లుండవలయునని కోరుకొనునో జీవితమున నిప్పుడే అటులుండ శ్రమించువాఁడు ఎంత వివేకియో! ఎంత సుఖియో కదా!

ప్రాపంచక విషయములందు విరక్తి - సద్గుణోపార్జన మందాసక్తి; క్రమశిక్షణతోగూడిన ఇంద్రియ నిగ్రహము, ప్రపత్తి పశ్చాత్తాప అవృత్తులందు బాధ - వినయవిధేయతలకు సంసిద్ధత - దేహాత్మబుద్ధి (దేహమే తానను తలంపు) విడుట - నిర్మమత్వము - భగవద్బుద్ధితో కష్టముల నెన్నగ సహించుటలు మన కెంతయు విశ్వాస ధైర్య క్షమలను గూర్చి, మృతియెడ నిశ్చింత కలిగించి, సంతోషముతో దానినెదుర్కొనుటకు మనల సిద్ధపఱచును. నరుఁడారోగ్యముగ నున్నపుడే మంచి పనియైన చేయఁగలఁడు. వ్యాధిగ్రస్తుడైన నేమియుఁ జేయఁజాలఁడు. అధి వ్యాధులవలన బాధపడి, బాగుపడి ఆధ్యాత్మికముగ మంచి మార్పు నొందినవారు కొందఱు గలరు. లోకవిషయలంపటులై సంచరించు వార లెన్నటికి పవిత్రులు కాఁజాలరు. బంధుమిత్రుల విశ్వసించి ఆత్మశ్రేయస్సు వారికి విడిచిపెట్టదగదు. నరుఁడు గుర్తింపఁగలుగు పూర్వమే వారాతనిని పరిత్యజింతురు. ఇతరులు తనను ఉద్ధరింతురని ఇతరుల సహాయ మాసించి విశ్వసించుటకంటె మానవుఁడు

ముందుగనే తన జాగ్రతలో తానుండి దొఱకిన అవకాశము గోల్పోవక మంచి పనులు కావించుచుండవలయును.

ఇప్పుడు మనకుఁగల కాలము చాల విలువ కలది. విముక్తి కిఁ బ్రయత్నింప దగిన దినములివి. దేహ బుద్ధి బలములు క్షీణింపకున్న సమయమే అనుకూలమగు కాలము. సుస్థిర సౌఖ్యానందముల గూర్చు కొన దగిన కాలమున అలసులమై వ్యర్థముగఁ బుచ్చుట అవివేకము. నరుడిక ముందెప్పుడో చక్కఁబడఁగలనని ఆ గడియ ఆ క్షణము కొఱకు నిరీక్షించుచుండును. అట్టి అవకాశము కలుగునను ట నమ్మదగని మాట. ఈ క్షణమునుండి నరుఁడా ప్రయత్నమున నుండవలయును. మృతినిఁగూర్చి భయపడుటకంటె సత్యానందస్థితిని సంపాదించుకొన యత్నింపఁదగును. ప్రపంచమునకు జీవన్మృతుడైనవాఁడు భగవాను నందు జీవింపఁగలఁడు. ప్రాపంచక వస్తువులయెడ విరక్తి పొందగల వాఁడు దైవమును యథేచ్ఛగ ననుభవింపగలడు. ఇంతకు ముందు మనము కావించిన దుష్కృతులగూర్చి పశ్చాత్తాపము వహించి, దేహేంద్రియముల శాసింపనేర్చుదుమేని దైవమునెడ గాఢవిశ్వాసము పడయగలము.

ప్రపంచమున నెందఱు వంచితులై పంచత్వము నొందిరో గమనించవలయును. వాడు చంపబడెను. వీడు మునిగెను. ఒకడు పైనుండిపడి తల పగులగొట్టుకొనెను. వీడు తినుచు మరణించెను. వాడు క్రీడించుచు చచ్చెను. అను వార్తలు దినదినము ఎన్ని వినుటలేదు. ఒకడు నిప్పులోబడి, ఒకడు కత్తివ్రేటున, వేఱొకడు టుపాకి కాల్పున మఱియొకడు ప్లేగు మొదలగు వ్యాధుల చేత, ఇంకొకడు తస్కరులచేత హతుడైనటుల ఎన్నెన్ని మృతి వార్తలు మనము వినుట లేదు? ఇటుల మృతి జీవిత సమాప్తి - మానవజీవితము ఛాయవలె క్షణములో తలవని తలంపుగ ముగియును. మరణ వేళ మనకు దైవమును స్మరణకు దెచ్చువారు లేరు. మన కొఱకు ప్రార్థించువారు లేరు. మన కొఱకు ప్రార్థించువారు దొరకరు.

ఆజ కహే మై కాలభజు — కాల కహే ఫిర్ కాల్
ఆజ కాలకే కరతహీ - ఔసనరజానీ చాల్.

రేపందు పీనాడు - రేపు - రేపందు
వీపగిదిని కాల - మెడపె దేమందు?
రేపుకు రేపున్నె? రేపొక్క దినమ?
ఓపి నేడే పను - లొనరించుకొనుమ?

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

ఆత్మోద్ధరణకు గాని విషయముల దలంచ దగదు. భగవానుని భగవద్విషయములకంటె నితరముల లెక్కింపరాదు. భాగవతుల సత్పురుషుల సాంగత్యము సంపాదించుకొని, వారి యడుగుజాడల ననుసరింపనేర్చిన మన మీ స్వల్ప జీవితమున జయము పొందజాలకున్నను సాధు సత్పురుషులు కరుణించి మనల శాశ్వతానంద ధామమునకు జేర్చితీరుదురు.

ఈ భూమిపై మనుజుడు ఒక ఆగంతుకునివలె ఒక క్రొత్తవాడు. ప్రవాసి - యాత్రికునివలె భావించుకొనుచు ప్రాపంచక విషయములందు దగుల్కొనక - పట్టించుకొనక ప్రవర్తింప నభ్యసింపవలయును. తన హృదయము నిర్మలము గావించుకొని దైవాభిముఖము జేయవలయును. తనకీ జగమున నెక్కడనేని, నియామకమైన నగరము లేదనియు - తనదియని చెప్పుకొనదగిన వస్తువేదియు లేదనియే విశ్వసింపవలయును. శ్రేయస్కామియైన సాధకుడు ఇందు నిత్య ప్రార్థనలందు తన మనో విచారములను బాష్పమిళితముల గావించి భగవానున కందించుకొను చుండవలయును. అప్పుడతని ఆత్మ తనువును పరిత్యజించిన పిదప భగవానుని జేరుటకు అర్హత గలిగి యుండును.

భగవద్భాగవత సేవాభాగ్యము గనజాలిన మానవులకీ మృతినిగూర్చిన చింత తొలగును. సాధుసత్పురుషులే మృత్యుం

జయులు. వారు మృత్యువునకు మృత్యువైనవారు. ఈశ్వరుని లీలగా గుర్తించి వారు మత్యుఖేలనము నెఱుగుదురు. అట్టి సాధుసద్గురువులు, సమాశ్రయించు భక్తులకు మృత్యువు నెదుర్కొనుటకు దగిన శక్తిని బుద్ధిని బ్రసాదింతురు. సిద్ధపఱతురు. యుద్ధరంగమున బంధు మిత్ర సందోహమును వధింపనుంటినిగదా! యని విషాదము నొందు అర్జుననకు శ్రీ కృష్ణుడు బోధించిన విషయము గమనింపుడు!

వాసాంసి జీర్ణాని యథావిహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణాన్
అన్యాని సంయాతి నవాని దేహీ ॥

చినిగిపోయిన వసనముల్ మనుజు, డెటుల
దలగ జేసి వినూత్న వస్త్రముల దాల్చు
నటుల జీర్ణంబులైన దేహముల వదలి
అన్యనూతన కాయంబు లాత్మపొందు.

(భగవద్గీతామృతము 2-22)

ఐహికకామితముల జిక్కువడి, అహంకార మమకారములకు లోగి దేహబద్ధులు, దేహబుద్ధులు నైనవారికే యీ మృతి విషయక భీతి గలుగును. కాని, భగవద్భాగవత సేవాపరాయణు లైన వారికి మృతిని గూర్చిన భీతి వాటిల్లదు.

శ్రీ సాయీనాథుడు తన బిడ్డలకు ఈ మృతి భీతి నివారించుటకు బోధాచరణరూపమున ఎటుల చక్కదిద్దువాడో యీ క్రింది విషయముల గమనింపుడు! (Sri Sai Baba's Charters & Sayings) శ్రీ సాయీనాథబోధామృతము పేరా 314 - 330 వరకు దెలుపబడిన అంశములను పాఠకులగు సోదర భక్తులు సావధానముగ జదివిన, **మృతియన నేమియో - బాబా తనవారి నెటుల మృతి నెదుర్కొనుటకు సంసిద్ధుల గావించి భయము బాపెనో విశదము కాగలదు.**

పేరా 314 :— అప్పాకులకర్ణి కలరా వ్యాధిచే మరణింప నున్నపుడు అతని భార్య బాబానుజేరి 'ఉధి'ని ప్రసాదింపుమని ప్రార్థించెను.

సా. బా.— నీవు ఏల దుఃఖించెదవు? గిట్టుటకే మనుష్యుడు పుట్టినది. ఏదొక దినమున మనలో ప్రతి వ్యక్తియు మరణింపవలసినదే. చావు పుట్టుకలు దైవలీలలు. ఈ రెంటిని వేర్పఱుప జాలము. సకలమున దైవమనుస్యూతమై యున్నాడు. వాస్తవముగ పుట్టువాడెవ్వడును లేడు. ఎవ్వడు మృతి నొందడు. నీ అంతర్దృష్టితో జూడుము! నీవు దైవ మవని - దైవమునకు భిన్నుడవు కావని యెఱుంగుదువు. చినిగి చీకిన వస్త్రమువలె ఈ దేహము దైవముచే పాఱవేయబడినది నేను నా 'కుఫ్నిని' పాఱవేయు పూర్వము 'అప్పా'- తన దుస్తులను మార్చుకొన గోరినాడు. అప్పాను పోనిమ్ము! అతని నాపవలదు. 'ఉధి' కొఱకు అడుగవలదు.

వివేకముగలవారు 'మృతి' అనిన ఏడ్వరు. అవివేకులు దుఃఖింతురు. చూడుము! ఇంతదనుక ఈ ఐదు ప్రాణములు తాత్కాలికముగ నుపయోగించుకొనుటకు బదులు ఈయబడినవి. ఆ బదులిచ్చిన వాడు తన సొత్తును తాను తిరిగి రాబట్టుకొనినాడు. అవి తిరిగి ఆ యజమానుని జేరినవి. గాలి-గాలిని, అగ్ని - అగ్నిని, - ఇట్లు ఈ పంచభూతములు వాని స్వస్థానములను జేరుకొనినవి. ఈదేహము పృథ్వీకారము. భూతత్త్వమువలన కలిగినది. యథార్థముగ నివి యన్నియు నొకటే. కావున దేహము భూమిని జేరుట దుఃఖింప దగిన విషయము కాదు.

శ్రీ సాయీసహస్ర నామావళిలో మనము స్మరించుచు పూజించు నామములను గమనింపుడు!

"వస్త్రవద్వపుర్వీక్ష్య స్వేచ్ఛాత్యక్త కళేబరః"

(వస్త్రమువలె తన శరీరమును భావించి తన యిష్టానుసారము విడువ బడిన దేహము కలవాడు.

"వస్త్రవద్దేహముత్సృజ్య పునర్దేహం ప్రవిష్టవాన్"

(వస్త్రమును విడిచినటుల దేహమును విడిచి తిరిగి దేహమున ప్రవేశించువాడు.)

అని మనము బాబానుగూర్చి పూజాదులందు స్మరించుచు పూజించుచున్నారము. కావున శ్రీసాయీప్రభువు తన బిడ్డలకు ఆచరణపూర్వకముగ 'మృతి' యన నేమియో బోధించి ధైర్యము పాదుకొలుపువాడు. సమర్థ సద్గురు దేవుడగు శ్రీ సాయీనాథుని సమాశ్రయమువలన ఆశ్రితుడగు వానికి ప్రాప్తించునది "అకుతోభయత్వము"- (నభిభేతి కదాచన) దేనివలన భయములేని స్థితి. (నిర్భయము) బాబా అభయప్రదానము గమనింపుడు? **Why fear? While I am here?** ఇచట ఘంటాపథముగ అభయప్రదానము గావించుటకు సమర్థ సద్గురు స్వామియగు శ్రీసాయీనాథున కొక్కనికే చెల్లినది.

కావున శ్రేయస్కాముడగు వాడు లౌకిక విషయలంపటుడు గాక బుద్బుదప్రాయమగు ఈ తనువు ఏ క్షణముననేని డుల్లుట నిశ్చయమని గుర్తించి, యీ దినమున నీ నిముసమునుండి భగవానుని, తదభిన్నుడగు శ్రీసాయీ ప్రభువును సమాశ్రయించి ఆ తండ్రి బోధలను పాటించి, అనుసరించుచు జీవయాత్ర సాగింప నభ్యసింప దగును. శ్రీసాయీనాథుడట్టి బుద్ధి, శక్తి మనకు ప్రసాదించుగాతయని ప్రార్థించుదము.

ధరపై జీవిత మే క్షణంబున సమాప్తంబౌనో? యీ లౌకికా
ర్థరతిన్ ద్రోసిన కాలమెంతయును వ్యర్థంబయ్యె; నీ పాదపం
కరుహధ్యానము, నీ పదార్చకుల సాంగత్యాప్తిచే నింతనేన్
తరణోపాయము గూర్పగా గదె!; సమర్థా! సాయినాథ ప్రభూ!

17. శ్రేయస్కాముఁడగు సాధకుఁడు తన జీవితమును చక్కదిద్దుకొను చుండవలయును.

సాహిబ సోసబ హోతహై - బందే సోకుచ్ నాహీ
రాయీసే పర్వతకరే - పర్వత రాయీ మాహీ.

పరమాణువును గిరి వరముఁ గావించు
గిరిని రేణువుఁ గాఁగఁ గెరలి శిక్షించు,
సకలముఁ బొనరింపఁ జాలు శ్రీసాయి
ఒకఁడేని ప్రభు నాప నోపలేఁడోయి!

(శ్రీసాయీ కృప - శ్రీసాయీ కబీరు సూక్తులు)

శ్రేయస్కాముఁడగు సాధకుఁడు దైవసేవయందు జాగరూకత శ్రద్ధకలిగి యుండవలయును, "నే నెవఁడను? ఎక్కడనుండి వచ్చితిని? ఆ ప్రపంచమేల విడిచితిని?" అని యొవనికివాఁడు ఆలోచించుకొన వలయును. "దైవమును జేరి దైవముతో నుండుటకే - ఆధ్యాత్మిక ప్రపూర్ణత పడయుటకే" అని, మనకు సమాధానము స్ఫురించును. ముందంజ వేయుటకు తీవ్రముగ - మనఃపూర్వకముగ మనము సిద్ధపడవలయును. త్వరలో మన శ్రమకు దగిన ఫలము పొందగలము. అపుడు మన మార్గము భయదుఃఖరహిత మగును. ఇపుడించుక శ్రమించిన నిక ముందు గొప్ప విశ్రాంతి కలుగును. ఆత్మానంద మొదవును. నిండు మనస్సుతో - తీవ్రాసక్తితో మంచిపనుల గావించు వానియెడ భగవానుడు మిక్కిలి ఔదార్యము వహించి, బహూకరించును. విజయము పొందగలము - అను గాఢవిశ్వాసము వహింపవలయునేకాని, దైవభీతి విడనాడి, మన విధులందుపేక్షకాని, (నేను చేయుచున్నాడను - అను) గర్వముగాని తగదు.

ఎవరేని మనోవ్యాకులత భయ నిరాశలమధ్య ఆందోళిత మానసులై వ్యసనములచే నణచబడి, భగవానుని పాదములవ్రాలి ప్రార్థించుచు ధనలో "నేనింకను పట్టుదల తీవ్రత వహింపవలయు

నేమో! - తెలిసికొనగలనా? - అని తలంచువేళ ఆ భగవానుడు మన అంతరాత్మయై "నీవెఱిగిన నేమి? - ఎఱుగకున్ననేమి? ఎఱిగి ఏమి చేయుదువు? అది యిపుడు చేయుము! నీకు భద్రము కలుగును" - అని బోధించును. ఇటుల ఓదార్పు పలుకుల బడసి, దైవాధీన మనస్కుఁడై భార మీశ్వరునిపై నిలిపి తన ఆందోళనల మానును. తనకిఁక ముందు ఏమి కానున్నదో?- అను చింతయుఁ గనఁడు. దైవేచ్ఛ యేమియో దానినే కానిమ్ము! - అను నిశ్చయముఁ బడయును. ఏ మంచిపని విషయముననేని ప్రారంభ సమాప్తములు దైవేచ్ఛానుసారములై ప్రవర్తిల్లునని యతఁడు స్వానుభవమున గుర్తింపగలఁడు. కావున దైవమునందు గాఢవిశ్వాసము వహించి మనమెల్లప్పుడు మంచి పనులఁ జేయుచుండఁదగును. అపుడు మంచి ఫలములఁ బడయఁ గలము. శ్రీసాయీప్రభువు బోధలలోని సార మిదియే.

మన జీవితమునఁ దగిన మార్పును పొందించునవి రెండు కలవు. 1. మన స్వభావము ఏ ప్రాకృత విషయములచే నాకర్షింప బడునో వానినుండి మన యింద్రియములను మనస్సును మరల్చుట- 2. మనము కోరుకొను సుగుణసంపత్తి కొఱకు తీవ్రతతో పరిశ్రమించుట. ఇతరులకు ఏవిధమయిన బాధ కలిగించు మన ప్రవర్తనలను తీవ్ర ప్రయత్నమున మాపుకొనవలయును. మన మెచట నున్నను ఏమి పలుకుచున్న - చేయుచున్న ఆత్మకు శ్రేయములఁగూర్చువానినే కావించవలయును. మన మెందెందు ఏయే మంచి విషయములఁ గనిన వినిన వానిని స్వీకరింప నేర్వవలయును. మన మితరుల ప్రవర్తనలను పరీక్షించునటుల మన ప్రవర్తనల నితరుల వేయికన్నులఁ బరిశీలించు చున్నారనియే గ్రహింపవలయును.

భగవద్భక్తులకు భక్త్యుత్సాహ తీవ్రతలు సద్గుణ సదాచార సంపదలుగల సోదర భక్తుల సందర్శన సంస్పర్శన సంభాషణలు మిక్కిలి హృదయాహ్లాదకరములు మధురాతిమధురములు నగును. అటుల గాకదుష్ప్రవర్తనులు దుర్మార్గ చరులై, తామిట కేతెంచిన పనులను గమనింపబోవి వారలను చూచిన మిక్కిలి విచారము దుఃఖము కలుగును.

తమకు సంబంధము లేని విషయములందు మునుగుచు తేలుచు, తమ విధులను సమాచరింపబోనివారు అభాగ్యులు. దైవదత్తమై, మనము వరించిన వృత్తిని, గుర్తింపవలయును. ప్రతి వ్యక్తి ఆత్మోద్ధరణము దృష్టియం దుంచుకొనవలయును. మన గురుదేవుఁడైన శ్రీ సాయీ ప్రభువుయొక్క త్యాగనిరతిని మన మేపట్టున మఱవఁ దగదు.

ఇంతకాలమునుండి శ్రీ సాయీ భక్తులమై యుండియు, ఆ తండ్రి జీవితః రహస్యములను . బోధలను గమనింపక - గమనించియు ఆ మహాప్రభు మార్గము ననుసరింపక యున్నందులకు మనము సిగ్గు నొందవలయును. భక్తిపథమున తీవ్రాసక్తిగలిగి అనుసరించు సాధకుఁడు శ్రీసాయీనాథుని జీవితమును పరిశీలించినవానికిఁ గావలసిన సకల ఫలములను పొందఁగలఁడు. అంతకంటె మానవుఁడు కోరఁదగిన అర్థములు ఇంకెచటను లేవు. సర్వ సమర్థ సర్వత్యాగ పరాయణుఁడైన శ్రీ సాయీనాథుని మన హృదయమునఁ .జేర్చుకొందుమేని మన మతి త్వరితముగ సత్య ప్రబోధము పొందఁగలము. కావున మన హృదయమును "ద్వారకామాయి" మందిరముఁ గావించుకొనవలయును. యథార్థ సాయీ అనుయాయి దైవ విధానములను - ఆజ్ఞలను ఏ వేనిఁగాని సహన బుద్ధితో స్వీకరించి మెలగఁగలఁడు. అటులఁగాక అలసుఁడై, సంకుచిత బుద్ధి స్వార్థపరతలు గలిగి ప్రవర్తించువాఁడైన కష్టములపై కష్టములు పొందుచుండును. అన్నియెడల బాధలే చూపట్టును. ఏల? యన అట్టివానికి అంతరంగిక శాంతి లేదు. కావున, బాహ్యశాంతియు మృగ్యము.

క్రమశిక్షణలకు కట్టుపడని భక్తుఁడు ఆత్మవినాశకరములగు వ్యసనములకు లోఁగును. స్వైరప్రవర్తనము లౌకికవిషయాసక్తి గలిగి యుండువాఁడు. అస్థిమిత బుద్ధి గలిగి యుండువాఁడు ఎప్పుడు నేదొక అనిష్ట సంఘటనము నెదుర్కొనుచునే యుండును. నిండు మనస్సుతో నోరార భగవానుని కల్యాణ గుణలీలల కీర్తించుచు దైవమును స్మరించుటకంటె మనము చేయఁదగినది లేదు. తిని, త్రాగి, నిద్రించుటలే పరమార్థముగ భావింపదగదు. సర్వవ్యాపి సర్వనియంతయగు

భగవాను నేదొక రూపమున భజించుచు ఆధ్యాత్మికనిష్ఠ నభ్యసించ వలయును. అపుడు క్రమక్రమముగ ఆత్మానంద సుఖమును పొందఁగలము! అటులఁగానిచో ఈ తనూరక్షణార్థమై పెక్కు అవసరముల నన్వేషించు చుందుము. అవియొక పట్టున తీరునవి కావు. ఆత్మరతి ఆత్మచింతనామృత మేలేశమేని చవిచూచి, యీ మార్గము ననుసరించు సాధకుడైన భక్తుఁడు లౌకికవిషయములఁ గూర్చి తలంచఁడు. ఏ యితర జీవి వలన నే విధమైన సుఖము నపేక్షింపఁడు. తన గురుదేవునందే సకలము నపేక్షించును - ఆనందించును. ప్రాకృతార్థము లేవి లభ్యమైనను వానికి సంతుష్టి సంతృప్తులు కలుగవు. స్వల్పములగూర్చి విచారింపడు. గొప్పవానికి ఆనందింపఁడు. సక్రమాభ్యాస వైరాగ్యములవలన భక్తుఁడు భగవానునందు సంపూర్ణముగ హత్తుకొనును. అట్టి భక్తునకు దైవమే సర్వస్వము. ఆతనికి స్మృతి నొందునది యేదియు లేదు. సకలము భగవానునందే వసించును, జీవించును. ఆ తండ్రి ఆజ్ఞామాత్రమున క్షణములో సకలము చేరి సేవించును.

శ్రేయస్కాముఁడగు సాధకుఁడు తన చరమస్థితి నెల్లవేళల జ్ఞప్తియందుంచుకొనును. కడచిన కాలమెవరికిని తిరిగిరాదు. కావున జాగ్రత - తీవ్రత లేనియెడల నరుఁడు తగినపాత్రత బడయజాలడు. అలసత సంకుచిత బుద్ధివలన హాని కలుగును. నిరంతర కార్యదీక్ష, త్యాగబుద్ధివలన శాంతి, శ్రేయము కలుగును. గుణలుబ్ధుడైనవాని యందు దైవకరుణ ప్రసరించుచుండును. కాయిక శ్రమలకంటె దుర్గుణముల నివారించుకొనుట మిక్కిలి కష్టము. స్వల్ప దోషములని యుపేక్షించిఁ వాని నివారించుకొనఁ జూడమేని అవి పెరిగి క్రమక్రమముగ నలవిమాలిన వగును. పగలు శ్రమించితిమేని సాయంత్రమున ఆనందింతుము. సాధకుడగు భక్తుఁడు తన ప్రవర్తనమును జాగ్రతతో గమనించుచు చక్కదిద్దుకొనుచు హెచ్చరించుకొను చుండవలయును. ఎవరెట్లు ప్రవర్తించుచున్నను శ్రేయస్కాముఁడు తనను దానుపేక్షింప దగదు. ఆధ్యాత్మిక పథమున మన మెంతెంత పురోగమించుదమో అంతంత సత్ఫలము బడయుచుందుము.

ఈ సందర్భమున శ్రీసాయినాథుఁడు 'దామియా'ను పురస్కరించుకొని మనకుఁదెలిపిన పరమ బోధను లెస్సగ జ్ఞప్తియందుంచుకొన దగును. (C ters & Sayings) "శ్రీసాయినాథ బోధామృతము" పేరా 276

"సంతృప్తి శరణాగతి"

దైవము గొప్పవాఁడు. అతఁడు మహాప్రభువు. "అల్లా మాలిక్"- దైవమెంత గొప్పవాఁడు! అతనితో నెవరు సమానులు కారు. అద్వితీయుడు. అతడీ సకలమును సృష్టించి, పోషించి, లయింపజేయువాఁడు. ఆ తండ్రి లీల లనూహ్యములు.

మన తలంపులన్నిటిని ఆయన ఆధీనములఁ గావించి, ఆ ప్రభుపు మనల నిలుపఁదలచిన విధమున నిలుచుటకు సంతృప్తి నొందుదము"- "అల్లా రఖేగా వైసా రహేనా" ప్రాప్తించినదానిని స్వీకరింపుము. సంతృప్తి సంతోషములఁ బొందుము. ఎన్నఁడును ఆందోళన వహింపకుము. ఆ తండ్రి సమ్మతి సంకల్పము లేక ఒక ఆకేని కదలదు.

ఋజుభావము - నిర్భయము - సాధుత్వము గలిగియుండవలయును. మన ధర్మములను విధులను శ్రద్ధతో నిర్వర్తించుచుండవలయును. కాని మన పనులకు మనమే కారణములము. కర్తలము. అని తలంచి యే క్షణమందేని మోహ విభ్రాంతులను పొందరాదు. కర్త దైవమే. ఆయన స్వాతంత్ర్యము - మన పారతంత్ర్యమును గుర్తించి, సకల కార్యములు అస్వామివిగనే, మనము కేవలము ఉపకరణములని తెలిసికొనవలయును. అట్లు కావించిన మనము నిర్లిప్తులమై కర్మబంధములనుండి విడివడుదుము.

**'దామియా' ఆకసము వందుకొనఁజూచుచున్నాఁడు. భగవాను అతనికి ప్రసాదించిన దానిని నిలుపుకొని సంతృప్తిని పొందదలచుట లేదు."**

ప్రార్థన :–

ఆత్మ చింతన మనిశంబు హత్త చేసి,
స్వీయ విధ్యుక్త ధర్మముల్ చేయబంచి,
"కర్తవగు దీవ వీడుపకరణ"మనెడి
భావమును పాదుకొలిపి, నీ పదసరోజ
భక్తి, నీ నామ కీర్తనాసక్తి గూర్చి
చక్కదిద్దవే! సద్గురు సాయిదేవ!

ద్వితీయ పాదము – సమాప్తము.

ఓమ్

# శ్రీ సాయీ అనుసరణము

## తృతీయ పాదము

1. ఆధ్యాత్మిక జీవనము.

"ఆగే పీఛే హరిఖడా - అపన హరేభార్
జనకో దుఃఖీ క్యోంకరే - సమరథ సిరజనహార్."

పొందుగ నీ భారమును సర్వమూని
ముందు వెన్కల నుండ భూసుతాజాని;
కుందెదవేల? కన్గొను రామసాయి
మందుడా! సర్వసమర్థుడౌనోయి!

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

శ్రీ భగవానుని పరంధామము మన లోపలనే కలదు. అనిత్యమసుఖమైన లోకమున బ్రవర్తించుచున్నను దీని నంటిపట్టుకొని యుండక మన మనస్సును భగవానునివైపునకు మరల్చు చుండవలయును. అపుడు మన మాత్మశాంతిని బడయగలుగుదుము. బాహ్య వస్తు విషయములందాసక్తి విడనాడి మనలోని వానియందు దృష్టి నిలుప నేర్వవలయును. మన హృదయమును ద్వారకామాయి దివ్యమందిరముగ శుద్ధముగ నుంచుకొనవలయును. అపుడు శ్రీ సాయీ భగవానుడు మన హృదయసీమను విడనాడక మనల ననుగ్రహించుచు సత్క్రమ మార్గమున నడుపుచు గమ్యమును జేర్చును. ఆ తండ్రి సకలైశ్వర్య సౌందర్య సంపదలు లోపలనుండియే ప్రకాశించును. అందే తనలో తాను రమించుచుండును. మన ఆత్మనే

అతడు పరీక్షించును. ఆత్మతోడనే సంభాషించును. శాంతినిడును. ఓదార్చును. అత్యద్భుతముగ పరిచయము కలిగించుకొనును. ప్రతి జీవియు తన ప్రియతముని కొఱకు తన హృదయ మందిరమును విడనాడకుండునట్లు చేసికొనదగును.

(S. C. S. 20) "నిండు మనస్సు నాకర్పించి నాయందు విశ్రమించువాడు. తన దేహమును గూర్చియేని, తన ఆత్మను గూర్చికాని భయపడవలసిన పనిలేదు. నన్నొక్కనినే చూచుచు, నన్ను గూర్చియే వినుచు, పలుకుచు నాయందే భక్తి సలుపువాడు (చైతన్యమును) దైవమును పొందును. నిత్య శుద్ధబుద్ధునిగ నన్ను సేవించువాఁడు నన్ను చేరును." అని బాబా పలికినాడు.

శ్రీ సాయీ మహా ప్రభువునకు స్వాగత మీయుదము. ఇతరమును బహిష్కరించుదము. బాబా మన యందుండెనా మనము మహాభాగ్యశాలురము. సర్వసంపత్సమృద్ధి గలవార మగుదుము. ఆ తండ్రియే మనకు ప్రాపు, కావు, సర్వసంరక్షకుడు. విశ్వాస పాత్రుడు, తోడునీడయై సర్వగతుల సహాయకారి యగును. అపుడు మన మితరులఁ జేర నక్కఱలేదు. నమ్మవలసిన పనిలేదు. మానవులు చంచల స్వభావులు. క్షణములో మాఱుదురు. త్వరలో తోటివానిని దిగవిడుతురు. శ్రీ సాయీనాథు డటులకాదు. తను నమ్మినవాని నంటికొనియే యుండును: తుది వరకు - గమ్యము జేరు నంతదనుక తోడునీడయై యుండును. ఈ రోజున మన పక్షమున నున్నవాడు రేపు మనకు వ్యతిరేకియై కష్టనష్టముల గలిగించు చుండును. చంచల చిత్తులగు మానవులు గాలివలె నటునిటు ప్రవర్తింతురు. శ్రీ సాయీ ప్రభువునందే గాఢ విశ్వాసము వహించి, మన భయస్థానము ప్రేమ స్థానముగ బాబానే మనము చేసికొనవలయును. ఆ తండ్రియే మనకు "పూటగ" ("బాసటగ") నిలిచి హితకామిత క్షేమములను ప్రసాదించును.

మనకీ ప్రపంచమున నెక్కడ కాణాచియైన నగరము లేదు. ఎచ్చట నున్నను క్రొత్తవారమే. యాత్రికులమే. పాంథులమే. అంత

రంగికముగ శ్రీసాయీశు నంటుకొని యుండమేని మనకు శాంతి విశ్రాంతులు లేవు. మన మిందందు నటమటించుట నవలోకించుటకు కారణము ఇది మనకు నివాసము కాకపోవుటయే. మన నివాస మా పరంధామమే యగును. ఈ ప్రపంచమునగల సకలము మన మార్గ మధ్యమున మనకు గోచరించునవియే యగును. సకలము పొడముచు నంతరించుచుండును. ఈ ప్రాపంచక వస్తువులతో నంటుకొని యుండక జాగ్రతపడ వలయును. అంటుకొని యుంటిమా వానితో గూడ నశించవలసిన వారమే. ఆ పరమపదమునందే మన తలంపు నిలుపుకొని, శ్రీసాయీ కరుణ మనపై ప్రసరించు విధమున నిరంతరము ప్రార్థించుచుండవలయును. ఆ దివ్య ఆధ్యాత్మిక దృష్టి నిలుపుకొన జాలమేని శ్రీసాయినాథునందే గాఢప్రేమ వహించుచు బాబా పదములనే అంటుకొని యుండదగును. బాబా పాదములను మనస్సునందు నిలుపుకొనువారు కష్టములం దూరట గాంతురు. మానవులు గూర్చు అపఖ్యాతులకు జలింపరు, అస్థైర్య పఱచి బుద్ధిని చలింపజేయు పలుకులను, అవహేళనములను సహింపనేర్తురు. శ్రీసాయీ ప్రభువు నిందలకు, బాధలకు గుఱియై కష్టముల సహించి తన్ను ద్వేషించు దూషించువారిని సైతము ప్రేమించి ప్రేమతత్త్వము మనకు ప్రదర్శించినాడు.

కష్టములే మనకు కలుగకున్న మన ఓర్పు ఎటుల సార్వభౌమ పీఠ మధిష్ఠింప గలదు? ఏ కష్టములను సహింపగోరమేని మనము సాయీప్రభువున కెటుల ఆప్తులము కాగలము? "గరీబ్ కో అల్లా వాలీద్ హై" – (దీనశరణ్యుడు, రక్షకుడు, భగవానుడు) అని బాబా తఱచుగ తన బిడ్డలకు దెలుపుచుండువాడు. సాయీ ప్రభువుతో ఆనందింపదలచిన, సాయీనాథునితో కష్టపడవలయును. శ్రీసాయీ కొఱకు కష్టముల సహింపవలయును. ఎప్పుడే నొకప్పుడైన శ్రీసాయీశునితో నేకాంత మందిరమున జేరియుండువాడు, ఆ తండ్రి ప్రేమామృత మొక బిందువేని రుచిచూచి యుండువాడు అవకాశ అనవకాశములను లెక్కింపడు. ఇతరులు తనపై మోపు నిందలను, దూషణలను సహించి ఆనందించగలడు, ఏలన శ్రీసాయీ ప్రేమ తద్ధను

చరుని దురభిమానమును నిర్మూలించును. సత్యవస్తువగు శ్రీసాయీ శుని ప్రేమించువాడు యథార్థ సాయీ అనుచరుడు. ప్రాపంచక వస్తు ప్రేమను విడనాడినవాడు సులువుగ దైవాభిముఖుడు కాగలడు, అధ్యాత్మికోన్నతి బడయగలడు. శాంతి సుఖముల నుపార్జించు కొన గలడు. ఈ లౌకికవస్తు సంచయములగూర్చి యితరులు పలుకుచు శ్లాఘించునటులగాక స్వానుభవమున నిర్ణయించుకొనువాడు వివేకి.

చేతశ్చంచలతాం విహాయ పురతస్సంధాయ కోటిద్వయం
తత్రైకత్ర నిధేహి సర్వవిషయా నన్యత్రచ శ్రీపతిమ్
విశ్రాంతి ర్హితమప్యహో! క్వను తయోర్మధ్యేతవాలోచ్యతాం
యుక్త్యావానుభవేన యత్రపరమానందశ్చ తత్సేవ్యతామ్,

మనమా! చంచలతన్ ద్యజించి కొనిరమ్మా! త్రాసు; నీ కోరువ
స్తునికాయం బొక పళ్లెరంబునను గృష్ణున్ వేఱొకన్ నిల్పి; రెం
టను - విశ్రాంతి హితంకరంబు బరమానందంబెదో - దాని, యు
క్తినిగానీ, యనుభూతినైని, దృఢబుద్ధిన్ దేల్చి సేవింపుమా!

(ప్రబోధసుధాకరము - శంకరభగవత్పాదులు)

బాహ్య విషయములను తృణీకరించి శ్రీసాయీపద నిష్ఠుడై యుండువాడు అధ్యాత్మిక సాధనకు ప్రదేశకాలాదులగూర్చి యాలో చింపడు. అంతర్ముఖుడైనవాడు ఇంద్రియముల నధీనమందుంచు కొనును. జీవికకు అవసరములైన లౌకిక వ్యాపారములందు పాల్గొను చున్నను నిస్సంగుడై నిర్లిప్తుడై ప్రవర్తించుచుండును. అంతరంగిక క్రమశిక్షణ అలవడిన వాని సకల కార్యములు వాని మేలునకే పరిణ మించుచు అధ్యాత్మిక పురోవృద్ధిని గూర్చుచుండును.

అహంతను సంపూర్ణముగ నిర్మూలింపలేని వానికి - భౌతిక విషయాసక్తినుండి విడివడలేని వానికి - పెక్కు విషయములు అనిష్ట మునుగూర్చి బాధించుచునే యుండును. ఈ ప్రాకృత వస్తుసంచ యముపైగల స్వార్థప్రేమయే మానవుని హృదయమును మలినము

గావించి బంధించుచుండును. సత్యసుఖశాంతులీ యింద్రియ గోచరములగు లౌకిక వస్తువులందు లేవని స్వానుభవమున దెలిసికొనజాలినవాడు ఆధ్యాత్మికానంద ప్రాప్తిని బడయగలడు. ఆధ్యాత్మిక జీవనముగూర్చి శ్రీ సాయీ ప్రభువు మనకు దెలిపిన విషయములను గ్రహించుదము. శ్రీ సాయీనాథ బోధామృతమున ఈ విషయములు గ్రహింపదగును. అని (Scs. Pera 120) బాబా తఱచుగ బలుకువాడు.

"మనమెవరము?"- అను దీనినిగూర్చి రేయింబవళ్ళు తలంచుచుండును! ఆర్. ఎ. తార్కాడ్ - 1915న బొంబాయిలో ఒక మిల్లు కార్యనిర్వాహక భాగస్వామి శిర్డికి వచ్చుచు 'మన్మాడ్ స్టేషన్‌దగ్గఱ రైలుపెట్టిలో నెక్కి స్థలముకొఱకు ఒక పోలీసు ఉద్యోగితో తగవులాడెను. తార్కాడ్ శిర్డికి జేరి బాబాకు మ్రొక్కెను,

సా, బా:— ఉదయమున నెవరితో వాదించుచు తగవులాడుచుంటివి? భావ్! (సోదరా!) అట్టి జనులతో మనమెప్పుడు తగవులాడరాదు. "మనమెవరము?" - అని విచారణ చేసికొనవలయును.

తార్కాడ్ తొలుత బాబా తెలిపిన అంశము సాంఘిక సమరస సమత్వభావము పెంపొందించుకొనదగునని తలంచెను. ఆ తరువాత యీ (వాదోపవాదములు చేయువారు) యిరువురు ఆధ్యాత్మికముగ ఏకమేకాని, భిన్నులుకారు - అని గ్రహించినాడు.

"త్వయిమయి సర్వత్రైకో విష్ణుః వ్యర్థం కుప్యమయ్య సహిష్ణుః"

సా. బా:— బాలభావ్‌తో - (సీతారాం దేవ్) మన మెఱుగవలసినది. మన 'ఆత్మ' మాత్రమే.

(S. C. S. Pera 119) శ్రీ సాయీప్రభువు తానెవరో నిర్గుణ తత్త్వమున, సగుణ తత్త్వమున దెలిపిన విషయములు పాఠకులు గ్రహింపదగును.

ప్రార్థన:—

తనువే 'నే' నను బుద్ధిమై స్వపర భేద భ్రాంతి, జీవాళియం
దనురాగంబును ద్వేషమున్ బఱపి సర్వాంతర్యామియౌ నిన్నొగిన్
గనలేకుంటిని, నీ పదాశ్రితుడ - "నీ-నా" లక్షితాధ్యాత్మ భా
వనిరూఢిన్ ఘటియించి ప్రోవగదె! దేవా! సాయినాథ ప్రభూ!

2. ప్రపత్తి (అడకువ)

స్వర్గమృత్యుపాతాళమే పూరతి నసుఖనాహి
సుఖసాహిబకే భజనమే - అరుసంతనకే మాహి.

తగ స్వర్గమర్త్యపాతాళలోకముల
నెగడదు సుఖము గడింప నేగతుల
సాయి చింతనమున - సాధుసంగమమున
జాయని సుఖము చెప్పుడు నెందు జనిన.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

శ్రీసాయీ ప్రభువునకు సంపూర్ణ శరణాగతిజేసి నిరంతరము స్మరించుదము. బాబా యెల్లవేళల బ్రహ్మనిష్ఠుడయ్యు నెల్లర నెల్ల వేళల గాపాడుచునే యుండును. శ్రీసాయీ స్మరణము సంసార తాప త్రయ హరణము. వ్యయప్రయాసలు లేని సర్వ సులభమార్గమిది. ఏ స్వల్పకాలమేని శ్రీసాయీ స్మరణమునకు వ్యయపెట్టు జీవి మహా భవ భయమునుండి తప్పుకొనగలడు. సకలేంద్రియములు స్వాధీనమం దున్నపుడే మన మీసాధనమునకు గడంగవలయును. సమర్థ సద్గురువు శ్రీసాయీప్రభువు ప్రత్యక్షదైవము. శ్రీ సమర్థ సద్గురుదేవ పాదరాజీవ ముల దలంచు క్షణముననే మన జీవితమున మేలు చేకూరును. ఆ తండ్రిని సేవింప నేర్చిన సంసృతిబంధ మెడలును. వేదవేదాంగాదుల తోడను శమదమాద్యష్టాంగ యోగసాధనముల తోడను సతతమతమ్ము

కావలసిన పనిలేదు. సంసారసాగరమున గూలిన మనము శ్రీసాయీ భక్తిపోతమున జేరి శ్రీసాయీనాథుని కైవర్తకునిగ జేసికొనదగును. సకల జలాశయముల నౌకలపై జనుల దాటించు కర్ణధారులవలె శ్రీసాయీ ప్రభువు మనకు కర్ణధారియై భవవారిధిని సుక్షేమముగ దాటింపగలడు. కావున మనము సమర్థసద్గురు దేవుడగు శ్రీసాయీ ప్రభువును సమాశ్రయించి సంపూర్ణ శరణాగతి (ప్రపత్తి) చేసి, మనకు గలవనుకొనుచున్న సకలము ఆతండ్రి ఆధీనము గావించి, బాబాచేతి లోని ఉపకరణమువలె మన జీవయాత్ర గడపుట శ్రేయస్కరము. బాబా మనవలన ఆసించునది నిర్వంచిత భక్తి ప్రేమ - గాఢ విశ్వాసము. ధైర్యముతోగూడిన ఓర్పుమాత్రమే. అటులదన్ను ప్రేమించి సేవించు భక్తులకు బాబా సచ్చిదానంద స్థితిని ప్రసాదింపగలడు.

"మనకు అనుకూలురెవరు? - ప్రతికూలు రెవరు?" అను యోచన ఎప్పుడు తగదు. మన స్థితిని మనము పాటించుకొనుచుండ వలయును, దైవము మనవెంటనుండి మనము తలంచు ప్రతి తలంపును, చేయు ప్రతిపనిని గమనించుచున్నాడని జాగ్రత వహింపవల యును. మనము మంచి గలిగియుండిన దైవము మనల నాదుకొని యుండును. భగవానుని రక్షణమునందున్న వానికి నెట్టి విపరీత ప్రవర్తనముగల జీవులేని హాని జేయలేవు. ఇతరుల విపరీత వర్తనల బాటింపక మౌనము వహించి సహించు వానిని దైవము తప్పక అనుగ్రహించును. ఎప్పుడెటుల మనల ననుగ్రహింపవలయునో దైవమునకే యెఱుక. శ్రేయస్కాముడగువాడు దైవమునకు సంపూర్ణ శరణాగతి జేసి నిశ్చింతగ నుండుటయే దగినపని. సకల భ్రాంతులనుండి మనల విముక్తుల జేయవలసిన భారము దైవముపైననే నిలిచినది. మన దోసగుల నితరులు గుర్తించి మనల నిరసించినపుడు మన మడకువ గలిగియుండుటయే మనకు లాభదాయకము. మానవుడు తన లోపములను స్వయముగనో యితరులవలనో తెలిసికొని యడకువ గలిగియుండు వేని అతడితరులకు శాంతి గలిగించి. తనచే బాధింపబడినవారికి తుష్టి తృప్తులబఱుపగలడు, దీనులను అకించనులను అడకువగలవారలను

దైవము రక్షించి విముక్తుల గావించును. వినతుల బ్రేమించును. ఓదార్చును. అపార కరుణను బ్రసరించును. దైవము కల్పించు అడకువ పరీక్షలో నెగ్గినవాని నున్నత స్థానమునకు దార్చును. తనరహస్యముల బ్రకటించును. పరమప్రేమతోఁ జేరదీసికొని తనయం దైక్యము జేసికొనును. అడకువగలిగి ప్రపత్తి గావించినవాడు బ్రపంచముపై నాధారపడక దైవమునందే హత్తుకొనియుండును గాన అగమ్యస్థితిలో బడినను సహన బ్రశాంతుల గోల్పోవడు. సకల జీవముల కంటె 'తాను కనిష్ఠుడు' - అని గుర్తింపఁజాలనంతవరకు సాధకుడగువాడు ఆధ్యాత్మిక పథమున బురోగమించినవాడని తలంచరాదు.

ఈ సందర్భమున శ్రీ సాయీప్రభువు మనకు దెలిపిన విషయములను గమనింపదగును. (S. C. S. 110) "అతడు నాకు విరోధి" యని యెవరినిగూర్చి పలుకకుము. ఎవఁడు ఎవనికి శత్రువు? ఎవని యెడలను ద్వేషభావము నీ హృదమున జేరనీయకుము. ఈ సకలము ఏకము - అభిన్నము.

మఱియొక సందర్భమున బాబా పరస్పర భేదము అసత్యమని నానాసాహెబ్ చందోర్కరుతో దెలిపిన విషయములు గమనింపదగును.

"ఋణానుబంధమున జేసి నీవు నన్ను జేరితివి. ఇట్టి ఋణానుబంధము నాదరింపుము. ఏ ప్రాణియైన నిన్ను జేరెనేని నిరసించి వెడల నడవకుము. సాధ్యమగున ట్లాదరింపుము. ఆకలిగొన్నవానికి అన్నము, దప్పిగొనినవానికి నీరము, వస్త్రహీనునకు వస్త్రము యథాసాధ్యముగ నొసగుము. అట్లు కావించితివేని భగవానుడు సంతసించును. ఇతరులపై అగ్రహావేశముల బ్రకటించి కటువుల బలుకకుము! ఇతరులతో కలహింపకుము. ఇతరుల నిందించిన ఓర్పు వహింపుము. శాంత వచనముల బలుకుము. ఇది సుఖప్రాప్తికి మార్గము. ఇతరులు - ప్రపంచము - తలక్రిందులు గానిమ్ము. దానిని నీవు పాటింపకుము. చలింపక ముక్కునకు సూటిగ నీ మార్గమున బొమ్ము!

ఈ ప్రపంచమున నిన్ను - నన్ను, ఒక జీవినుండి మఱి యొక జీవిని వేర్పఱచు గోడ "భేదకుడ్యము" కలదు. ఈ గోడను పడ గూల్చుము. భగవానుడే మహాప్రభువు. ఆ దైవకార్యము, లీలలు అద్భుతములు, అమూల్యములు - శాశ్వతములు. క్రమక్రమముగ నీ ఆశయములు ఫలించును. మనము పరస్పరము ప్రేమాభివృద్ధి బడపి శాశ్వతానందము పొందగలము." అని బాబా బోధించినాడు

S. C. S. 140 (శ్రీ సాయీనాథ బోధామృతము)

ప్రార్థన:—

సకలంబందున నీవ పొల్చదు; తలంచన్ చేతనాఽచేతనా
త్మక విశ్వంబుననీవ; వేఱయిన తత్త్వంబెందునున్ లేమి, వీ
నికి బింబ ప్రతిబింబ మాత్రమనుమీ "నీ-నా" స్వరూపస్వభా
విక దృష్టిన్ ఘటియింపగాగదె! కృపాబ్ధీ! సాయినాథప్రభూ!

3. శాంతముగల మానవుడు సాధువు.

సావధాన ఔ శీతలతా - సదా ప్రఫుల్లితగాత్
నిర్వికార గంభీరమత - ధీరత దయా బసాత్
నిర్వైరీ నిష్కామతా - స్వామీ సేతీ నేహ్
విషయా సోన్యారా రహే - సాధునకామతయేహ్.

చల్లని మనమున సావధానతయు
పుల్లిత కాయ మేపునదోప మఱియు
కన వికారము లేక గంభీర మనమున
ననిశము ధైర్యదయాదృష్టి తనర.

కామితంబుల వీడగని, వైరముడిగి,
ప్రామిన ప్రేమ నీశ్వరునందు గలిగి,
యలరు నాతడు సాధువనబడుచుండు;
పొలుచు నియ్యవి సాధువుల బాయకుండు.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

మనము ముందు శాంతి వహింపదగును. ఆ పిదప నితరులను శాంతింపజేయగలము. అశేష విద్యల గడించిన వానికంటె ప్రశాంత స్వభావుడు ఎక్కువ మేలు చేయగలడు. ఉద్రేకియైనవాడు మంచినిగూడ చెఱచి వేయును. అత్యంత హాని నుపార్జించుకొనును. మిక్కిలి సాధువైనవాడు సకలమును మంచిగా మార్చగలడు. ప్రశాంతస్వభావు డెవరిని అనుమానింపడు. సంతృప్తిని బాసి చంచల చిత్తుడైనవాడు నానావిధ సంశయములతో నుజ్ఝాతలూపబడుచుండును. వానికి శాంతిలేదు. ఇతరులకు శాంతి కలుగనీయడు. అట్టి వాడు పలుకదగనివి పలుకుచుండును. అవసరములైన పనులను వినుచుండును. ఇతరులు చేసితీరవలసిన వానిగూర్చియే ఆలోచించుచుండును గాని తన విధ్యుక్తములను పాటింపడు. శ్రేయస్కాముడు ముందుగ తననుగూర్చి తాను జాగ్రత పడవలయును. ఉత్సుకత వహింపవలయును. అపుడు ఇతరులకు మేలుగూర్చు ఉత్సుకత చక్కగ ప్రకటింపగలడు. ఆకృతమతి తన పనుల లోన లోపముల గప్పిపుచ్చి వెలికి నేవియో మెఱుగులు పెట్టజూచుచు నితరులు తమ పనులలోని లోపముల దెలుపుకొన, క్షమింప నంగీకరింపడు. కావున శ్రేయస్కామి తన్నుదాను విమర్శించుకొని యితరుల క్షమింప నేర్వవలయును.

మనల నితరులు సహింపవలయునని తలంతుమేని ఇతరుల యెడ మనము సహనము పఱపనేర్వవలయును. సత్యత్యాగమునకు - అడుగడుగున నరుడు తానెంత దూరముగ నున్నవాడో గమనించుచుండవలయును. అట్టి యెఱుకగలవాడు ఇతరులయెడ కోపము వహింపడు. ఇతరులు నిరసించిన చలింపడు. తనను గూర్చియే పరిశీలించుకొనుచు

తనను మాత్రమే నిరసించుకొనుచుండును. మంచివారితో చెలిమి చేయుట ఒక గొప్పవిషయముకాదు. ఇది అందఱకు సంతోషదాయకమే. ప్రతినరుడు శాంతి నానందించును. తనతో నేకీభవించువానిని మిక్కిలి ప్రేమించును కాని, కఠినులతో, పెడబుద్ధిగలవారితో అక్రమవర్తనులతో, మనల వ్యతిరేకించువారలతో ప్రశాంతముగ వర్తింపగలుగుట అపార దైవకరుణయే. అది ప్రశంసనీయ విషయమే యగును అదియే సత్యమగు పౌరుషము.

తాము ప్రశాంతులై యితరులతో ప్రశాంతముగ నుండువారు కొందఱు గలరు. వారు శాంతి వహింపక యితరులను శాంతి వహింపనీయనివారును కలరు. అట్టివా రితరులకు బాధ కలిగించుచుందురు. కొందఱు ప్రశాంతులజేయ యోజించుచు మార్గముల నన్వేషించువారును కలరు. ఈ దుఃఖభూయిష్టమైన జీవితములనుగూర్చి తలంచుకొనుట్టకంటె, ఆ కష్టముల నడకువతో సహించుటలోనే మన సర్వ ప్రశాంతి యిమిడియున్నది. సహనమును గూర్చి చెప్పగ నెఱిగినవాడే ప్రశాంతి సహించుటలో నుత్తమోత్తముడు, వాడు సకలమును జయించినవాడు, ప్రపంచ చక్రవర్తి, శ్రీసాయీప్రభువునకు పరమాప్తుడు, మోక్షసామ్రాజ్యమునకు వారసుడు.

శ్రీసాయీప్రభువు తన ఆశ్రితునకు ఎల్లవేళల సమరస సమన్వయ భావము గలిగి, యితరుల పనులలో అనవసర జోక్యము కల్పించుకొనక తన విధులను తాను నిర్వర్తించుకొనుచు భూమ్యాకాశములు తలక్రిందు లగుచుండినను తన స్థానమునుండి తాను తొలగరాదని బోధించినాడు. (S. C. S. 289) "స్పర్థ – జగడములను మానుకొంటివా భగవానుడు నిన్ను రక్షించును. కీడునకు కీడు చేయకుము. దెబ్బకు – దెబ్బ తనకుము. కీడునకు తిరిగి మేలుచేయుము! ఇతరుల మాటలు నీకు హాని కలిగింపలేవు. (S. C S. 290, 91 చూడుము)

S. C. S. 526 బాబా - భక్తుల తలంపులను మన్నించుట. ఇతరుల జోక్యమును సహింపకపోవుట. విషయము గమనింపుడు!

సా. బా:— (ఒకనాడు) నా కడుపు నొప్పిగ నున్నది.

అంతట "మావుషే" కాల్చిన యిటుక రాతితో బాబా పొత్తి కడుపుమీద కావు కాచెను. ఆ పిదప నామె తనబలముకొలది నతి తీవ్రముగ బాబాపొత్తికడుపు నిరుప్రక్కల నొత్తుచుండెను. అచట నున్న యస్. బి. నాచ్నే "అవుము! ఆవుము! మెల్లగ నొత్తుము! బాబాకు బాధకలుగును" — అనెను.

సా. బా:— వెలుపలకు పొమ్ము! ఇతరుల పనులలో జోక్యము కల్పించుకొనకుము.

(S. C. S 284) [శ్రీసాయినాథ బోధామృతము] దాదా కేల్కారువల్లి.

ఇతరుల ఆహారవ్యవహారములలో జోక్యము కల్పించుకొనక సహనబుద్ధి కలిగియుండుమని బాబా బోధించిన విషయము.

దాదాకేల్కారు మిక్కిలి పట్టుదలగల బ్రాహ్మణుడు. ఉల్లి గడ్డలనిన మిక్కిలి రోసవగించును. అతడు మిక్కిలి అభినివేశముతో సాఠేవాడలో విడియువారలను ఉల్లిపాయలు నుపయోగింప నీయకుండువాడు, యస్. బి. నాచ్నే అత్తగారు ఉల్లిగడ్డలను తఱుగుచుండ నామెను నిందించెను. అతని మనుమరాలికి కనులపోటు ఏర్పడెను. కేల్కారు బాబాను చేరి—

దా. కే:— బాబా! బిడ్డకు కనుల కలక, పోటు ఏర్పడినది. నేనేమి చేయవలయును?

సా. బా:— కనుల కాపునకు ఉల్లిపాయ లుపయోగింపుము.

దా. కే:— ఉల్లిగడ్డలకు నే నెక్కడకు వెళ్ళుదును?

సా. బా:— (తన దగ్గఱ ఉల్లిగడ్డలున్నను వాని నీయక, అచటనున్న నాచ్నే అత్తగారిని వ్రేలితో జూపుచు) ఈ తల్లి దగ్గఱ నుండి తీసికొనుము.

నాచ్నే అత్త:— బాబా! దాదాకేల్కారు నేను ఉల్లిపాయల నుపయోగించుచుంటినని నన్ను తిట్టినాడు. అతని కేమియు నిచ్చుటకు నా కిష్టములేదు. నీ వాజ్ఞాపింతువేని యిచ్చెదను.

సా. బా:— ఇమ్ము.

ఆమె ఉల్లిగడ్డల నిచ్చెను. బాబా ఆమెద్వారా దాదా కేల్కారుయొక్క స్వాతిశయము, సహింపరాని మూర్ఖపు పట్టుదలను ఆ రూపమున అడచెను.

శ్రీ సాయీనాథ బోధామృతము S. C. S. 289 – 291, 321 చూడుడు.

ప్రార్థన :—

కలుగు సంకటముల కోరుల్ కారకులని
శాంతిగోల్పోయి ధైర్యము, క్షమను విడిచి
జగతి వర్తించు వీనికి సహనబుద్ధి
నిడవె! ద్వారకామాయి సాయీ! పరాత్మ!

4. నిర్మలబుద్ధి - సరళభావము. "పత్రం పుష్పం ఫలం తోయం"

1. నిష్కాపట్యము (సరళత) 2. నిర్మలత్వము అను రెండు ఱెక్కలవలననే మానవుడు ఈ పాకృతవస్తుజాలమునుండి పైకి ఉద్ధరింపబడుచున్నాడు. సరళత - మన తలంపున నిర్మలత మన ప్రేమయందు నుంచవలయును. సరళత జీవిని దైవాభిముఖము గావించును. నిర్మలత - ఆ దైవమును జేరి, ఆయానందామృతము నాస్వాదింప గలుగును. మనఃమాంతరంగికముగ మితిమీరిన ఆసక్తి వర్జించిన నెట్టిపనియు మనల నాటంకపఱుపదు. దైవేచ్ఛను - ఎదుటి మేలును తప్ప నితరమేమియు తలంచక - ఆసింపకుండువాడు అంతరంగిక స్వాతంత్ర్యము, ఆనందము పొందగలడు. మన హృద

యము నిష్కాపట్యము - ఋజుప్రవర్తనము గలదైన - ప్రతిజీవియు మనకు ముకురము (అద్దము)ను - పవిత్రగ్రంథమునై తోచును. దైవముయొక్క మహత్త్వమును ప్రకటింపక వ్యర్థము, నీచమైన జీవి యీ విశ్వమున లేదనియే మనము గుర్తింపవలయును. సకల చేతనాఽచేతనములు దైవ మహత్త్వమును ప్రకటించును.

మన మాంతరంగికముగ సరళత పవిత్రతల గడింపగలిగి నపుడీ విశ్వమునగల సకల వస్తువులు మనకు ప్రతిబంధకములు గానివిగ మనము చూచి గ్రహింపగలము. ఆపుడు మనల నిరోధించు నది యేదియు గలుగదు. పవిత్ర హృదయము స్వర్గ నరకముల రెంటిని దున్నికొనిపోవును. నరుడు సాధారణముగ అంతరంగిక బుద్ధి ననుసరించి బాహ్యవస్తువులను నిర్ణయించుకొనుచుండును. ప్రపంచ మున ఆనందము - అనునది కలదేని నిర్మల, పవిత్ర హృదయుడు దానిని పొందును. భయాందోళన కష్టము లీ విశ్వమున నెందే నుండె నేని దుర్బుద్ధి గలవానికే అవి యొల్లుకబడును. అగ్నియందున బాగుగ కాలిన యినుము త్రుప్పువదలి నిర్మలమై యెఱ్ఱనగును. అటులనే పూర్ణముగ దైవాభిముఖుడైనవాడు అలసత - మాంద్యముల విడినాడి నిత్య నూతనుడై యలరారును. అలసతకు లోగినవాడు ఏ స్వల్ప శ్రమకేని జంకును. బాహ్యసుఖములకై చేయిజాచును. సంపూర్ణ ఆత్మజయ సంపాదనకై కడగువాడు గాఢ విశ్వాసము, ధైర్యక్షమలు గలిగి దైవమును శ్రీ సాయీప్రభువు ననుసరించువాడు - అంతకు పూర్వము ఘోరములు వ్యసనకరములని తలంచిన పనులను సుఖ వంతములు సుళువులని భావించి నిర్వర్తింపజాలును.

శ్రీ సాయీ ప్రభువు ఆచరణపూర్వకముగ, మనకు బోధించిన విషయములను మనము సర్వదా స్మరించుచు, నిత్యాచరణమందు గమనించు చుండవలయును. శ్రీ సాయీబాబాను అనుసరింపదలచు శ్రేయస్కాముడు తానితరులతో బలుకునపుడుగాని, ఏ చిన్నపనియేని జేయునపుడుగాని, ఇతరులు - బిచ్చగాండ్రకు - ఏయితర జీవులకు యిచ్చునపుడు పెట్టునపుడుగాని, నిర్మలహృదయముతో, ప్రతిఫలాపేక్ష

వదలి, సరళభావము గలిగి, భగవానుడు మనకు శక్తిప్రసాదించి నాడు కావున ఆ భగవానుడే యీ రూపమున మనల జేరి కోరుచు న్నాడు - అను బుద్ధితో నీయవలయును. పెట్టవలయుననియు; ఏ లవమేని స్వార్థపరత, మలినభావము, కాపట్యము మన హృదయమున గలిగిన, దానిని భగవానుడు స్వీకరింపక పోవుటయేకాక మనము కావించు ప్రతి కార్యము వ్యర్థమగునని మనకు ఆ తండ్రి బోధించినాడు. ఈ క్రింది విషయములను గమనింపుడు:—

నిర్మలమనస్సుతో-ప్రేమతో బాబాకు సమర్పించువానిని స్వీకరించుట:- (S. C. S. 510 శ్రీ సాయీనాథ బోధామృతము.)

1914 శ్రీరామనవమియందు లక్షల జనము బాబాచుట్టు జేరిరి. ఒక వృద్ధురాలు బిగ్గఱగ అఱచుచుండెను.

వృద్ధురాలు:— ఓ బాబా! ఈ ముసలిదానిపై కరుణ వహిం పుము. (బాబా పనుపున) శ్యామా (మాధవరావు దేశపాండే) వెలు పలకు వెళ్లి జనసమూహమును త్రోసికొనుచు ఆ వృద్ధురాలిని బాబా సన్నిధికి కొనివచ్చెను. ఆమె సంతోషబాష్పముల స్రవించుచు తన రెండు చేతులతో నడుమును బిగించెను.

సా. బా:— అమ్మా! నీకొఱకెంత కాలమునుండియో వేచి యుంటిని. నాకు ఏమేని దినుటకు తెచ్చితివా?

వృద్ధురాలు:— ఇదిగో చలిది రొట్టెముక్క. ఉల్లిగడ్డ. నేనొక రొట్టె, రెండు వుల్లిగడ్డలను తీసికొని ప్రయాణమై వచ్చితిని. ఈ యుదయ మాకలి నొంది నీటిదఱి జేరి సగమురొట్టె, నొక ఉల్లిని భక్షిం చితిని. శేషించిన వివిగో. వీనిని నీవు భక్షింపుము.

సా. బా:— (ఆ చప్పని రొట్టెముక్కను నమలుచు — అత్యా సక్తితో తినుచు) అమ్మా! నీ రొట్టె ఎంత మధురముగా నున్నది! (చూడుడు S. C. S. 515)

నిర్మలమతితో సమర్పించు బహుమతులు. (S. C. S. 518)

కె. కె. గార్డె, (బి. ఎ., యల్.యల్.బి. నాగపూర్ సబ్‌జడ్జి ఉద్యోగమునుండి విరమించినవాడు) పూనాలోని రేమార్కెట్‌నందు మంచి చక్కని మూడు మామిడిపండ్లను కొనితెచ్చి వానిని బాబాకు సమర్పించెను.

సా. బా:— (వానిని స్వీకరించుచు) అహెూ! ఇతడు (గార్డే) అంగడిలో నాకొఱకు కొనిన పండ్లన్నియు, మొన్న ఆ పండిట్ చేసి నట్లుగాక (వీనిలో నేమియు దాను భక్షింపక) తీసికొనివచ్చి సమర్పించినాడు. పండిట్ పొట్లములో కట్టిన లడ్లన్నిటిని నా కీయవలయునని తీసుకొని వచ్చుచుండెను. కాని, మార్గమధ్యమున గోదావరి నదిలో స్నానము చేసి, ఆకలినొంది ఆ పొట్లములోని లడ్లు కొన్నితిని శేషించినవి తెచ్చియిచ్చినాడు. ఈ ఫలములు ఆ లడ్లవలె భుక్తశేషములుకావు.

(చూడుడు. S. C. S. 519)

సంశయ కాపట్యములతో గూడిన బహూకృతులు: (520 520) కనిత్కార్ సతి — ద్రాక్ష ఫలములు.

కనిత్కార్ సతి తన పుత్రికలతో గూడి, బాబాకు సమర్పింప ప్రత్యేకముగ మిక్కిలి ప్రేమతో మంచి ద్రాక్షఫలములను బుట్ట నిండుగ దీసికొని వెళ్ళెను.

సా. బా:— (కరుణాస్వరమున) నీవేమి తీసికొనివచ్చితివి? ద్రాక్షలా?

క. సతి:— అవును! బాబా! నీకొఱకు వానిని నాశిక్‌నుండి తెచ్చితిని.

అంతట నామె ఆ పండ్లబుట్టను బాబాకు సమర్పించెను. బాబా ఆ ద్రాక్షఫలములు కొన్ని త్రిప్పి చూచుచుండగా ఆమె కూతురు-

బానుతాయి- "ఈ పండ్లన్నియు బాబాచే పంచిపెట్టబడి వ్యర్థము కానున్నవి" అని తలంచెను.

సా. బా:— (ఆ బుట్టను కనిత్కార్ పతివైపునకు త్రోయుచు) నీ బుట్టను నీవు తీసికొని పొమ్ము!

కనిత్కార్ సతికి పై ప్రాణములు పైన పోయినట్లయ్యెను ఆ తల్లి పొందిన మానసిక బాధను బాబా గుర్తించి, ఆ బుట్టనుండి యెండిపోయి పనికిరాని పండ్లను కొన్ని తీసికొని, శేషించినవానిని తిరిగి యిచ్చుచు, "ఇపుడు పొమ్ము! నీ బిడ్డలను వీనిని దిననిమ్ము!"- అని బాబా పలికెను.

కనిత్కార్ సతి ఆమె కుమార్తెలు ఆ పండ్లబుట్టతో తిరిగి పోవుచుండగా "అమ్మా! నాకట్టి ఆలోచన ఏల కలిగెనో నేనెఱుగను. నీవా బుట్టను బాబాకు బహూకరింపగా "ఏమి? యీమె యీ పండ్ల బుట్టనంతయు ఇచ్చినదే! క్షణములో నివియన్నియు పంచిపెట్టబడును. బాబా ఏవియు దినడు. మనకేమియు దక్కవు - అని తలంచితిని" అని బానూబాయి తల్లితో చెప్పెను.

బాబా చర్యలు - పలుకులు - ఆ తల్లియొక్క ఆశయమును - ఆమె బహూకృతిని గూర్చిన తలంపు - ఆ కూతురుయొక్క అనిష్టత వలన చెఱుపబడినదిగ విశదీకరింపబడినట్లు గమనింపదగును. ఏ విధమైన మనోమాలిన్యము-కాపట్యము మనకు గలిగిన మనము పలుకు పలుకులు, చేయుపనులు వ్యర్థములగునని మనము గ్రహింపవలయును.

ప్రార్థన :—

తలపుల్ పల్కులు చెయ్వులందెపుడు స్వార్థత్వంబు, కాపట్యమున్
మలినత్వం బిసుమంతయేన్ గనక, సమ్మానించుచున్ సర్వజీ
వులు నీవే యను దృష్టిగూర్చి, విహితంబుల్ సత్కృతుల్ చేయ-ని
ర్మల బుద్ధిన్ ఘటియింపగా గదె! సమర్థా! సాయినాథ ప్రభూ!

5. ఆత్మచింతనము.

సబఘట భీతర రామహై - ఐసా ఆపసుజాన్
ఆప ఆపనే బంధియా - ఆపై దయా అజాన్.

ప్రాపంచకాత్మ నా - బడురామసాయి
వ్యాపించి జీవాళియందుండు నోయి!
నీవ యీ నిన్ను బంధించుకొన్నావు
నీ వివేకము బాసి నేరకున్నావు.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

దైవానుగ్రహము కొఱవడిన గ్రహణశక్తి తఱుగుచుండును. కావున మనము మన ఆత్మయైన దైవమునందు విశ్వాసము వహింపజాలము. మనయందున్న వెలుగు (జ్ఞానజ్యోతి) చాల అల్పము. ఆ స్వల్పమును మన ఉపేక్షవలన గోల్పోవుచుందుము. తఱచుగ మనలో ఎంత అంధత్వమున్నదో మనము తలంచుకొనము. తెలిసికొనబోము. సాధారణముగ మనము చెడ్డపనులనే చేయుచు నేవేవియో సాకులు చెప్పుకొనుచుందుము. కొన్నియెడల ఉద్రేకముతో కావించుచు ఆ పనులను ఔత్సుక్యత లనుకొందుము. ఇతరులలోని యే స్వల్ప దోషముల గనిన మనము మిక్కిలి కుపితుల మగుదుమేకాని, మన దోష కృతుల నుపేక్షింతుము. ఇతరులవలన మనముపొందు కష్టనష్టములను గూర్చి వెన్వెంటనే చెప్పుకొనుచుందుమేకాని, మనవలని బాధల నితరులు సహించువానిని గణింపము. తాను కావించు పనుల జక్కగ విమర్శించుకొన నేర్చినవాడు ఇతరులనుగూర్చి విమర్శించుటకు బూనుకొనడు. కావున శ్రేయస్కాముడు తననుగూర్చి విమర్శించుకొనుచు నితరుల విషయములందు మౌనముగ నుపేక్షించునేని వాడాంతరంగిక భక్తి - పారిశుద్ధ్యత గలవాడగును.

దైవమునందు - ఆత్మయందు మన దృష్టిని సంపూర్ణముగ కేంద్రీకరింపగలిగిన, వెలుపల మనము చూచు విషయములవలన

మనము చలింపము. శ్రేయము పొందగోరువాడు తనతో తానుండక యెచట నుండగలడు? ఇతరములందు పఱుగువాఱుచు తనను తానుపేక్షించుకొనునేని వాడు పొందు ఫలము మృగ్యము. మానవుడు మనశ్శాంతి, లక్ష్యసిద్ధినిగోరునేని సకలవిషయముల వాడావలనుంచి తనయందు తాను లక్ష్యము వహించుచుండవలెను. అస్థిరములగు ప్రాపంచిక విషయాందోళనలనుండి విడివడువాడు ఆధ్యాత్మిక పురోవృద్ధిని బడయ గలడు. ఈ అస్థిరములగు విషయములకు విలువ గట్టితిమా మనము చాల వెనుక బడుదుము. భగవానుడు - భగవత్సంబంధములుతప్ప ఇతరముల నేవియు గొప్పగ అధికములుగ - ఆనంద దాయకములుగ - హితప్రదములుగ, మనము దలంచరాదు. ఇతరములనుండి మనము పొందగోరు సుఖ సంతోషములను వ్యర్థములుగ దలంపదగును. దైవమును ప్రేమించుజీవి దైవేతరముల నేవగించును. దైవమే నిత్య సత్యము. అవ్యయానంద ఘనుడు - సర్వాంతర్యామి - దుఃఖోపశమన స్థానము, హృదయానందకరుడు అని మనము దృఢిగ దెలిసికొన దగును.

శ్రీశంకరభగవత్పాదులు పలికిన సూక్తులే శ్రీసాయీనాథుడు మనకు ఆచరణపూర్వకముగ బోధించినాడు. శ్రీసాయీబాబా అవతార విశిష్టత మనము తెప్పగ పాటించవలయును.

"గురుచరణాంబుజ నిర్భరభక్తః
సంసారా దచిరా ద్భవముక్తః
సేంద్రియ మానస నియమా దేవం
ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవమ్"

"సాంద్రభక్తి గురుపదాబ్జ నిష్ఠను సంసృతి ముక్తినిబొందు
నింద్రియనిగ్రహుడగు యోగి కనున్ హృదయస్థుని గోవిందు."

(లక్ష్మీనారాయణ స్తోత్రమంజరి - భజగోవింద శ్లోకములు— మోహముద్గర శేషము)

శ్రీ సాయీనాథ బోధామృతము (S. C. S. 118) సావధానముగ జూడుడు.

"గురువునందు సంపూర్ణ విశ్వాసబుద్ధి కలిగియున్న చాలును. అదియే యేకైక సాధనము. గురువు నొక్కనినే తన తలంపులకు, ఆశయములకు ఏకైక లక్ష్యము చేసికొన జాలినవాడు పరమార్థము సత్యధామము - గమ్యము పొందును. నా గురువు నాకు బోధించిన సత్యమిది యొక్కటియే. చతుర్విధ సాధనములు ఆరు శాస్త్రములు అవసరము లేదు."

ప్రార్థన:—

లౌకిక కామితంబుల దలంచుచు సత్సుఖ శాంతి ధామ మెం
దో కలదంచు బర్విలెడు దుర్మతినిన్ మఱలించి, సర్వ లో
కైక శరణ్యు, భూతహృదయస్థుని, సద్గురుదేవు నిన్నె య
ప్రాకృతబుద్ధినై గొలుచు భాగ్యమొసంగవె! సాయిసత్ప్రభూ!

8. సద్బుద్ధి - ఆనందము

చార చిహ్న హరి భక్తికే - ప్రకట దిఖాయీ దేత్
దయాధర్మ అధీనతా - పరదుఃఖకో హరివేత్.

ప్రాణులన్ దయయు ధర్మాచరణంబు
క్షీణనోపకృతి, యింద్రియ నిగ్రహంబుఁ
బఱగ నీ నాలుగు వసుమతియందు
హరిభక్త చిహ్నంబులై నెగడొందు.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

సత్పురుషుని ప్రభావ మహిమముల కాతని సద్బుద్ధియే నిదర్శనము. సద్బుద్ధి గలిగియుండువాడు నిత్యానందము పొందగలడు.

సద్బుద్ధి కష్టములందును ఆనందముతో సహించును. దుర్బుద్ధి నిరంతరము భయము, అశాంతిని బొందుచుండును.

"యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చయః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తోయస్సచమే ప్రియః"

జడియకుండు నెవ్వానికి జగములన్ని
జగము లన్ని టికెవ్వడు జడియకుండు
నలుక, భయము నుద్వేగము హర్షములను
విడువజాలినవాడు మత్ప్రియుడు పార్థ !

(భగవద్గీతామృతము 12-15)

(ఇచట హర్షము అనగా లౌకిక విషయానందముగ గ్రహింపవలయును.)

తన హృదయము తనను కోపించి నిరసించకుండునేని వాడానందమున విశ్రమింప గలడు. దైవము వానికి విధించిన కర్మములను (Duties) వాడు చక్కగ శక్తివంచనలేక నిర్వర్తింప గలిగినప్పుడే మనుష్యు డానందింపగలడు. తమ విధులను తాము చక్కగ నిర్వర్తించనివారికి, పాపకర్ములకు నిత్యానందము లేదు.

యశ్శాస్త్రవిధిత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్.

సవ్యసాచి! యెవడు శాస్త్రనియమమును
విడిచి తా యథేచ్ఛ నడచుచుండు
నా నరుండు సిద్ధి నందడు; సుఖమును
బడయలేడు; పరమపదము గనడు.

[భగవద్గీతామృతము 16-23]

"మేము శాంతి కలిగియున్నారము, మాకేమియు చెఱుపు కలుగదు. మమ్ము చెనక నెవరు సాహసింపగలరు?" అని యెవరేని పలికిన వారి మాటలను మనము విశ్వసింప దగదు. ఏలన ఏక్షణమున నేని భగవానుడాగ్రహించును. వారి కృతులన్నిటిని ఉన్మూలించును. వారి ఆలోచనలన్నియు వృథలగును. భగవత్ప్రేమి కష్టముల సైచి పేరు ప్రఖ్యాతి పొందుట లోక ఘనకార్యముకాదు. స్వార్థత్యాగనిరతి యందే ప్రతిష్ఠ గలదు. త్యాగముననే శాశ్వతకీర్తి ప్రతిష్ఠిత మైనది. దానినే - అట్టి అవినాశధామమును - అవ్యయానందమును జీవి పడ యుటే "అమృతత్వము" — అని పూర్వఋషులు పేర్కొనిరి.

"న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః
పరేణనాకం నిహితంగుహాయాం విభ్రాజతేతద్యతయో విశంతి"

స్వర్గమునకంటె సత్యోత్తమమై బుద్ధిగుహాయందు ప్రతిష్ఠిత మైన అమృతత్వస్థితిని కేవలము త్యాగముచేతనే పడయుదురుగాని కర్మ ములచేత - సంతానముచేత - ధనముచేత (సాధకులు) పొందజాలరు.

(కైవల్యోపనిషత్తు, 1-8)

"తేన త్యక్తేన భుంజీథాః" ఈశావాస్యోపనిషత్తు — 1.
కావున త్యాగబుద్ధిగలిగి అనుభవింపుము.

ఇచట త్యాగశబ్దమునకు స్వార్థత్యాగము అని అర్థము- అనగా దేహాత్మబుద్ధిని త్యజింపుమని ఉపనిషత్తులు శాసించుచున్నవి. దేహము - మనస్సు - బుద్ధి తానను భావమును త్యజించవలయును. భ్రమజనితమైన జ్ఞానము - ఆభాస సుఖదుఃఖములను త్యజించిన వానికే సత్యానందము - అమృతత్వము సిద్ధించును.

మన పనులచేత - సంతానముచేత ధనముచేత గడించు ప్రతిష్ఠ గొప్పస్థితి - క్షణికము. లౌకిక విఖ్యాతి దుఃఖసహితమై యుండును. సాధుసత్పురుషుల విఖ్యాతి వారి బుద్ధిగుహాయందే ప్రతిష్ఠితమైయుండునుగాని మానవుల నాల్కలలో కాదు. సత్పురుషుః

ఆనందము దైవమునుగూర్చియే - దైవమునందే కలదు. వారిది సత్యానందము. నిత్యసత్యానందము నాసించువాడు అస్థిరములగు లౌకిక ఆనందముల నాసింపడు. మానవుల మెప్పులను పొందిన మనము పవిత్రులముకాము. తప్పులు మనయందు నిరూపింపబడిన అల్పులము గాము. మానవుల పలుకులు మనల గొప్పవారలను గావింపజాలవు. భగవానుని దృష్టియందు మనమెంతో అంతవారలమే.

మనుష్యులు ముఖమును విలోకింతురు. దైవము మన హృదయమును పరీక్షించును. మానవులు మన పనులను పరిగణింతురు. దైవము మన తలంపులను పరిశీలించి చూచును. శ్రేయస్కాముడు తనకు చేతనైన మంచి పనుల నిస్వార్థ బుద్ధితో గావించుచు తన అకించనత్వమును గుర్తించుకొనుచు అడకువ గలిగియుండుట అమృతత్వసిద్ధికి సరియైన మార్గము. ఇతర జీవములవలన సుఖసంతోషముల నిరాకరించుట ఆత్మవిశ్వాస - పరిపూర్ణ అంతశ్శుద్ధి లక్షణము. ఇతర బాహ్యసాక్ష్యముల నపేక్షింపబోనివాడుగ ఋజువు చేసికొనగలుగుచున్నాడు. తనను దాను మెచ్చుకొనుచు నితరుల మెప్పులు గడించువాడు పాత్రుడు కాడు. దైవము మెచ్చుకొనువాడే సత్పాత్రుడు. అమృతత్వస్థితికి యోగ్యుడు.

సచ్చిదానంద స్వరూపుడగు భగవానుని పొందుటయే అమృతత్వము. భగవానుడు హృదయ గుహయందు సద్బుద్ధిలో ప్రకాశించుచున్నాడు. గుహయందెటుచూచిన రాయితప్ప వేరొకటి గోచరించదు. కావున హృదయము అనగా శుద్ధమానుష ధర్మములు - గుణములైన ప్రేమ - మార్దవము - దయ మొదలగువానితో గూడినది. అట్టి హృదయాంతర్గతమగు విశుద్ధ బుద్ధియందుగల భగవానుని జేరినవానికి నాకము (స్వర్గము)న కంటె సర్వోత్కృష్టమైన అమృతత్వము - పరమానందము ప్రాప్తించును.

శ్రీసాయీనాథుడు మనకీ సందర్భమున బోధించిన విషయము గమనింపుడు. (S. C. S. 114, 115)

"ఈ శరీరము నాగృహము మాత్రమే. ఈ యింటనుండి నా గురుదేవు డేనాడో యెత్తుకొని పోయెను" - అని బాబా పలికినాడు. అనగా ఈ దేహమే నేను. ఈ మనస్సేనేను. ఈ లౌకిక బుద్ధియే నేను అను తలంపు, తొలగినపుడే జీవికి సత్యతత్త్వము గోచరమగును. భ్రమజనితమైన లౌకికజ్ఞానము, దానివలన దోచు అభాస సుఖదుఃఖాదులు నిర్మూలింపబడి, సత్యానందప్రాప్తి అమృతత్వము కలుగును.

సత్యసుఖము - ఆనందము. ఈ విషయమునుగూర్చి బాబా తెలిపినది శ్రీసాయీనాథ బోధామృతము (S. C. S. 114-116) పాఠకులు చూడుడు.

ప్రార్థన :-

జనముల్ కూరుచు మెప్పుదెప్పుల జలించన్‌బోక, దేహాత్మబు
ద్ధిని బోకారిచి, ప్రేమ మార్దవ దయాస్తిక్యాత్త హృత్కంజసీ
మను వెల్గొందెడి నిన్ను జేరి చిర - భూమానందమున్ గాంచుపా
త్రుని జేయంగదె! మ్రొక్కువాడ; శ్రితబంధూ! సాయీనాథ ప్రభూ!

7. ఇతరములన్నిటికంటె దైవమును ప్రేమించుట.

ప్రేయః పుత్రాద్విత్తాత్ప్రేయోఽన్యస్మాచ్చ సర్వస్మాత్
అంతరతం యదాత్మేత్యుపనిషదః సత్యతాభిహితా.

నందనునికంటె స్వీయధనంబుకంటె
నితరమున కంటె మఱియు కొన్నింటికంటె
ఆత్మప్రియతమంబును మఱి అంతరికము
ననెడి ఉపనిషదుక్తి యథార్థమింత.

(ప్రబోధసుధాకరము - సగుణ నిర్గుణైక్య
ప్రకరణము) [శ్రీ శంకరభగవత్పాదులు]

ఈ విశ్వమున సకలమునకంటె దైవమును - శ్రీ సాయీప్రభువును ప్రేమించువాడు ధన్యుడు. శ్రీ సాయికొఱకు దన్ను తృణీకరించుకొనదగును. మన ప్రేష్టవస్తువు కొఱకు ప్రియములగు సకల లౌకికవస్తువులను విడువ నేర్వవలయును. మన గురుదైవమును మన ప్రాణముకంటె నధికముగ ప్రేమించనేర్వదగును. విశ్వమున సృజింపబడిన సకలవస్తువులను ఆయా నామరూపములు మాత్రముగ భావించి ప్రేమించుట వంచనము, మోసము - అస్థిరము. శ్రీ సాయీరూపమున ప్రేమించుట విశ్వసనీయము స్థిరము. స్వార్థపరులమై భౌతిక జీవముల నంటికొనియుంటిమేని నశించువానితోగూడ మనము నశింతుము. తదంతర్యాతుడగు శ్రీసాయిని హత్తుకొని యుంటిమా సతతము దృఢముగ నిలువగలము.

సకలభూతాత్మ - భూతాత్మయైన శ్రీసాయిని ప్రేమించుచు, పరమాప్తునిగ చేసికొనవలయును. అంతదనుక మనకు జేదోడు-వాదోడు అనుకొని ప్రేమించుచున్న బంధుమిత్రాదు లందఱు దూరమైపోయినను బాబా మనల విడనాడడు. మనల జెడనీయడు. పడనీయడు. మనకిష్టమైనను అనిష్టమైనను ఏదొక దినమున ఈ బంధుమిత్రాదు లందఱను విడనాడి పోవలసినవారమే. జీవితకాలమున శ్రీసాయీబుద్ధి-సాయీ చింతనము ఏమఱకయుంటిమా అవసానకాలమునను ఆ తండ్రి నంటి కొనియుందుము. మన సర్వస్వము ఆ తండ్రికి అంకితము చేసికొనవలయును. ఎల్లరు పెడముఖములు పెట్టి తొలగినను బాబా ఒకడే మనకు దోడ్పడగలడు. ఆ తండ్రిని కాదనుకొని పెడముఖముపెట్టి దూర దూరముగఁ దొలగువారిని బాబా ఏమి చేయగలడు? బుద్ధి గలిగి తన కభిముఖుడగు నంతవరకు వేచియుండగలడు. బాబాకు కావలసినది మన నిండు హృదయము మాత్రమే. దానిని సమర్పించి ఆశ్రయించితిమా - తన గద్దియపై గూర్చుండ బెట్టుకొనును. తన అంకమునఁ జేర్చుకొనును. మన హృదయపాత్రను శ్రీసాయీ ప్రేమామృతముతో

నింపుకొనవలయును. అప్పుడు ఇతర లౌకిక విషయములకు తావు కలుగదు. శ్రీసాయి యొక్కడే మనయందు తనకు దావై చేరును.

ప్రాకృత జీవముల మానవాదులవలన మనమేమేమి అభిలషించి, నమ్ముకొని నిరీక్షించుచుందుమో ఆ మన కోరికలు నిష్ప్రయోజనములు, శూన్యములు కావచ్చునుగాని శ్రీసాయీనాథుని గాఢ విశ్వాసమున సమాశ్రయించుదుమేని మనము హితాభీష్టములను సత్యముగ బడయగలము. బాబా ఆశ్రయము ఎన్నిటికిని వ్యర్థముకాదు. మన విశ్వాసము మానవులందు నిష్ప్రయోజనముకాని, బాబాయందు ఏనాడును కాదు. కాని అటునిటు లూగులాడు గరికపోచ నాధారము చేసికొనదగదు. ఈ ప్రాకృత జీవ సంచయము గరికయే. వాని యందుగల కీర్తిప్రభావాదులు అడవిపూలవలె వాడి వత్తలైపోవునవి.

మానవుల బాహ్యావేషములను పాటించుదుమేని, మనము శీఘ్రముగ వంచితులమగుదుము. ఇతరులవలన రక్షణలాభముల నపేక్షించుచున్న తఱచుగ చెడుదుము. సకలమున నధివసించిన శ్రీ సాయీ ప్రభువు నన్వేషించుదుమేని తప్పక బాబాను చూడగలము. స్వార్థప్రయోజనాసక్తితో ఈ జీవముల నాదరింతుమేని అది మన చేటునకే యగును. ఈ విశ్వమున తన గురుదైవమునుగాక ఇతర మేదో భోగ్యవస్తువుగ పరిగణించువాడు ఈ ప్రపంచమున సకల శత్రువులు చేయజాలని హానిని తనకు దానే కావించుకొనుచున్నాడు.

ఈ సందర్భమున శ్రీ మద్భగవద్గీతా చరమసూక్తి గమనింపుడు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

(భగవద్గీత 18—77)

నీ సకల ధర్మములను - ఆశ్రయములను - ఆధారములను (నీకు శరణ్యములు ఆధారములనుకొనుచున్న వానిని) పూర్ణముగ

విడిచిపెట్టి - ఏకం మాం - ఈ విశ్వమున వ్యాప్తమై ఒక్కడనేయైన నన్ను శరణొందుము. నేను సకల పాపములనుండి నిన్ను విముక్తుని గావింతును. ఇక నీవెట్టి విచారము పొందవలదు - అని భగవాను డభయ మిచ్చినాడు. కావున ఈ జీవితమున మనము కావింపదగిన ధర్మము - విధి ఆ తండ్రి నొక్కనినే. ఒక్కడే అయిన ఆ తండ్రిని సమాశ్రయించి - సర్వభావముల ప్రేమించి సేవింప నేర్వవలయును. మన జీవిత లక్ష్యము - మానవులమై జన్మించిన మనము పొందదగిన- పొందవలసిన ఫలము - గమ్యము - అదియే. ఈ విషయమున బాబా సూక్తిని (S. C. S. 137) గమనింపుడు.

8. శ్రీసాయీ సంబంధము. (బాహ్యసంబంధము)

ఆగే పీఛే హరి ఖడా - ఆపన హారే భార్,
జనకో దుఃఖీ క్యోం కరే - సమరథ సిరజనహార్.

పొందుగ నీ భారమును సర్వమూని
ముందు వెన్కల జను చూసుతాజాని!
కుందెదవేల? కన్నోను రామసాయి
ముందుడా! సర్వసమర్థుడానోయి!

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

శ్రీ సాయీప్రభువును సన్నిహితము జేసికొంటిమా సకలము సుఖమే, శుభమే, సుసాధ్యమే. ఏదియు కష్టము కాదు. ఆ తండ్రిని దూరముచేసికొంటిమా - దూరమయ్యెనా - అన్నియు కఠినమే - దుర్లభమే. బాబా మనతో అంతరంగికముగ సంభాషింపకపోయినా యితర సుఖములని మనము భావించునవి యన్నియు వ్యర్థమే. బాబా ఒక్క పలుకేని పలికెనా మనమెంతేని యూరట నొందుదుము. ఆ తండ్రి దుఃఖమగ్నులైన ఆశ్రితులను ఆనందాంబుధి దేల్చును. బాబాకు దూర దూరమైన మనము అభాగ్యులము. బుద్ధి హీనులము. వ్యర్థులము.

సర్వశ్రేయములు గూర్పజాలిన బాబాను ఇవి యిమ్ము, అవి యిమ్ము అని కోరుదుమేని మనము తెలివిలేనివారలమే. బాబాను విడనాడుదుమేని యీ ప్రపంచమునంతయు గోల్పోయిన దానికంటె అధికమగు నష్టము పొందుదుము. శ్రీ సాయీ ప్రభువులేని యీ విశ్వము మనకెట్టి లాభకారియు గాదు.

శ్రీసాయీతోడి సంబంధము మధుర స్వర్గము. ఆ తండ్రికెడమై యుండుట ఘోర నరకము. బాబా మన చెంత నుండెనా యెట్టి శత్రువేని మనల జెనకజాలడు. శ్రీసాయిని దనవానిగ జేసికొనజాలినవాడు సన్నిధిని సంపాదించుకొనినవాడే. అదియే ఉత్తమోత్తమ శ్రేయము. బాబాను కోల్పోయినవాడు సర్వము పోగొట్టుకొనినవాడే. శ్రీ సాయి లేక జీవించదలచువాడు నిర్భాగ్యుడు - దరిద్రుడు. ఆ స్వామి గూడియుండువాడు మహాభాగ్యశాలి. బాబాను తనవానిగ జేసికొని, దగ్గర నుంచుకొని సంభాషించుచు, ఆనందించుటకు గొప్ప నేర్పు, తెలివి కావలయును. అణకువ, శాంతి గలిగియుంటిమా బాబా మన దరికి జేరును. బాహ్య విషయములందు - లౌకిక కామితములందు దృష్టి నిలిపితిమా - ఆ ప్రభువు దూరమగును. ఆ తండ్రి నెడము చేసికొనిన మనకు ఇతర ఆశ్రయములేదు. ఎక్కడకు పోగలము? ఎవరిని నమ్ముకొన గలము? తగిన ఆప్తుడు లేడేని మనము జీవింపజాలము. ఇతరాశ్రయములను త్యజించి శ్రీసాయిని పరమాప్తునిగ జేసికొన జూడమేని దుఃఖభాజనులము దిక్కరుల మగుచున్నారము.

ఇతరులను విశ్వసించి యీ ప్రపంచమున మెలగ జూచువాడు బుద్ధిహీనుడు. శ్రీసాయి మనల నేవగించి కోపించునట్లు చేసికొనుటకంటె నీ ప్రపంచమునంతయు మనల నేవగించి వ్యతిరేకించునట్లు కావించుకొనుటే శ్రేయము. కావున ఆ తండ్రినే మన ప్రత్యేక ప్రేమవస్తువుగ జేసికొందుముగాక! ఆ స్వామియే మనకు మిక్కిలి ప్రియమైన వాడగునుగాక! ఈ సకలమును శ్రీ సాయికొఱకే ప్రేమించుదము. శ్రీ సాయిని సాయికొఱకే ప్రేమించుదము. మన ఆప్తులు అని తలంచు స్వార్థాంధులలో బాబా ఒక్కడే సాధువు విశ్వాసపాత్రుడు

నగుట ఆ తండ్రి నొక్కనినే ప్రేమించుదము. మనకు మిత్రులు, శత్రులు, ప్రియులు అని తలంచు వారందఱు సాయియందే సాయి కొఱకే యున్నవారిగ దెలిసికొని, వీరందఱు ఆ ప్రభువును దెలిసికొని ప్రేమించునట్లు చేయుమని ఆ స్వామినే ప్రార్థించుదము.

మనలో నెవరికి వారు తానొక్కడే ఎల్లర ప్రశంసల నందుచు, కీర్తింపబడవలయునని కోరుకొనదగదు. అద్వితీయుడగు శ్రీ సాయికే అట్టి అర్హత, యోగ్యత గలదని మనము గుర్తింపవలయును. శ్రీసాయి నాథుడు మనయందు సమగతిని నిలిచి అనుగ్రహించునటుల మన మెల్లపుడు కోరుకొను చుండవలయును. అంతరంగికముగ మనము నిర్మలులము, నిర్లిప్తులమైయుండి యే యితర జీవులయందును మన హృదయముల హత్తుకొననీయరాదు. ఆ ప్రభువెంత మధురాతి మధురమైనవాడో తెలిసికొన దలంతుమేని ఆ గురుదేవుని యెదుట మనము నిర్వంచితబుద్ధితో ఋజుప్రవర్తనులమై నిర్మలమయిన హృదయముతో జేరుచుండవలయును. సత్యముగ ఆ తండ్రి అనుగ్రహమున మనము బలాత్కారముగ ఆకర్షింపబడిన తప్ప సర్వమును పరిత్యజించి ఆ ప్రభువును జేరి పరమానందము బడయజాలము. మానవు నందు దైవానుగ్రహము ప్రసరించునపుడు వాడు సర్వజ్ఞుడుగ గావింపబడును. ఆ దైవకరుణ తొలగెనా వాడు దరిద్రుడు, దుర్బలుడై వ్యధల పొల్పడును. ఈ విషయమున మన మధైర్య పడదగదు. దైవేచ్ఛపై నాధారపడి దృఢముగ నిలువనేర్వవలయును. మన కేది యెట్లు కలుగుచున్నను ఆ ప్రభువు కీర్తికొఱకే సహింపవలయును. శిశిర ఋతువు గడచిన వసంతర్తువు. రాత్రి పిదప పగలు, తిరిగి పొడచూపును. బాబా ఆశ్రితునకు విశ్వాసము - ధైర్యముతో గూడిన ఓర్పు (నిష్ఠ - సబూరి) అవసరము. (S. C. S. 177, 178 చూడు!)

9. పరమ సుఖాభిలాష:

"జబ మైథా తబగురు నహి - అబగురు హై మై నాహి
కబీర నగరీ ఏకమే - దో రాజా న సమాహి"

'నేను' న్న దనుక గన్పింపడు గురుడు
'నేను' లేదు, గురుండు నెగడుట నిపుడు:
అరయగ నొక రాజ్యమందున ఱేడు
లిరువురుంట బొసంగదేమొ! యేనాడు.

(శ్రీ సాయీ కబీరుసూక్తులు)

దైవానందప్రాప్తి కలిగినపుడు మనుష్యానందమును ఏవగించి, విడనాడుట మిక్కిలి సులభము. మనుష్యానందము, దైవానందము రెంటిని గలిగియుండగోరుట దుస్సాధ్యము. దైవకీర్తి ప్రేమకొఱకు సంతోషముతో మనస్సును నిర్మూలించుటకు దేనియందాసక్తి లేకుండుటయు మానవుడు తన ఆధిక్యతను విస్మరించుటయు గష్టము. దైవానుగ్రహము ప్రాప్తించునపుడు నరుడు ఉత్సాహభక్తుల గలిగియుండుట గొప్ప విషయము కాదు. అట్టి గడియ మానవులందఱు కోరదగినదియే, సకల భారములను వహించు ఆ పరమ చోదకుడు - నియంత - నరుని జీవిత పథమున గొనిపోవుచుండ నతడు తన భారములగూర్చి తలంచకుండుటలో ఆశ్చర్యము లేదు. ఎల్లప్పుడు మన సుఖానందము కొఱకు పర్యాయముగ నేదొకటి యుండవలయునని కోరుకొనుచుందుము. మానవుడు బాధపడకయే సకలమునుండి తనను వదలించుకొనజాలడు, తనకు ఆనంద సుఖముల గలిగించుచున్న వనుకొను ప్రతి వస్తువును ఏవగించుకొనుచు దొలగి చననేర్చువాడే ప్రపంచమును జయింపగలడు.

దైవప్రేమచేత మానవప్రేమ నతిక్రమింపవలయును. మానవప్రీతిగాక భగవంతునకేది ప్రీతియో దానిని స్వీకరింప నేరవయును. భగవత్ప్రీతి (ప్రేమ) కొఱకు మన సన్నిహితము మిక్కిలి ప్రేమపాత్రమగువస్తువును సైతము త్యజించుటకు సిద్ధపడవలయును. మన మేక్షణమేని విడివడి పోవక తప్పదని గుర్తించి, మనకు పరమాప్తుడనుకొను వానిచే త్యజింపబడుటకేనియు గష్టము వహించరాదు. తన అహంతను, మమతను పూర్ణముగ నిర్మూలించి హృదయమును దైవము

నందు హత్తజేయు పూర్వము మానవుడు పెద్దకాలము బలీయముగ ప్రయత్నము జేయ వలయును. దేహబద్ధుడై దేహబుద్ధితో (దేహమే తాననుబుద్ధితో తనను తాను విశ్వసించువాడు ప్రాకృత సుఖముల వైపునకు శీఘ్రముగ దిగజారును.

కాని, శ్రీసాయీ ప్రేమ సాధుసత్పురుష సాంగత్యము, సత్ప్రవర్తనుడగువాడు లౌకిక సుఖముల వైపునకు దిగజారడు. మధురము లని తలంచు ఇంద్రియార్థముల నాసింపడు. కఠినాభ్యాస ముల గావించును. దైవముకొఱకు కఠిన పరిస్థితుల సహించును. దైవము వలన ఆధ్యాత్మికానందము ప్రసాదింపబడెనా కృతజ్ఞతతో మనము స్వీకరింపవలయును. దానిని దైవబహూకృతిగ దలంప వలయునేకాని, మన యోగ్యతకు దగిన దానిగ భావింపరాదు. మనసున ఉప్పొంగి మిక్కిలిగ ఆనందింపదగదు. వ్యర్థములగు ఊహల పాల్గా రాదు. అట్టి బహూకృతిని దలంచి యెక్కువ అడకువ గలిగి, కడు జాగృతి భయములతో మన విధుల నిర్వర్తింప వలయును. ఏలన- ఆ దైవకరుణ తొలగి మనల ప్రాకృత లోభములు వశపఱచు కొన వచ్చును.

దైవపథము ననుసరించిన గొప్ప సాధుసత్పురుషులకు సైత మిట్టి వేవియు క్రొత్తలు కావు. ఇట్టి అవస్థాంతరముల వారెన్నియో అనుభవించిరి. దైవానుగ్రహము - ఆధ్యాత్మికానందము ననుభవిం చుచు నొకరు "ఈ నా విభవైశ్వర్యముల నుండి నేను చలింపను."- అని పలికిరి. అదైవకృప లోపించి తన విషయము గుర్తించుకొని "దేవా! నీ ముఖ మావలకు ద్రిప్పితివి. నా కీ కష్టములు ప్రాప్తించెను"- అని, యట్టి కష్టపరంపరలలో నతడు నిరాశ పొందక, ఆ మహాప్రభువు నింకను తీవ్రమగు భక్తితో నాశ్రయించి "దేవా! నీ తోడనే చెప్పుకొని యేడ్చుచున్నాడను" - అనినాడు. తుదకు తన ప్రార్థనాఫలమును బడసి, తన మొఱ దైవమాలకించెనని ధృతి వహించుచు "నా ప్రభువు నా మొఱ వినినాడు. కనికరించినాడు. నా స్వామి నాకు తోడైనాడు." - అనినాడు. తనభాగ్యమును శ్లాఘించుకొనుచు "ఓ స్వామీ! నా

దుఃఖమును సుఖముగ జేసితివి. ఆనందము న న్నులము కొన జేసితివి" అని శ్లాఘించినాడు.

గొప్ప సాధు సత్పురుషులే ఆ విధముగ అవస్థాంతరముల పొలై తుదకు దైవానుగ్రహముననే ఆనంద ధృతిశాంతులు బడయజాలి రన, మనవంటి అల్పులు, దుర్బలులు, అకించనులు అధైర్యపడ రాదు. కొంత కాలము తీక్షణముగ - కొంతతడవు సంకుచితముగ ఆ స్వామికరుణ మనయందు వర్తించుచుండును. మహాప్రభువు ఆగ్ర హానుగ్రహములకు మనము తలనొగ్గనేర్వవలయును. అనన్య భక్తితో ఆ తండ్రినే శరణొందవలయును. ఉదయమున ఆ ప్రభువు విజయము చేసి మనల స్వస్థుల గావించును. ఇదియంతయు ఆ మహాప్రభువులీల.

దైవమును - దైవకరుణనుగాక దేనికై నిరీక్షింపగలము? దేనిని విశ్వసింపగలము? మంచివారు, భక్తులు, విశ్వాసపాత్రులైన మిత్రులు మన దగ్గఱ నున్నను, పవిత్ర గ్రంథములు, చక్కని కావ్య ములు, మనోహర గేయకావ్యము లున్నను ఇవి యన్నియు జేయు సాయ మత్యల్పము. దైవకరుణ తొలగెనేని వీనివలన ప్రయోజనము లేదు. మనల మన దీన స్థితిలోనే విడిచిపుచ్చును. అట్టి సమయములందు అత్యుత్తమమైన చికిత్స 'ఓర్పు' మాత్రమే. ఆ స్వామి ఇచ్ఛకు ఆత్మ సమర్పణము చేయుటయే మనము కావింపదగిన పని. ఎట్టి భక్తులం దేని నేదొక సమయమున దైవ కరుణ తొలగి, ఉత్సాహము కుంటు పడని వారిని జూడబోము. ఎల్లఱకు అట్టి స్థితి యెప్పుడో యొకప్పుడు తప్పదు. జీవితమున నెప్పుడేని లోభపఱుపబడక మహోన్నత స్థాయిని ప్రకాశించు సాధుసత్పురుషుడు కలుగుట అరిది.

దైవనిమిత్తమై కష్టముల సహించి శ్రమింప బోనివారు మహోన్నత దైవానుభూతిని బడయజాలరు. ప్రలోభములకు లొంగని వారే దైవానుభూతికి అర్హులు. ప్రాకృతలోభములకు వశులు కానివారికే భగవాను డవ్యయామృతము త్రోవబెట్టును. కష్టములను ధైర్యముతో సహించుటకే తనవానికి దైవము ఓర్పు ప్రసాదించు చుండును. అప్పుడును ఈ ప్రలోభములు సాధకుని విడువక అనుసరించుచునే

యుండును. ఏ సమయముననేని వీని అహంకారమమకారములు - గర్వ ముత్పన్న మగునేమో! యని ప్రాకృతలోభము లాకర్షించుచుం డును. సాధకుడు బ్రతికియున్న, మరణించిన ఆ లోభపిశాచి నిద్రిం పదు. కావున మన మెప్పుడు ఇతరాశ్రయముల విడనాడి, గురుదేవుని మాత్రమే శరణొంది, సంగరమున కాయత్తపడి నలువైపుల గ్రమ్ము కొను (కామాది) శత్రువుల నెదుర్కొన వలయును.

[శ్రీసాయీ ప్రభువును గురుదైవముగ విశ్వసించి అనుస రింపదలచు ఆశ్రితులకు బాబా తాను ఆచరించిన విధానమును విస్పష్ట ఫణితిని దెలిపినాడు. బాబా దగ్గఱ గోప్యములు, రహస్యములు, మంత్రతంత్రములు లేవు. కావున సోదర భక్తులు శ్రీ సాయీనాథ బోధామృతము (S. C. S. పేరా 137) - పలుమాఱులు పఠించి అవగా హనము చేసికొన బ్రార్థితులు.]

ప్రార్థన:—

ప్రతి జీవంబున జేరి చాటుపడి, సర్వవ్యాపియై, యీశుడై
అతులప్రాణిచయాంతరాత్మయయి, కర్మాధ్యక్షుడై, లోక సం
స్థిత భూతాది నివాసుడై, హృదయసాక్షిభూతుడై, నిర్గుణాం
చితుడై సద్గురుదేవుడైన ప్రభునిన్ శ్రీసాయినిన్ గొల్చెదన్.

10. శ్రీ సాయీ కరుణయెడ కృతజ్ఞత.

మనము శ్రమించుటకే జన్మించితిమి. విశ్రమించుటకుగాదు. కావున నిరంతర మేదొక కృషి సలుపుచుండవలయును. సుఖము ననుభవింపజూచుటకంటె సహనము నభ్యసింపవలయును. స్వార్థ పరత కలవడుటకంటె త్యాగనిరతి వహింప నేర్వవలయును. ప్రాప్తించు వేని నిరంతరాధ్యాత్మిక సుఖానందముల నపేక్షింపని మానవుడు లేడనియే చెప్పదగును. ఆధ్యాత్మికానందము భౌతిక సుఖానందముల్ల

నన్నిటిని త్రోసిరాజను. ప్రాకృతానందములు వ్యర్థములు, అపవిత్రములు. ఆధ్యాత్మిక సుఖానందములనిన స్థిరములు, నిరామయములు. సుగుణ సంజనితములు, పవిత్రములునై నిర్మల హృదయములందు దైవముచే గూర్పబడినవి యగును· కాని మానవుడు తన అభీష్టానుసార మీ యాధ్యాత్మిక సుఖానందముల నెల్లకాలము అనుభవింపజాలడు. ఆతని లోభపఱచు కాలము చేరువనే యుండునని గ్రహింపదగును. మానసిక కృత్రిమ స్వాతంత్ర్యము, స్వీయశక్తి సమర్థతలందు విశ్వాసము, దైవదత్తములగు వానికి సర్వవిధముల విరుద్ధములు.

అవ్యాజ కరుణాసింధువగు దైవము మనల ననుగ్రహించి సుఖానందముల బ్రసాదించుచున్నాడు. కాని, మనము కృతజ్ఞతాపూర్వకముగ ఆ సుఖ సంతోషముల తిరిగి దైవమునకు సమర్పించుకొనుటలేదు. దాతయెడ కృతజ్ఞత కలిగి, తత్కృపాజనక స్థానమునకు సంపూర్ణముగ కృతజ్ఞత దెలుపుకొన బోని కారణమున ఆ దయా బహూకృతులు మనయందు ప్రస్ఫుటములు కావు. త్రికరణముల గృతజ్ఞత దెలుపుకొనువానియందే ఆ దైవకరుణా బహూకృతులు నిలుచును. దీనులు అకించనులకై యుద్దేశింపబడిన దైవకరుణ గర్వితుల దురహంకారుల వద్దనుండి తిరిగి గ్రహింపబడును.

అకృత్యములయెడ నిజమైన పశ్చాత్తాపము, గనకయే మన మోదార్పబడ గోరతగదు. మానసికముగ గర్వాతిశయముల గూర్చు ధ్యాననిష్ఠకు గడంగ దగదు. లౌకికదృష్టియందు గొప్పవి అనుకొనబడునవి పవిత్రములు కావు. మధురములన్నియు పథ్యములు కావు, మనము కోరుకొను కోరికలన్నియు మనకు మేలు కూర్చునవి కావు, మనకు ప్రియమైన ప్రతివస్తువు భగవానునకు ప్రీతిపాత్రము కాదు, వినమ్రులమై మనము దైవకృపకు దోసిలొగ్గవలయును. దాన మనకు అడకువ కలుగును. దైవభీతి కలుగును. అట్టిభీతి విధేయతవలన నిర్మమత్వము (నాదికాదు నీదే-అను స్థితి) సిద్ధించును. శ్రీ సాయీ కరుణా ప్రబోధ కలవాడు ఆ కృపానుభూతులచే సుశిక్షితుడైన వాడు ఏ విషయమునను ఏమి కావించినను తన అధికృత ప్రకటించు

కొనదు. తన అకించనత్వము దీనత్వమును గుర్తించుకొన నేర్చును. దైవదత్తములగు కరుణా బహూకృతులను దైవమున కర్పించుచు, అరిషడ్వర్గమునకు లోగి మనము కావించువానిని (పాపములను) వాని వలన గలుగు శిక్షానుభవములను మనయందారోపించుకొనవలయును.

"లఘుతామే ప్రభుతాబసే - ప్రభుతాసే ప్రభుదూర్
కీడీసీ మిశ్రీచుగే - హాథీకే శిర్ దూర్ -"

అధికత సిద్ధించు నడకువ గనిన
అధికతగన ప్రభువఱుగు దూరమున!
చిన్నదై చీమ భక్షించు గుడంబు,
మున్ను నెత్తిన త్రాల్చు మత్తగజంబు"

(శ్రీ సాయి కబీరు సూక్తులు)

శ్రేయస్కాముడు తనను చిట్టచివరవానిగ భావించుకొన వల యును. అపుడున్నత స్థితిని పొందగలడు. కడపటిది లేనిదే మొదటిది లేదు. దైవము నెదుట అత్యుత్తములగు సాధువులు - వారి ఆత్మ నిశ్చయమందు (వారి దృష్టియందు) అత్యల్పులుగనె వారు భావించు కొందురు. వారెంతలెంతలు మహోన్నతస్థానముల నందుకొనజాలిరో వారల హృదయము అంతలంతలు అడకువ గలిగియుండును. (S. C. S. Para 267 చూడుడు) (బాబా అడకువ S. C. S. Para 301 చూడుడు.) ఋతంభర ప్రజ్ఞులు సత్యమగు దైవసంపద్విశిష్టులగు వారు వ్యర్థములైన లౌకిక కీర్తికొఱకు ఆసపడరు. దైవమునందు సుప్ర తిష్ఠులై యున్నవారు ఎన్నడును లేశమేనియు గర్వితులుకారు.

భగవానునకు సకలమును అంకితము సేయువారు ఏ మేలు వారు పొందినను పరస్పరము శ్లాఘుంచుకొన నపేక్షింపరు. దైవమునే శ్లాఘింతురు. దైవకరుణనే ప్రశంసింతురు. దైవము తదభిన్నులు - ప్రత్యక్ష దైవములగు సాధుసత్పురుల కరుణా విశేషమునే కీర్తింతురు. తదంకితము గావింతురు. ఏ స్వల్పబహూకృతి బడసినను మనము

కృతజ్ఞత దెలుపుకొనవలయును. అపుడు అంత కధికములగు వానికి అర్హుల మగుదుము. ఏ స్వల్పమేని అత్యుత్తమ బహూకృతిగ - (లోక సృష్టియందు) ఎట్టి నికృష్టమైనను దానిని అమూల్యముగ మనము స్వీకరింప నేర్వవలయును. దాత విలువను గుర్తింపజాలుదుమేని ఏ బహూకృతియు అల్పము నీచము, వ్యర్థము కాదు. మహాప్రభు దత్తమైనది అల్పమెన్నడును కాజాలదు. దానిలో నేదియో ప్రత్యేక మగు విలువ కలదనియే మనము గుర్తించవలయును.

శ్రీ సాయీప్రభువు మనల దిట్టినను కొట్టినను, లేక యేవియో శిక్షలు విధించినను మనము కృతజ్ఞతతో స్వీకరింప దగును. మన క్షేమము కోరియే ఆ ప్రభువా విధముగ గావించువాడు. ఏది యెటుల పరిణమింపజేసిన అది మన మేలునకే. దైవకృప నిలుపు కొన గోరువాడు (అల్పమైనను) ఆ కృపాప్రసాదమునకు కృతజ్ఞుడు కావలయును. ఆ కృప తొలగినపుడు (సబూరి) ధైర్యముతో గూడిన ఓర్పు వహించి, ఆ కరుణను తిరిగి ప్రసాదింపుమని దైవమును ప్రార్థిం పవలయును. శ్రీ సాయీ కరుణను దక్కించుకొనుటకు తగిన జాగరూకత, అడకువ కలిగియుండవలయును.

(శ్రీసాయీ ప్రభువు ప్రకటించిన ఆగ్రహావేశములు శ్రీ యన్. కె. నూల్కర్ విషయమున S C. S. 333; పూనానుండి వచ్చిన శ్రీ చిదంబర్ కేశవ్ గాడ్గిల్ విషయమున S. C. S. Pera 412 తుద కెటుల అనుగ్రహములుగ పరిణమించెనో కనుడు! శ్రీ సాయీనాథ బోధామృతము - పేరా 333, పేరా 412.)

ప్రార్థన:—

హితమున్ గూరుచు నీ బహూకృతులు - నీ యీ యాగ్రహానుగ్రహ
ప్రతిపాద్యంబులెవేని నీ శ్రితులకున్ భద్రప్రదంబుల్; కృత
జ్ఞత విశ్వాస వినమ్రతల్ సహనముఁ గల్పించి, యీ నీ పదాం
కితవృత్తిన్ ఘటియింపగాగదవె! తండ్రీ! సాయినాథప్రభూ!

## 11. త్యాగ నిరతులు చాల అరుదు:

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే.

కావరంబు, బలము, కామంబు మఱియు క్రో
ధము పరిగ్రహంబు దర్పముడిగి,
మమతలెల్ల విడిచి, మది శాంతి గనువాడు
బ్రహ్మభావమొంద బాత్రుడగును.

(భగవద్గీతామృతము 18-53)

శ్రీ సాయీ ప్రభువును ప్రేమించువారు నేడు లక్షలు కోట్లు కలరు. కాని ఆ తండ్రిని అనుసరించువారు చాల అరుదు. బాబా వలన కష్టవిముక్తి బడయగోరువారు పలువురు కలరు. ఆ తండ్రి కొఱకై కష్టముల సహించువారలు చాల అరుదు. బాబా పేర విందు లారగించువారు కోకొల్లలుగ గలరు. కాని భోజన నియమమును పాటించువారు లేరు. బాబా బోధలను చదువుచు నితరులకు దెలియజెప్పువారు పలువురు కలరుగాని శ్రీసాయీప్రభువు కోరిన కానుకలు (నిష్ఠ-సబూరి) విశ్వాసము - ధైర్యముతో గూడిన ఓర్పు - త్రికరణ శుద్ధిగ సమర్పించువారు కానరారు. బాబా లీలల బరస్పరము దెలుపుకొనుచుందురు కాని, ఆ తండ్రి త్యాగనిరతి గమనింపలేరు. శ్రీ సాయీ ప్రభువువలన సహాయము పడయుచుండునంతవరకు ఆ స్వామిని పొగడుచుందురు. వారి యభీష్టములను ప్రసాదింపక బాబా యించుక మఱుగుపడి విడిచెనా తమ కష్టములను వారితో వీరితో దెలుపుకొనుచు మిక్కిలి మనోవ్యాకులత పొందుదురు.

శ్రీ సాయీప్రభువుకొఱకే బాబాను ప్రేమించువారు సుఖ సంతోషముల నోలలాడుచున్నను కష్టముల జిక్కువడి సదమదమగుచున్నను శ్రీసాయీ చింతనము, శ్రీసాయీసేవ విడువరు. స్వలాభ

ముల నపేక్షింపక నిస్స్వార్థబుద్ధిగలవారి వర్తనమిది. కొందఱు బాబా తమ్ము అభీష్టముల ప్రసాదింపకపోయినను వారికి గలుగు కష్ట నష్టముల సహనబుద్ధితో సైచి బాబాను ప్రార్థించుచునే యుందురు. స్వార్థ ప్రయోజనము, స్వార్థప్రేమలతో మిళితముగాని శ్రీసాయీప్రభుని సేవా ప్రేమలు మిక్కిలి ఉత్తమమైనవి. అపార ఫలదాయకములు.

నిరంతరము స్వకీయకష్ట నివృత్తి, ఓదార్పులు ప్రతిఫలములు కాంక్షించుచు బాబాను సేవించువారి సేవలు, ప్రకటించుభక్తి, వ్యాపారిక ప్రేమలే. అట్టివారు జీతగాండ్రు అనక తప్పదు. వారు కూలికి పనిచేయునట్టివారు. ప్రతిఫలాపేక్ష లౌకిక కామితములందు ఆసలేక ఆధ్యాత్మిక నిష్ఠగలిగి శ్రీసాయీనాథుని సేవించగలవారు నూటికి కోటికి ఎవరో 'మహల్సాపతివంటివారు' చాలా అరుదుగ గలరు. నరుడు తన సకలము సమర్పించినను లాభము లేదు. తన అకృత్యములకు మిక్కిలి పశ్చాత్తాపము నొందినను ప్రయోజనమల్పమే. సర్వము తెలిసికొన జాలినను దైవమునకు దూరమైనవాడే. మంచి గుణములు తీవ్రభక్తి యున్నను కొఱతయే. ముఖ్యమైనది లోపించినదే ఆ ముఖ్యమైనది ఏది? - సకలమును తనను త్యజించుటయే. [త్యాగేనైకే అమృతత్వమానశుః"- (కైవల్యోపనిషత్ 1-3)] అహంత - మమతలను - నేను - నాది అను భావమును సంపూర్ణముగ త్యజించుటయే - అమృతత్వ ప్రాప్తికి ముఖ్యము.

శ్రేయస్కాముడగు మానవుడు తన బుద్ధి శక్తి ననుసరించి తాను చేయదగినది, చేయజాలినది యంతయు చేసి, తానేమియు గావింప లేదనీ, తన దేహేంద్రియములను ఉపకరణములుగ జేసికొని తన హృదయాసీనుడగు శ్రీసాయీమహాప్రభువే కావించికొనినాడని యథార్థముగ గుర్తింపవలయును. అటుల తాను కావించిన ఏ మంచి పని నేనియు తూచుకొనరాదు. తానేమి కావించినను ప్రతిఫలమాసించని సేవకునిగ భావించుకొనవలయును. అపుడు వాడు అకించనుడై ఆధ్యాత్మికముగ ఎదుగుటకు వీలగును. శ్రీసాయీప్రభువు "నేను సేవకుడను. అల్లామాలిక్ - అల్లా అచ్ఛా కరేగా!" - అని నిరంత

రము పలుకువాక్కులను మనము జ్ఞప్తియం దుంచుకొనవలయును. అట్టివానికంటె ధనికుడు, శక్తివంతుడు లేడు. తనను పూర్ణముగ త్యజించికాని, అత్యంత కనిష్ఠస్థానము నందుంచుకొన జాలినవాడే ధన్యుడు, కృతార్థుడు.

ప్రార్థనము :—

తనువీ 'నే' నిది 'నాది' 'నాది' యని స్వాంతంబందు భావించుచున్
పెనుమోహంబున జిక్కి, స్వార్థమతినై విశ్వైకనాథున్ నియం
తను నిన్నున్ గననైతి; నీతని మమత్వాహంకృతుల్ వాపి, శ్ర
ద్ధను క్షాంతిన్ ఘటియింపు మింక; జగదంతర్యామి! సాయీశ్వరా!

12. పవిత్ర రాజపథము:

సరవర తర వర సంతజన -చౌథా బరసే మేహ్
పరమారథకే కారణే - చారో ధారీ దేహ్.

సరసులందంబులు సాధుజనంబు
తరువులు నీ నాల్గు ధర ననిశంబు-
పరులకు నుపకృతుల్ పఱుపగా గోరి
ధరియించు చుండును తనువు లవ్వారి.

విరచాక బహు నఫల భజే - నదీన అంచ వైనీర్
పరమారథకే కారనే - సాధు ధరాశరీర్.

తమ ఫలంబుల దరుల్ - తా తినబోవు
తమనీరముల నదుల్ - తా క్రోల బోవు.
పరమార్థమతి సాధువరులు దేహము
ధరియించి పొసరింత్రు ధర్మోపకృతుల.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

అహంకార మమకారముల విడిచి - ఈ తనువే నేను - ఈ లౌకిక సంపదలు 'నావి' అను బుద్ధి విడిచి త్యాగబుద్ధి గలిగి, శ్రీ సాయీ ప్రభువును మనమనుసరింపవలయును. బాబా బోధలను పాటించి, త్రికరణశుద్ధిగ ననుసరింతుమేని దైవానుగ్రహమునకు పాత్రుల మగుదుము. త్యాగశీలమే మనల మోక్ష సామ్రాజ్యమున జేర్చు రాజ పథము. త్యాగమే మోక్షము. త్యాగమే అంతర్బహిశ్శత్రువుల బారినుండి రక్షించునది. త్యాగమునందే ఆనంద మనోబలములు కలవు. ఉత్తమోత్తమ సుగుణము త్యాగము. పవిత్రతయొక్క పరి పూర్ణత త్యాగమునందే కలదు. నిత్యజీవనము - ఆత్మమోక్షము త్యాగ మునందు మాత్రమే కలదు.

శ్రీ సాయీనాథుడు ఆశ్రితజన సంరక్షణకై సర్వము త్యజించినాడు. ఆ తండ్రిని అనుసరింపగోరు మనమును త్యాగ ధర్మ మును పాటింపవలయును. నిత్యత్యాగ శీలమునందే ప్రశాంతి గలదు. ఏ దేశమున కేగినను - సద్విషయమును పరిశీలించినను - ఏ సాధు సద్గురు బోధ వినినను పైన క్రింద - నెల్లదెసల - త్యాగమును మించిన దేదియును లేదని మనము గ్రహించగలము. మనకు గలదని మనము తలంచునది మనది కాదు. ఆ సర్వేశ్వరునదే అని గుర్తించవలయును. బుద్ధిపూర్వకముగ నేని అబుద్ధిపూర్వకముగనేని మనము త్యాగమునే - త్యాగమయ జీవితమునే సమాశ్రయించవలయును.

"అనిత్యమసుఖంలోక మిమం ప్రాప్యభజస్వమాం" - అని భగవానుడు తెలిపినాడు. అనిత్యము - సుఖవిహీనమగు ఈ లోక మున మానవుడు కష్టములు సహింప నేర్చుకొన దగుననియే తెలిపి నాడు. దానికి సకల కష్టనివృత్తికి ఏకైకమార్గము శ్రీ భగవానుని - తదభిన్నులగు సద్గురువును శరణాగతి జేయుటయే. అట్టి కష్టముల వలన మనకు అతకున కలుగును. శ్రీ సాయీ మహాప్రభువవలె కష్ట పడ నేర్చినవాడుగాని బాబాను సత్యముగ గ్రహింపజాలడు. ఓర్పు, అంతరంగికశాంతి, సచ్చిదానంద స్థితి, శ్రీసాయీపదమునంధే కలదు. 'కష్టములనుండి త్యాగములనుండి (ఇష్టానిష్ట పూర్వకములైన త్యాగ

ములనుండి) తప్పుకొనజాలిన వారింతవరకు నెవ్వరును లేరు. శ్రీ సాయీశుని జీవితమంతయు త్యాగమయమే. కష్టసహనమే. తన ఆశ్రితులకొఱకు బాబా ఎన్నెన్ని కష్టములు సహించినాడో శ్రీ సాయీ చరిత్రవలన మనకు బోధపడగలవు. అట్టియెడ బాబా ఆశ్రితులమైన మనము తీరికగ గూర్చుండి సుఖసంతోషముల బడయగోరుట అవివేకము. కష్టసహనముకంటె నన్యము వాంఛించుదుమేని మనము సత్యముగ వంచితుల మగుదుము.

మానవుని జీవితమున నేయాకు త్రిప్పినను ఏదియోయొక కష్టనష్టములే మనకు బొడగట్టును. కావున కష్టసహనము, త్యాగ నిరతి నభివృద్ధి పెంపొందించుకొను కొలది మనము ఆధ్యాత్మికౌన్నత్యమును బడయగలము. ఇతరులచే నెంతెంత నిరాకరింప బడుచున్నాడో వాడు అంతంత దైవప్రేమ జూఱగొనువాడు. అసహన త్యాగములే వానికొకక వర్ణనాతీత అనందమును గలిగించును. అయా కష్టముల భారముచే నణగిపడియున్న వాడైనను వాని విశ్వాససహనములే వానికి దైవసుఖమును ప్రసాదించును. కష్టపరంపరలచే మానవున కెంతలెంతలు తనూ రక్తమాంసములు క్షీణించుచుండునో వానికంతలంతలు అంతశ్శాంతి - దైవకరుణ ఆత్మబలములు అభివృద్ధి నొందుచుండును.

శ్రీసాయీప్రభువు నిమిత్తమై యెంతెంత కష్టసహనము శ్రీ సాయీ పదాశ్రితుడు పెంపొందించుకొనునో అంతంత ప్రేమపాత్రుడగును. కాన సాయీనాథు ననుసరించువాడు కష్టములు వలదని కోరుకొనడు. కుంతీదేవి శ్రీకృష్ణునిగోరినవరము 'విపదస్సంతు నశ్శశ్వత్‌తత్రతత్రజగద్గురో' అను పలుకులను స్మరణకు దెచ్చుకొనదగును. ఈ కష్టసహనము మానవశక్తి కాదు. దైవ కరుణయే. సాధారణ పరిస్థితులలో మానవుని పరువు లెత్తించి కృశింపజేయునవి, శ్రీసాయీ అనుయాయుని ఉత్సాహ సహన ప్రేమలతో నెదుర్కొనజేయగలుగు చున్నవి. ఇట్టి సర్వవిధత్యాగ సహనములు మానవశక్తి

సంకల్పముల ననుసరించి సాధ్యములు కావు. స్వార్థపరుడైనవాడిట్టి వానికి నిలువజాలడు. దైవమును విశ్వసించి దైవకరుణాలేశమున కష్టసహనశక్తి ప్రసాదింపబడిన వానికే దేహేంద్రియము లధీనము లగును.

శ్రీసాయినాథుని విశ్వసించి, మనసర్వస్వము బాబా పదాంకితముగా వించుకొంటిమేని మనకు "అకుతో భయత్వము" ప్రాప్తించును. మనల జెనక జాలునది యీ విశ్వమున గలుగదు. మనము శ్రీసాయి ప్రభువిశ్వాస సేవకుల మగుటకు సిద్ధపడవలయును. మనమెక్కడకు పాఱిపోయిన నెక్కడ దాగినను గలుగనున్న కష్టములనుండి తప్పుకొన లేము. కష్టములేవేని రానిమ్ము, కానిమ్ము. వీనికి నివారణము లేదు. తప్పించుకొను మార్గములేదు. సహించి తీరవలసినదే. బాబాతోడ గూడి సాయి సేవకులముగ నుండగోరుదుమేని ఆ తండ్రి ప్రేమామృతమును తనివిదీర గ్రోలుదము.

ఇక సుఖములా? - వానిని దైవమునకే విడిచిపెట్టుదము. బాబా అభిరుచి ననుసరించి ప్రసాదింపనిమ్ము. శ్రీసాయి సామ్రాజ్యమున జేరితిమా, కష్టములు మధురములగును. బాబాకొఱకు ఆనందింతుము. అవి మనకు హితకరములనియే భావించుదము. సహించి చావునకేని తెగబడితిమా అవి మన కనుకూలములగును. మనకు ప్రశాంతి ప్రసాదింప బడును. మనకు చిరకీర్తి కలుగును. తదీయులగు భాగవతు లానందింతురు. మన సంబంధీయులందఱు ఔన్నత్యమును గందురు. అభీష్టావాప్తి కష్టసహనములు రెంటిలో మన కిష్టమగు దాని నేరుకొనుట మనకు విడువ బడెనా, రెండవదానినే మనము కోరుకొనవలయును. అపుడు మనము బాబా అడుగుజాడల నడచిన వారమగుదము. సాధుసత్పురుషుల సమ్మతి బడసినవారమగుదము. ఈ కష్ట సహనముకంటె మేలైనదేదేని ఈ విశ్వమున నున్నయెడల శ్రీసాయి ప్రభువు ఆచరణపూర్వకముగ నిర్దేశించి యుండెడివాడే. బాబా తన ఆత్మీయులతో, ఆశ్రితులతో, "ఎవరేని నన్ననుసరించి నెంట బాధలబడినవారుంటిరా, విశ్వాససహనత్యాగములూతగ రండు!"

అని తెలిపినారు. ఈ విశ్వమునగల వివిధ శాస్త్ర గ్రంథముల పరిశీలించితిమేని "దైవసామ్రాజ్యమును అనేక కష్టములద్వారా ప్రవేశింపదగినదే" అని తుది నిర్ణయముగ గ్రహింపగలము. [ఈ సందర్భమున S. C. S. - శ్రీసాయీనాథ బోధామృతము - పేరా 371 సోదరభక్తులు సావధానముగ జదువదగును.]

ప్రార్థన :

ఈ విశ్వం బసుఖం బనిత్యమగు; నా యీ జీవవృత్తంబులా-
దైవాధీనములౌ; హితాఽహితవిభేదజ్ఞానమూ లేదెటన్;
నీవాడన్ - శరణంటి; త్యాగనిరతిన్ విశ్వాస ధైర్యక్షమల్
సేవాలబ్ధిని గూర్చి ప్రోవగదవే! శ్రీసాయినాథప్రభూ!

**తృతీయపాదము సమాప్తము.**

ఓమ్

# శ్రీ సాయీ అనుసరణము

## చతుర్థ పాదము

### 1. శ్రీసాయీబాబా పిలుపు - మేలుకొలుపు:

"జాగరిత బొందు - బిడ్డ!" - శ్రీసాయి పలుకు,
"అదియె కను! దూరమందు మాయాపిశాచి
పలుగువాఱుచు నిను లోభపఱచుచుండె;
ఆశపడితివా - యగు సర్వనాశనంబు.

* * *

ద్వారకామాయి నిలయ కవాట మెపుడు
దిక్కులేనివారలు చేర దెఱచియుండు;
వస్తు సంభారములు చూడ స్వల్పమైన
ప్రేమపూర్వకముగ నివి పెట్టబడును.

* * *

గములు కట్టి కసాయి ప్రాంగణము జొచ్చు
నోరులేని యీ జీవుల తీరుగాంచి
కరుణ బ్రసరించు నా పరాత్పరుని శక్తి
కతన - వీనికై మది జాలిగాంచు చుంటి.

* * *

పథికుడా! నీదు చింత లావలకు ద్రోయు
మైహిక విచారములను మిథ్యలుగ గనుము!
ఇందు నీకు గావలసిన దే లవంబొ;
కాలపరిమితియే నధికంబుగాదు.

అకట! యీ భాగ్యకలిత సౌఖ్యంబు లెల్ల
స్వల్పములును బ్రతిక్షణ క్షయకరములు;
అల్పముల వీని గొండాడు నట్టి జడుడు
వాని కంటెను మిక్కిలి స్వల్పుడగును.

* * *

కుదురుగా నిన్నొడగ జేర్చుకొనగనిమ్ము-
క్షల విచార భారముల నావలన విడుము!
ఒనర నెడబాటు మనకు లేకుండుగాక!
నాదు సర్వస్వమును - నేను - నాది - నీవ."

(శ్రీ శ్రీసాయీ కరుణ పుటలు - 1, 2.)

2. నిర్వేదము:

శ్రీసాయీనాథ బోధామృతము- **(Sri Sai Baba's Charters & Sayings)** ఏకకాలమున ఒకే ప్రదేశమున - ఒకే వ్యక్తినిగూర్చి పలుక బడకున్నను ఈ సార్వకాలిక సత్యప్రబోధములు మన కందఱకు విన బడుచునే యున్నవి. అందఱ నుద్దేశించినవి. ఇవి బాబా శ్రీముఖోద్గ తము లగుటచే త్రిసత్యములు. విశ్వాస కృతజ్ఞతాపూర్వకముగ స్వీక రింప దగినవి. ఇవి మన బంధ విముక్తికొఱకు - మనకు సుశ్రేయమును గూర్ప నుద్దేశించి పలుకఁబడినవి. కావున మన హృదయఫలకమున ఖచితములు చేసికొన దగినవి.

ప్రేమామృత పూరితములు - దయా కలితములు నగు ఆ మధు రాతి మధుర సూక్తులు మనల మేలుకొలుపుచునే యున్నవి. మన దోష ప్రవర్తనలు - కల్మషపూరిత హృదయములే వానిని స్వీకరించి, బాబా దఱికి జేరుటకు జంకుగొంకు మనకు గూర్చుచున్నవి. బాబా అభయ ప్రదానములు మనల ప్రోత్సహించుచున్నను, మన దుష్ట సంస్కార ములు మన పాప పుంజములు మనల గ్రుంగదీయుచున్నవి. నిత్య

సత్యానందమును - ప్రేమామృతా స్వాదనను తనతో గలిసి అనుభ వించుచు ఆనందించుటకు "ద్వారకామాయిని జేర రండు!" అని - బాబా ఎలుగెత్తి పిలుచుచునే యున్నాడు. బాబా ముఖోద్గతమగు ఆహ్వానమును ప్రేమ పూరితమైన పిలుపును మన స్మృతి పథమునకు దెచ్చుకొందము.

(S. C. S శ్రీసాయీనాథ బోధామృతము - పేరా 44)

"అయ్యలారా! రండు! సంచుల నిండుగ "ఉధి" గొని పొండు! మీ తల్లి ధనరాసులను బండ్ల కెక్కించుకొని పొండు! ఇటు చూడుడు! జనులు వచ్చి "బాబా! మాకీయుము - మాకీయుము" - అని కోరుదురు. "తీసికొన్నుడు!" అని నేను చెప్పుదును. ఎవడు తీసి కొనడు.

(S. C. S. శ్రీ సాయీనాథబోధామృతము పేరా 45)

"అడిగినవానికి 'లేదు' - అనక సమృద్ధిగ నీయుము!, - అని నా గురు డానతిచ్చినాడు. సద్బుద్ధితో నా మాటలు వినువారు లేరు. నా ధనాగారము తెరువబడియే యున్నది. ఎవ్వరు నా ధనమును బండ్ల కెక్కింప జూడరు. "త్రవ్వుడీ!" - అని నేను చెప్పుదును. ఎవ్వరు నే మాత్రము శ్రమపడరు. "త్రవ్వి వెలికి దీసి, బండ్ల కెక్కించుకొని పొండు! మీ ధనపు కొట్టులను నింపించు కొనుడు! మనమిక నేమి కానుంటిమో! ఈ జీవితము ఏమి యగునో! పృథివి - పృథివిని, జలము-జలమును, అగ్ని - అగ్నిని, వాయువు-వాయువును, ఆకాశము- ఆకాశమును జేరును. ఇట్టి మంచి అవకాశము మీకు గలుగబోదు"- అని దయామయుడగు బాబా మనల ప్రబోధించుచునేయున్నాడు.

* * *

బాబా! నీ పలుకులు, పిలుపులు ఎంత మధురాతి మధుర ములు! ఈ పాపి చెవులకు వినవచ్చుచునే యున్నవి. తండ్రీ! దీనులగు పాంథులను మమ్ము జేరబిలుచుచున్నావా? నిన్నుగూడి ఆనందించు

మనుచున్నావా? స్వామీ! నిన్ను జేరుటకు - చేరగలుగుటకు నేనెంత వాడను? నాకేమి యోగ్యత కలదు? "రా- రండు!" బిడ్డలు మీరందఱు రండు! అనుచున్నాడవు.

ఈ అనుగ్రహావతరణము - ఈ కరుణా ప్రపూరితమగు ఆహ్వానము భావమేమి? ఏవిధమైన సాధుస్వభావములేని నే నెటుల నిన్నుజేర సాహసింప గలను? సర్వహృదయాంతర్వర్తివగు నీయెదుట మంచి తనము కలవాడనని యెటుల నటింపగలను? ఉదారస్వరూపుడవగు నీ మ్రోల పరమదోషినగు నేనెటుల గూర్చుండగలను? నిన్ను గనిన దేవాదులు వెఱగొందుదురు. సజ్జనులును నిన్ను జేర వెఱపు గందురు. అట్టియెడ "రండు! మీరందఱు నా దఱికి రండు!" - అని పిలుచుచున్నాడవు. ఈ అభయప్రదానవాక్కులు బాబా! నీ శ్రీముఖోద్గతములే కాకున్న నెవరు ఈ పిలుపులను సత్యములని విశ్వసింతురు?- నీవే ఆజ్ఞాపించి చేరదీసికొనకున్న నెవరు నీ దఱికి జేర సాహసింతురు? - చేర గలుగుదురు? సర్వసృష్టి స్థితి లయకారకుడవగు నిన్నెట్లు చేరగలను? నీదఱిజేరిన తరువాత దుస్సంకల్పాదులు మనసున పొడమకుండుటకు ఎట్లు? సర్వగతుల భ్రష్టుడైన వీడెటుల నీ దివ్య పాదపద్మములను స్పృశింపగలడు?

నిస్వార్థపరాయణుడై అహర్నిశలు నిన్ను సేవించుచు 'భగత్!' (భక్తుడా!) అని నీచే ప్రశంసింపబడిన మహల్సాపతి - నీ అన జవదాటని చందోర్కరు - తుది క్షణమువరకు నీ స్మరణ విడబోని కాకాదీక్షిత్తు - నీకొఱకు, అభిమానాదుల వర్జించి భిక్షాటనము గావించిన వామనరావు, నార్కేలు - నిరంతరము నీ అద్భుత లీలలను గీర్తించు గాణూదాసు - హేమాద్రిపంతులు - నీ కీర్తి వ్యాపింప జేసిన ఉపాసనీబాబా - నీ ప్రేమ జూఱగొనిన శ్యామా, రాధాకృష్ణ అయీ, తార్కాడ్‌సతి, తారాబాయీలు నీకై శాశ్వత విశ్రాంతి భవనము నిర్మించిన బూటీ - సతతము సకల సేవల బొనరింపనేర్చిన బడేబాబా (అబ్దుల్) - మొదలగువారెక్కడ? పది నిముసములేని మనసు నిలిపి నిన్ను సేవింపలేని యీ విషయలంపటుడైన నికృష్టు డెక్కడ? ఈ

స్వల్పుడెంత? వీడు కావింపగల సేవ యెంత? బాబా! జీవన జ్యోతి వగు నీ సమక్షమున చెడుతలంపులు గలుగరాదు గదా! సర్వజ్ఞుడవు-సర్వనియంతవగు నిన్నెటుల జేరగలను? నాయీ హైన్య భావము నెటుల గప్పిపుచ్చుకొనగలను?".

అని, బాబా పిలుపు వినబడిన శ్రేయస్కాముగడగు సాధకుడు తన అంతరాత్మయగు శ్రీసాయీనాథునితో విన్నవించుకొనును.

* * *

మనము పుణ్యక్షేత్రములని, తీర్థములని అవతార పురుషులు విహరించిన స్థానములని వానిని దర్శించుటకు వెళ్ళుచుందుము. సిద్ధయోగి సత్పురుషుల అద్భుతలీలలు, మహిమలు విని వారిని వీరిని సందర్శింప నేగుచుందుము. ఇవియన్నియు వినోద, విలాస యాత్రలుగ పరిణమించు చున్నవేకాని, హృదయ పరివర్తనము కలుగుట లేదు. కారణము, ఆ తీర్థ క్షేత్రరాజములందు ఆయా స్థలములకు అట్టి అద్భుతశక్తి గలిగించిన అవతార సాధుసత్పురుషులందు, వారి ప్రబోధలందు దగిన విశ్వాసము లేక పోవుటయే. భగవానుడు ఒక దేశముననే కాదు. ఒక కాలముననే కాదు. ఎల్ల దేశముల నెల్ల కాలముల అవ్యాజకరుణాసింధువై అవతరించుచునే యున్నాడు. ఎల్లర నుద్ధరించుటకై మానవుడై పొడముచునే యున్నాడు. వారు, వీరు అనక ఎల్లఱను, దీనులు ఆర్తులునై సంసృతి సాగరమున నిమగ్నులై తరుణోపాయము గనిలేనివారి నందఱ జేఱబిలుచుచునే యున్నాడు. శ్రేయస్కాములగు వారలా పిలుపు విని చేరి, తరించుచునే యున్నారు.

నేడు పరాత్పరుగుడగు భగవానుడు శ్రీసాయీబాబా రూపమున అవతరించి, (S. C. S. శ్రీ సాయినాథబోధామృతము పేరా 301 ఎ.) "మీరందఱు నా బిడ్డలు - సాయిదేవుడా? — అని భక్తులగు మీరటుల పలుకరాదు. మీ సకలాభీష్టములను నావలన మీరు పొందవలయును. అని బోధించినాడు. [చూడుడు. S. C. S శ్రీ సాయీనాథ బోధామృతము పేరా — 81, 301, 331, 371, 388.]

సర్వవ్యాపి సర్వనియంత, సర్వజ్ఞుడు, సర్వసమర్థుడగు భగవానుని ఏ రూపమున సమాశ్రయించి సేవించినను - బ్రహ్మజ్ఞుడైన ఏ సమర్థ సద్గురువును సమాశ్రయించి సేవించినను మానవుడు సంసార సాగరమును తరించి తీరును. కావలసినవి గాఢవిశ్వాసము, ధైర్యముతో గూడిన ఓర్పు మాత్రమే. దయామయుడగు భగవానుడు తన బిడ్డలగు సకల మానవులను (జీవులను) తనను చేరరమ్మని పిలుచుచునే యున్నాడు. కాని, దరిజేరబోవని కారణము. దైవము - భగవానుడు అనువాడు కలడు - అను సద్బుద్ధి; - ఆ దైవ స్వరూపుడగు అవతార సత్పురుషునందు విశ్వాసము లేకపోటయే. - అహంకార మమకారములు - (నేను - నాది) అను తలంపులీజీవియందు పాదుకొని, యీ జీవిని దైవమునకు దూరము చేయుచున్నవి. పురాకృత సుకృతమున జెరినను ధైర్యముతోగూడిన ఓర్పులేని కారణమున అవతార పురుషుని జేరిన జీవి రిక్తహస్తములతో మరలిపోవుచున్నాడు.

బాబా పలికిన పలుకులను గమనింపుడు! "బాబా! మాకీయుము - మాకీయుము అని కోరుదురు తీసుకొనుడని నేను చెప్పుదును ఎవడు తీసికొనడు (S. C. S. 44)." "సద్బుద్ధితో నా మాటలు వినువారు లేరు. నా ధనాగారము తెరువబడియే యున్నది....త్రవ్వుడీ! యని యందును. ఎవ్వరు శ్రమపడరు. త్రవ్వి వెలికిదీసి బండ్ల కెక్కించు కొనరు.... **(S. C. S 45).**"

బాబా పలుకులందు విశ్వాసములేని కారణమున ఆధ్యాత్మిక సంపదను బడయ నేరకున్నాము. మృదుమధురములు - ప్రేమానుగ్రహపూరితములు నగు పలుకుల జేరబిలుచుచున్నను ఇంచుక ఓర్పు గలిగి "బాబా! నీ ధనరాసులను త్రవ్వి బండ్లకెక్కించుకొను బుద్ధి - తగినశక్తిని నీవే ప్రసాదింపవే!" - యని ప్రార్థింప నేరకున్నారము. ఆ మాత్రమేని ప్రార్థించిన జేరబిలిచిన ఆ తండ్రియే దగిన బుద్ధిని - శక్తిని ప్రసాదించి, అనుగ్రహించి తీరును. పెన్నిధానమగు బాబాను జేరియు విశ్వాససహన శక్తులు లేనివారమై యేవియో యొకటి రెండు

జాలను - ఐహిక సుఖసంపదలను - గ్రహించి మరలిపోవుచున్నా రము. శ్రీ సాయీనాథుని కరుణ సర్వదా సర్వధా ఎల్లజీవులయందు గలదు - కలదు. ఆ కరుణను బడయుటకు మనము త్రికరణశుద్ధిగ బ్రార్థింపవలయును.

ప్రార్థన :—

అనురాగంబున "రండు! రం"డనుచు నాహ్వానించు ప్రేమస్వరూ
పుని నిన్‌జేరగజాలు యోగ్యతను - సద్బుద్ధిన్ ప్రసాదించి, వి
నిని నీవే దఱిచేర నీడ్చికొని, శాంతిన్ గూర్చి, ప్రేమామృతం
బున దన్పంగదె! నీకు మ్రొక్కెదను; బాబూ! సాయీనాథ ప్రభూ!

8. శ్రీ సాయీ సంబంధము తఱచుగ గలిగి యుండుట శ్రేయస్కరము:

"యద్యపి గగనం శూన్యం తథాపి జలదామృతాంశురూపేణ
చాతకచకోర నామ్నో దృఢీభావాత్పూరయత్యాశామ్.
తద్వద్వ్రజతాం పుంసాం దృగ్వాఙ్మనసామగోచరోఽపి హరిః
కృపయా ఫలత్యకస్మాత్ సత్యానందామృతేన విపులేన."

ఆకసంబు శూన్యంబైన నగునుగాక!
వారివాహసుధాంశు రూపములజేసి
చాతక చకోర సుదృఢవిశ్వాసముననె
ఎల్ల కామితములను బూరించుగాదె?

అఖిల వాఙ్మనముల కెందు నందరాని
కృష్ణసాయి యవ్విధి నాశ్రయించు ప్రజల
నెప్పుడో యొకప్పుడు నిజకృపను బఱపి
అమిత శాశ్వతానందరూపమున నింపు.

(ప్రబోధ సుధాకరము - అనుగ్రహప్రకరణము)

శ్రీ సాయీ పదాశ్రితులమగు మనము ఆ తండ్రి బహూకృతులను స్వీకరించి, ప్రశాంతి స్వస్థతను బడయుటకు బాబాను జేరవలయును. దీనులము, అకించనులమగు మనకొఱకు బాబా సిద్ధపఱచిన ప్రేమామృతమును తనివిదీఱ నాస్వాదించవలయును. మన మఖిలమించి ఆనందింప దగినవన్నియు శ్రీసాయీప్రభువునందుగలవు. మన ప్రాపు, కాపు, బలము, కీర్తి ప్రతిష్ఠలు, మన సర్వస్వము ఆ తండ్రివే. తన సంశ్రితుల ఆత్మను వైళము సంతృప్తి బఱుపగలడు. ఆనందింప జేయగలడు. సర్వదా మన ఆత్మను మాత్రము బాబాకు అభిముఖము జేయవలయును.

[ S. C. S. శ్రీసాయీనాథ బోధామృతము పేరా 181. స్వీకరణము]

బాబా కుంతలమును శుభ్రపఱచి బోరగిల పెట్టుచుండెను. బాబా యందు విశ్వాసములేని కోపర్గాం స్టేషనుమాష్టరు బాబాతో "ఇదియేమి?" అనెను.

బాబా:— నా దగ్గఱకువచ్చు ప్రతిపాత్ర మూతిని క్రిందు జేసికొని వచ్చును. (అనగా జలము - ప్రేమామృతమును స్వీకరించుటకు వీలుపడని విధమున జేరుచుందునని భావము.)

మన హృదయమును "ద్వారకామాయి" మందిరముగ గల్పించుకొని గౌరవభక్తి ప్రేమలతో నేడే-యీ క్షణముననే - శ్రీసాయీ మహాప్రభువునకు స్వాగత మీయవలయును. బాబా తన అంకిత సంతతిలోని వారగు మహల్సాపతి - చందోర్కర్ - కాకాదీక్షిత్ మొదలగువారిలో నొకరుగ మనల (ఎవనికివాడు తెలుపుకొనదగును) భావించి, అనుగ్రహమునకు బాత్రుల గావింపుమని ప్రార్థింపవలయును. మన హృదయ పాత్రలను ప్రేమామృతమున నింపుమని, మన ఆత్మను తనయందు జేర్చుకొనుమని విన్నవించుకొనవలయును. మనకీ విశ్వమున గావలసిన కోరదగిన వస్తువు ఆ తండ్రియే. బాబా వెలిగా మనకీ ప్రపంచమున సుఖశాంతులు లేవు బాబా ఉనికి చేతనే మనమున్నాము. బాబా లేదేని మనమును లేము. బాబా దూరమైన

మనకు జీవింపగల శక్తి మృగ్యము. కావున తఱచుగ శ్రీసాయీ భిషగ్వరుని జేరి బంధవిమోచనౌషధమును సేవించుచుండవలయును. ఆ తండ్రి దివ్య ప్రేమామృతమును తఱచుగ సేవించుచుండమేని మన జీవయాత్రయందు - మార్గమధ్యమున సొమ్మసిల్లి పడిపోవుదుము.

బాబా తన ఆశ్రితుల కొసగిన అభయప్రదానమును గమనింపుడు! [S. C. S. పేరా 25-" తన భారముల నాపై నిలిపి, నన్ను జింతించువానిని సర్వవిధముల నాదుకొని రక్షింతును. "యోగక్షేమం వహామ్యహమ్"-] [S. C S. Para 27 "నా భక్తుని యింట తిండి గుడ్డల కేనాడును కఱవు గలుగదు."] అని శపథము గావించిన బాబా తన మాటను నిలుపుకొని తీరును.

శ్రీసాయీప్రభువు మన ఆత్మకు మధుర ఫలాహారము. ఆ తండ్రి నుచితరీతిని సేవించువాడు దివ్యసామ్రాజ్యమున బాల్గొననర్హుడు. లోకవిషయానుభవముల మునిగి, పాపాచరణశీలుడై సొమ్మసిల్లు యీ జీవికి బాబా త్రావబెట్టు ప్రేమామృతము నూతన చైతన్యమునుగూర్చి, యుజ్జీవింపజేయును. ఎక్కువసేపు బాబానుండి విముఖులమైతిమా మన పవిత్రాశయములనుండి పతితుల మగుదుము. మానవుని ఊహలు తరుణ వయస్సు మొదలు చెట్టువైపునకు దారితీయుచుండును. అట్టియెడ యేదొక రూపమైన దైవసహాయము - దివ్యాలంబనము కలుగకుండెనా వాడంత కంతకు నధోగతిపాలగుచుండును.

కావున పవిత్రమైన శ్రీసాయీ సంబంధము ఏదొక రూపమున గల్పించుకొని, సన్మార్గాభిముఖులము కావుటకు యత్నించవలయును. కావున యీ సమయముననే యీ క్షణముననే ఆ ఉపేక్ష త్యజించి, బాబా ఆశ్రయము పొందజాలమేని, సేవింపమేని, చేయూత నపేక్షింపమేని మన గతి యేమి కానున్నదో! నిరంతరము శ్రీసాయీనాధుని ధ్యానించి సేవించుటకు బుద్ధి - శక్తి చాలనివారమేని, అనుగ్రహమునకు పాత్రులను గావింపుమని ఎప్పుడే నొకప్పుడైన ఆ తండ్రిని ప్రార్థింపవలయును. విశ్వాసధైర్య సహనములు గలిగి బాబాను సేవించు బిడ్డలు ఆ ఆసతోడనే ఆ తండ్రి కరుణ ఎపుడు ప్రసరించునా!

యని నిరీక్షించుచుందురు.

ప్రార్థన :—

శ్రీ సాయీమహాప్రభూ! నీవు జగదంతరాత్మవు. సృష్టిస్థితి లయకారుడవు. మాయందు అవ్యాజ కరుణ వహించి దీనులము - అకించనులమగు మాకు చేయూత నొసగి మమ్ము ఉద్ధరించుటకు అవతరింతువు. నీకొఱకు మేముపడయు క్షుత్పిపాసలను దీర్తువు. సర్వ స్వామివగు నిన్ను సేవించి, పూజించి, అనుభవించి, ఆనందించు వారెంత ధన్యులు!

ఎట్టి మహాప్రభువును వారు సేవింపగలిగిరి! ఎట్టి ప్రియ తముడైన అతిథిని వారాదరింపగలిగిరి! ఎట్టి పరమాప్తుని వారుచేర దీసిరి! ఎట్టి విశ్వాసపాత్రుడగు మిత్రమునకు స్వాగతమొసగ జాలిరి. ఎట్టి ఉదారాశయములుగల ప్రియుని వారాలింగనము జేసికొనిరి.

బాబా నీవు జకదేకనాథుడవు. ప్రియతముడవు. ప్రేష్టవస్తువ వీ వొక్కడవేకదా! ఈ ప్రపంచమున నెట్టి మహోన్నతస్థాయి నొంద గలిగిన వస్తువైనను నీ కరుణా లేశమున బడసినదేకదా! ఈ విశ్వ మున నీకు సాటిరాగల వస్తువు లేనేలేదు. బాబా! నీకు వేవేలు సాష్టాంగ ప్రణిపాతములు.

4. శ్రీసాయి సమాశ్రయము - తాపోప శమనకరము:

అంతస్థభావభోక్తా తతోఽంతరాత్మా మహామేఘః
ఖదిరశ్చంపక ఇవవా ప్రవర్షణం కింవిచారయతి?

భూతకోట్యాంతరిక భావభోక్తయై, త
దంతరాత్మయౌ శ్రీసాయి - అంబుదంబు;
ఖదిరమియ్యది - యిది చంపకంబటంచు
వృష్టిసమయంబునందు భావించునేమి?

(ప్రబోధసుధాకరము - అనుగ్రహప్రకరణము)

సకలవిశ్వమయుడును - సకలభూతాంతరాత్మయునగు శ్రీ సాయీనాథుకు ఒక మహాంబుదము. కరుణామృతధారలు వర్షించు సమయమున నిది ఖదిర (చండ్ర) వృక్షమని - ఇది చంపక తరువని విచక్షణ వహింపదు ఆశ్రితకోటి నందఱను సమానముగ ననుగ్రహించును. ఆయా జీవులస్థితి - విశ్వాస సహనములకొలది బాబా అనుగ్రహవృష్టిని బడయుచుందురు.

శ్రీ సాయీరక్షణ మాసించు జీవి - బాబా అనుగ్రహ సుధా మాధుర్యము జవిజూడగోరు జీవి - తగిన విశ్వాస విధేయతలతో జేర వలయును. అపుడుగాని ఆ తండ్రి రక్షణలోని మాధుర్యము తదాశ్రితున కెఱుక బడదు. మన సందేహములన్నియు దొలగి, కనువిప్పి కలిగి నపుడుగాని బాబాను మనము చేరజాలము. అది మానవమాత్రునకు లభ్యపడునదికాదు. సందేహనివృత్తియు - కనువిప్పి కల్గుటయు ఆ తండ్రి లీలయే.

(S. C. S. శ్రీ సాయినాథబోధామృతము - పేరా 56)

సా.బా:- .... పలువిధములగు కారణముల నా వారిని దూరదూరములనుండి నా దఱికి నేనే చేర్చుకొందును. నేనే యేరి కోరి నా దాపునకు ఆకర్షింతును.

దేవతలకేని లభ్యముకాని యట్టియోగ్యత మానవబుద్ధికి అందదు. కావున బాలహృదయము - గాఢ విశ్వాసమునుగలిగి ఆ తండ్రి పిలుపును సమాలకించి, మనయెదుట బొలుచు మానవరూపమునన్న దైవమును - శ్రీ సాయీ మహాప్రభువును జేరవలయును. మనము బాబాను జేరి ఆ స్వామితో గలసియుండుటే - ఆ తండ్రి సంబంధము గల్పించుకొనుటే బాబా కోరునది. కావున ఆ పనికై మనము ఆ స్వామి దయ - అనుగ్రహమునకై ప్రార్థింపవలయును. శ్రీ సాయీనాథునకంటె నితర సాధనముల నపేక్షింపక బాబా ప్రేమ ప్రవాహమున నోలలాడ నేర్వవలయును.

ఇట్టి మహోన్నతము - అమూల్యమైన రక్షణము మన ఆత్మకు - తనువునకు బలవర్ధకరము. ఆధ్యాత్మిక జీవనమునకు రసాయనము. మన దుష్ట మానసిక బాహ్యప్రవృత్తికి నివారణోపాయము. మన కామితములు నిరోధింపబడును. ప్రాకృతాకర్షణలు క్షయించును. సుగుణసంపద పెంపొందును. విశ్వాసము దృఢపడును. ఇతోఽధికముగ శ్రీ సాయీ కరుణ మనయందు ప్రసరించి, మన ఉన్నతాశయము పటిష్టమై ప్రేమజ్యోతి మనయందు చక్కగ ప్రకాశించును.

బాబా భౌతిక తనువునందున్నను లేకున్నను ఒక్కటే. మహాసమాధికి (1918కి) పూర్వము శ్రీ సాయీమహాప్రభు వెక్కడనున్నాడో యీనాడు, నికేనాడును అక్కడనేయున్నాడు. ఉండువాడు - అనగా సర్వవ్యాపియై యున్నవాడు. కావున పూర్వము - భౌతిక తనువుననున్నయపుడు - తరువాత - మహాసమాధి పిదప బాబా తన బిడ్డలకు ఆశ్రితులకు ప్రసాదించుచున్న లౌకిక - పారలౌకిక ఫలములు - సోదర భక్తులకు విశదములగుచునే యున్నవి.

కావున శ్రీ సాయీనాథునందు గాఢవిశ్వాసము వహించి మన మా తండ్రితోడ సంబంధము గలిగియుండ నేర్వవలయును. మన ఆత్మోద్ధారకునిగ - మనోదౌర్బల్యపరిహారకునిగ - అంతశ్శాంతి ప్రదాతగ మనము తెలిసికొన గలము. నిరాశ నిస్పృహల నొందిన బిడ్డల నెట్లుద్ధరించినది - వివిధానేక సంకటములనుండి యెట్లు కాపాడుచున్నది అపార కరుణామృతము బఱపి వాడి వత్తలైన తన ఆశ్రితుల జీవితముల కెట్లు జీవనము గల్పించుచున్నది విశదమగుచునే యున్నది. శ్రీసాయీప్రభువుతో సంబంధము గల్పించుకొను పూర్వము విచారగ్రస్తులు - కఠిన హృదయులు బాబా దివ్య ప్రేమామృత మాస్వాదించి స్వస్థచిత్తులు - శాంతస్వభావులు హృదయ పరివర్తనము గలవారై యెటుల చక్కబడిరో తెలుపజాలు ఉదాహరణములు కోకొల్లలుగ గలవు. విశ్వాస వినయవిధేయతలతో ఆ మధురాతి మధురామృత నిధానమును జేరి అంతయో యింతయో ఆస్వాదింపక తిరిగి వచ్చినవారు లేరు.

శ్రీసాయీనాథుడు నిరంతరము పొంగి పొరలు దివ్యామృతము చెలమయే. అహర్నిశలు వెలుగొందు "ధుని" యే పుష్పఫల శోభితంబైన కల్పతరువే. బాబా పాదతలము జేరిన బిడ్డలకు క్షుత్పిపాసలు - శీతాతపవ్యధలు కలుగనేరవు. ఆ కారణముచేతనే అవ్యాజ కరుణాసింధువై మనల నందఱ జేరబిలుచుచున్నాడు.

"అనిత్య మసుఖంలోక మిమం ప్రాప్య భజస్వ మామ్" - అని శ్రీకృష్ణసాయీ మహాప్రభువు - "లోకవిషయ గ్రీష్మాతపమున ఏల సోలి సుక్కెదరు? మీరందఱు నా బిడ్డలు. రండు! రండు!! నావలన సకలాభీష్టముల బడయుడు!" అని యెలుగెత్తి చేరబిలుచుచున్నాడు.

"శరత్సుధాంశు ప్రతిమప్రకాశం - కృపాతపత్రం తవసాయినాథ!
స్వకీయ పాదాబ్జ సమాశ్రితానాం - స్వచ్ఛాయయాతాప మపాకరోతు.

శరదిందు సుందర సమశీతకాంతి
బఱపు నీ కరుణాతపత్రంబు; భ్రాంతి
ద్రోయు, నీ పదరతాత్ములకిది తాత !
ఛాయచే పాపముల్ శమయించుగాత !

(శ్రీసాయీ మహిమ్న స్తోత్రము) (బాబాపూజా స్తవమాల)

అని, శ్రీ ఉపాసనీ మహారాజు మనల నందఱ నుద్దేశించి "ఈ సంసార గ్రీష్మాతపమున నేల సోలి సుక్కెదరు? శ్రీసాయీనాథ కరుణాతపత్రము నీడ జేరి తాపోపశమనము బొంది, సుఖ శాంతి సంతుష్టి సంతృప్తుల బడయుడు!" అని ఉద్బోధించుచున్నాడు,

ప్రార్థన :

నీ యిచ్చించినరీతి జీవచయమున్ ద్రిప్పింతు; స్వాతంత్ర్యమా
యీయా జీవుల కెందునేన్ గలుగబో - దీనీదు వాగ్దానముల్
త్రోయంబోవక నీ పదాంబుజములందున్ భక్తి, నీ సంస్మృతిన్
నీ యాసక్తి సదాశ్రయంబిడవె! తండ్రీ! సాయినాథప్రభూ !

5. సర్వసమర్పణము:

మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోసిఽమే.

నాదు భక్తిగలిగి నాయందు మది నిల్పు
నను నమస్కరింపు నను యజింపు
నన్నె పొందగలవు, నాకు బ్రియుండవై
తివి, యథార్థమిది ప్రతిజ్ఞ జేతు.

(శ్రీమద్భగవద్గీతామృతము 18-65)

సర్వవ్యాపకుడు - సర్వసాక్షి - సర్వనియంత సర్వేశ్వరుడగు శ్రీసాయీ ప్రభు మహత్త్వమును మన అల్పత్వమును గమనించుదుమేని - సరిపోల్చుకొందుమేని గజగజ వడకుదుము. విభ్రమము నొందుదుము. బాబాను జేరమా మనము నిర్జీవులమే. తగని విధమున జేరుదుమా - ఆ తండ్రి అనుగ్రహమునకు దూరులమగుదుము. శ్రీ సాయీ బాబా అనిన ఎవరో ఒక సాధారణమైన వ్యక్తి-మానవుడు-సాధువు అని తలంచరాదు. ఆ తండ్రి "అపాంతరాత్మ" - ప్రకటమైన అంతర్యామి - సకల భూతాంతర్యామియైయుండియు (సర్వ భూతాంతరాత్మ) తనను సమాశ్రయించు జీవులను ఉద్ధరించుటకు సగుణుడు - సాకారుడై మన యెదుట బొడమిన భగవానుడు. కావున మన సకల చిత్తప్రవృత్తులను ఎఱుగువాడు. కావున బాబా మ్రోల మనమేమియు గప్పిపుచ్చజాలము.

"ప్రపంచమున సాయిని లోగొనగల వస్తువెదేదియులేదు.
ప్రపూర్ణసంవిత్స్ఫురన్మూర్తి బాబా కనుబ్రాముగరాదు"

(శ్రీసాయీ విజజయము)

ఆ తండ్రిని జేరుటకు దగిన పాత్రతను మనకు ప్రసాదింపుమని బాబాను ప్రార్థించవలయును. మన హృదయమున శ్రీసాయీనాథునియెడ గౌరవ భక్తిప్రేమలు నెలకొను విధానము దెలిసికొని మన ఆత్మకు శాంతి, దైవ సంబంధమైన త్యాగబుద్ధి మన ముపార్జించుకొను మార్గమును జూపుమని ఆ స్వామినే ప్రార్థించవలయును.

శ్రీసాయీనాథుడు మన అంతరాత్మయై మనకు బోధించును. గాఢ విశ్వాసము - అడకువ - అకించనత్వము గలిగి మన గురుదేవుని సమాశ్రయింప దగును. మన మనస్సును ప్రతిక్షణము బరీక్షించుకొనుచు మన శక్తికొలది దానిని నిర్మలము - పవిత్రము జేసికొనుచుండవలయును. భగవదాజ్ఞలకు విరుద్ధముగ నే పనియేని గావించిన తగిన పశ్చాత్తాపమును మన హృదయాసీనుడగు బాబాకు దెలుపుకొనుచు క్షమాభిక్ష నర్థించి, మన హృదయభారమును దీర్చుకొనవలయును. అటుల కాదేని మనము కావించిన అకార్యములు (చేయరాని పనులు) బాబాను జేరనీయక జంకుగొంకులను గూర్చుచుండును.

విషయ సుఖానందముల గూర్చి యుప్పొంగుచుందుమే కాని, కావించిన అకార్యముల గూర్చి యేడ్చి పశ్చాత్తాపము పొందము. లౌకిక సుఖములందు శ్రద్ధాభక్తులను ప్రకటించుదుమేకాని, జీవిత లక్ష్యమునెడ నుపేక్ష, అలసత్వము వహింతుము. అవి యివి కూడబెట్టుకొనుటకు లుబ్ధత్వము వహింతుమేకాని, దాతృత్వబుద్ధిని విడనాడుదుము. విచక్షణ పాటింపక వదరుచుందుమేకాని, మౌనమువహింప వెనుకాడుదుము. ప్రవర్తనల నిర్లక్ష్యము వహింతుమేకాని, మంచి శీలమును గాపాడుకొనము. తిండికై ప్రాకులాడుదుమేకాని, దైవమును దలంపము. విశ్రమింప త్వరపడుదుమేకాని, ఏదొక కృషి సలుప బద్ధకించుదుము. ఆత్మస్తుతి పరనిందలకు మెలకువగని చెవులొగ్గుదుమే కాని, దైవసేవ, మానవసేవలకు కునుకుపాటొందుచుందుము. అనాలోచితముగ నిర్ణయించుచుందుమేకాని సావధానముగ పరిశీలింపము, త్వరపడి ఉద్రేకము వహింతుమేకాని, ఇతరులు మనకు గావించు అనిష్టముల స్వీకరింపజాలము, సంపదల బొందునెడ నుబ్బి తబ్బిబ్బు

లగుదుమేకాని, దారిద్ర్యమునెడ నిబ్బరము వహింప జాలము. సత్కార్యాచరణల గూర్చి నిర్ణయించు కొందుమేకాని, ఏ యొక్క టినియు నాచరణమందుంచుకొనజాలము.

ఇట్టివి - మఱి యితరములైన మన లోపముల గూర్చి విచార పడుచు హృదయాసీనుడైన గురుదైవమునకు దెలుపుకొనుచు, క్షమాపణ మర్థించుచు, నెప్పటికప్పుడు మన ప్రవర్తనముల జక్కదిద్దుకొనుచుండ వలయును. ఇవియే శ్రీసాయీ ప్రభువు అధివసించిన మన హృదయ పీఠమున వెలిగించదగిన అగరువత్తులు- దీపములు- బాబామ్రోల భస్మీ పటలము జేయదగిన అకార్యములు. వెలిగించవలసిన జ్ఞానజ్యోతులు. ఇటుల గావించి మన తనూమనములను సంపూర్ణముగ ఆ తండ్రికి సమర్పించుకొనవలయును. ఇదియే మనము బాబాకు సమర్పించు కొనవలసిన నివేదనము - నైవేద్యము.

మానవులమగు మనము గురుదైవమునకు ఇంతకంటె సమ ర్పింపదగిన నైవేద్యము - బలి వేరొకటి లేదు. మన తనూ మనో బుద్ధులకంటె బాబా కోరునది లేదు. మన సంపదలతో బహుమతులతో బాబాకు పనిలేదు. అవియన్నియు వ్యర్థములే. నిర్మల మనస్సుతో సంపూర్ణ సమర్పణము గావించుకొనవలయును. అపుడు శ్రీ సాయీ సంబంధము - సన్నిహితత్వము - బంధ విముక్తి కలుగును. శ్రీసాయీ కరుణ లభించును. అట్టివానికి మృత్యుభీతి లేదు. వాడు మృత్యు వునకు మృత్యు వగును.

"మా ముపేత్యతు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే. (గీత 8-16)

"అమృతత్వాయ కల్పతే" "బ్రహ్మభూయాయ కల్పతే" (గీత 13-26)

"కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తప్రణశ్యతి" (గీత 9-31) అని భగవానుడు గీతలందు ఘంటాపథముగా ప్రకటించినాడు.

పెరపొచ్చములు లేక తండ్రిబిడ్డ లెట్లు మెలగుదురో ఆ స్థితి ఆ స్వాతంత్ర్యము - సంపూర్ణ సమర్పణముచేతగాని మనకు లభింపదు "సంపూర్ణ సమర్పణము గావించి తన యునికిని విస్మరించువాడుగాని నాకు అంతేవాసి (శిష్యుడు) కాజాలడు" అని బాబా విస్పష్టముగ తెలిపినాడు. ఒక సందర్భమున "నా శిష్యుడ నని చెప్పుకొన దలచినవాడు ముందుకు రండు.! నా గురువును నేను సేవించినటుల నాకు సేవ జేయగల వాడెవడో తెలుపుడు"- అనియు బాబా పలికినాడు. అనగా తనను తాను విస్మరించి తన సకలేంద్రియములను, మనస్సును, బుద్ధిని అహంకారమును సంపూర్ణముగ సమర్పణము గావించుకొన జాలినవాడే శ్రీసాయీ శిష్యుడు. సేవకుడు కాగలడు. వాడే బ్రహ్మజ్ఞానము పడయుటకు - బ్రహ్మము నెఱుగుటకు అర్హుడు అని భావము.

ఈ సందర్భమున బాబా మనకు గావించిన బోధను పాఠకులగు సోదరీసోదర భక్తులు సావధానముగ గ్రహింపదగును,

(S.C.S. శ్రీసాయీనాథ బోధామృతము పేజా 133 చూడుడు.)

బ్రహ్మమును దెలిసికొన గోరిన అయిదు సమర్పింపవలయును,

ధనికు డొకడు బాబాను చేరి దైవమును జూపుమని - బ్రహ్మజ్ఞాన ముపదేశించుమని కోరుట....

♦ ♦ ♦ ♦

సా. బా: నీవేమియు గ్రహింపలేదా? నాకు అయిదు కావలయును. బ్రహ్మమును జేరుటకు నరుడు అయిదు సమర్పింపవలయును, అనగా 1. అయిదు ఇంద్రియములు, 2. ప్రాణములు, 3. మనస్సు, 4. బుద్ధి, 5. అహంకారము. [ఇట్టి సమర్పణము వైరాగ్యము] బ్రహ్మజ్ఞానమార్గము చరింప మిక్కిలి కష్టమైనది, ఎల్లరు ఆ మార్గమున నడువజాలరు. ఆ వైరాగ్యము - ఉదయమైన వెలుతురు పొసగును. లౌకిక పారలౌకిక విషయములందు విరక్తి గాంచువాడు మాత్రమే బ్రహ్మజ్ఞానము పడయ దగినవాడు,

[తనకు బ్రహ్మజ్ఞానోపదేశమును పొందుటకంటె 5 రూపాయలమీద గల గాఢమగు ఆసక్తిని బాబా తెలిసికొనజాలెనని ఆ ధనికుడు గ్రహించి సిగ్గున వెడలిపోయెను.]

* * * *

'జీవి' అని చెప్పబడు, 'నేను, నేను' అను శబ్దవాచ్యుడు - పైన దెలుపబడిన 1. అయిదు జ్ఞానేంద్రియములు, 2 అయిదు ప్రాణములు, 3 మనస్సు, 4. బుద్ధి, 5. అహంకారము. ఈ జీవికి గల సంపదలు, సంస్కారములే యీ అయిదు - 'నావి' అని చెప్పుకొనదగినవి యీ అయిదు మాత్రమే. కావున ఈ పంచకమును నిండు ప్రేమతో శ్రీసాయీ ప్రభువునకు సమర్పణము గావించినవాడే బ్రహ్మజ్ఞానము బడయుటకు - దైవము నెఱగుటకు జేరుటకు ప్రవేశించుటకు అర్హుడు. "జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప"

(గీత 11-54)

ప్రార్థన:

అనిశము దేహబుద్ధి విషయాదుల జిత్తము జొన్పి, యాత్మ చిం
తనమును విస్మరించి, విహితంబు లవంబు నెఱుంగ; నా తనూ
మనముల నింద్రియంబుల సమర్పణ సేయుచు నిన్ను జేరు రీ
తిని నెఱిగింపగాగదవె! దేవ! శ్రితావన! సాయిసద్గురూ!

6. సకలము శ్రీసాయీ ప్రభువునకు సమర్పించి సకలమునకై ఆ తండ్రినే ప్రార్థించవలయును:

దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా
మామేవయే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే.

దేవసంబంధియును మఱి, త్రిగుణమయము
నైన నామాయ దాటగానలవికాదు,
ఎట్టివాడు నన్నే యాశ్రయింపగలరో
వారలీ మాయను దరింతు; పాండుతనయ!

(శ్రీమద్భగవద్గీతామృతము. 7-14)

మనలో ముముక్షువులు భగవానునకు - ప్రపత్తి - సర్వ సమర్పణము గావించి, సమాశ్రయించినను "అహంత"ను సమూలముగ నాశనము జేయజాలని కారణముననే యేకొందఱు మాత్రమే అంతర్జ్యోతిని గుర్తించి, మానసికముగ విముక్తి (జీవన్ముక్తిని) బడయగలుగుచున్నారు. శరణాగతుడు- "లౌకిక పారలౌకికార్థముల నన్నిటిని నీకు సమర్పించు చున్నాడను. అవి యన్నియు నీవే; నన్ను - నా తనూమనములను నీకే సమర్పించు కొనుచున్నాడను. నేను నీవాడనై నిన్ననుసరించుచున్నాడను. నీ సేవకుడను. నీ చేతిలోని ఉపకరణమను. నీ యిచ్ఛించిన విధమున (నన్ను) ప్రవర్తింపజేయుము. నాయందింతకు బూర్వము గల సకల దోషములను క్షమించి నీవానిగ జేసికొనుము. నీ కరుణా కటాక్షము నాపై ప్రవహింపజేయుము. నీ ప్రేమామృతమును ద్రావబెట్టుము.

సాకారుండవో లేక ని
రాకారుడవో! మఱేమి యగుదువో! యెఱుగన్
నాకగునె? శ్రితుడ గృపణుడ
సాకవె! నీ కరుణ బఱపి; సాయీనాథా!

సందేహములడపవె! నీ
యందున నేకాంత భక్తి నందింపవె! ని
న్నెందేమఱనీకవె! యఘ
సందోహమడంప గదవె! సాయీనాథా!

చేయదగని పనుల జేసితి నెన్నియో
చేయదగినవాని జేయనైతి;
కృపణుడైన వీనికిక వేఱుగతి లేదు
కరుణ బఱపి, ప్రోవగదవె! సాయి!

శ్రీసాయీ సద్గురూ! చిన్మయాకార!
వాసుదేవ! శ్రితభక్తమందార!
జనన మరణ రూప సంసారఘోర
వనధి గూలితినింక పారము జేర
నీ పదాంబుజ భక్తినిష్ఠ పోతంబు
ప్రాపు గూర్పవె! సాయిబాబా! సతంబు;

వివిధ విషయము లన్వేషించి, వాన
దవులు నింద్రియముల దగ ద్రిప్పిలోన!
బోలుచు పరాత్మాభిముఖము గావింపు
తెలివి నాత్మానుభూతిని బ్రసాదింపు.

సుతుడేని సతియేని సుహృదుండునేని
మృతివేళ నెవరు జేయిడరు సుంతేని
మోక్షసౌఖ్యముల బ్రాపునుగుర్తు వీవ
అక్షీణ కరుణాకటాక్ష! శ్రీదేవ!

వాదోపవాదనల్ పాపవర్తనల
నేదింపు స్వార్థప్రవృత్తకార్యముల;
నాలుక నీనామద్వయమ్ము
రేలుబవళ్ళు స్మరింపగా నిమ్ము.

తలపుల నెల్ల దోదపుల బోనడపి,
పలు గృహ ధన ధాన్య వాంఛల గెడపి,

దేహవిస్మృతి గూర్చి ధృతి బుద్ధులిడుము!
మోహబంధముల నిర్మూలింపు చిరము!

సాయి నీ నామ సంస్మరణంబు నిమ్ము!
మాయయౌ నితరంబు మఱచిపోనిమ్ము!
మతిచంచలత్వంబు మాయింపు స్వామి!
ధృతిశాంతి విమలభక్తిని గూర్చి యోమి.

స్వామి! నీ ప్రేమవీక్షణ దీప్తి వెలుగ
నామోహతమసంతయు బాయువేగ;
బొనుపుగ నే తొంటి పుట్టువులందు
బొనరించితివొ! యెట్టి పున్నెంబు, లిందు.

అనఘ! నీలీలా కథామృతంబాన
గనినాడ మెలకువ గంటి నీమేన
సాయి! నీ పద భక్తి, సాయి! నీ సేవ
బాయనీయకు; సత్కృపామేయభావ!"

అని, నిత్యము స్మరించుచు సంపూర్ణ శరణాగతి జేసినవాడ నని తలంచును. కాని, యటుల సంపూర్ణ శరణాగతి జేసిన మనలను శ్రీసాయీ చింతనము - శ్రీసాయీసేవ శ్రీసాయీ సంబంధమునకు అంతరాయము గల్పించి, తన చక్కికి నాకర్షించుకొనుటకై మాయా పిశాచి మన దఱికి జేరుచుండును. అటుల శ్రీసాయీ సంబంధము గల్పించుకొని ఆశ్రితుడు కావించిన శరణాగతి (ప్రపత్తి) దీక్షను పూర్వముకంటె నధికముగ గలంచజూచును. ఇదియెంత క్రూరమైనదో గమనింపుడు! ఈ మాయా పిశాచి తన పరిచారకులైన కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యములను గలుపుకొని శ్రీస్వామిని శరణుజొచ్చిన సాధకుని గ్రమ్ముకొనును. దాని ప్రభావమున తన సాయీ సంబంధ మును విస్మరించుటో, లేక, పట్టిపట్టని విధమున బాబా భక్తి ప్రకటిం

చుటో జరుగుచుండును. అట్టి సమయములందు బుద్ధిమంతుల, హితైషుల బోధలను పాటించి శ్రీసాయీకరుణకు మనల విముఖులు జేయు - శ్రీసాయీభక్తిని జెఱచు కామక్రోధాదుల ప్రవర్తనలను - అవి కల్పించు వివిధ విలాసములను - గమనించి, వానిని దఱికి జేర నీయక యెప్పటికప్పుడు త్రోసివేయుచుండవలయును.

ప్రతి స్వల్పవిషయమునకు - కష్టమునకు ఇతరులు మనల గూర్చి పలుకు నిందలకు - కల్పించు బాధలకు మనము కలత నొందక దైవాభిముఖులమై శ్రీసాయీ ప్రభువును తలంచుచు స్మరింపనేర్వవలయును. మనకు త్రికరణముల ననిష్టములను - సంకటముల - గలిగించువారిని క్షమింపుమని బాబాను ప్రార్థింపవలయును. మన మే కారణముననేని ఇతరులను త్రికరణముల నొవ్వించిన సందర్భములందు నెప్పటికప్పుడు బాబాను క్షమాభిక్ష నర్థించుచుండవలయును. మన మనసులోనికి ప్రవేశించిన శత్రుషట్క్రరూపములైన మలినముల నెప్పటికప్పుడు క్రొక్కివేయుచు హృదయపాత్రను తుడిచి శుభ్రపఱచుచుండవలయును. అప్పుడు మన హృదయభారము తొలగి, శ్రీసాయీ సంబంధమును మరల యథాప్రకార మలవరచుకొనుటకు సాధ్యమగును. మనము రాగద్వేషాదుల నాదరించితిమా ప్రభువు దూరమగును. వానిని దూరదూరమున ద్రోచివైచితిమా ఆ తండ్రి మన దాపు జేరును. ఈ ప్రక్రియ మన మానసిక వ్యాధికి దివ్యరాజౌషధముగ గుర్తించవలయును. మన మానసిక నైర్మల్యక్రియా కలాపమున అలసులమై మాపని, రేపని, జాగుచేసితిమా - బాబా మన కంతకంతకు దూరమగుచుండును. శ్రీసాయీ ప్రేమకిరణములు క్రమక్రమముగ దూరమగుచుండును. దినదినమునకు మన మనోభారములు హెచ్చి శ్రీసాయీ సేవయెడ మాంద్యము వహింతుము.

బాలకులు బుద్ధిమాలి నిన్ భంగపఱుప
వారినెల్లర గృపక్షమింపంగ బోవె?

అటుల 'మౌల్వి' ముఖ్యులు నీకు వ్యథలగూర్ప,
సైచినాడవు; సద్భావ! సాయిదేవ!

(సాయీ మననము - ప్రథమ సర్గము - 90)

మనలో కొందఱు ఆధ్యాత్మిక క్రమశిక్షణ లేక పట్టియుపట్టని వ్యావహారిక భక్తి పాటించుచు నిక ముందు జాగరూగత వహించుద మని, తమ అకార్యములకు క్షమాపణము చెప్పుకొనక శ్రీసాయీ ప్రభువునకు దూరమగుచుందురు. సకల భూత హృదయాంతర్వర్తియైన శ్రీ సాయీనాథున కెఱుగరాని విషయము లేదు. ఎంతసేపటికి ఆ తండ్రి మన హృదయమునే పరీక్షించుచుండును. తనవాడెటుల బాగుపడునా? - అనియే బాబా ఆందోళనము. మన మాధ్యాత్మికముగ మంచి మార్పు బొందుచుంటిమా - ఆ తండ్రి సంతోషించును. ఒకటి రెండు మాఱులు స్వయముగనో పరోక్షముగనో హెచ్చరించుచుండును. వాని ప్రవర్తనము చక్కబఱచి, తనవైపునకు మరల్చుకొనుటకు వానికి సంకటములు శిక్షలు కల్పించియైన వానిని పెడత్రోవనుండి మరల్ప జూచును. అప్పటికిని వాడు గ్రహించి సత్క్రమమార్గమునకు మఱలడా- వాని కర్మమునకు విడిచిపెట్టును.

ఈ సందర్భమున శ్రీ సాయీనాథుడు దాస్గణూ మహారాజును సత్క్రమపథమునకు మరల్చిన విషయమునుగూర్చి శ్రీ సాయీనాథ బోధామృతము. S. C. S. పేరా 409, పాఠకులు శ్రద్ధగ జదువ బ్రార్థితులు.

ప్రార్థనము :-

అరిషడ్వర్గము నీ యధీనమగు మాయా కింకరులో; వీరినీ
శరణం బొందినవారిపై తరిమి శిక్షారూపమౌ ఘోరసం
సరణాంభోనిధి ముంచి తేల్చెదవ? నా స్వాంతంబు నీ పాద పం
కరుహాంబందున హత్తజేసికొని చక్కన్దిద్దు; సాయీప్రభూ!

7. శ్రీసాయీ సంబంధము స్థిరపడుటకు సాధకుడు తగిన శ్రద్ధతో మెలగవలయును:

"జబ మైంథా తబ గురు నహీ - అబగురుహైం మైంనాహీ
కబీర నగరీ ఏకమే - దో రాజా న సమాహీ."

"నేనున్న దనుక గన్పింపడు గురుడు
"నేను" - లేదు - గురుండు వెగడుట నిపుడు;
అరయగ నొక రాజ్యమందున ఱేడు
లిరువురుంట బొసంగదేమొ? యేనాడు.

(శ్రీసాయీ కబీరు సూక్తులు పుట- 11 - ఐక్యము)

శ్రీసాయీనాథుడు భక్తిని ప్రేమించువాడు. భక్తిని ప్రసాదించువాడు. నిర్మలమైన హృదయమెందుండునా? - యని వెదకు చుండును. అట్టిదానిన అధివసించి విశ్రమించును. మన హృదయ మందిరాంతరమున ప్రత్యేకించి యొక భాగము నలంకరించి యుంచిన బాబా తన బిడ్డలందఱి గూడివచ్చి పండుగ గావించుకొనును. కావున బాబా మన హృదయ భవనమున ప్రవేశించ వలయునని తలంతు మేని, ఇంతవఱకు పేరుకొనియున్న చెత్త చదారము - ప్రోగుపడి యున్న మలిన పదార్థములను - లౌకిక దుర్వ్యసనములను చిమ్మి వైచి పరిశుభ్రపఱచ వలయును. చక్కని వసతి గల్పింప వలయును. మన ప్రియతమునకు స్వాగతమిచ్చుటకు మన గృహమును సాధ్యమగు విధమున శుభ్రపఱచి సర్వ సమృద్ధము గావింతుముకదా!

సెజ్జసేవ (నీలాంబరి - అటతాళము)

శయనింపవె బాబా! సాయీ! అవధూతా!
శయనింపు చిన్మయసుఖ సంధాతా! ॥ శయనింపవె ॥

సచ్చిదానంద శయ్యను సుఖనిద్ర
బుచ్చుమె! యేకాంతముగ; సాయిభద్ర! ॥ శయనింపవె ॥

వైరాగ్య మార్జనిని బరిశుద్ధిగావించి
సార ప్రేమాంబుల జల్లినా మర్దించి
వ్యాప్తిగ నవవిధ భక్తి తివాచీలు
సప్తదీపములివె జ్ఞానతేజము గ్రాలు ॥ శయనింపవె ॥

లలిహృది ప్రేమడోలను నిల్పినాము
వెలయ సుసంకల్ప విరులుంచినాము
ద్వైతమన్ తలుపులు వైచి, తెర దించితిమి,
బ్రాతిగ దుశ్చింత బంధముల్ దునిమి ॥ శయనింపవె ॥

భయపడి పాఱిరి వ్యామోహ వాంఛల్లు
దయయు క్షమయు శాంతి దాసిరి దాసీల్లు
సాయి! "ఉన్మనీ" యను సాలువ గైకొని
హాయి నిద్రురింపవె! హానును ప్రార్థన విని ॥ శయనింపవె ॥

[శ్రీసాయిబాబా పూజాస్తవములు 37, 38, 39 పుటలు]

ఇచట మనమొక రహస్యమును జ్ఞప్తియందుంచుకొనదగును. మనము భావించిన సత్కర్మముల సుకృతవిశేషమున మనమిటుల సిద్ధపఱుపగలుగుచున్నారమని తలంపరాదు మన మనస్సున ఆలోచించి ఊహించి, సిద్ధపఱుప దలచిన వన్నియు సంవత్సరముల కొలది సమకూర్పదలచిన - ప్రయత్నించిన పరిపూర్తి గావింపజాలము. ఆతండ్రియొక్క అవ్యాజ కరుణయే మనలను బాబావైపునకు మరల్చినది. ఆ తండ్రి ప్రేమామృతము నంతో - యింతో త్రావ బెట్టినది. కృతజ్ఞతాభి వందనములను బాబాకు సమర్పించుకొనుటకంటె మనము చేయ జాలిన ప్రత్యుపకృతి లేదు.

మనము శక్తివంచనము లేక చేయగలిగినది శ్రద్ధతో చేయదగును. చేయవలసివచ్చెనే - యని కాని - ఇతరుల మెప్పునకుగాని చేయదలపరాదు. భయభక్తి గౌరవములతో - ప్రేమతో బాబాను మన

పతికి ఆహ్వానింపవలయును. మనల జేరబిలిచినవాడు ఆ తండ్రియే. ఆ మహాప్రభువు అజ్ఞయే మనల నాకర్షించినది. మనకు హితప్రద ములు - అవసరములగువాని నన్నిటిని ఆ తండ్రి అనుగ్రహించి సమ కూర్చితీరును. "రారా! బాబూ! నన్ను ఆహ్వానించి స్వాగత మొసంగు" మని శ్రీసాయీనాథుడే మనలో ప్రతి జీవిని జేరబిలుచుచున్నాడు.

శ్రీసాయీ మహాప్రభువు మనకీమాత్రము భక్తిని ప్రసాదించి నది మన మర్త్యులమని కాదు. మన కుల ధన పదవీ సంపదల జూచి కాదు, మనయందపారము, అవ్యాజమైనకరుణ కలిగియే. శ్రీసాయీ కరుణకు మనము చేయగల ప్రత్యుపకృతి కృతజ్ఞతాపూర్వక వందన ముల సమర్పించుటయే. అంతకంటె మనము చేయగలిగినది - చేయ దగినది వేఱులేదు. మనలో నెవరేని అట్టి భాగ్యము తనకు గలుగ లేదేయని భక్తితృష్ణాతురుడై ఆ తండ్రి ప్రసాదించు దివ్య ప్రేమామృత భోజనమాసించి ఆకలి నొందిన, బాబా నిలయము - ద్వారకామాయీ కవాటముజేరి తట్టవలయును. [బాబా యేబిడ్డ హృదయమున నధివసించియుండునో - అదియే 'ద్వారకామాయి'.] బాబా ప్రసన్నుడై అంతో యింతో భక్తియను రొట్టెముక్కను ప్రసాదించి, తన కరుణా మృతము నొక బిందువేని త్రావబెట్టునంతదనుక ఆ తలుపు దట్టుచు విలపించవలసినదే.

బాబాతో మనలో ప్రతి వ్యక్తికి అవసరము కలదు. మనతో బాబా కెట్టిపని లేదు. శ్రీసాయీనాథుని ఉద్ధరించుటకు మనము వెళ్లుట లేదు. మనకుదగిన భక్తిని ప్రసాదించి మనలో ప్రతి జీవిని జక్క బఱచి సముద్ధరించుటకే బాబా మన దగ్గఱకు జేరుచున్నాడు. శ్రీ సాయీ కరుణ వలన భక్తిబడసి, జీవితమున నిత్యనూతన పురోగతి నొంది, బాబాయందు అభేదస్థితి - ఐక్యమునొందుటకే మనము చేరు చున్నది. కావున శ్రీ సాయీ కరుణను త్రోసిరాజన దగదు. మన హృదయ మందిరమును శ్రద్ధతో శుభ్రపఱచి, సిద్ధపఱచి ప్రియతము డైన శ్రీసాయీనాథునకు స్వాగత మీయవలయును.

బాబాను మన హృదయ మందిరమున జేర్చుకొను నంత

దనుకేకాదు మన ప్రయత్నము. ఆ తండ్రిని మన హృదయపీఠ మున ఆసీనుని జేసికొని తరువాత పూర్వమున కంటె జాగృతి వహింప వలయును. ఎంతెంత జాగృతి శ్రద్ధల వహింతుమో అంతంత అధిక మగు శ్రీసాయీ కరుణామృతమును గ్రోల నర్హులమగుదుము. బాహ్యా డంబరములకై ప్రాకులాడినకొలది ఆంతరంగికభక్తి సన్నగిల్లుచుం డును. మనలో ప్రతివ్యక్తియు సర్వసమర్పణము గావించుకొన దగిన పరతత్త్వము శ్రీ సాయీనాథు డొకడే. అటుల సర్వ సమర్పణము గావించుకొన నేర్చినవాడు తనలో దానుండడు. తన మనోవికారముల నన్నియు నిర్మూలించుకొని - ఐహిక బంధములనుండి విడివడి శ్రీ సాయి యందే యుండును.

"నిన్ను జూచువాడు తన్ను దా మఱచును
తన్ను జూచువాడు నిన్ను మఱచు;
నిన్ను తన్నుఁజూచు నేర్పరుల్ గలరొకో
విశ్వదాభిరామ వినురవేమ!"

అని వేమనయోగి పలికినాడు.

ఈ సందర్భమున ఆశ్రితుడు శిష్యుఁడగువాడు తన గురుదేవు నెడ గలిగియుండదగిన ప్రేమను - బాబా తాను ఆచరించి మనకు దెలిపిన విషయములు ఈ క్రింద నుదహరింప బడినవి. [S. S. C. శ్రీ సాయీనాధబోధామృతము పేరా - 137]

(రాధాబాయ్ దేశముఖ్ వృత్తాంతము)

* * *

"సాటిలేని కరుణా స్వరూపుడగు నా గురువును 12 సంవత్సర ములు సేవించితిని. నాయెడ నా గురుస్వామి పఱపిన ప్రేమ యేమని - ఎంతని - వివరింప గలను? ఆయన ధ్యాననిష్ఠయందున్న తఱి ఎదుట గూర్చుండి నా దృష్టిని నా గురుదేవుని మీదనే కేంద్రీక

రించితిని. ఇరుపురము ఆనంద ప్రపూర్ణుల మైతిమి. ఇతరములమీద నా దృష్టి సారించి యెఱుగను. ఆకలిదప్పులను మఱచి రేయింబవళ్లు నా గురు ముఖాబ్జమునే అవలోకించితిని. నా గురుస్వామి యెడబాటు ఒక క్షణమైనను నాకు అశాంతి కలిగించెడిది. నా గురువును తప్ప నితరమును ధ్యానించియెఱుగను. గురుదేవునికంటె నితరాశయము, గమ్యము నాకు లేదు. నిరంతరము నా మనస్సు (లక్ష్యము) ఆ స్వామి మీదనే నిలుపబడియుండును. నా గురుదేవుని లీల లత్యద్భుతములు. నా గురువును తప్ప నితరమును నేను కోరియెఱుగను. నా ప్రేమను తప్ప నితరమును నా వలన ఆయన కోరియెఱుగడు. ఏమియు చేయనియట్లు వెలికి ఆయన తోచినను నన్నెప్పుడు ఏమఱి యెఱుగడు. కరుణా కటాక్ష వీక్షణమున నన్ను రక్షించినాడు.

ఈ మసీదున గూర్చుండి నేను యథార్థము, పలుకుచున్నా నను. నా గురుస్వామి నా చెవిలో నూదగలినది ఏమియు లేదు. చెప్పము. నీవును ఆవిధముగనే జేయుము.

నీ తలంపులకు నన్నేకైక లక్ష్యము జేసికొంటివా, నీవు పరమార్థము బడయగలవు. చలింపని శ్రద్ధతో నన్ను చూడుము. నేనును నిన్ను జూతును. నా గురుదేవుడు నాకు బోధించిన ఏకైక సత్యమిది యొక్కటియే. చతుర్విధ సాధనములతో, ఆరు శాస్త్రములతో నీకు అవసరము లేదు. గాఢమైన విశ్వాసముతో (శ్రద్ధతో) నీ గురువును విశ్వసింపుము. అది చాలును"

* * *

మన హృదయ మందిరమును శ్రీ సాయీ ప్రభువునకు వాస యోగ్యముగ - విశ్రాంతి భవనముగ - ద్వారకామాయిగ - గల్పించు కొను విధానము - శిర్డియందు నిత్యము జరుపబడు "సగుణోపాసన" (త్రికాల సేవలు) నుండి "సెజ్జహారతి" పాఠకులు గమనింపదగును.

(మధ్యమావతి - ఆట తాళము)

జయము! జయము! శ్రీ - సాయీగురుదేవ!
జయము! సత్కరుణా - మయ ప్రభావ! (ధ్రువము)

పవ్వళింపగదె! - బాబా సాయీ!
పువుల సెజ్జ ప్ర - భూ! మందిరమున,
కేల హారతుల - గీలించుచు ప్రేమ
జోలల బాడుచు - జో - కొట్టెదము. ॥ జయము ॥ ౧

సదయమాత నిజ సంతతి నట్లీవు
మృదుమధురోక్తుల - శ్రితులను మనుతువు
భక్తుల ఆధి - వ్యాధుల నడతువు
సక్తిని సుఖము ప్రసాదించెదవు ॥ జయము ॥ ౨

అగణిత శ్రితజన - తాపద లడతువు
తగ దర్శనంబిడ - త్వర బరువిడుదువు
అలసినావు బాబా! శ్రమపడితివి
అలరు సెజ్జ దను - వల్లన జేర్పవె! ॥ జయము ॥ 3

క్షమయ నీదు మృదు శయ్యాతలము
సుమనోవృత్తులె - సుమసంచయము
స్వీయజనము లిడు సేవాలేశము
సాయీ! సద్గురు - సమ్మతి గొనుము! ॥ జయము ॥ ౪

పంచప్రాణములు - పంచ జ్యోతులు
కాంచని మనములు - కోమల కాంతులు
సేవక భక్తుల సేవాప్రేమలు
పావన! అత్తరు - పన్నీరములు ॥ జయము ॥ ౫

దేవా! నీ శుభ - దివ్య పదము విడి
పోవగ మా మన - ములు వెతనొందెడి;
అనతి - కాన, ప్రసా - దాశీస్సుల
బూని, గృహమ్ములకు బోయెద మిమ్ముల ॥ జయము ॥ ౬

అరిగి వేకటను దిరిగి వచ్చెదము
పెఱిపదరక్తి, ప్రబోధించెదము
నిద్రలేపవలె నిన్నతి ప్రేమ
భద్రము లిడ పరిపాలిత హనుమ ॥ జయము ॥ ౭

ప్రార్థన :—

శీరిడి (శీలధి) పురవాస! శ్రీసాయిదేవ!
ద్వారకా భవన! సత్కరుణా ప్రభావ!
పలికిన నీతోడ బలుకగా నిమ్ము
పలుకనెంచిన నీవ, భాషింపరమ్ము!

ఇతరమునుండి నా హృది మరలించి,
కృతమతి నీయందు కేంద్రీకరించి,
'నన్ను' నీ యంద లీనము జేసికొమ్ము!
ఎన్న 'నే' - 'నా' పదాలిక డుల్లనిమ్ము.

నీవు నా యందున నేను నీ యందు
ఈ విధి నెడము లేక యికముందు
ఏకమై వర్తింపనిచ్చి జీవితము
సాకల్యముగ బుచ్చు జాడనుకోనుము,

శాంతిదాతవును విశ్రమపదమీవ,
అంతరాత్మ - పరాంతరాత్మవు నీవ
మధురము నీ చూపు - మధురము ప్రాపు
మధురము నీ పల్కు మధురము కావు.

ప్రేమామృతమున నీ బిడ్డల మనుతు,
సామి! నీకిక నీవ సాటిగదలతు
ఆంతరంగికముగ ఆత్మ నర్పింతు
అంతకు వేఱులేదనియే దలంతు

నేను నాదెది లేదు నీవ నీయదియ
నా, నీ, విభేద మేనాడు లేనిదియ
సాయి! నిన్నొంటరి సమయాన జేరి
నా యీ హృదయమంతయు నొకసారి

కొంకక ప్రకటించుకొను భాగ్యమిమ్ము!
అంకితు డాశ్రితుడనియేని కొమ్ము!
ఇతరుల నన్నుపేక్షింప నీయకుము
ఇతరుల నన్గదలింపనీయకుము.

నీ ప్రియభక్త సన్నిధినిగాంక్షింతు
నా ప్రార్థనంబు విన్నపము గావింతు,
నీ భక్తి నీ సేవ నీ చింతనంబు
శ్రీ సాయి! కూర్చి రక్షింపు! సతతంబు.

8. అహంకార మమకారములను త్రోసివైచి, అడకువ గలిగినపుడే శ్రీ సాయీ కరుణ లభించును.

విహాయకామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి.

సర్వ కామములను సమయంగ జేసి, తా
నాశలేనివాడు నగుచు, మిగుల
నిర్మమత్వము, మఱి, నిరహంకృతిని గల్గి
సంచరించు నతడు శాంతినొందు,

(శ్రీమద్భగవద్గీతామృతము 2-71)

శ్రీ సాయీ భగవానుని కరుణకు నిండు మనస్సుతో ప్రార్థించ వలయును. ఋజుబుద్ధితో ప్రార్థించవలయును. దానికొఱకు గాఢ విశ్వాసము ఓర్పుగలిగి వేచియుండ వలయును. కృతజ్ఞతతో స్వీకరింప వలయును. అడకువతో దానిని భద్రపఱచుకొన వలయును. శ్రద్ధతో దాని నుపయోగించుకొనవలయును. దాని ప్రభావమును ఆ తండ్రికే అంకితము చేసికొన జాలితిమేని బాబా సంతోషపూర్వకముగ మనల జేరును. భక్తి ప్రేమలు మనకు కొఱవడినవిగ మనకు స్ఫురించిన, అడకువ వహింపదగును. కాని, యే క్షణమునను నిస్పృహ - నిరాశ పొందరాదు. వ్యర్థముగ విచారపడరాదు. చాలకాలమునుండి మనకు ప్రసాదింపకనిలిపియున్న ఆ కరుణను శ్రీసాయీనాథుడు ఒక్క క్షణ మాత్రమున అనుగ్రహహింపగలడు. మనము కోరినతోడనే కాకపోయి నను నిదానముగ నేని ప్రసరించితీరును. కాని యే క్షణముననేని మనల విడనాడడు. మనము ప్రార్థించిన వెంటనే ఆ తండ్రి తన కరుణను ప్రసాదించిన మనోదౌర్బల్యము గలవారు దానిని చక్కగ భరింపజాలరు. కావున ఆ మహాప్రభువు కరుణకై మనము గాఢ విశ్వాసముతో ధైర్యముతోగూడిన ఓర్పుతో వేచియుండవలయును.

శ్రీసాయీకరుణ మననుండి ఉపసంహరింప బడినను, మనకు

ప్రసాదింప బడకున్నను ఆ కారణము మనలోగల లోపముగ, మనము కావించు దుష్కార్యఫలితముగ మనము తెలిసికొనవలయును. లేదా అది మనకొక పరీక్షకై కావింపబడినదిగ గ్రహింపవలయును. మన కేదిక్షేమమో మనము గుర్తింపజాలము. ఆ తండ్రికే అది విదితమగును. మనము బాబాను సంపూర్ణముగ మనస్ఫూర్తిగ శరణాగతి జేసి, మనము కాక్షించు వానిని అవి కావలె-యివి కావలెనను కోరికలు కోరక ఆ తండ్రియందే భరన్యాసము గావించితిమా ఆ క్షణము నుండియే ప్రశాంతి వహింపగలము. బాబా యిచ్ఛ ప్రకారము జరుగుట కంటె మధురము - మనోహరమైనది మఱియొకటి లేదు. అస్థిరములు స్వల్పములైన కామితములను వదలుకొని, ఆ మహాప్రభువు చేతిలోని ఉపకరణముగ భావింపనేర్చితిమా ఆ క్షణముననే బాబా కరుణ మనయందు ప్రసరించును.

ఈ మన హృదయపాత్రలు పరిశుభ్రముచేయబడి, అధోముఖముగాక స్వీకరించుటకు తగినవిగ అభిముఖము లయ్యెనా శ్రీసాయీ ప్రభువు తన కరుణామృతమున మన హృదయపాత్రలను నింపును. ఆశ్రితుడు ఎంతలెంతలు స్వల్ప విషయములనుండి విడివడి తన అహంత - మమతల (నేను నాది అనుభావముల) నిర్మూలించు కొనజాలునో, అంతలంతలు త్వరితముగ పూర్ణముగ ఆప్రభువు కరుణ మనయందు ప్రవహించి, మన హృదయముల నుత్తేజపఱుపజాలును. ఆ కరుణాప్రవామును ఆశ్రితుడు గమనించి, ఆ ప్రవాహమున నోలలాడుచు, ఆ ప్రవాహము వెంట పయనము గావించుచు ఆశ్చర్యము, ఆనందము పొందుచు విశ్వవ్యాపిత హృదయుడై యలరారును. ఆ తండ్రికి అధీనుడై ఆ స్వామి చేతిలోని ఉపకరణముగ తనను భావించుకొనువాడు కావున బాబా అభయహస్తము వానిని హత్తుకొనియే యుండును. అప్పుడట్టి ఆశ్రితుని ప్రేమ సంకుచితము - స్వార్థపరము గాక విశ్వవ్యాప్తమగుటచే శ్రీ సాయీప్రభువు కీర్తి ప్రతిష్ఠలకే ఆ ప్రేమను అంకితము చేయుచుండును.

[ఈ సందర్భమున S. C. S. శ్రీసాయీనాథ బోధామృతము

పేరా 131 - బాబా పాత్రలను కడిగి బోరగిల పెట్టుట - అను విష యము చూడుడు.]

ప్రార్థన :–

ఎఱుగన్‌జాలుదువీవు నా తలపులన్ గృత్యంబు లారాటముల్
నిరతం బైహిక కాంక్షలన్ దవిలి, వానిన్ బొందగాలేక, మో
హరతిన్ గుందెడి వీని కైహిక పదార్థాసక్తి దూలించి, నీ
కరుణాలబ్ధికి యోగ్యుజేయగదె! దక్షా! సాయినాథ ప్రభూ!

[సూచన:– శ్రీసాయీ కరుణనుగూర్చి విపులము "శ్రీసాయీ కరుణ" అను గ్రంథమున "విజ్ఞప్తి" శీర్షికక్రింద పుటలు 13–47 వరకు తెల్పబడిన దానిని పాఠకులు చూడ ప్రార్థితులు.]

9. గాఢమైన ప్రేమ - తీవ్రమైన ఆసక్తి అనునవి శ్రీసాయీప్రభువు భక్తునకు లభింపజేయును;

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప.

అన్యచింతలేని యట్టి సద్భక్తి న
న్నరయదెలియ బడయనగునుగాని,
వేఱుసాధనమున నేరరు నన్ యథా
ర్థముగ గాంచ: వైరిదర్పహరణ!

(శ్రీమద్భగవద్గీతామృతము 11–54)

పరతత్త్వమైన శ్రీసాయీ ప్రభువునందు గాఢమైన ప్రేమ, తీవ్రమైన ఆసక్తి గలిగి నిండు మనస్సుతో బాబాను ఆహ్వానింప వలయును. బాబా భౌతిక తనువునందున్నపుడేకాదు. నేటికిని అట్టి ప్రేమాసక్తులను ఆ తండ్రియందు ప్రకటించువారు వేనకువేలు బాబా అంకిత సంతతియైనారు. అగుచున్నారు. మనము ప్రకటించు ప్రేమకు శతాధికమ్ముగ సహస్రాధికముగ ఆ తండ్రి మనయందు నిత్య సత్య ప్రేమ

బఱపును. ఆ ప్రేమాంబుధి నిరవధికమైనది. ఇంతకు బూర్వమునగల సాధువులు - బాబా అంకిత సంతతిలోనివారు ప్రకటించినంత ప్రేమను మనము పఱుప లేకపోయినను - అట్టి భక్తులకుగల యోగ్యతలు మనకు లేకున్నను "బాబా! నేను నీవాడను. నీకంటె నితరాశ్రయము లేనివాడను"— అని, ఒక్కమాఱు శరణాగతి జేసితిమా-మేనము ధన్యులమే. నిర్వంచిత మనసు మాత్రమైన మనము కలిగి యుండిన చాలును. మనము శరణుజొచ్చిన క్షణమునుండి మన సకల భారముల నా తండ్రి వహించి, మనమెటుల జక్కబడుదుమో ఆ విధానముల గల్పించి, ఆ మార్గమున నడిపించును. ఇక మనము పెడదారుల బట్టినను ఏవియో ఆటంకముల గల్పించి, మనల సరియగు త్రోవకు మలుపును. (S, C. S. శ్రీసాయీనాథ బోధామృతము పేరా 409 గాణుదాస్ మహారాజు విషయము గమనింపుడు)

ఆశ్రితుడగువాడు కావింప దగినది యీ మాత్రమే. "నేను-నాది" అని వాడు తలంచు సకలమును బాబాకు సమర్పణము గావింపవలయును. అట్టి సమర్పణమునకు ఏ కొంతయేని "తనది"-అనుకొని, తన యధీనమున నుంచుకొనరాదు. తన అధీనమందున్నటుల - ఉంచుకొనినటులనైన తలంచరాదు. అనన్య భక్తితో సేవించు బిడ్డల యోగక్షేమభారము వహించుటకు దీక్షబూనిన ఆ తండ్రి మన వెంట మనయందు అధివసించి యుండగ నిక నితరాలోచనలను మనస్సున జేరనీయక బాబా నిర్దేశించుచు నడిపించు మార్గమున నడచుచు విధించు కార్యములను సమాచరించుటయే మన పని. అటుల ప్రవర్తించునపుడు మనకు ప్రాప్తించు జయాపజయములు - లాభనష్టములు - కీర్త్యపకీర్తులు సకలము ఆ తండ్రివిగనే మనము నిశ్చయించుకొనవలయును.

శ్రీసాయీ ప్రభువును మనము సమాశ్రయించి యనుసరించునపుడు ఏ సమయమున నే విషయమున సందేహము వహింపరాదు. బాబా అభయ ప్రదానములను త్రిసత్యములుగ మనము విశ్వసింపవలయును.

[S. C S శ్రీసాయీనాథ బోధామృతము 1-52 పరిచ్ఛేదములను సావధానముగ పఠించి జ్ఞప్తియందుంచుకొనదగును.]

'మీరలెల్ల నా బిడ్డలు; మీకు దండ్రి
నేన నన్నాశ్రయించి మీకేది వలయు
దానిగొందు; కావున జంక బనియులేదు;
"సాయి దేవుడా?" - అనెడి సంశయము వలదు.

[శ్రీసాయీకరుణ పుట 21 (S. C. S పేరా 281)]

అని, బాబా అభయమిచ్చినాడు. కావున బాబా విషయమున సందేహముగాని, ఆ తండ్రి సమర్థతను పరిశోధించు తలంపుగాని మనము వహింపరాదు, బాబా సమర్థతను అన్వేషింప దలచువాడు వంచితుడగును. భగవానుని లీలలు మానవమాత్రుల ఊహలకు అందనివి. జిజ్ఞాసువులమై, సత్యాన్వేషణమే ప్రధానముగ గలిగి, ఆ తండ్రి విధించిన, బోధించిన మార్గము ననుసరించుటకు నిశ్చయించుకొనవలయును. వారి కందని విషయములగూర్చి పరిశోధనలు కావించువారికి భక్తి సన్నగిల్లును. ఋజుమార్గమున జీవితము గడుపుట, గాఢవిశ్వాసము - ఈ రెండు ప్రధానములు. మన తెలివియొక్క ఆధిక్యతగాని, బాబా అద్భుత లీలారహస్యముల నెఱుగ యత్నించుటగాని కావు. మానవుడు తన విషయముల తనకందుబాటున గల విషయములనే ఎఱుగ జాలడు. ఇక తన కందనివి, తన కతీతములైన విషయములగూర్చి యేమి తెలిసికొనగలడు? కావున మనకు గలవనుకొనుచున్న జాతి, కుల విద్యా ధన పదవీ వ్యామోహముల నన్నియు మఱచి (విస్మరించి) మిక్కిలి విధేయతతో ఆ తండ్రిని శరణొందవలయును. అపుడు మనకెయ్యది యెంతెంత మాత్ర మవసరమో - లాభదాయకమో అంతంతమాత్రము శ్రీసాయీ భగవానుడు ప్రసాదించి తీరును.

మన మీ లోకమున నే విషయమును గూర్చియు ఆందోళన

చెందవలసిన పనిలేదు. మన తలంపులతో కలహింపరాదు. పొడము సందేహములను సమాధానపఱుప యత్నింప దగదు. మాయా పిశాచ గ్రస్తులు సూచించు సంశయములను వారింప బూనరాదు. శ్రీ సాయీ నాథుని అభయప్రదానములను ప్రగాఢముగ విశ్వసింప వలయును. సాధులు - భక్తులు - బాబా అంకిత సంతతిలోని వారు ప్రవర్తించిన మార్గమును గుర్తించి మనమును అనుసరింప నేర్వవలయును. అపుడు మన శత్రు నికాయము దూరదూరమున జాఱిపోవును. ఈ స్థితి బడయుటకు శ్రేయస్కామియగువాడు శ్రీ సాయీ మహా ప్రభువునకు సేవకుడుగ నడచుకొన వలయును. మాయా పిశాచి నాస్తికుల, పాపుల జోలికి పోదు. కలచదు. వారి నంతకు బూర్వమే తన కధీనుల జేసి కొనినది కావున వారితో నిక పనిలేదు. భక్తి మార్గానుయాయులు శ్రేయస్కాములగు సాధకులనే వేయివిధముల లోభపఱచి సన్మార్గము నుండి మరల్ప యత్నించుచుండును.

కావున జాలహృదయముతో నిస్సందేహ బుద్ధితో శ్రేయ స్కామి బాబా పాదకమలముల జేరుచుండ వలయును. మన దైనం దిన ప్రవర్తనములలోనే స్వల్ప విషయమును గాని మనకు గ్రహింప సాధ్యముగాక, బోధపడనిది యుండెనా, దాని నెఱుకపఱచుటకు బాబాకే విడిచి పెట్టవలయును. ఆ తండ్రియే తనవానికి బోధపఱ చును. బాబాను మఱచి, తన ఇచ్ఛానుసారము ప్రవర్తింపజూచు వాడు వంచితుడగును. కాని శ్రీసాయీ అధీనమనస్కుడైనవా డెన్నటి కిని చెడడు. అట్టివానికి పతన భయము లేదు. బాబా యెన్నడు తన బిడ్డను వంచింపడు.

[శ్రీ సాయీబాబా చరిత్రము - భక్తుల వృత్తాంతములు - "ఏమీ, నిన్నుపేక్షింతునా?" అను గ్రంథమును పఠించు సోదర భక్తు లకు బాబా తన బిడ్డలను చక్కదిద్ది అనుగ్రహించిన వృత్తాంతములు కోకొల్లలుగ గలవు. శ్రీసాయీ పదాశ్రితునకు ఆ తండ్రి కల్పించు విధానములు తొలుదొలుత కష్టములుగ గోచరించినను పరిణామమున నవి ఆయా బిడ్డల కెట్టుల శ్రేయస్కరములై సుఖశాంతుల బ్రసా

దించినవో పాఠకులగు సోదర భక్తులు గ్రహింపగలరు.]

శ్రీసాయీ భగవానుడు నిరాడంబరుల ననుసరించును. వినయ విధేయతలు గలవారికి దన్నైయుక పఱచును. అకించనులు దీనులగు వారికి తన యునికిని బోధపఱచును. పవిత్ర హృదయులకు ప్రబోధ కల్పించును. గర్వితులు దురహంకారులకు, చోద్యములను వింతలను మాత్రము గమనింపజూచువారికి తన కరుణను మఱుగు పఱచును.

మానవుల హేతువాదబుద్ధి మిక్కిలి స్వల్పమైనది. అచంచల విశ్వాసము అమోఘము, నిర్వంచితమైనది. హేతువాదబుద్ధిగాని ప్రకృతి పరిశోధన విధానముగాని - విశ్వాసమును ముందుంచుకొని అనుసరింపవలయునేకాని, విశ్వాసమునకు అవి పురోగామి కారాదు. విశ్వాసమును విచ్ఛిన్నము జేయరాదు. ఈ గురుభక్తి మార్గమున (శ్రీసాయీనాథు కనుసరించి మనకు విశదపఱచిన మార్గమున) విశ్వాస ప్రేమలు మార్గదర్శకములు. అవి మనకు గోచరములుగాని విధమున పని గావించును. అవి అత్యంత పవిత్రములు - శ్రేష్ఠములైన అవలంబనము.

శ్రీసాయీ భగవానుడు నిత్యుడు - నిరామయుడు - అనంత శక్తిసంపన్నుడు - అనూహ్యములు, అవేద్యములగు లీలల నిందు నందు (ఇహపరముల) బఱపుచుండును. శ్రీసాయీశుని లీలలు మానవమాత్రులకు, మానవుల హేతువాదబుద్ధికి వేద్యములేదైన - "అవాఙ్మానస గోచరములు" - అని ఆ దైవలీలలనుగూర్చి పలుకుట ఎట్లు పొసగును?

ప్రార్థన: సృష్టిస్థిత్యుపసంహృతి క్రియల నీ వీ విశ్వరంగాన, నీ
ఋష్టంబౌనటు జీవి ద్రిప్పెదవు; నీయీ లీల నాకేమి వి
స్పష్టంబౌ? శరణంటి, దీనుడను, నీవాడన్ గృపన్ బ్రోవవే!
సాష్టాంగ ప్రణిపాతముల్ గొను; సమర్థా! సాయినాథప్రభూ!

**చతుర్థపాదము సమాప్తము.**

ఓమ్

# శ్రీ సాయీ అనుసరణము

## పంచమ పాదము

1. అంతరాత్మ - అపాంతరాత్మ - శ్రీసాయీప్రభువు:

సబఘట భీతర రామహై - ఐసా అపసుజాన్
అప అపనే బంధియా - ఆపై దయా అజాన్.

ప్రాపంచకాత్మనాబడు రామసాయి
వ్యాపించి జీవాళియందుండె నోయి!
నీవ యీ నిన్ను బంధించు కొన్నావు
నీ వివేకము బాసి నేరకున్నావు.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

శ్రీ సాయీ మహాప్రభువు అవతారములోని విశిష్టతను మనము గుర్తింప వలయును. భగవానుడు - దైవము - అనువా డున్నాడా? - ఉండిన ఎట్లుండును? ఎక్కడనున్నాడు? అని సందే హించువారి సందేహ నివృత్తిచేసి, తనయునికిని విస్పష్టము చేయుటకే ఆ దైవము శ్రీ సాయిబాబాగా అవతరించి తన లీలలను ప్రదర్శించి నాడు. శ్రీ సాయీబాబా జీవితచరిత్రము అయా భక్తుల వృత్తాంతము లను సావధానముగ మనము చదివిన ఆ దైవ రహస్యము మనకు బోధపడగలదు. బాబా ద్వారకామాయీ మసీదునందు ఏకదేశగతుడై కూర్చుండి, తనను జేరిన బిడ్డలతో సంభాషించుచుండియు, విశ్వమం దంతట వ్యాపించి తన బిడ్డల కెక్కడ ఏ క్షణమున నేమి ఆపద కలుగుచున్నదో వేయికనుల పరికించుచు వారికి తోడ్పడి రక్షించు వాడు. తనవా డెచ్చట నేజీవికి బాధ కలిగించినను - అది తనను బాధించినట్లుల ఎఱుకపరచినాడు. ఏ జీవి నెక్కడ సంతృప్తి పఱచి,

నను దాను సంతృప్తి పొందినటుల విశదపఱచినాడు. దైవముయొక్క సర్వభూతాత్మ - భూతాత్మస్థితిని నిరూపించుటకు ఇంతకంటె నిదర్శనము లేవి కావలయును? ఇట్టి నిదర్శనములను పరభావ గ్రహణమని- ఏవియో చమత్కారములని ఇంద్రజాల విద్యలని అల్పులు తలంతురు, అది కేవలము పొరపాటు.

పిల్లిని కఱ్ఱతో కొట్టిన 'హన్సిరాజు'నకు, కుక్కను కొట్టిన మహల్సాపతికి, బిచ్చగత్తెపై ఆగ్రహావేశములు పఱపి, మెడపట్టి గెంటుమని సేవకు నాజ్ఞాపించిన చందోర్కరునకు, ఇత్యాది ప్రవర్తనములను ద్వారకామాయి మసీదున గూర్చుండియున్న బాబా ఎటుల తాను గమనించుచుండెనో విశదపఱచినాడు. తాను సకల భూతాంతరాత్మయైయుండియు అపాంతరాత్మగా (ప్రకటమైన అంతరాత్మగా) నున్నటుల - దైవముయొక్క స్థితి - ఉనికియు నిట్టిదే యని, నిరూపించినాడు. ఈ పరమ రహస్యము శాస్త్రాధ్యయనములవలన - ఉపన్యాసాదులవలన ముముక్షువులైన సాధకులకు బోధపడదు. అది ఆయా వ్యక్తుల స్వానుభవముల వలన బోధపడవలసినదే. అట్టి అనుభూతి తన ఆశ్రితకోటికి గలిగించి, శుభ్రస్నిగ్ధమార్గమున నడిపించుటకే ఆ భగవానుడు తాను సర్వభూతాంతర్యామియయ్యును - అపాంతరాత్మగా నెటుల గాగలడో శ్రీసాయిబాబా అవతారము బోధపఱచినాడు.

"ప్రపంచమున సాయిని లోగొనగల వస్తువేదియు లేదు
ప్రపూర్ణ సంవిత్స్ఫురన్మూర్తి బాబా కనుబ్రామగరాదు."

(శ్రీసాయీ విజయము)

హృదయపీఠమున నధివసించి, యెప్పటికప్పుడు ప్రబోధ కల్పించు ఆ మహాప్రభువు పలుకులాలకించి, యనుసరించు జీవి ధన్యుడు. వెలుపలి ప్రపంచ భాషణములకు చెవియొగ్గక బాబా వినుచు రహస్యముల గ్రహించు కర్ణములు మాన్యములు. లోక విషయములనుండి మఱలి, సత్యవస్తువును దర్శించు నేత్రములు

పవిత్రములు. ఐహిక వ్యామోహములను ద్రోసిపుచ్చి, సక్రమములగు నిత్యాభ్యాస సాధనలచే ఆధ్యాత్మిక రహస్యములను దెలిసికొన యోగ్యత కల్పించుకొనువాడు సుకృతి. ప్రాకృతాకర్షణలకు జిక్కు పడక స్వామిసేవకై అవకాశము గల్పించుకొన నుత్సహించువాడు పూజ్యుడు. కావున ఇంద్రియార్థములనుండి మనస్సును మరలించి అంతరాత్మయై బాబా కావించు బోధను మనము గ్రహింపదగును.

కావున మన అంతర్యామియు, శాంతిదాత, మన ప్రాణము నైన శ్రీసాయీప్రభువును విడనాడక - హత్తుకొని యుంటిమేని మనకు పరమశాంతి లభ్యమగును. అనిత్యములు అసుఖములు, అల్పము లగు వస్తుజాలమును ద్రోసిపుచ్చి, నిత్యసత్య వస్తువునకై అన్వేషింప వలయును. ఈ విశ్వమున మనల లోభపఱచు వస్తువులు మనల నిర్బంధించుటకై కూర్చబడిన ఉచ్చులుకాక మఱేమగును? శ్రీ సాయీ నాథుడే మనల ద్రోసిపుచ్చెనేని ఈ విశ్వమునగల వస్తువులవలన మనకు గలుగు శ్రేయము లవమేనియు లేదు. ఈ ప్రాకృతార్థము లేవేని లభించిన ఉబ్బక, నశించిన ఖేదపడక, వాని యందహంకార మమకారముల (నేను - నాది అను భావము) పడయక నిర్లిప్తస్థితి గలిగి, శ్రీసాయీ ప్రభువు ప్రేమ కరుణ బడయుటకై ఆ తండ్రిని విశ్వసించి అనుసరించిన, శాశ్వతానందమును బడయగలము.

జ్ఞానకర్మేంద్రియములు - మనోబుద్ధి చిత్తాహంకారములను, సకలము శ్రీసాయీ ప్రభువు పదకమలములందు సంపూర్ణముగ సమ ర్పణము గావించిన పిదప ఆశ్రితుడు బాబా చేతిలోని ఒక యంత్ర ముగ - బాబా ఆజ్ఞను పరిపాలించు కింకరుడుగ ( కింకరోమి? - స్వామి! ఏమి ఆజ్ఞ - ఏమి చేయమందువు? - అనువాడు - సేవకుడు ) ప్రవర్తింప నేర్వవలయును. శ్రీ సాయీప్రభువు ఆదేశములను హృద యమున నిలుపుకొనవలయును.

శ్రుతి స్మృతి పురాణేతిహాసాదులు కోకొల్లలుగ మనకు మార్గము నెఱుక పఱచుచున్నవికదా! ఇంక శ్రీసాయీ ప్రభువు ఆదేశ ములకై నిరీక్షించుటేల? వానిలో క్రొత్తలేమి కలవు? - అని కొందఱు

సందేహింపవచ్చును. ఈ విశ్వమునగల. సకలాధ్యాత్మిక వాఙ్మయము - సకలభాగవత సాధుసత్పురుషుల బోధలను స్వానుభవ రూపమున తన బిడ్డల కెఱుకపఱచిన తండ్రి శ్రీసాయీనాథు డొక్కడే. శ్రీ సాయీశునిగూర్చి క్షుణ్ణముగ దెలిసికొన నేర్చిన వారికి విషయము విశదము కాగలదు సకలశాస్త్ర వాఙ్మయము అశేష ప్రవచనములను ప్రవచింప వచ్చును. కాని యవి ప్రబోధ గల్పింపజాలవు. అవి మనోహరముగ భాషింప వచ్చును కాని, మన హృదయమున కుత్సేకము గూర్పజాలవు. అవి వివిధ రీతుల బోధింపవచ్చును కాని యందలి నిగూఢార్థమును స్వానుభవ రూపమున నిరూపింపజాలవు. అవి భగవదాజ్ఞలను సంభాషింపవచ్చును. కాని, వాని నాచరణమందుంచుకొనునట్లు చేయజాలవు. అవి మార్గమును నిర్దేశింపవచ్చును, కాని, ఆ మార్గమున ఆశ్రితుల నడిపింపజాలవు. అవి యన్నియు నెంత సేపటికి వెలుపల మాత్రమే పని చేయగలవు. కాని, మన హృదయమున నాటజేసి, ఉద్దీపనము గలిగింప జాలవు. అవి పైపైన జలసేచనము చేయగలవు - గాని, సత్ఫలప్రదాయకములుకావు, ఇవి యన్నియు ఆశ్రితుడైన సాధకునకు 'భ్రమ' గలిగింప జాలునేకాని, 'బ్రహ్మము' - నెఱుగుటకు - యథార్థముగ గనుటకు - ప్రవేశించుటకు (జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ) తోడ్పడ జాలవు. ఆ పని సమర్థ సద్గురుదేవుడైన శ్రీ సాయీ ప్రభువున కొక్కనికే సాధ్యము. వినుటయే కాని, ఆచరణ మందునుప జాలక తెలిసికొనుటయే కాని, ప్రేమింపజాలక, నమ్మినట్లు నటించుటే కాని, యనుసరింప జాలని వారికవి యుపకరింపజాలవు. ఆశ్రితులకు సత్ప్రవర్తనము గల్పింపగలశక్తి సమర్థ సద్గురు దేవుడగు శ్రీ సాయీనాథునకే కలదు. ఆ తండ్రిని సంపూర్ణశరణాగతి జేసిన బిడ్డను చేరదీసి, చక్కదిద్ది, సరియగు మార్గమున నడిపించి "అపనా సరికా కరితత్" - తనయంత వానిగ జేయగలడు.

ఈ సందర్భమున శ్రీ సాయీ మహాప్రభువు శ్రీ యం. బి. రేగే మహారాజునకు గావించిన బోధ పాఠకులు గుర్తించుకొనదగును.

[S. C. S. శ్రీ సాయీనాథ బోధామృతము, పేరా 191]

సా. బా:- (యం. ఏ. రేగేతో) నీ వేమియు గ్రంథపఠనము చేయనక్కరలేదు. కాని, నన్ను నీ హృదయమున నిలుపుకొనుము.

ప్రతి గురుపూర్ణిమనాడు బాబా ద్వారకామాయి మసీదున తన గద్దెపై గూర్చుండును. భక్తులు తమ కిష్టములగు గ్రంథములను తీసికొని వెళ్ళి బాబాకు మ్రొక్కి సమర్పించువారు. బాబా ఆ గ్రంథములను స్పృశించి ఆశీస్సులతో వానిని తమకు తిరిగి ప్రసాదించిన తమకు పారాయణసిద్ధి ఫలము లభించునని వారి విశ్వాసము. అటుల గొనిరాబడిన గ్రంథములను సాధారణముగ బాబా తెచ్చినవారికి దెచ్చినవి తిరిగి ప్రసాదించువాడు. ఒక్కొక్కవేళ నొకరు తెచ్చిన వానిని మఱియొకరికి పర్యాయముగ మార్చియిచ్చువాడు. ఒక గురుపూర్ణిమనాడు శ్రీ యం, బి. రేగే పుస్తకమును దీసికొని వెళ్ళలేదు.

సా. బా:— (రేగేవంక చూచి) నీవు మంచి పని చేసితివి. నీవే గ్రంథములను చదువనక్కఱలేదు, వీరీ గ్రంథములందు బ్రహ్మమును (దైవమును) చూడగలమని తలంచుచున్నారు. కాని, వారు కాంచునది భ్రమ (భ్రాంతి) మాత్రమే. నన్ను నీ హృదయమున **నిలుపుకొని, మనస్సును బుద్ధిని ఏకము చేయుము. చాలును!**

ప్రార్థన :—

పటుపైశాచిక కామితంబులగు నీ భామా ధనక్షేత్ర ప
ర్యటనల్ మాన్పుము; గ్రంథశోధనల కీ యష్టాంగ యోగక్రియా
పుట పాకంబులకేను జాల; శరణంబున్ గంటి; నీ ధ్యానమే
తృటినిన్ బాయగనీక ప్రోవగదె! తండ్రీ! సాయినాథప్రభూ!

2. ఆస్తిక్యమే అనుభూతి - అనుభూతియే ఆస్తిక్యము:

మైకో కాహూఢుండో వందే మైతో తేరాపాస్ మే
ఖోజ్‌గేతో ఆమీలుంగా పల్ భరకే తల్లాస్ మే.

న దేవల్ మే యేన మస్జీద్‌మే న కాశీ కైలాస్‌మే
నహ్యాయ్‌మై అజోధ్యా ద్వారక - మేరాభేట్ విశ్వాసమే."

ఎందు వెదకెదవీవు? నీ యందయుంటి
నెఱిగి వెదకిన దృటిలో లభించువాడ
లేను - గుడియందున; మసీదులోన లేను.
కాశియందు గైలాసాన గాని యీ, య
యయోధ్యనేన్ ద్వారకనేని నుండబోను;
ఎందు విశ్వాస మొనరు నేనందయుందు.

"సర్వస్య చాహం హృది సన్నివిష్టో"- (భగవద్గీతలు 15–15) సకలభూత హృదయాంతర్వర్తినై నేనున్నాడను - అని భగవానుడు తెలిపినాడు.

జనసామాన్యమునకు నిగూఢభావములు బోధపడని కారణమున స్థూలదృష్టికి జనుల నాకర్షించి, సత్పథగాములను గావించుటకే తీర్థ క్షేత్రములు వెలసినవి. ఒక్కొక్క అవతార పురుషునిచే - ఒక్కొక్క సాధుసద్గురువు ప్రభావమున విశ్వమందాయా ప్రదేశముల వివిధ తీర్థ క్షేత్రములు పెంపొందినవి. అంతట వ్యాపించియున్న భగవానుని గుర్తించుటకు సాధ్యముకాని పామర జనమునందు ఆస్తిక్యత (దైవము - భగవానుడు అనువాడు కలడు - కలడు - అను భావము) దృఢపఱచుటకే యీ విశ్వమున ఇన్ని తీర్థక్షేత్రములు నెలకొనినవి. వానిలో మహత్త్వము లేకపోలేదు. మహాపురుషులాయా క్షేత్రముల మెట్టినకారణమున వారి అమోఘప్రభావముచే ఆ ప్రదేశము చేరినవారి హృదయములు సత్ప్రవర్తనము నొంది బాగుపడుదురు. అటుల వారు చక్కబడుటయే ఆస్తిక్యము. ఇచట దైవము కలడు - అను బుద్ధి అవసరము. ఆస్తిక్యత దృఢమైన దానివెంట అనుభూతి - దైవానుభవము - ప్రాప్తించును. అనుభూతి - అభీష్టావాప్తి కలిగిన కొలది ఆస్తిక్యతయు క్రమముగ పెంపొందును. ఇవి - 'ఆస్తిక్యత అను

భూతులు' అవినాభావ సంబంధము గలవి. అనగ ఆస్తిక్యత లేనివానికి అనుభూతిలేదు. అనుభూతిలేని వానికి ఆస్తిక్యత కలుగదు.

శ్రీసాయీనాథుని సమాశ్రయించిన బిడ్డల లౌకిక కామితములను హితములైన కోరికలను బాబా ప్రసాదించుటలోని రహస్యము - తనవానికి ఆస్తిక్యబుద్ధి పెంపొందించుటకే యని మనము గ్రహింప వలయును. బాబా ఒక సందర్భమున

"కోరిన కోరికలను సమ
కూరుతు నావాడుతెలిసికొని, యిటనే
కూరుప గోరిన వానిన్
గోరగ నను జేరుననెడి కోరిక; బిడ్డా! అనినాడు.

దైవము - అనువాడు కలడా? ఉన్న ఎట్లుండును? ఎక్కడ నుండును? ఆ దైవము నాశ్రయించిన మనకు సర్వశ్రేయములు ప్రాప్తించునా? అను సంశయగ్రస్తులకు స్వానుభవ రూపమున బోధ పఱచి, సందేహ నివృత్తి చేయుటకే భగవానుడిటుల అవతారముల సాధుసత్పురుషుల రూపముల బ్రకట మగుటకు కారణము. ఇన్ని వినియు - చూచియు నింకను సంశయములచే పీడితులగువారినిగూర్చి యేమి పలుక గలము? ఒకటి మాత్రము సత్యము. ఈ నాడు కాక పోయిన మఱియొక నాటికేని అట్టివారికిని ఈ రహస్యము బోధపడి తీరును. నేడో రేపో ఎల్ల జీవములును ఆ దైవమును సమాశ్రయించి తరించి తీరుదురు. నాస్తికుడగువాడు లేనేలేడు. వాగ్వివాదమున ఎదిరిని లోగొనుటకు ఏవో నాస్తిక వాదములను బ్రకటింప జూచిన నట్టివాడు ఏదొక సమయమున తన అంతరాత్మ ప్రబోధమును గుర్తిం పక తప్పదు. ఈ విషయమున మార్గములు - వ్యవధులు - అవధులు భిన్నములు కావచ్చును

ఈ సందర్భమున శ్రీసాయీనాథుడు తెలిపిన విషయము లను పాఠకులు గుర్తింపనగును. [ S. C. S. పేరా 149 చూడుడు. ]

సా. బా:— దైవమునుగూర్చి యేమేమో పలుకుచున్న వానితో "దేవుడు - దేవుడు" - అని, ఏమేమో పలుకుచుంటివేల? దేవుడు నా జేబులోనున్నాడు"—

[ S. C. S. పేరా 156] (శ్రీసాయీనాథ బోధామృతము.)

సా, బా:— (టి. ఎ. కార్ణిక్‌తో) దేవుడు అంత దూరమున నున్నాడా?

"నహి ఆకాశకే ఉపర్ - నహి పాతాలకే అందర్
సదా తో పాస్ హై తేరా - కహాఁ ఢుండన్కు జాతాహై"

(బ్రహ్మానందుని గేయము)

అతడు ఆకాశముపైన లేడు. పాతాళము క్రింద లేడు. ఎల్లప్పుడు అతడు నీ దగ్గరనే యున్నాడు. ఆ దేవుని వెదకుటకు నీవెక్కడకు పోవుచున్నాడవు?

ఈ విశ్వమునగల వేదాంతులు, జ్ఞానులు ప్రవచించిన పలుకులకంటె మధురతమములైన శ్రీసాయీ భగవానుని హితబోధలను మనము శ్రద్ధగా విని వానిని మన హృదయమున నాటజేసి కొనవలయును. బాబా పలికిన పలుకులు ప్రత్యక్షరము, ఉత్తేజము గూర్చునవి. ప్రాణప్రదములైనవి. వానిని సామాన్య మానవ బుద్ధితో సరితూచ దగదు. వానిని గర్వమున- ఇతరుల మెప్పునకుగాక మౌనముగ అడకువ విధేయతలతో స్వీకరింపవలయును. బాబా పలుకులు ఎల్లఅకును బోధపడునవిగావు. ఆ తండ్రి అనుగ్రహించి చక్కదిద్ద దలచినవానికే బోధపడును. ఆ భగవానుడు ప్రతి అవతారమున బోధ చేయుచునే యున్నాడు కాని, అభాగ్యులు వానిని స్వీకరింప జాలరు. లోకవాసనలకు బానిసీడైన మానవుడు భగవానుని పలుకులకంటె ప్రాపంచక వార్తలకే చెవియొగ్గును. భగవత్ప్రీతికంటె స్వీయేంద్రియ సుఖ

సంతృప్తులకే ప్రాకులాడును. ప్రపంచము అస్థిరము. హైన్యము లగు విషయములనే ఎఱ చూపును. భగవానుడు మహోన్నతములు శాశ్వతములగు వానిని ప్రసాదింప సిద్ధపడును. కాని, మానవ హృద యములు జడప్రాయము లగుట శ్రేయములను గ్రహింపజాలవు. అస్థి రములు, అల్పములైన విషయములకై దివారాత్రములు ప్రయత్నముల గావించుచు, అవి లభింపని పట్టున శోకించుచు తుదకు నశింతురేకాని, ఉజ్జీవనము గల్పించుకొన జాలరు. లౌకిక విషయముల మానవుని వంచించునుగాని, బాబా ఆశ్రయమున నెవ్వడు - ఏ కాలమున వంచి తుడుకాడు. శ్రీసాయీనాథుని సమాశ్రయించినవాడు రిక్తహస్తములతో తిరిగివెళ్ళడు.

బాబాను తన ప్రియతమునిగ భావించి ప్రగాఢ విశ్వాస ప్రేమల బఱవువానికి ఆ తండ్రి యిచ్చినమాట అనుగ్రహించి తీరును. పలికిన పలుకు త్రిసత్యముగ నిలుపుకొనును. పరిపూర్ణము గావించును. బాబా అభయప్రదానముల మన హృదయ ఫలకమున ఖచితముల గావించుకొని వానిని మెలకువతో ధ్యానించుచు, సాధ్యమగునంతవరకు ఆచరణమున బాటించుచుండవలయును. అటుల కావించు మనల లోభపఱచి ఆకర్షింపజాలు లౌకిక విషయములకు అధీనులము కాము.

తాను చక్కదిద్దనున్న బిడ్డను పలువిధముల లోభపఱచుచు పరీక్షించువాడు ఆ తండ్రియే. ఆయా పరీక్షలకు నిలువలేక వ్యామో హితుడై ఆ ఉరులలో చిక్కుపడి విలపించునపుడు చేరి, ఊరట పుచ్చువాడు శ్రీసాయీ ప్రభువే - యని మనము గుర్తించవలయును. మనకు గలుగు ఈ వివిధ ద్వంద్వములగు సుఖదుఃఖాదులగు కార ణము మఱియొకటి లేదు. ఇవియన్నియు మన పరీక్షకు నిర్దేశింపబడి నవిగ మనము గుర్తింపవలయును. ప్రతి దినము బాబా మనకు రెండు పాఠములను గఱపుచుండును. మనము కావించు అకార్యముల (చేయరానిపనుల) గూర్చిన అవివేకమును నిరసించుట యొకటి, మన సత్ప్రవర్తనమును గూర్చి అగ్గించి యభినందించుట మఱియొకటి, ఈ ద్వివిధములగు పాఠములను మన దైనందిన ప్రవర్తనముల గుర్తించుచునే యున్నారము.

ప్రార్థన :—

సాయినాథ. సుశ్రేయమౌ స్థానమీవ!
ఏ నెవఁడ? నీ దయిని బల్క నెంతవాఁడ?
కట్టకడపటి సేవకు డిట్టిహీను,
డితనికి విహితంబేమొ యెఱుగలేఁడు.
లేదు స్థితి, శక్తియు; నితండు లేనివాఁడె;
పావనుఁడ వుదారుఁడవు సత్ప్రభువు నీవ.
సకలమును సంఘటింపఁగ జాలుదీవ,
విశ్వమున బరివ్యాప్తమై వెలయుదీవ;
నీ విడిన యభయంబుల ద్రోవబోక
శ్రితుని వీనిపై గృప బ్రసరింపఁగదవె!

జాలిమై కడగంటి వీక్షణము బఱుప
వేని, వ్యసనపీడితు డిత డెటుల బ్రతుకు?
జాగుసేయక - విడక - దర్శనము నిమ్ము!
మ్రుక్కి సోలఁగ నీక నీ చక్కఁ జేరి
నిన్ననుసరించు బుద్ధిని, నీదుసక్తి.

ధృతిని, నీ సేవల నిరహంకృతి నిరీహ
గూర్చి, నీ బిడ్డడనిపించుకొనఁగ నిమ్ము
సృష్టి మొదలుగ నీవిని వెఱుగుదీవు
సాయిగురుదేవ! సత్కృపామేయభావ!

3. సత్యమే శరణ్యము:

"సత్యమేవ పరం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః
సత్యమేవాక్షయా వేదాః సత్యేనైనాప్యతే పరమ్."

"సత్యమే పరబ్రహ్మమై యున్నది. సత్యమునందే ధర్మము సుప్రతిష్ఠితమై యున్నది, సత్యమే శాశ్వతములైన వేదము లగుచున్నవి. సత్యమునే ఆధారము జేసికొని జీవి పరమస్థానమును పొందుచున్నాడు." అని లోకశ్రేయము గాంక్షించు మహర్షులు మనకు ప్రబోధించు చున్నారు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః."

(భగవద్గీత 18-66)

అని, తన నాశ్రయించిన అర్జునునకు చరమసూక్తిగ ప్రబోధించినాడు. ఇచట 'సర్వధర్మాన్' - అను పదమునకు నైతిక-సాంఘిక శాస్త్రీయ ధర్మములని మనము భావింపరాదు. సర్వోపాయమ్ములన్ను - ఇతరములైన సకల సాధనములను - మనకు ఆధారములని మనము భావించుచున్న ఆధారములను అన్నిటిని పరిత్యజించి, "మాం-ఏకం శరణం వ్రజ" - సత్యస్వరూపుడనైన - సత్యమైన, త్రికాలాబాధ్యమైన, భగవానుడనైన నన్నుమాత్రమే శరణు పొందుము. అనగా దైవమును ఆధారముజేసికొని నీ జీవయాత్రను (నీ విధులను) సాగింపుము. సత్య స్వరూపుడనైన నేను సకల పాపములనుండి నిన్ను విముక్తుని గావింతును. శోకింపవలదు. [నరుడు తన విధులను నిర్వర్తించుపట్టున పెక్కు పాపములను జీవహింసాది కార్యముల గావించుచున్న వాడనని విచారపడుట సహజము] దైవము నాధారము జేసికొని, తనను ఆ దైవము చేతిలోని ఉపకరణముగ భావించి, దైవమునందు మనస్సు - బుద్ధి నిలిపి, దైవము విధించు కర్మములను సలుపువాడు నిర్లిప్తుడై, సకల బంధములనుండి విముక్తుడగునని మనము గ్రహింపవలయును.

[సత్యము - అను పదమునకు నిజము పలుకుట - అని అర్థమును కలదు. చూచిన - వినిన - తెలిసిన విషయమును ఉన్నది ఉన్నట్లు తెలుపుట, సత్యము పల్కుట అను అర్థమును కలదు, ఇచట

'సత్యము' - అను శబ్దమునకు 'దైవము' - అనియే మనము గ్రహించవలయును. దైవాధీనుడై, దైవము నాధారము జేసికొని జీవయాత్ర సాగించువాడు సత్యమునే పలుకుచుండును. కల్లలెప్పుడును పలుకడు]

చూడుడు! - S. C. S, శ్రీసాయినాథ బోధామృతము పేరా 11.

"సత్యమాధారముగ నీవు సంచరింపు
మెల్లవేళల; నపుడు నీ వెటుల నున్న,
నెందు నీవున్న, నేమి కావించుచున్న
విడక నెప్పుడు రక్షణంబిడుచునుందు."

(శ్రీ సాయీ కరుణ - అభయప్రదానములు)

"బిడ్డా! సత్యమాధారముగ జేసికొని, విధేయతతో నన్ననుసరింపుము," - అని, బాబా మనకు దెలిపినాడు. సత్యమునే (దైవమునే) ఆధారము జేసికొని విధేయతతో బాబాను అనుసరించుచున్న మనల నలముకొను ప్రతిబంధములనుండి ఆ తండ్రి మనల రక్షించును. మనల లోభపఱచు వస్తువులనుండి, అవినీతిపరుల అపవాదముల నుండి తొలగించి స్వేచ్ఛను కల్పించి బాబా - ఇతర మానవుల వ్యర్థ ప్రలాపములను పాటింపనీయడు.

మనమింతకు బూర్వము కావించిన పాపములను అకార్యములను గూర్చి యోచించుకొని, విచారపడవలయును. మనము కావించిన ఏ మంచిపనులనుగూర్చి గర్వించుటగాని, అధిక్యత వహింప జూచుటగాని తగదు. వాస్తవముగ వివిధ మనోవికారములచే నలముకొనబడినవాడు గాని, పాపికానివాడుగాని మనలో లేడనియే చెప్పదగును. మనము ప్రకటించుకొని గర్వింపదగిన సుగుణ సంపదలు మనలో లేవు. మనము దుర్బల మనస్కుల మగుటచే దైవమునకు క్షమాపణము జెప్పుకొనదగిన అకార్యములే మనయందపారముగ గలవు. కావున మన మేమంచి పని గావించుచున్నను, మనమేమో ఘన కార్యములను గావించుచున్నారమని తలంపరాదు. మనము చేయు

నది గొప్పగ - అమూల్యము - విచిత్రము - శాశ్వతము - ప్రశంస నీయమైనదిగ తలంచి -యుపొ్వంగరాదు. సకలమునకంటె మహో న్నతస్థానమున సత్యస్వరూపుడగు దైవము - శ్రీసాయీప్రభువే యున్న వాడుగ విశ్వసించి, ప్రేమించు చుండవలయును. మన అకించ నత్వమును గూర్చి యెల్లవేళల నెల్లెడల గుర్తించుచుండవలయును.

ఎట్టి లౌకిక విషయములనుగూర్చి భయపడక, దేనిని నిందింపక మన లోప పాప తాపములనుగాక దేనిని ఏవగింపక, ప్రాపంచకార్థములు లభించిన, నశించిన మోదఖేదముల బడయరాదు. దైవమును-ప్రత్యక్షమగు సాధుసత్పురుషుల నాశ్రయించి, యనుసరించునెడ, మనలో పలువురు స్వీయాభిమాన గర్వముల విడనాడ జాలక ఆ సత్య వస్తువునందుగల రహస్యములను, అందుగల మహోన్నత విషయములనేవియో పరిశీలించి తెలిసికొనవలయు నను కోరికతో నాశ్రయించి యనుసరింతురే కాని, తమ విషయము - తమ బంధవిముక్తిని గూర్చి యోజింపరు.

శ్రీ సాయీబాబా ద్వారకామాయి మసీదునందు అంత ఎత్తున గుడ్డపేలికలతో వేలాడ గట్టబడిన బల్లపలకపై నెట్టు లెక్క గలిగినాడు? ఎటుల నిదురించినాడు? నీటిని తైలముగా మార్చి యెటుల దీపముల వెలిగించినాడు? మూడు దినము లెల్లరు మృతుడని నిర్ణయించిన యతడు ఎటుల బ్రతుక గలిగినాడు? నాణెము లొక్కొక్కటి తీసి రుద్దుటయేమి? కడవల నీటితోనింపి, యా నీరము నెల్లదిక్కుల జల్లుట ఏల? వందలకొలది మైళ్ళదూరమున జరుగుచున్న విషయము లెటుల గనుచున్నాడు? ఇత్యాదుల దూరదృష్టి - దూరశ్రవణాదులు, అష్ట సిద్ధులు - అష్టాదశ సిద్ధులకు సంబంధించినవా? మొదలగు సందేహములు కుతర్కములతో బ్రహ్మజ్ఞుడు - బ్రహ్మమునగు గురుదేవుని పరీక్షించుటకు ఆ రహస్యములను తమ భౌతిక విజ్ఞానసంపద నాధారముగ జేసికొని తెలిసికొనుటకు జేర జూతురేకాని, తమ విషయము - ఇహపరసాధన విషయము తమ బంధ విముక్తినిగూర్చి రవంతయేని ఆలోచించుకొనరు. ఇట్టి ప్రవర్తనలవలన మనము వంచితులమగుదుమే

కాని, తరింపజాలమని సోదరీసోదర భక్తులు గ్రహింపవలెను. అనంత శక్తి సంపదలు గల శ్రీ సాయీ మహత్త్వము మన అత్యల్పములైన కొలమానములతో కొలవదగినదికాదు.

తఱచుగ నట్టివారిని - సంశయగ్రస్తులను చక్కదిద్దుటకు - వారి దురభిమానగర్వములను దైవరహస్యాన్వేషణాసక్తులను అణచుటకు వివిధములైన లోభములను దైవము కల్పించును. వారాలోభపాశములకు జిక్కుపడి, పాపప్రవర్తనములకు లోగి చెడుదురు. కావున దైవమునకు దైవనిర్ణయములకు భయపడుచు ఆ భగవానునికి ఆగ్రహము గలిగించు మార్గమున మనము ప్రవర్తింపరాదు. మహాత్ములు ప్రత్యక్ష దైవమగు సాధుసత్పురుషులగూర్చిన ఊహాతీతములు - అవేద్యములైన చర్యలను మనను విమర్శించుచు చర్చింపక, ఎవరికి వాడు తన అల్పత్వమును గుర్తించుచు, ఎట్టి మంచి పనులను దాను దోసిపుచ్చి, దైవమునెడ - దైవముయొక్క ఆజ్ఞలయెడ నెంతలెంత యపరాధముల గావించుచున్న వాడో ఆ విషయముల దలంచుకొని, పశ్చాత్తాప మొందవలయును.

మనలో కొందఱు వారి భక్తి ప్రపత్తులను గ్రంథ పరిమితముల గావింతురు. అనగా సద్గ్రంథ పారాయణములే భక్తిగ భావింతురు. కొందఱు చిత్రపటములు - విగ్రహములు ప్రతిమలకు మాత్రమే వానిని సమన్వయింతురు. అనగా పటములకు విగ్రహాదులకు పూజలు సలుపుటయే భక్తిగ దలంతురు. మఱికొందఱు బాహ్యావేషములు, ఆయా చిహ్నముల ధరియించుటే భక్తిగ పరిగణింతురు. ఇంకను కొందఱు నోటికిమాత్రమే పరిమితము గావింతురు. దైవగుణలీలా సంకీర్తనములే భక్తిగ భావింతురు. ఏ కొలదిమందిమాత్రము ఆ భక్తి ప్రపత్తులు హృదయమునకు సంబంధించినవిగ గ్రహింప జాలుదురు. సత్యజ్ఞాన ప్రకాశమున ప్రభోధితులైనవారు ప్రేమామృతము హృదయపాత్రలయందు పొంగిపొరల, నిత్యసత్య వస్తువునందు దృష్టినిలిపి, ప్రాపంచక విషయవాసనల ద్రోసిపుచ్చి, దేహయాత్రార్థముమాత్రము ప్రకృతి విధానముల ననుసరింతురు. ఇట్టివారు నిత్యసత్యస్వరూపులై,

తమ హృదయస్థాయియైన శ్రీసాయీ ప్రబోధమును సమాలింపగలరు.

ఈ సందర్భమున శ్రీసాయీ మహాప్రభువు తనబిడ్డలకు గావించిన ప్రబోధముల నొకటిరెండు గ్రహింపదగును. [S. C. S శ్రీ సాయీనాథ బోధామృతము - పేరా 337ఎ.] గర్భవతియైన భార్యతో జస్టిస్ యం. బి. రేగే బాబాను దర్శించెను. అపుడు బాబా - "నా బహుమతులలో నొకటి మీ దగ్గఱ గలదు" అని పలికెను. బిడ్డ జనించిన పిదప ఆబిడ్డను వారు బాబా దగ్గఱకు గొనిపోయిరి. అపుడు బాబా "ఈ బిడ్డ నీ వాడా? - నా వాడా?" అన, "బాబా! నీవాడే" అని శ్రీ రేగే సమాధాన మిచ్చెను. అంతట బాబా నాకుగా నీ దగ్గఱ ఉంచుము" అనెను. 18 నెలల తరువాత ఆ బిడ్డకు అవసానస్థితి ప్రాప్తించెను. ఆ బిడ్డ నెత్తుకొని శ్రీ రేగే బాబాపటము ముందునిలిచి "ఈ బిడ్డ కర్మశేషము నే ననుభవింతును. ఈ నీ బిడ్డను నీవు స్వీకరించి ఆత్మశాంతిని ప్రసాదింపుము" అని ప్రార్థించినాడు.

దీని ననుసరించి, ఈ ప్రపంచమున మనదియనుకొను సతీసుత సంపత్సంచయమంతయు దైవమునకు జెందినదేయని, మనము తాత్కాలికముగ ధర్మకర్తలము మాత్రమేయని, దైవమెపుడు వీనిని స్వీకరింపదలచునో, లేక మనల ఆ ధర్మకర్త పదమునుండి తొలగింపదలచునో అదియంతయు దైవేచ్ఛ" ననుసరించి యుండునని బాబా మనకు బోధించినాడు.

[S. C. S. 539] (శ్రీసాయినాథబోధామృతము)

దామియా (దామోదర - సావల్రాం - రసానే) కు బాబా సంతతి ప్రసాదించుటకై నాలుగు మామిడిపండ్లు నిచ్చుచు "దామియా! ఈ పండ్లనిపుడు తీసికొనిపొమ్ము. వీనిని తినిచావుము!" అని పలికెను. దామియా భయచకితు డయ్యెను. సంతతి బడసి, సంసార నిమగ్నుడగుట ఆధ్యాత్మిక మృతియే - యని అతడు గ్రహింపజాలడయ్యెను.

బాబా కావించిన యిట్టి ప్రబోధములనేకములు కలవు. వీని ననుసరించి మనము లోక విషయ లంపటులమైనకొలది ఆధ్యాత్మిక

సంపదకు దూరమగుదుమని, ఆధ్యాత్మికనిష్ఠ హెచ్చినకొలది లోక విషయవాసనలు క్షయించుచుండునని గ్రహింపవలయును.

"లౌకికార్థములను - వాని వాసనలను విడువుము. నిత్యసత్యమైన దైవమును - దైవీ సంపదలను ప్రేమింపుము. ప్రపంచమును విస్మరింపుము. సత్యమగు దైవము నాశ్రయించి, ఆశించి, స్మరింపుము" - అని దివారాత్రములు మన హృదయస్థాయియైన శ్రీసాయీ ప్రబోధ కల్పించుచునేయున్నాడు.

ప్రార్థన:—

నిను - విశ్వాత్ముని, విశ్వవందితుని దంత్రీ! కానగాజాల భూ
త నికాయంబిది నీ కభిన్నమగు; సత్యంబీవ; విభ్రాంతి వా
సనలన్ గూర్పకుమయ్య! మ్రొక్కెదను; "శ్రీసాయీశరణ్" ధ్యాన మే
క్షణమందేన్ మఱువంగనీయకుమి; ఈశా! సాయినాథప్రభూ!

4. ప్రేమ ప్రభావము:

"అనిర్వచనీయం ప్రేమస్వరూపమ్"

(నా. భ. సూత్రములు 51)

ప్రేమస్వరూపము పలుకుల కందనిది. దైవమే - ప్రేమ; ప్రేమయే దైవము. కావున దైవమునుగూర్చి పలుకుటకు - ఊహించుట కెటుల సాధ్యము కాదో ప్రేమ తత్త్వమును గూర్చియు వివరింప నలవి కాదు. లౌకిక విషయములందు - బంధుమిత్రాదులందు - గృహ ధన క్షేత్రాది సంపదలందు మనము ప్రకటించు ఆసక్తి - ప్రీతి - కామముయొక్క వికారముకాని, ప్రేమకాదు. 'ప్రేమ అనునది సాధు సాంగత్యముతో ప్రారంభమై భక్తిభూమికల నన్నిటిని గడచి పరాకాష్ఠ నొందిన నిర్మల మానసిక స్థితిగ బేర్కొనదగును. తనయందు - సకల

భూతములందు దైవమును, గురుదేవుడైన శ్రీసాయీప్రభువును జూచ గలిగి యీ సకల జీవములు బాబాకు భిన్నములు కావు అను నిశ్చిత బుద్ధితో ఆదరించి, గారవించి సేవించుటయే ప్రేమ.

"యా ప్రీతి రవివేకానాం - విషయే ష్వనపాయినీ
త్వామనుస్మరతః సా మే హృదయాన్మా మపసర్పతు"

(విష్ణు. పు. 1-20-23)

వివేకహీనులు లౌకిక విషయములందెట్టి ప్రీతి వహించి ఆసించి తలంచుచుందురో స్వామీ! అట్టిప్రీతి - ఆసక్తితో నిన్నుగూర్చి మా హృదయము ధ్యానించునట్లు అనుగ్రహింపవే! యని భక్తులు ప్రార్థింతురు. అవివేకికి అనిత్యములు అసుఖములైన ప్రాపంచక వస్తువులందు ఎంత ప్రీతియుండునో, అట్టి ప్రీతి సర్వభూతాంతర్యామి యైన దైవమునందు గలిగియుండుట 'ప్రేమ' కావున లోకవిషయా సక్తి కామము - దైవమునందాసక్తి ప్రేమ అని మనము గ్రహింపవల యును. బాబా ఒక సందర్భమున "నేను మీ యందఱ నెట్లు ప్రేమించుచున్నాడనో అట్ుల మీరు ఒండొరులు ప్రేమించుకొనుడు!" అని బోధించినాడు. స్వప్రయోజనాసక్తియే లవమేని గలిగెనా అది కామమగును. స్వార్థపరత బుద్ధి నశించెనా - అది 'ప్రేమ' యన బడును.

ప్రేమస్వరూపుడైన శ్రీసాయి మన హృదయస్థాయియైన క్షణ మున మనయందుగల సకలము ఆనందమయమగును. ప్రేమ ఉత్త మోత్తమము. అపార శ్రేయస్కరము. కఠినములను మృదువుగను, మహాభారములను మిక్కిలి తేలికగను మార్పజాలును. ఇది భారము'- అని స్ఫురింపజేయని మహాభారములను వహింపజేయును. తిక్తము లను మధురములుగను రుచికరములుగ గావించును. శ్రీసాయీ ప్రేమమహత్కార్యములను ఘటింపజేయును. అల్పములను నీచముల ద్రోసిపుచ్చి పరిపూర్ణతపై దృష్టి నిలుపజేయును. ఉన్నతాశయములకై ప్రయత్నము జేయించును. లౌకిక కామితములను దూరముగ ద్రోసి

పుచ్చి, వానినుండి విడివడజేసి, పరమస్వేచ్ఛకై ఆసక్తి బలపడును. అస్థిరములగు సుఖసంపద్భోగముల కాసపడనీయక, కష్టనష్టములచే క్రుంగనీయక నిరంతరము అంతర్దృష్టిని ప్రసాదించుచుండును.

ప్రేమకంటె మధురమైనది, ధృత్యుత్సాహపూరితమైనది, విశాలమైనది, భూమ్యాకాశములందు అనంత ప్రపూర్ణమైనది లేదు. ప్రేమ దైవమునుండి కలిగినది. అది దైవమునందే అంతర్వ్యాప్తమైనది. ఈ విశ్వసృష్టినంతటిని అధిగమించి, ఆ దైవమునందే విశ్రమించునదియగు చున్నది. ప్రేమ కలవాడు ఆకసము నంట నెగురును. దిగంతములకు బరువులిడును. ఆనందించును. ఎట్టి దానను బంధింపబడక పరమస్వేచ్ఛను బడయును. ప్రేమసామ్రాజ్యమున చేరినవాడు మహోన్నతమైన శ్రీ సాయి పరమపదమున విశ్రమించువాడు కావున నెల్లరకు సకలము నొసగజాలును. ఎట్టి వలను సకలము గలిగియుండును. శ్రీ సాయీ మహామృతసాగరమునుండి సకల కల్యాణ తరంగములు ప్రవహించుచు విశ్వవ్యాప్తమ్ము లగుచుండుగాన వాని కెల్లప్పుడు నే విషయమున కొఱత కలుగదు.

ప్రేమియగువాడు బహుళాకృతులను ఆదరింపడు. ఆ సకల వస్తు సంభారముల కన్నిటికంటె ముందుగ దననే ఆ విశ్వంభరుడైన శ్రీ సాయీశునకు సమర్పణము గావించుకొనును. ప్రేమకెందును పరిమితిలేదు. అది యెల్ల పరిమాణముల నధిగమించి తీక్ష్ణమై ప్రకాశించుచుండును. శ్రీ సాయీనాథుడు తనకు విధించునది ధర్మ సహితము సుసాధ్యముగ ప్రేమియగువాడు గ్రహించుగాన దేనిని గష్టముగ, భారముగ తన శక్తికి మించినదిగ దలంపక ఆ పనికి బూనుకొని సాధించును.

ప్రేమ నిద్ర, అలసత నెఱుగదు. ఎల్లవేళల జాగరూకత వహించును. నిరంతరము పరిశ్రమించుచున్నను కుంగదు. భయపెట్టబడుచున్నను కలవరపాటుగనదు. దీప్తజ్వాలలవలె దివిటీలవలె నిరోధముల నన్నిటిని ద్రోసిపుచ్చి, ఊర్ధ్వగమనమునే సాగించుచుండును. ప్రేమియగు వాడు తన అంతరాత్మ ఉచ్చైస్స్వరమున

అఱచుచున్న అఱవును "ప్రియతముడగు సాయీ! నీవు సకలము నా వాడవు - నేను సకలము నీవాడను" - అను అఱవును వినగలడు.

ప్రేమ - చైతన్య సహితము, ఋజువు, ప్రియతమము, ఆనందము, సామరస్యసమన్వయ కలితము, ధృతిమతియు, సహనము, విశ్వవ్యాపకము, వివేకవంతము, కష్టసహనము, పౌరుషము, నిస్స్వార్థమైనది. మానవున కేవిషయమందేని నెప్పుడేని స్వార్థపరత కలిగెనేని నతడా ప్రేమతత్త్వమునుండి పతనము జెందును. ప్రేమ సకలము నావరించునది. విధేయత గలది. విస్పష్టమైనది. లాలన, చులకన, నిరసనములకు లొంగనిది. వ్యర్థము నాదరించనది. అది వివేకము (జ్ఞానము) గని. పవిత్రతల ఆగారము. స్థిరతకు ఆటపట్టు. శాంతి నిధానము. సకలేంద్రియముల నధీనమందుంచుకొని భద్రపఱచుకొను నది. పెద్దలయందు విధేయత వహించునది యగును, కష్టములపై కష్టము లలముకొనుచున్నను గురుదేవుడగు శ్రీసాయీభగవానునందు భక్తి, కృతజ్ఞత, విశ్వాసము లవమేని విడనాడక తన గురుదైవమునే ఆధారము జేసికొని పురోగమించునది యగుచున్నది, సంకటముల బాలుగాక యెట్టివాడేని ప్రేమసామ్రాజ్యమున నిలువజాలడు గదా!

ప్రేమ విషయమున శ్రీసాయీ ప్రభువు తెలిపిన అంశములను [S. C. S. శ్రీసాయీనాథ బోధామృతము పేరా 263, 208, 289 చూడుడు] బాబా భౌతిక తనువునందున్న కాలమున జ్ఞాన ప్రేమలబ్ధికై ఆశ్రయించినవారు సర్వసాధారణముగ లేరనియే చెప్ప దగును. ఎల్లరు కష్టనివృత్తికి - అభీష్టావాప్తికే ఆశ్రయించి బాబాను సేవించినారు. కాని బాబా ఆశ్రయ మహత్త్వమా జన్మమున గాకున్నను మఱుజన్మమునసైన ప్రేమలబ్ధిని ప్రసాదించితీరును.

శ్రీసాయిబాబా భక్తుల వృత్తాంతములలో (Devotees Experiences Part-1) రావ్‌సాహెబ్ యస్వంత్ జనార్దన్‌గాల్వంకర్ (హేమాద్రిపంత్ అల్లుడు) 1917 నశ్రీసాయీ ప్రభువును దర్శనము చేసికొని నాడు [S. C. S. పేరా 465 చూడుడు.] బాబా యీతని పూర్వ భవమునగల ఉదాత్తసుగుణములగూర్చి పేర్కొని, ఆ కారణమ్మున

అతనిని ఆ భవమున అట్టి తల్లి గర్భమున పుట్టువొంద జేసితినని తెలిపి యాతని సుగుణముల నగ్గించినాడు. గాల్వంకరునకు బాబాయందు భక్తి పెంపొందినది. 1932నందు గాల్వంకర్ స్వప్నమున శ్రీసాయీ నాథుడు పొడమి, "నీకేమి కావలయును?" - అని ప్రశ్నించినాడు. "నాకు ప్రేమ - కేవలము ప్రేమమాత్రమే కావలయును" అని వెంటనే తెలుప. బాబా ఆ బిడ్డకు 'ప్రేమ' ప్రసాదించి అదృశ్యుడైనాడు.

సకల భూత హృదయాంతర్వర్తియై యెల్లెడల నెల్లవేళల నేమి జరుగుచున్నదో తెలిసికొని. తన బిడ్డలకు ఏడుగడయై అసాధ్యముల సాధింపజాలు సమర్థ సద్గురుదేవుడగు బాబాయెడ గాఢమగు ప్రేమబు అపుటయే వివిధ మతస్థులగు బాబా ఆశ్రితులకు సమాన ధర్మమైనది. ఆ ప్రేమ నిర్వంచిత - నిరవధిక ప్రేమ - ఆ పిచ్చి ప్రేమయే శ్రీసాయీ ప్రభువు కరుణకు ఉపాయోపాయములై యున్నది. బాబా అట్టి ప్రేమచేతనే తన గురుదేవు ననుగ్రహము సంపాదించుకొన గలిగెననియు తన అట్టి మహోన్నత స్థితికి ఆ ప్రేమయే మూలమని స్పష్టముగ తెలిపినాడు, కష్టనివారణము అభీష్ట సంసిద్ధియే ప్రతి వ్యక్తియు గోరునది అది ప్రేమైకసాధ్యము. శ్రీ సాయీ పదాశ్రయమున ఆ ప్రేమ నెల్లరు సంపాదింప గలిగిరి, సంపాదింపగలరు.

ప్రార్థన:—

సాయి! నీ ప్రేమపూర్ణుని సలుపరమ్ము
అనుపమ ప్రేమసుధ సతమాననిమ్ము
స్వామి! యీ నీదు ప్రేమప్రవాహమునను
మునిగి, రూపటి, కఱగుచు బోవనిమ్ము
వీని నీ ప్రేమవశుని గావించుకొనుము
ఎపుడు నీ ప్రేమగీతి గీర్తించనిమ్ము
హృదిని ప్రేమమయంబు గావించి నిన్ను
ప్రియతముని విడక యనుసరింప నిమ్ము
స్వాత్మకంటె నీపై ప్రేమ పఱగనిమ్ము
ఎపుడు నీకై నిజాత్మ ప్రేమింపనిమ్ము

ప్రేమవస్తువు నీనుండి వెలయుగాన
ఎల్లయెడలను నీ ప్రేమ నెసగనిమ్ము
కాంతు నీ ప్రేమమయ పదపంకజములను
కంటిమూతల దొలగింపగదవె! సాయి!

5. ప్రేమ నిరూపణము:

"యో నహృష్యతి నద్వేష్టి - నశోచతి నకాంక్షతి
శుభాఽశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్సమే ప్రియః.

ఎవడు హర్షమొంద డెవడు ద్వేషింపడో
యెవడు దుఃఖమొందడెవడు కోర
డర్జునా! యెవడు శుభాశుభ త్యాగియో
యట్టి భక్తుడె ప్రియుడగును నాకు.

(భగవద్గీతలు: 12-17)

తనకు సుఖసంతోషముల గూర్చుచు, శ్లాఘించి గౌరవించు వారిని గూర్చి సంతోషింపక, తనకు కష్టనష్టముల గలిగించుచు నిరసించుచు నిందించువారియెడ ద్వేషము వహింపక, నష్టమైన వస్తువు కొఱకు శోకింపక తన అర్హతను పాటింపక అవి - యివికావలయును కోరికలు లేక మేలుకీళ్ళను సమదృష్టితో జూచు నా భక్తుడు నాకు ప్రియమైనవాడు అని శ్రీకృష్ణభగవాను డర్జునునితో బలికినాడు.

ప్రేమతత్త్వ నిరూపణము దుర్లభము. పలుక నూహింప నలవి కానిది. భగవానునకు భక్తునియందు, భక్తునకు భగవానునందు ప్రకటమగునది ప్రేమ. ఇది నిస్స్వార్థ ప్రేమ - పరాప్రేమ. లౌకిక ప్రేమయందు స్వార్థబుద్ధిగలదు. ఈ ప్రేమతత్త్వమును లోకదృష్టితో గ్రహించవలయుననిన "తల్లి బిడ్డల" ఉదాహరణముకంటె వేఱులేదు. సర్వ సాధారణముగ మనము గాంచుచున్న ఈ యనుభూతిని దెలిసికొనిన భగవానుని భక్తుని బంధించు ఈ నిర్హేతుక ప్రేమమాత్రము మనకు కొంతవఱకు బోధపడగలదు.

మాతృపరాయణులై తల్లి యొడిలో నున్న బిడ్డనుజేరి గొప్ప విలువయైన రత్నములను జేతికిచ్చినను, మిక్కిలి మధురమైన పదార్థములను తిన జూపినను, అధికముగ గారవించి, ప్రేమబఱపినను వేయివిధముల ఆశపెట్టినను ఆ బిడ్డ - మాతను మాతృస్తనములను విడిచి డాయదు. ఇతరముల కాసపడబోదు. ఇతరముల కోరుటయేమి? ఇతరముల నెఱుంగదు. తలపనైన తలంపదు. ఆ శిశు వెఱుంగునదియు కోరునదియు 'తల్లి' అను వస్తువ యొక్కటియే. తల్లి కంటె నితరమైన దేనితోడను సంతోషమొందదు. తృప్తిగనదు. ఆ విధముగ భక్తుని కామితము భగవాను డొక్కడే. కాని యితరమేదియు గలుగదు. భగవానుడును "సచ్చా దిల్ కామితా" - నిర్మలమైన ప్రేమ పూరిత హృదయమును ప్రేమించువాడు. కావున భక్తుడగువాడు సాయిమాతను శిశువువలె నంటుకొని యుండవలయును. బిడ్డకెప్పుడేది యవసరమో తల్లి యెఱుగును. సమకూర్చుచుండును. బిడ్డకోర నక్కరలేదు. బిడ్డ తన రక్షణను గూర్చి తలంచడు. తనరక్షణభారము తాను వహింపదు. అది తల్లి బాధ్యతయే.

బిడ్డ కొంచెమెదిగి తిరుగాడ నేర్చినపుడును ఆ బిడ్డ యోగ క్షేమముల గుర్తించి కూర్చు బాధ్యతయు తల్లిదే. బిడ్డ తిరుగుచు నెందేని జారిపడిన "అమ్మా!" అని యేడ్చును. మఱియొక రా బిడ్డ తలంపునకు రారు. బిడ్డయేడ్పు వినబడినతోడనే తన పనులన్నియు డిగవిడిచి పఱుగులెత్తుచు తల్లి బిడ్డదగ్గఱకు జేరినతోడనే, బిడ్డ తనకు దాన పడియు తల్లిపైన కోపము ప్రకటించుచు, వచ్చియురాని పలుకులతో "నన్నొంటరిగ నేల దిగవిడిచివెళ్లినావు? నన్నిటుల క్రిందబడ జేసితి వేమి?" అని పలుకుచు, స్వాభిమానము ప్రకటించుకొనుచు "పొమ్మ - నీతో మాటాడను? పొమ్మ!" అనుచున్న బిడ్డ నెత్తుకొని తల్లి తన యొడిలో జేర్చికొని, స్తన్యమున దృప్తి నొందింపజూచును. బిడ్డ దూరదూరముగ పఱుగులెత్తును.

ఇటు మాతా శిశువుల సంబంధమును గమనింపుడు! సహజముగ బిడ్డ తల్లిపై తన అధికారమును ప్రకటించును. తల్లి ఆ విధ

మంతయు నెఱుగును. తల్లిబిడ్డల యిరువురందును పెరపొచ్చములు లేవు. తల్లి భిన్నముగ పాటింపదు. బిడ్డ ఆకలినొందిన అది తల్లి తప్పు; జాఱి క్రిందపడిన అది తల్లి నేరము; నిద్రపట్టకున్న అది తల్లి దొసగు; తప్పు నిరూపించుటకు, నిరసించి కోపించుటకు, తుదకు శిక్షించుటకును బిడ్డ దక్షుడు. తల్లిబిడ్డల ప్రేమబంధమువలె, భగవానుడు, భక్తుల సంబంధము లిట్లుండును. తల్లికి కష్టము కలిగిన బిడ్డయేడ్చును. బిడ్డయేడ్చిన తల్లి దుఃఖించును. ఈ ప్రేమబంధ మనుభవైక వేద్యము. పలుక నూహింప నలవికానిది. తల్లి తిట్టిన కొట్టినను బిడ్డ తల్లిని కౌగలించుకొనియే "అమ్మా! అమ్మా!" అనియేడ్చును. రక్షించిన, శిక్షించిన, బిడ్డకు యొకర్తుకయే శరణ్యము; దిక్కు. ఆవిధముగ నేది యెటుల బరిణమించుచున్నను భక్తునకు భగవానుడే శరణ్యము, ఆశ్రయము, ఆశ్రయస్థానమని మనము గ్రహింపవలయును.

"ఏమీ, నిన్నుపేక్షింతునా? (Life of Sai Baba) శ్రీసాయీ బాబా చరిత్ర - భక్తుల వృత్తాంతములు) అను గ్రంథమున బాబాకు అంకిత సంతతికిగల తల్లిబిడ్డల సంబంధమును నిరూపించు వృత్తాంతము లనేకములు గలవు. ఉదాహరణమునకు బాబా అర్.బి. పురందర్‌ల విషయమున తల్లి బిడ్డల ప్రేమలెట్లుండునో గమనింపుడు. S. C. S. శ్రీ సాయీనాథ బోధామృతము - పేరా 508, 530 గమనింపుడు.)

**S. C. S. 508**

* * * *

(3) 1915లో బాబాకు చాల జబ్బుగ నుండెను. ఉబ్బసము, అయాసము హెచ్చుగ నుండెను. ఆ విషయ మెఱుంగకయే పురందర్ శిరిడికి వెళ్ళి బాబా బాధపడుటచూచి బిట్టేడ్చెను.

సా. బా:— నీ వేల యేడ్చెదవు?

పురందర్:— బాబా! నీ యీ స్థితి నేను సహింపజాలకున్నాను.

సా. బా:— భయపడకుము. 2, 4 దినములలో చక్కబడును. అల్లా నాకీ వ్యాధి నొసగినాడు. ఈ గడువులోపల తిరిగి స్వస్థతను

గలిగించును నీవు దుఃఖింప వలదు. రెండు మూడు రోజులనుండి నిన్నుగూర్చి తలంచుచున్నాను. ఇటకు రావలసినదిగ నీకు ఉత్తరము వ్రాయమని కాకాదీక్షిత్తుతో జెప్పినాడను. (ఆ ఉత్తరము అందు పూర్వమే పురందర్ శిర్డీకి వెళ్ళెను.)

* * * *

ప్రేష్ఠ - ప్రేమికుల భావైక్యత లిట్లుండును. ఒకరికి ఒక తలంపు గలిగిన క్షణముననే ఆ తలంపు రెండవవారికిని గలుగును. ఇట్టివి శ్రీ యం. బి. రేగే, మొదలగు బాబా ప్రేమికుల వృత్తాంతముల దెలిసికొనదగును. కావున భగవానుని తలంపే భక్తుని తలంపు - భక్తుని తలంపే భగవానుని తలంపు. వీరు అభిన్నులని మనము గుర్తింపవలయును. ఒండొరులు తమ ఆశయములను సమాదరింతురు. సోదర భక్తులందు నిట్టి భావానుభవైక్యత తఱచుగ గమనింపదగును.

**S. C. S. Pera** 580 (శ్రీసాయినాథబోధామృతము)

భక్తులు వెండిపాలకిని సంపాదించిరి. దానికి పూన్పబడిన వెండి గుఱ్ఱము లపహరింప బడెను. పురందర్ - అతని మిత్రులు ఆ వెండి పాలకిని భద్రపఱచుటకు ద్వారకామాయి మసీదు ఉత్తరపు వైపున నొక గదిని నిర్మింపదలచిరి. బాబా లేని సమయమున పురందర్ మసీదు గోడకు రంధ్రములు తొలుచుచుండెను. బాబా వచ్చిచూచి, ఆ పని ఆపు మని ఆజ్ఞాపించెను. బాబా బెదరించుచున్నను, దూషించుచున్నను పురందర్ ఆపని సాగించుచునే యుండెను. (బిడ్డ తల్లియెడ వహించు చనుమానము - స్వాతంత్ర్యము నిచట మనము గమనింపవలయును.) తనకు భోజనమువేళ అతిక్రమించినను, విడిదియందతని కుటుంబము భుజింపక ఆతనికొఱకు వేచియున్నను పురందర్ లెక్క సేయక తన పనియందే నిమగ్నుడయ్యెను.

సా. బా:— ఇది యెంత దుస్సహమో - గమనింపుడు! ఇతడు నా మాటలను వినడు, దీనినంతయు నేను సహింపవలయును,

సా. బా:— (పురందరుతో) నీవు భోజనమునకు వెళ్ళుము.

పురందర్:— బాబా! నేను వెళ్ళను. నేను లేని సమయమున నేను చేసిన పనినంతయు తారుమారు చేయుదువు.

సా. బా:— అట్లు చేయను. నీవు భోజనమునకు వెళ్ళుము. (పురందరు భోజనమునకు వెళ్ళెను.)

సా. బా:— (అచట నున్నవారితో) ఏమి చేయవలె? బిడ్డ మన కాలిపై మలము విసర్జించిన మనము కాలును నఱుకుదుమా? లేక బిడ్డను ఛేదింతుమా? దానిని మనము సహింపవలయును.

ఇదియే "మాతా శిశువుల" సంబంధము. భగవానునికి - భక్తులకు గల సంబంధము. ఇట్టి సంఘటనలు బాబాకును తన అంకిత సంతతికిని అనేకములు కలవు. ఈ ప్రేమ నిరూపణమందు స్వలాభాపేక్ష - స్వార్థపరత లేశమేని లేదు. భగవత్ప్రీతికై భక్తుడేమేమియో కావించు చుండును. భక్తునికి సంతుష్టి సంతృప్తుల గూర్చుటకై భగవాను డెన్నియేని సహించుచుండును. ఇదియే సత్యమగు ప్రేమకు నిదర్శనము శ్రీసాయీనాథునకు ఆ తండ్రియొక్క బిడ్డలకుగల బంధము - తల్లి బిడ్డలకుగల సంబంధముగాని - వేఱుకాదు.

ప్రేమి యగువాడు (భక్తుడు) ధైర్యముతో గూడిన యోర్పు (సబూరి) యోజనాసక్తి (వివేకము) కలిగయుండును. సాధారణముగ జనులు ఏ స్వల్ప నిరోధము, ఆటంకము గలిగిన తమ పూనికను వదలుదురు. ఓదార్పు పొందవలయునని నిరీక్షింతురు. ధైర్యముగల ప్రేమి ప్రాపంచకాకర్షణములకు లోనుగాక దృఢముగ నిలబడును. తనను లోబఱచుకొనుటకై ఆసల గల్పించుచు, మార్గమును దప్పింప యత్నించు మాయాపిశాచి పరివారమగు కామాది శత్రుషట్కమును తృణీకరించును. ప్రేమి తనకు సుఖసంతోషముల గూర్చునపుడు శ్రీ సాయీనాథు నెంత ప్రేష్టవస్తువుగ భావించునో కష్టముల అనిష్టముల గలిగించుచున్నను బాబాయందు అదే దృష్టి కలిగి యుండును.

తనను పరీక్షచేయువాడు, ఆ పరీక్షలను సహన స్థైర్యములతో నెదు ర్కొన జేయువాడు ఆ తండ్రియే యని యతడు విశ్వసించును.

యోజనాపరుడగు ప్రేమి శ్రీసాయీ ప్రభువుకంటె ఆ తండ్రి ప్రసాదించు బహూకృతులయెడ ఆదరము బలుపడు, ఆ బహూ కృతుల విలువకంటె శ్రీసాయీ కరుణ ప్రేమలనే నిరంతరము కాంక్షించును ఉదాత్తాశయుడగు ప్రేమి అట్టి బహూకృతులతో సంతృప్తి గనక శ్రీ సాయినాథునే తన విశ్రమ స్థానముగ విశ్వ సించును శ్రీ సాయీ ప్రభువునందు బలె తదభిన్నులగు సాధు సత్పురుషులందు ప్రేమ బలపజాలుదుమేని అది బాబా మనయందు ప్రసరించు కరుణాప్రభావముగ మనము గుర్తించవలయును. మనకు గలుగు దుష్టసంకల్పముల నెప్పటికప్పుడు పారద్రోలుచు మాయా పిశాచి, దాని పరివారముగు శత్రుషట్కము, మనల నాకర్షించుటకై పన్నుచున్న ఉరుల నేవగించి, తృణీకరించుట నేర్చితిమేని మనకా సత్యవస్తువయగు శ్రీసాయీ ప్రభువునందు ప్రేమభావము పెంపొందు చున్నటుల భావింపదగును అట్టి మానసికస్థితి అనంతఫలప్రదము ఏ యితర విషయముల గూర్చి యేనైనో పెక్కు ఆలోచనలను మన మనస్సున జేరనీయరాదు.

మన పూనిక, మన కృషి శ్రీసాయీ ప్రభువు పరముగనే యుండవలయును, విశ్వాస - ధైర్యక్షమల వహింపవలయును. ఆధ్యా త్మికముగ నెంత పురోగమించిన సాధకునైనను శత్రుషట్కము ఏవియో ప్రతిబంధమును గల్పించి, మనమార్గమునుండి తప్పించి, వశీకృతు లను జేసికొన యత్నించుట సహజము. అట్టి ఆకర్షణలను విశ్వసింప రాదు. ఆ శత్రువులు పన్నుచున్న వలల జేరరాదు. అందు దగులు కొనరాదు. దుస్సంకల్పమేదేని బొడమిన "నా హృదయము 'ద్వారకా మాయి'— ఇచట శ్రీసాయీనాథున కొక్కనికే స్థానము. మఱియొకనికి స్థానములేదు. ఈ మందిరమున నీవు ప్రవేశించిన బాబా నిన్ను తన్ని వెడలనడపును. వైళమ తొలగిపొమ్ము" - అని, యెప్పటికప్పుడు, ఎట్టి దురాలోచనలు మనసున ప్రవేశింపదలచిన దూరదూరముగ

తటిమి వేయుచుండవలయును మనకు మార్గదర్శి - జ్ఞానజ్యోతి - ఆశ్రయము - రక్షకము - విశ్రమస్థానము శ్రీసాయీ ప్రభువుగాన, మనమే విషయమునుగూర్చి, యెవరిని గూర్చియైన భయపడవలసిన పని లేదు. ఈ ప్రపంచమంతయు నేకమై మనల ప్రతిఘటించినను - భూమ్యాకాశములు తలక్రిందులగుచున్నను మన రక్షకుడు - ఏడుగడ; శ్రీసాయీ మాత - ప్రభువు మన హృదయమందు నిత్యాసీనుడైయున్న వాడను విషయము మఱువరాదు. ఎప్పుడేని, నే కారణముననేని అట్టి శత్రువులకు లోగిన వెంటనే తెలివినొంది బాబాను సంస్మరించి, దృఢభావమున దీక్షవహించి, ఆ తండ్రి కరుణయందు - అనుగ్రహము నందు విశ్వాసము పెంపొందించుకొని యుద్ధవీరునివలె పురోగమింప వలయును.

ప్రార్థన:—

పసిబిడ్డం డిల దల్లికంటె నితర ప్రాపంచకార్థంబులం
దిసుమంతేన్ మది చొన్పబోని విధి, సాయీలౌకికానేకదు
ర్వ్యసనాపేక్షల బాపి, నీదు చరణాబ్జధ్యానసేవాత్మమా
నస వృత్తిన్ ఘటియింపవే! జననీ! మాన్యా! సాయి!

ప్రేమాద్వయీ!

6. శ్రీ సాయీ కరుణను అడకువ విధేయతలతో గప్పిపుచ్చుకొన వలయును:

"భక్తనకీ యహ్ రీతిహై - బంధే కరే జో భావ్
పరమారథకే కారణై - యా తన రహెూకి జావ్."

మనసును నిలిపి గమ్యము జేరుదనుక
పైనయు కష్టములకు వికలత గనక

పరమార్థదృష్టి యెప్పట్టున విడక
చరియించు భక్తుడౌ సాధువేమఱక.

(శ్రీసాయీ కబీరు సూక్తులు - సాధనము.)

భక్తిఫలరూపమైన (సాధనము) "శ్రీసాయీకరుణ"ను సాధకుడు కప్పిపుచ్చుకొన నేర్వవలయును. "జిన్నెపాయా ఉన్నె ఛుపాయా" (కబీరు) సాధకుడు తాను బడసిన ఆధ్యాత్మికాభ్యున్నతిని బ్రకటించుకొనరాదు. తాను ఉన్నతస్థాన మాక్రమించినటుల తలంపరాదు. తన అభ్యున్నతిని గూర్చి యెల్లరతో జెప్పుకొనదగదు. ఆ విషయమై యోజించుకొనగూడదు. ఎట్టి యోగ్యతలు - అర్హతలులేని తనకు బాబా ఆ కరుణను బ్రసరింప జేసినందులకు జుగుప్స - ఏవ - భీతి నొందవలయును. అట్టి యున్నత స్థానమున కంటుకొని యుండరాదు. అట్టి స్థితి త్వరలో తాఱుమాఱు కావచ్చును. బాబా తన అనుగ్రహమును ఎప్పుడైన ఏ క్షణమునైన తొలగింప గలడు. ఉపసంహరింప గలడు. ఆ కరుణాప్రసారానుభూతి నొందునపుడు - అదిలేనిపట్టున తన స్థితి యెట్లుండునో భక్తుడు సతతమూహించు కొనుచుండవలయును.

శ్రీసాయీనాథుడు తన కరుణ నొకించుక తనయెడ ప్రసరించిన మాత్రముననే తన జీవితాశయము సిద్ధించినట్లు భక్తుడు భావింపదగదు. అడకువతో అహంతను ద్రోసిపుచ్చి, ధైర్యముతో గూడిన ఓర్పు గలిగి, ఆకరుణ ఉపసంహరింపబడిన స్థితి నెదుర్కొనుటకు సిద్ధపడవలయును. తన విధులను నిర్వర్తించుటయందు, బాబా సేవలందు, భక్తి నెఱపుటయందు మాంద్యము, అలసత్వము వహింపకుండుట నేర్వవలయును. శ్రీసాయీ కరుణ ఉపసంహరింపబడిన పట్టులందు నిస్పృహపొందదగదు. మానసికముగ నిరాశ నొందక తన శక్తివంచన లేని విధమున ఉత్సాహముతో తన విధులను నిర్వర్తించుచుండవలయును. మానవుడు తానాసించినటుల తన ప్రయత్నములు విజయవంతము లగుచున్న పట్టున ఆ సంతోషము నిలుపుకొనజాలక ఉబ్బితబ్బిబ్బులై చెడుటయు నొక్కొక్కతఱి సంభవించుచుండును.

మానవుని జీవిత పథము వాని యధీనమున నుండదు. అది దైవాధీనము. ఏ జీవి కేయే రూపమున నెప్పుడేమాత్రము ప్రసాదింపవలయునో ఆ ప్రభువునకే యెఱుక. మానవుడెంత అటమటించిననంతకంటె ఆవంతయైనను అధికముగ లభ్యపడదు. భక్తిపథమున పురోగమించుచున్నవారయ్యును కొందఱు తమ అనర్హతలను లోపములను గుర్తించుకొనలేక తమ కలవికాని పనులను సాధింప, తమ హృదయ కామితముల సంతృప్తి పఱుపదలచి, వివేచనా బుద్ధిని గోల్పోయి తమకు మించిన వానికై ప్రాకులాడి చెడినవారునుగలరు. అట్టివారు శీఘ్రముగ శ్రీసాయీకరుణను గోల్పోవుదురు.

అట్టివారలాకాశ సౌధములను నిర్మించుకొనుచు నిరాధారులై యటమటింతురు. శ్రీసాయీ పదాశ్రయమున నచట జేరజాలక స్వశక్తి నూతగ గొని, యా గగన సౌధముల కెగుర బ్రయత్నించి విఫలు లగుచుందురు. అనుభవజ్ఞులు శ్రీసాయీ అనుయాయులగువారల సమాలించి, బాబా అడుగు జాడల గుర్తింపలేక భయంకరములగు అగాధముల గూలుచుందురు. దురహంకారులై సాధుసత్పురుషుల నడకువతో ననుసరింపదలపని వారల చర్యలిట్లుండును.

వివిధశాస్త్రజ్ఞాన సంపదలను గూర్చుకొని, దురహంకారమున గర్వించువానికంటె నేకొంచెమేని మంచి తలంపులు గలిగి, యే లవమేని వివేచనాబుద్ధిగలవా డుత్తముడు. తన తొంటి నిరాధార స్థితిని మఱచి, తాను గడించిన ఆధ్యాత్మిక భాగ్యానంద లేశమును గూర్చి యుప్పొంగుచు శ్రీ సాయీప్రభువునందుగల భయభక్తులను విస్మరించువాడు ఆ మహాప్రభువు కరుణకు దూరుడగుట నిశ్చయము. అట్టివాడు సుఖసంతోషములను పొందునపుడు నిర్భయము గలిగియున్నను, కష్టదుఃఖము లలముకొనిన వేళల భయభ్రాంతుడై క్రుంగిపోవుచుండును. మొదటినుండియు నడకువతో ప్రతివిషయమున తగుమాత్ర ప్రవేశము గలిగి ప్రవర్తించుచు, బాబాయందు సకలభారముల నిలిపికొని, ఆ తండ్రి చేతిలోని యుపకరణముగ మెలగువాడు చెడడు. పడడు.

జ్ఞానజ్యోతి మన హృదయమున వెలుగుచున్నయది ఆరిపోయిన మన స్థితి యెట్లుండునో తలంచుకొనుచుండవలయును. బాబా మనకు నీతి పాఠము గఱపుటకు, తన ప్రభావమును ప్రకటించుటకే ఆ తంద్రి అటుల గావించెనని, మనమా పరీక్షలకు నిలువ నేర్చుదుమేని, తిరిగి ఆ వెలుగును ప్రసరించునని, మనము గ్రహింపవలయును. ఎల్లకాలముల మన యిచ్ఛ ప్రకారము సకలము ప్రవర్తిల్లుచుండుటకంటె నిట్టి పరీక్షలు, అంతరాయములను బాబా మనకు గూర్చుచుండుట మన క్షేమము కొఱకే యని మనము తెలిసికొనవలయును.

మానవుని ఔన్నత్యము, అర్హత, వాడు లౌకికముగ ఆక్రమించిన స్థానము ననుసరించి, ధనభోగాది సంపద్విశేషముల గూర్చి, గడించిన వివిధశాస్త్రజన్యజ్ఞానము ననుసరించి యుండదు. తగిన అడకువ హృదయమున పాదుకొని సకలమును శ్రీసాయీ ప్రభువు ప్రభావమునకే అంకితము గావించుచు, తన అకించనత్వమును దైన్యస్థితిని గుర్తింప నేర్చి యితరులు తనను గారవించి శ్లాఘించుచుండుటకంటె, వారి దృష్టియందు దానధమాధముడుగ భావింపబడుటయే శ్రేయమని తలంచువాడు, దైవదృష్టియందు ఉత్తమ యోగ్యతలు కలవాడు, "నేను శ్రీ సాయీప్రభువునకు సంబంధించినవాడను" - అను జ్ఞానము దృఢపఱచుకొన్న వాని జన్మము సార్థకము. తరువాత సకలము బాబా అభీష్ట ప్రకారము జరిగితీరును.

తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజంతమః
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

ఇట్టి నా భక్తుల ననుగ్రహింపగోరి
యే కిరీటి! వారల బుద్ధివృత్తి నిలిచి
ప్రజ్వరిల్లెడు జ్ఞానదీపంబువలన
వారి యజ్ఞాన జనితాంధకారమడతు.

(భ. గీతలు 10-11)

మనలో సాధకుడగు ప్రతివ్యక్తియు శ్రీ సాయీ ప్రభువు నెదుట తానేపాటివాడో తన ప్రజ్ఞ - పదవీ వైభవము లే మాత్రమో గ్రహించు కొనవలయును. బాబా పాదరేణువునందు శతాంశము, సహస్రాంశమునకేని సరిరాడు. అంతకంటె నధికముగ భావించెనా, వాడు పరాభూతుడగును. మనస్వల్పాతి స్వల్పస్థితిని గ్రహించి, యా 'అహంత'ను నిర్మూలించి, యీ 'నేను' అను దురహంకృతిని బాబా పాదధూళికంటె తగ్గు స్థితికి జేర్చితిమా, ఆ తండ్రి కరుణ ఆ వ్యక్తియెడ ప్రసరించును. ఆ పరంజ్యోతి వాని హృదయమున వెలుగొందును. అంతకు బూర్వము వానిని గ్రమ్ముకొనిన దురభిమాన స్వాతిశయములు పటాపంచలై భస్మీభూతములగును.

శ్రీసాయీనాథుడపుడు మనకు ప్రకటమగును. మనమెవరమో - మనమేమై యుంటిమో - ఎక్కడనుండి వచ్చితిమో ఈ 'అహంత' త్రికాములందెటుల లేనిదో బాబా మనకు విశదపఱచును. ఆ పని మన కలవికానిది. అగమ్యము. మనలో నెవనికి వాడు ఏకతముగ దిగవిడిచి పెట్టబడెనా, వాడు లేనివాడే. బాబా వానిని జేరెనా, అపుడు పునరుజ్జీవితుడే, బలవంతుడే. నూతనోత్సేకానందములతో ప్రకాశించువాడే యగుచున్నాడు. అపుడు ఆ దాటున ఉద్ధరింపబడి, బాబా ప్రేమాలింగమున జేరి పొందు ఆనంద మెంత ఆశ్చర్యకరమో గమనింపుడు! బాబా కౌగిట జేరమా, యీ సంస్కృతి మహాసముద్రమున, జీవి సంతరించు కొనిన యపారభారములచే, క్రుంగి క్రుంగి; తుదకు రూపఱుచున్నాడు.

శ్రీసాయీనాథుని ప్రేమయే మనల క్రుంగిపోనీయక పట్టుకొనుచు మన ఆవసరముల నన్నిటిని దీర్చుచు, కలుగు ఆదలనుండి కాపాడుచు, శతసహస్రాపాయములనుండి రక్షించుచున్నది. ఈ స్వాభిమానము, అహంత, స్వార్థపరత, మనల నిర్మూలము జేయునవి. శ్రీసాయీ ప్రభునందే దృష్టి నిలిపి, బాబాయందు నిర్వంచిత ప్రేమ బలుప గలిగితిమా, ఆ ప్రేమ కారణముగ భక్తుడు శ్రీసాయీ ప్రభువునందు లయ మొందగలడు. 'శ్రీసాయి' ఉన్నాడు కావుననే 'నేను'

అను వస్తువు యున్నటుల స్ఫురింపుచున్నది. 'శ్రీసాయి' లేడా 'నేను'ను లేనిదే.

శ్రీసాయీ ప్రభువు నే జీవియైన నొకపరి సమాశ్రయించి "బాబా! నేను నీవాడను" అని ప్రపత్తి చేసెనా, అట్టి తనవాని అర్హతానర్హతలను బాబా పాటింపడు. వాడు ఊహించి, ఆశించి, అర్థించబోని స్థానమును ప్రసాదించును. గురుదైవమగు బాబా బహూ కృతులకు ఆశ్రితు డనర్హు డైనను ఆ తండ్రి అపారవితరణ, శీలము, సౌజన్యప్రేమలు, కృతఘ్నులయెడనేని (బాబా అనుగ్రహ రూప బహూకృతులను పొందియు వానిని మఱచి దూరదూరముగ దొలగి పోవువారియెడనేని) సకల శ్రేయముల బ్రసాదింపక మానవు. శ్రీసాయీ ప్రభువు అపారప్రేమను తెలిసికొని ఆశ్రయించినను తెలిసి కొనలేక ఆశ్రయించినను సకల జీవములకు బలము, రక్షణము, ఆశ్రయము, విశ్రమస్థానము ఆ తండ్రి యొక్కడే యగుచున్నాడు.

ప్రార్థన:—

నిను విశ్వాస విహీనులై మఱచి, యెంతేన్ దూరదూరంబునన్
జను నీ బిడ్డల బ్రేమ జీరుదు; కటాక్షశ్రీల సారించి, ర
క్షణ గల్పింతువు; నీ పదాశ్రితుడ, జక్కన్ దిద్ది యీదీను ప్రా
ర్థన మాలింపవె! తేర్పవే! కృప; సమర్థా సాయినాథ ప్రభూ!

7. సకలమును గురుదైవమగు శ్రీసాయీ ప్రభువునకే నివేదించు కొనదగును:

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్.

దేని జేసెదవో నీవు దేని దినెదో
దేని వేల్తువో దానంబు దేని నిడెదో
యెట్టి దానిని దపమొనరింతొ, వాని
నంతయును పార్థ! యిడుమి మదర్పణముగ.

(శ్రీమద్భగవద్గీతామృతము. 9-27)

అని శ్రీసాయీకృష్ణభగవానుడు తన భక్తునకు దెలిపినాడు.

శ్రీసాయీకరుణ బడయగోరువాడు తన లక్ష్యము - ఉత్తమో త్తమ స్థానము - గమ్యము - విశ్వవ్యాపియైన శ్రీసాయీప్రభువని దృఢ ముగ విశ్వసించవలయును. ఇట్టి విశ్వాసము మన ప్రేమను పావనము జేయును. స్వార్థరూపమైన యీ లౌకిక విషయాసక్తి అంతరించును, ఏ యితరములందునేని మన మానందము నపేక్షింతుమా- భ్రమితులమై తుదకు క్రుంగిపోవుదుము. సకలమును ప్రసాదించువాడును ప్రసా దింపగలవాడును నగు ఆ తండ్రికే మనము సకలమును నివేదించు కొన నేర్వవలయును.

సకల కల్యాణ ధాముడైన శ్రీసాయి నుండియే యీ శ్రేయము లన్నియు వెలువడుచున్నవగుట సకలమునకు మూలాధారమగు ఆ ప్రభువునందే వీనినన్నిటిని సమన్వయపఱచు కొనవలయును.

శ్రీసాయీ ప్రభువు నిత్య సత్య సజీవమైన అమృతపు చెలమ. అకించనులు మహాత్ములు; పేదలు, ధనికులు; ఉన్నతపదస్థులు, అధోగతులు; ఆ చెలమనుండియే జీవామృతమును చేదుకొను చుందురు. ప్రేమోత్సాహములతో నిర్వంచిత బుద్ధితో దానిని సేవించు వారు వారి భావసదృశమగు శ్రీసాయీకరుణ బడయుదురు.

శ్రీసాయీ భగవానునుండి ప్రకటమైన యీ లౌకిక వస్తువు లనే శ్లాఘించుకొనుచు, స్వప్రయోజనార్థము వినియోగించు వాడు సత్యానందము బడయజాలడు. హృదయ వైశాల్యత గనడు. అట్టివాడు

లౌకిక విషయసాగరమున మునిగి తేలుచుండును. ఎట్టి సద్విషయ మేని యెట్టి ఘనతగాని, యే యాధిక్యతయైనను తనదియనికాని మఱి యొక మానవమాత్రునిది యనికాని, భావింపక సకలమును తన గురు దేవుడగు శ్రీ సాయినాథునకే అంకితము గావించుకొనుచుండ వల యును. శ్రీ సాయీశుడు తనయం దధివశించి యున్నాడు. కావుననే వీడున్నవాడు; శ్రీసాయీప్రభువు లేడా - వీడును లేనివాడే.

మానవుడు తనకు గలదు అనుకొనుచున్న సకలమును ప్రసాదించినవాడు భగవానుడగు శ్రీసాయీప్రభువే. దీనిని నిలువు కొని, యింతకంటె ఉత్తమస్థానము బడయుజూడుమని ఆ తండ్రి ఆదే శము. బాబా కోరునది మన కృతజ్ఞతను మాత్రమే. ఇదియే సత్యపుగు బోధ - ఈ బోధను పాటింపగలిగితిమా పృథాభిమానము - స్వపర ప్రశంసలు - అహంత మమతలు - మటుమాయము లగును. అప్పుడు శ్రీసాయీ కరుణ మనయందు ప్రసరించి, త్యాగబుద్ధి (ఇది నేను - నాది కాదు; నీవు - నీదియే) గలిగినవాడు ఈర్ష్య - అసూయల బాసి, హృదయ వైశాల్యము బడసి, స్వార్థప్రయోజనాసక్తి విస్మరించును.

సకలమును శ్రీ సాయీనాథ పదాంకితము జేయజాలినవాని ఆత్మ విశ్వవ్యాప్తమై, సకల శక్తిప్రపూర్ణమగును. శ్రీసాయీశునందే ఆనందించును. ఆ తండ్రియందే సకలాశయములు గలిగియుండును. సకల శ్రేయములకు మూలము శ్రీసాయి - ఆశించి ప్రశంసింపదగిన ఏకైక ధామము శ్రీ సాయీ - సకల విశ్వమును అనుగ్రహింపదగిన తండ్రి శ్రీ సాయి.

ఈ సందర్భమున **S. C. S.** పేజీ 256 చూడుడు. మార్వాడీ భాగ్‌చంద్ గడ్డివామి నిప్పంటుకొని నపుడు అతనికి బాబా బోధించిన విషయములు "నేను - నాది" అను విషయముల గూర్చిన బోధలు గమనింపుడు.

ప్రార్థన:—

ఇది నా యిల్లివి నాదు భూము లివి నా యీ సొమ్ములౌనంచు నా హృదియం దాసురశీలినై చెడితి, తండ్రీ! నన్ను, నా వాని, నీ పదకంజాంకితముల్ పొనర్చుకొని, తృప్తస్వాంతునై నీదు దివ్య దయాపాత్రుని జేసి దిద్దగదె! బాబా! సాయినాథ ప్రభూ!

8. ప్రాపంచక విముఖత - దైవాభిముఖతయే మధుర జీవనము:

"మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః"

స్వాంతముంచుము నా యందు భక్తి గనుము
నను యజింపుము నాకు వందనము లిడుము
ఇట్లు మత్పరాయణుడవై, యెపుడు మనసు
నిలిపి నాయందు నను పొందగలవు పార్థ!

అని ద్వాపర శ్రీకృష్ణసాయి బోధించినాడు. ఇదియే నిష్కామ కర్మ భక్తి జ్ఞాన పూర్వకమైన సంపూర్ణ శరణాగతి యగుచున్నది. ప్రాపంచక విముఖతకై మనమేమి ప్రయత్నములు గావింపవలసిన పనిలేదు. దైవాభిముఖతకై మనమెంతెంత ప్రయత్నింతుమో అంత లంతలు ప్రాపంచక విముఖత దానియంతట నదే కలుగుచుండును. శ్రీరామకృష్ణ పరమహంస తెలిపినటుల "మనము తూర్పుదిశ కెంతెంత పురోగమింతుమో పశ్చిమదిశ మనకంతంత దూరమగుచుండును." ఈ విషయము మనము లెస్సగ జ్ఞప్తియందుంచుకొనదగును.

శ్రీ సాయీ ప్రభువును గూర్చిన తలంపు మధురము. ఆ తండ్రి నుద్దేశించి కావించు ప్రతి సేవయు మధురము. బాబా మన యెడ పఱపు ప్రేమౌదార్యమాధుర్యములను గమనింపుడు! అథోగతి యందున్న మనలను నుద్ధరించినాడు. ఆ తండ్రికి దూరమై పరుగులు,

పాటిన మనల మరలించి, తన దాపునకు జేర్చుకొనినాడు. తనను సేవింపుమని, ప్రేమింపుమని, తన సన్నిధిని జేరిన మాత్ర అనుగ్రహించి రక్షింతునని, అభయ మిచ్చినాడు. ఇట్టి ప్రేమామృతవాహినిని గూర్చి మనమేమి పలుకగలము? ఎంత పలుక గలము? మన మీ లోక విషయ గ్రీష్మాతపమున సొలి స్మృతి తప్పి పడియున్న మనల గుర్తించి శైత్యోపచారముల గావించి, తేర్చి, మేల్కొలిపి, అభయ మొసగిన బాబాను ఎటుల మఱువగలము?

శ్రీసాయీమహాప్రభువు తన సేవకునియెడ పలుక నూహింప నలవికాని కరుణప్రసరించువాడు. తనవాని అర్హతలకు మించిన ఆదరణ ప్రేమలను పఱపువాడు. అట్టి కరుణా ప్రసారమునకు బాబా యెడ మన మెటుల కృతజ్ఞత దెలుపుకొన గలము. ఏమి ప్రత్యుపకృతి గావింపగలము? ఈ విశ్వమంతయు ప్రతి క్షణము సేవించు శ్రీసాయీ గురుదేవునకు అత్యల్పులమగు మనము కావింపగల సేవ యేపాటిది? తన బిడ్డలు తనకు గావింపగల సేవకు వేయి మడుంగులు ఆ తండ్రి తనవారికి సేవలు కావించుచున్నాడు. తన వారి ననుగ్రహించుటకై యీ భూమ్యాకాశముల మధ్య తన సృష్టియంతయు ఆ తండ్రి సంతతిని పలువిధముల సేవించుచున్నది. "తనవానికే సేవకుడననియు, తన ఆశ్రితుని సంరక్షించుటకు తన తలనేని వెచ్చింతు"నని బాబా తెలిపినాడు. [S. C. S. 13; 40-43 చూడుడు]

బాబా మన కనుగ్రహించిన వేనవేల బహూకృతులకు తిరిగి, మనమేమి యీయగలము? మన జీవితమున కృతజ్ఞతతో ఆ తండ్రిని స్మరించుచు, బాబా ప్రీతికొఱకు బాబా స్వరూపమైన యీ విశ్వమున మనలజేరు ఏ జీవినైన మన శక్తికొలది సంతృప్తి సంతుష్టి కలిగించుటకంటె మనమింక ఆ తండ్రి సేవ యెటుల జేయగలము? అదియు మనచేతగాదు. అట్టి బుద్ధిని శక్తిని ఆ తండ్రి ప్రసాదింపవలసినది. శ్రీసాయీనాథుడు జీవిరూపమున మనల జేరి, మన సేవ స్వీకరించుటకై డాసి మనకా సేవాభాగ్యము కలిగించినాడను తలంపుతో మన జీవితమున నేనాడేని, యే క్షణమేని సేవ జేయగలిగితిమా

మనము ధన్యులమే. కృతకృత్యులమే. ఈ విశ్వమున ఏ జీవియేని బాబాకంటె భిన్నము కాదు. శ్రీసాయీశునికంటె ప్రశంసనీయుడు, సేవనీయుడు మఱియొకడు లేడు. శ్రీసాయీ స్మరణ సంకీర్తనములు, 'శ్రీసాయీమయ మీ విశ్వ'మను బుద్ధి - మనము సర్వదా అపేక్షింప దగినవి.

మన ప్రభువు శ్రీసాయీనాథుడు. మన మా తండ్రి సేవకులము. వినయ విధేయతలతో బాబాను సేవించుట మన విధి. మనము కోరదగినది అదియే. మన యీ సేవాకార్యము నిర్వర్తించుటకు దగిన శక్తిని ప్రసాదింపుమని ఆ తండ్రినే ప్రతిక్షణము ప్రార్థింపవలయును. శ్రీసాయీనాథుని సేవకొఱకు బాబా ప్రేమానుగ్రహముల కొఱకు ఎవ్వడు ఈ లౌకిక దైహిక సుఖాపేక్షలను త్యజింప జాలునో వాని జీవితము మధురాతి మధురమై శ్రీసాయీ కరుణ సంపూర్ణముగ బడయగలడు. వాడు మానసిక సుఖ శాంతి స్వాతంత్ర్యములను బడయు గలడు.

[S. C. S. శ్రీసాయీనాథ బోధామృతము - పేరా - 137, 138, 139 సోదర సోదరీభక్తులు, నిత్యము పఠించి స్మరింపదగినది. శ్రీసాయీప్రభువు తాను స్వయముగ ఆచరించినది - తాను తనవానికి బోధింపజాలినది విశదపఱచినాడు. పేరా 138.

"గురుదేవుని కరుణారసార్ద్ర దృష్టియే ఆశ్రితుడగు శిష్యునకు షడ్రసోపేత భోజనము.

పేరా 139.

"ఈ సుబోధ నీ మనసున పాదుకొలుపుకొందువేని నీ జీవితము ఈ కలకండవలె మిక్కిలి మధురమగును." అని హేమాద్రి పంతుతో బాబా తెలిపినాడు.

ప్రార్థన :—

శ్రీసాయి సేవ! నీ చెలిమిని జీవి, ప
విత్రుడు ముక్తుడై వెలయగలడు
శ్రీసాయి పదభక్తి! నీ సంగతిని జీవి
భవ్యుడు సాధువై వరల గలడు
శ్రీసాయి ప్రేమ! నీ వ్యాసంగమున జీవి
నిశ్శ్రేయస పదాప్తి నెగడ గలడు
శ్రీసాయి కరుణ! నీ సంబంధమున జీవి
చిరసుఖానంద మార్జింపగలడు
సాయినామమ! నీదు సంస్మరణ కతన
వివిధ పురుషార్థముల, జీవి వెలయగలడు
సాయిగురుదేవ సక్తియే సరణి గనిన
వ్యక్తి మధుర జీవిత సిద్ధి బడయగలడు.

9. స్వాతిశయ - స్వార్థపరతల త్యజించి సాధకుడు తన కామితముల తన అధీనమున నుంచుకొన దగును:

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే.

ప్రకృతి గుణములచే జేయబడెడు సర్వ
కర్మములను గూరిచి యహంకారమునను
మూఢచిత్తుడు పలువిధములను లోన
దాను గర్త నటంచును దలచుచుండు.

(శ్రీమద్భగవద్గీతామృతము, 3-27)

స్వప్రయోజనాసక్తిని మాని శ్రీసాయీనాథునకు సమ్మతము లగువానినే మనము కోరుకొనవలయును. ఆ తండ్రి యిచ్ఛించినటుల

అనుసరించువారము కావలయును. వివిధములగు తలంపులు, కాంక్షలు మనల నలముకొని వానికై పరుగులెత్తింప జేయును. స్వీయ లాభము నాసింపక శ్రీసాయీప్రభు గౌరవము నిలుపుటకే మన మా కామితములకు చలింపరాదు. శ్రీసాయీ ప్రేమ గోరుదుమేని బాబా మనకు ప్రసాదించిన వానితో సంతృప్తిసంతుష్టులను బడయవలయును. ఏ విషయము నందైన స్వార్థపరత గలిగెనా అది మనలను కలంచి అధోగతిపాలు చేయును. మనకు మంచిది అని స్ఫురింపజేయు కోరిక నైనను వెంటనే ఆశించరాదు. మనకు అసమ్మతమై తోచుదాని నైనను వెంటనే మానరాదు. ప్రతి విషయమును సావధానముగ యోజించి త్వరపడక ఆచరింపదగును. మనకు మంచిది అని తోచి నది యితరులకు వెగటు కావచ్చును. మనకు అసమ్మతముగ గోచ రించునది పలువురకు సమ్మతము కావచ్చును. కావున మన నిత్యా చరణయందు ఏ పని చేయబూనినను మనము కర్తలము అని భావిం పక శ్రీసాయి భగవానున కధీనమనస్కులమై ఆ తండ్రి చేతిలోని ఉపకరణముగ ప్రవర్తింప నేర్వవలయును. ఇంద్రియముల కధీనముగ ఈ మన దేహమును ప్రవర్తింపనీయక మనహృదయస్థాయియైన శ్రీసాయీ అధీనమందుంచ వలయును.

నిరంతరము మనస్సునందు శాంతి సహనముల నలవరచు కొని కామ వికారములకు లోనుగారాదు. మన జీవితమున ప్రతి క్షణము ప్రతి సంఘటనము అశాంతి - అసహనముల గలిగించు చుండును. మనప్రయత్నమువలన శాంతి సహనములు కలుగవు. స్వల్పవిషయములకే మన మశాంతి పొందిన ఘోరకష్టముల నెదుర్కొ నుట దుర్లభము. ఇంద్రియార్థముల కాశించి పరువులెత్తక ప్రాపంచక కష్టములందు శ్రీసాయీప్రభు గౌరవము నిలుపుటకొఱకు - మన కామితముల బడయుటకు గాదు, వానిని సైపవలయును. మన కష్ట ములు దైవికములైనవా, బాబా మనయందు సత్పరివర్తనము గలిగిం చుటకై కూర్చినవిగ సహింపవలయును.

ఈ ప్రపంచమున నే విధమైన కష్టములు లేనివారు కలరని మనము తలంచరాదు. మన దృష్టియందు అగర్భ శ్రీమంతులు - సుఖ సంతోష భాజనులుగ బొడకట్టువారిని ప్రశ్నింతుమేని మన భావనకు విరుద్ధమగు సమాధానము మనము పడయుదుము. కాని, వారు పడయు సుఖసంతోషముల ముందు వారి కష్టములు వారికొక లెక్క లోనివికావని మనమెంతుము. ఈ ధన సుఖ భోగభాగ్యములన్నియు మనము చూచు చుండగనే కప్పురమువలె హరించిపోవును. వ్యసన భయాందోళనలులేని జీవి యీ విశ్వమున లేడనియే చెప్పదగును. జనులు తఱచుగ సుఖసంతోషదాయకములని ఊహించిన వానినే భయవ్యసన మూలములని కాలక్రమమున గుర్తించుదురు. సుఖ సంతోష దాయకములని భావించునవి యెల్ల నస్థిరములు, అసత్య ములు. ఇతరులకు ఈర్ష్య, అసూయలను కలిగించునవిగ మనము తెలిసికొనదగును. సాధారణముగ మానవులు భ్రాంతులు, అజ్ఞానాంధు లగుటచే సత్యమును తెలిసికొనలేరు. ఈ జీవితమున తుచ్ఛములు, క్షణికములగు భోగముల కాశపడి శాశ్వతముగ ఆత్మవినాశనము గల్పించుకొందురు.

కావున శ్రేయస్కాముడు ఈ ప్రాపంచక కామితములకై పరువులెత్తక యిట్టి తృష్ణల నడంచుకొని శ్రీసాయి భగవానునందే హత్తుకొనవలయును. బాబా మనకు హితకరములగు హృదయ కామిత ములను ప్రసాదించి తీరును. అపుడు సత్యశాశ్వతానంద సుఖశాంతు లను బడయగలము. తొలుదొలుత మనము కొన్ని కష్టములను సహించ సిద్ధపడ వలయును. శ్రమల కోర్వజాలమేని శాంతిలేదు.

ఆధ్యాత్మికాభ్యున్నతికై మనము కావించు కృషికి మనయందు చిరకాలము పాదుకొనియున్న అలవాటులు తొలుత ప్రతిఘటించు చుండును. శ్రేష్ఠములైన మన అభ్యాసములవలన నికృష్టములగు మన పూర్వపు టలవాటులు క్రమముగ నశించును. మన యింద్రియ

ములను తొలుత గొణుగుకొనుట సహజము. కాని మన హృదయ స్థాయిగ నిలిపికొనిన శ్రీసాయీ సన్నిహిత బలమున ఈ యింద్రియ ములను అధీనములగును. పూర్వమునుండి మనలబట్టి పీడించుచున్న మాయాపిశాచి శ్రీసాయీ ప్రభునందు మనము బుద్ధి నిలిపి ప్రార్థించిన కొలది అది మనల విడనాడి దూరదూరముగ పాఱిపోవును. సర్వజన హితప్రదములైన కార్యాచరణమున మన మేమఱక యెల్లవేళల మనము మగ్నులమైయుండుట నేర్చితిమేని ఆ మాయాపిశాచి మన దఱికి జేర సాహసింపదు.

చూడుడు:— S. C. S. పేరా 117 శ్రీసాయీనాథ బోధా మృతము. నవవిధ భక్తులను అన్నిగాని, కొన్నిగాని లేక ఏ విధమగు భక్తియొక్కటేని మనము గాఢముగ అలవరచుకొనిన యెడల మనము మాయా పిశాచి వాగురలలో జిక్కుపడము.

ప్రార్థన:—

సాయీప్రభూ నీదు చేయూత నుపసంహ
రింతువేన్ వీనికి శాంతియున్నె?
దేవ! మార్గంబు నిర్దేశించు చుండవేన్
ముందున కడుగిడు బుద్ధియున్నె?
ప్రాపుగ నిలిచి సంరక్షింప కుందువేన్
ఆత్మరక్షణకు ధైర్యంబదున్నె?
నిష్ఠయు క్షమయును నిలుపగ జూడవేన్
జడుడైన వీని కా శక్తియున్నె?
శాంతి సద్బుద్ధి ధృతియు నిష్ఠయును గూర్చ
నీవు దూరమౌదేని యీ "నేను" - లేడు.
అఖిల చేతనాఽచేతన వ్యాపి వీవ
సత్కృకరుణా స్వభావ! శ్రీసాయిదేవ!

10. నిరంతరము మన ఆశయములను శ్రీసాయీ ప్రభువునకు దెలుపు
కొన దగును.

"జానామి ధర్మం నచమే ప్రవృత్తిః
జానా మ్యధర్మం నచ మే నివృత్తిః
శ్రీసాయిదేవేన హృదిస్థితేన
యథా నియుక్తోఽస్మి తథా కరోమి"

( శ్రీ సాయీ మననము - 100 )

ఎఱుగనయ్య! ధర్మంబు - ప్రవృత్తి నెఱుగ
నెఱుగబో నధర్మంబు - నివృత్తి నెఱుగ;
హృదయపీఠంబునందు వసించు సాయి
యెట్టుల నియమించు నటుల వర్తించువాఁడ.

(శ్రీసాయీ మననము - ప్రథమ సర్గము 128)

శ్రీ సాయీ మహాప్రభువును నిరంతరము మన మీ విధ
మున బ్రార్థింపవలయును.

"శ్రీ సాయీ ప్రభూ! ఈ పని నీకు సమ్మతమేని దీనిని
నిలుపుకొన నిమ్ము! ఈ నా కోరిక వీని కాత్మోజ్జీవనము ప్రసాదింతువని
తలంతువేని దీనిని సమకూర్పుము. బాబా! ఇది వీనికి హానికరమైన
యిట్టి కామితమునకు విముఖుల గావింపుము. నా హృదయమునుండి
ఆ కోరికను తొలగింపుము. ఏది హితకరమో, ఏది యహితమో నిర్ణ
యించుకొనజాలనివాడను. స్వామీ! వీని కేది క్షేమకరమో నీ వెఱుగు
దువు. నీ యిచ్ఛానుసారము ప్రతి విషయము ప్రవర్తిల్లనిమ్ము. నా
తలంపుకాదు. నీ సంకల్పమే కానిమ్ము. నీ వేది యెప్పు డేమాత్ర మను
గ్రహింప దలంతువో ఆ విధముగ ప్రసాదింపుము. నీ బిడ్డ ననిపించు
కొనుటకు - నీ పేరు నిలుపుటకు దగిన యోగ్యతను ప్రసాదింపుము.

వీని నెక్కడ నెటుల నిలుప దలతువో అచట నట్టుల నిలుపుము. వీడు నీ జేతిలోని ఉపకరణము. నీ యిచ్ఛించునటుల వినియోగించుకొని ప్రవర్తింపజేయుము. నీ సేవకుడను - కింకరుడను నీ పనుపు శిరసావహింప సిద్ధుడను. నా కొఱకై జీవింప వాంఛలేదు. నీ కొఱకే జీవింప దలతును. ఈ నా పూనికను చక్కగ నిర్వర్తింపజేసికొననిమ్ము!

ఓ దయామయా! శ్రీ సాయీ ప్రభూ! నీ కరుణను ప్రసాదింపుము. నీ కరుణయే ఊతగా గమ్యము జేరువరకు వీని జీవయాత్ర సాగించుకొననిమ్ము. నీకు అభిమతము ప్రియమైన దానినే కోరి పడయ నిమ్ము. నీ తలంపే వీని తలంపు కానిమ్ము. నిన్నెల్లవేళల నా బుద్ధి ననుసరింప నిమ్ము. నా సమ్మతి నా అసమ్మతులను నీకు అనుగుణ్యముల గావింపుము. ఈ ప్రాపంచక విషయములకు తృణీకరించి, వానినుండి విడివడిన వాని గానిమ్ము. నీయందే విశ్రమించి, హృదయ శాంతి నీయందే పొందువాని గావింపుము. వీని హృదయ శాంతిధామము నీవే. నీకు దూరమైన జీవచయము అశాంతి నొందును. సచ్చిదానందధాముడవగు నీయందే వీనిని నిరంతరము విశ్రమింప నిమ్ము! శ్రీ సాయీనాథా! నీకు వేవేల నమస్కృతులు.

( పంచమ పాదము సమాప్తము )

ఓమ్

# శ్రీ సాయీ అనుసరణము

## షష్ఠ పాదము

1. శ్రీ సాయీ ప్రభువును దృష్టియందుంచుకొని తాత్కాలిక కష్టములను సైచవలయును:

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహకశ్చన
నచాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః.

కర్మజేసిన ఫలమేమి కాంచతతడు
కర్మజేయమి కిడేమి కాంచ, దట్టి
బ్రహ్మవేత్తకు సర్వజీవముల వలన
నే ప్రయోజనమైన లే దింద్రతనయ!

(భగవద్గీతామృతము 3-18)

బ్రహ్మజ్ఞుడగు సాధుసత్పురుషుడు ఏ పని గావించినను అది విశ్వశ్రేయము కొఱకే యగుచుండును. అట్టివారికి స్వార్థపరత - స్వప్రయోజనము - అనునది వారు కావించు పనులలో లేశమేనియు నుండదు. వారు భాషించు ప్రతివాక్కును - కావించు ప్రతికార్యము జనములకు ప్రబోధ కల్పించునదియే యగును. ఆ విషయము శ్రేయస్కాములగు సాధకులకు మాత్రమే బోధపడును. కాని, యితరులకు ఐహిక విషయలంపటులకు బోధపడదు. శ్రీసాయీనాథుని జీవితమును సావధానముగ గమనించిన బాబా ఎంత సహనముతో తనకు గలిగిన కష్టములను, తననుగూర్చి కావించిన అవహేళనములను, నిందలను, ఎటుల సైచినాడో విశదము కాగలదు.

"స్వయం విప్రకృతో బాలైః నైవాఘం తదచింతయత్"
1 తాంబూలీ 2 మౌలీ 3 భాటేభి 4 నానావల్యాదిభిస్తథా"

(సాయీ మననమ్ - తృతీయానుబంధము - శ్లో 14)

బాలకులు బుద్ధిమాలి నిన్ భంగపఱుప
వారి నెల్లఱ గృప క్షమింపంగబోవె?
అతుల మౌల్విప్రముఖులును వ్యధలగూర్ప
సైచినాడవు సద్భావ! సాయిదేవ!

(శ్రీసాయీమననము - తెనుగు 90)

1. తాంబూలీ = దుండగీడు. 2. మౌల్వీ = మౌలానా జవర్ ఆలీ, 3. బాలాసాహెబ్ భాటే. నానావలీ. S.C.S - 305 చూడుడు. 'ఏమిా నిన్నుపేక్షింతున్నా?' - గ్రంథమున వీరి విషయ ములు తెలుపబడినవి.

బాబా శిరిడికి జేరిన క్రొత్తలో బాలకులేకాదు, పెద్దవారలు కూడ బాబా ఒక 'పాగల్ ఫకీరు - ఒక పిచ్చి ఫకీరు - అని తలచినారు. బాలకులు బాబాపై రాళ్లు విసరినారు. తెలివిలేని ఆ బాలకులపై బాబా ఆగ్రహించలేదు. అనుగ్రహించినాడు. ఆ విధముగ మౌలానా జవర్ ఆలీ, తాంబూలీ, నానావలీ బాలాసాహెబ్ భాటే మొదలగువారు ...బాకు కష్టములను కలిగించి, నిరసించి, నిందించి అవహేళనము ...రు. కాని బాబా అట్టివారినిగూడ ఆగ్రహించి యెఱుగడు. ...రలను అనుగ్రహించి వారివారి ద్వేషాసూయలను భక్తిప్రేమ ...కావించినాడు. మనల ద్వేషించి బాధించువారితో ...మించవలయునో బాబా మనకు విశదము కావించి

...యీ ప్రభువు నామము, చరిత్రము, లీలలు విశ్వ ...కే ఆచంద్రార్కస్థాయిగ నిలిచియున్నవి. బాబా ఏ ...లోకుల నుద్ధరించుట కొఱకే. బాబా మూర్తాభవించిన

వేదము. వేదశాస్త్రములందు ఎందేని నెరసు కలిగిన కలుగవచ్చును గాని, బ్రహ్మజ్ఞుడు బ్రహ్మమునైన శ్రీసాయీ భగవానునందు, బాబా పలుకులందు, పనులయందు మచ్చునకైన నెట్టినెరసు కలుగబోదు.

శ్రీసాయీ ప్రభువును సమాశ్రయించి, సేవించి, యనుసరించు విధానమును గమనింపుడు! ఆ తండ్రి బోధలను ఆచరణములను లెస్సగ గ్రహించి సాధ్యమైన విధమున, శక్తివంచన లేక అనుసరించుటయే బాబాను ప్రేమించి, సేవించుటయగునుగాని, బాబా మూర్తిని పూజించిన మాత్రమున బాబాను అనుసరించిన వారముకాము. కాని అట్టి మూర్తిపూజయు వ్యర్థముకాదు. కాలక్రమమున అట్టి సాధకుడును బాబా అనుగ్రమున సన్మార్గవర్తియగును.

శ్రీ సాయీనాథుని అనుసరించుట మనకు సాధ్యమగు పని కాదు. ఆ తండ్రి ముందుగ నడచుచు, మనకు మార్గము నిర్దేశించుచు వెలుగు ప్రసరించువాడు బాబా ఆజ్ఞలను పాటించుట యందుగాని, పనుల గావించుటయందుగాని, మనము సతంత్రులమను తలంపు వహింపక మన హృదయస్థాయియైన శ్రీ సాయి చేతిలోని కీలుబొమ్మగ ఉపకరణముగ మనము భావింపవలయును. శ్రేయస్కాముడగు సాధకుడు ఆ విధముగ ప్రవర్తింప నేర్వవలయును. ఆదరణ ప్రేమలతో గూడిన విధేయత ఆజ్ఞాపరిపాలనము ఉత్తమోత్తమమైన అనుసరణము. అట్టి విధేయతగల ఆశ్రితుడైన భక్తుడు శ్రీ సాయీప్రభువునకు సన్నిహితుడై అనుగ్రహపాత్రుడగును.

శ్రీ సాయీ నాథునకు సంబంధించిన విషయములు మనము విననివి పెక్కులు గలవు. అటుల వినియు కనినవానియందైనను మనకు బోధ పడనివి పెక్కులు గలవు. విని, కనినవానియందైనను ఆచరణమందుంచుకొన జాలనివియు అనేకములు కలవు. బాబా సన్నిహితులని పేర్కొనబడినవారియందును ఆ తండ్రి ఆజ్ఞలను నిస్సంకోచముగ పాలించినవారు మిక్కిలి అరుదు. ఈ విషయమున బాబా కావించిన పరీక్షను గమనింపుడు. (S. C. S. పేరా - 619 చూడుడు.)

చావసిద్ధముగ నున్న ముసలిమేకను బాబా కత్తితో చంపు మనగ అబ్దుల్ (బడేబాబా) శ్యామా (మాధవరావు దేశపాండే) యెటుల తొలగి పోయినది, గురుదేవుని ఆజ్ఞ (మంచిదికాని - చెడ్డది గాని) పాలించుటకు కాకాదీక్షిత్ - మాత్రమే సిద్ధపడినది. ఆ ఉదంతమును గుర్తింపుడు. బాబా ఆ మేకను చంపుటకుకాదు. అట్టి ఆజ్ఞ నిచ్చినది. తనకు సన్నిహితులు భక్తులు అనబడువారిలో తన ఆజ్ఞను పరిపాలించుటకు సిద్ధపడువారెవరో నిరూపించుటకే ఆ సంఘటన కల్పించినది. ఆ మేక కొన్ని క్షణములలో చావనున్నదని ఆ తండ్రి యెఱుగును.

అది బాబా కోరికగాని - ఆజ్ఞగాని - అభిలషితముకాని ఆ తండ్రి ముఖమునుండి వెలువడిన దానిని భక్తుడగు ఆశ్రితుడు పరి పాలించి తీరవలయును. ఇక లౌకికార్థములగు ధనాదులనుగూర్చి వేఱుగ జెప్పదగినది. ఇక లౌకికార్థములగు ధనాదులనుగూర్చి వేఱుగ జెప్పదగినది యేమి కలదు? ఇచ్చువాడు గ్రహించువాడు ఆ తండ్రియే. "దదాతి - ప్రతిగృహ్ణాతి". సకలమును త్యాగము జేయ గలవాడే, త్యాగముజేయ సిద్ధపడువాడే బాబాయందు ప్రేమబఱుపజాలువాడు.

S. C. శ్రీ. పేరా 135 దైవము నెఱుగుటకు 5 సమర్పింప వలయును - అను ఉదంతము గమనింపుడు! బ్రహ్మజ్ఞానము బాబా వలన బడయగోరి బొంబాయినుండి బాబాను చేరిన ధనికుని వృత్తాంతము - బాబా కావించిన బోధ గమనింపుడు! బాబా తలంపును గుర్తించి ప్రవర్తించుట మొదటి పద్ధతి. అటుల గుర్తించి ప్రవర్తింప జాలనియెడ ఆజ్ఞలనైన పాటించి పాలించి తీరవలయును. బాబా ఆజ్ఞలు మనకు సంతోషకరములైన వానిని ఆచరించుటమేలు. అని మన తలంపులకు విరుద్ధములైనను బాబా ఆజ్ఞలగుటచే వానిని శిరసావహించి ఆచరించుట శ్రేయస్కరము. అట్టివాడే బాబా అనుచరుడు, సన్నిహితుడు, భక్తుడు అగుచున్నాడు.

శ్రీసాయీ మహాప్రభువు ప్రసాదించు శ్రేయమెట్టిదియో మనము గ్రహింపజాలము. బాబాయందు ఆశ్రితునకుగల గౌరవ

ఆదరణ ప్రేమల కనుగుణముగ ఆ తండ్రి కరుణ అనుగ్రహము వాని యందు ప్రసరించుచుండును. బాబా దర్శనము, ఆ తండ్రి విగ్రహము, చిత్రపటమువైపునకు దృష్టి మరలించిన మాత్రమున అనుగ్రహింపబడుదుము - అనుకొనువారికావిధముగనే కలుగును. బాబాను తలంచినంతమాత్రమున ఆస్వామి కరుణ ప్రసరించును అని భావించు వారికి అటులనే లభ్యమగును. శ్రీసాయినామస్మరణమే సర్వార్థ సాధకము అని విశ్వసించువారు, వారు తరించుటయే కాక యెల్లరను తరింపజేయ గలరు.

సమర్థ సద్గురు దేవుడైన శ్రీసాయీప్రభువు హృదయము పరమ పవిత్ర గంగాతరంగిణి నతిక్రమించును. ఆశ్రితుడు బాబాను తలంచిన మాత్రమున ఆ దివ్య ధునియందు అవగాహనము జేసినవాడగును. స్మరించిన మాత్రమున హృదయము పవిత్రమగును. శ్రీసాయీకరుణార్ద్ర దృష్టిప్రసరించిన మాత్రమున ఆశ్రితుడు తరించును. సకలోపనిషత్సారభూతమైన భగవద్గీతలను తన ఆశ్రితుడైన అర్జునునకు బోధించి శ్రీకృష్ణసాయి సకల రహస్యాతి రహస్యమైన ప్రబోధమును సోదరీ సోదర భక్తులు హృదయఫలకమున శిలాక్షరములుగనిలుపు కొనదగును.

"మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే".

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః"

నాదు భక్తిగలిగి, నాయందు మదినిల్పు
నను నమస్కరింపు, నను యజింపు;
నన్నె పొందగలవు; నాకు ప్రియుండవై
తివి; యథార్థమిది - ప్రతిజ్ఞ జేతు.

అఖిల సాధనముల త్యజియించి, ననుమాత్ర
మీవు శరణు గనుమి; యేను నిన్ను
బాండవేయ! సకలపాప విముక్తు గా
వింతు నిజము; విడుము వంతలెల్ల.

(శ్రీమద్భగవద్గీతామృతము. 8-65, 66)

అని శ్రీకృష్ణ భగవానుడు తెలిపి, యీ అతి రహస్యమైన విషయము మిక్కిలి ప్రియుడవైన నీకు దెలిపితిని. దీనిని భక్తులు కానివారికి, నన్ను ద్వేషించువారికి నెఱింగింపదగదని హెచ్చరించి నాడు. ఆ విధముగనే శ్రీసాయీనాథునివంటి సమర్థ సద్గురువులు తమ ఆంతరంగిక విషయములను సహజస్వభావముల నెల్లఱకు నెఱుక బఱుపరు. వారెవరికైన అతి రహస్యవిషయముల నెఱుకపఱచినయెడ దాని నితరులకు దెలుపవలదని భావింతురు. బాబా చరమక్షణమున దనకు మిక్కిలి ఆప్తుడగు 'బయ్యాజీ'కి ఏదో రహస్యము దెలిపి దాని నెవరికి దెలుపవలదని శాసించి, మహాసమాధి నొందెను ["ఏమీ! నిన్నుపేక్షింతునా?"" గ్రంథమున "చరమలీల" చూడుడు] ఆ కారణముచేతనే భగవానుడు గీతలందిటుల దెలిపినాడు.

"యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం"
"జయామనీ జైసాభావ్ తయాతైసా అనుభావ్"
భావసదృశ మనుభవమును గూర్తువు
సేవకజనులకు జిద్విలాసుడవు. (త్రికాలసేవ)

కావున ఆశ్రితులగు భక్తులు బాబాయెడగల గౌరవాదరణ ప్రేమలకు సదృశముగ ఆ తండ్రి కరుణకు పాత్రులై ఆయామాత్ర సత్ఫలముల బడయుదురు. S. C. S. పేరా 121) బొంబాయినుండి వచ్చి దర్శనము చేసికొనిన ఒక కాంత సంసారము - జనన మరణములనుండి విముక్తి గోరినపుడు బాబా తెలిపిన విషయములను గమనింపుడు. శ్రీసాయీనాథుడు ప్రత్యక్షదైవము, అపాంతరాత్మ, ప్రకటమైన అంతరాత్మ - అను విశ్వాసము లేనివారి కేమి తెలిపినను ప్రయో

జనము కలుగదు. అట్టి ప్రత్యక్షదైవమును చూచియు ఆ తండ్రి యొక్క సామాన్య వ్యక్తిగ భావించువారికి - గురుదైవమునందు విశ్వాసము లేనివారికి యెన్ని జన్మములకైనను విముక్తి దుర్లభము.

సమర్థ సద్గురు దేవుడగు శ్రీసాయీ ప్రభువువంటి సాధు సత్పురుషులయెడ ఆదరణ ప్రేమ గౌరవములు బలుప జాలు ఆశ్రితులగు భక్తులకు సందేహసంకోచములకు, ఆందోళనములకు తావు గలుగదు. ఇక వారెరుగ వలసినది - తెలిసికొనదగినది లేదు! సకలము పరిసమాప్తమే యగును. ఇంకను వారికి దైవమునుగూర్చి తెలిసికొన వలయునను కాంక్ష యేమేని శేషించినదా - వారు శ్రీ సాయీ ప్రభువు యొక్క సర్వసమర్థతలను (సర్వజ్ఞత్వ సర్వవ్యాపకత్వాదులును) సందేహించువారే యగుచున్నారు. సమర్థ సద్గురుదేవుడగు శ్రీసాయీ నాథుని సమాశ్రయించిన వారికిక ముక్తి విషయమై సందేహింపవలసిన పనిలేదు, మోక్షవిషయము తలంప నక్కఱ లేదు. ఆ తండ్రి మనల నెట్టినరకమున నుంచదలచినను అట్టి స్థితి వేయి మోక్షముల కంటె శ్రేష్ఠమైనదే.

"దివివా భువివా మమాస్తువాసో నరకేవా నరకాంతక ప్రకామం"

(ముకుందమాల)

భగవాను డీ విశ్వమున ఆయా దేశముల నాయా కాలముల అవతారపురుషులుగ, బ్రహ్మజ్ఞాన సాధుసద్గురువులుగ అవతరించినాడు. వారివారి వృత్తాంతములను మనము వివిధ భాషలలో చదివి, విని, తెలిసికొనుచున్నారము, వారిలో నెవరిని సమాశ్రయించి సేవించినను తరింపగలము. వీరందరిలో న్యూనాధిక్యతలు లేవు. వీరందఱు భగవత్స్వరూపులే. ఈ అవతార పురుషులలో నెవరి నామము స్మరించినను వారివ్యక్తిత్వము, మహత్త్వము, శక్తి సమర్థతలు మన హృదయమున వెంటనే పొడమును. శ్రీసాయీనాథుడు తనను జేరిన బిడ్డలకు వారి వారి మతములనుగాని, వారు సేవించి యనుసరించుచున్న గురుదైవములనుగాని మార్చుకొనదగదని శాసించినాడు.

'వీతరాగవిషయం వా చిత్తం'

'యథాభిమత ధ్యానాద్వా'

[యోగదర్శిని - సమాధి. 37, 39]

రాగద్వేషాదులులేని వ్యక్తినిగూర్చి తలంచిన మాత్రమున మనస్సు అధీనమగును. లేక తన కభిమతమగు గురుదైవమునుగూర్చి తలంచి ధ్యానించిన మన మనస్సు నిశ్చలమై ప్రశాంతి నొందును. అని యోగదర్శిని తెలుపుచున్నది.

సమర్థ సద్గురుదేవుడైన శ్రీసాయీనామము స్మరించిన మాత్ర మున మనస్సు ఆనందసాగరమున నోలలాడును. అట్టి సంస్మరణ భాగ్యమేని బాబా కరుణా విశేషముగ మనము భావింపదగును. ఆ తండ్రిని దర్శించిన (పటమునందేని) మాత్రమున మన ఆనందము నకు మేరలేదు. (స్వప్నములందేని) ఆ తండ్రితో సంభాషించిన, బాబా మనల జేరబిలిచిన నిక బలుకదగిన దేమి కలదు? బాబా శ్రీముఖమునుండి ఆజ్ఞ యేదేని వచ్చిన అంతకంటె అదృష్టము, సౌభా గ్యము వేఱొకటి లేదు. అట్టి సుకృతముగల వ్యక్తి విముక్తినిగూర్చి లేశమేనియు దలంపడు. బాబా సన్నిహితస్థితి బొందినవానికి మోక్ష ముతో పనిలేదు. అట్టి స్థితియే శ్రీసాయీ ప్రభువునందు ఆదరణ ప్రేమలకు తార్కాణము.

ఆత్మనెఱుగదలచు మానవుడు ఆత్మజ్ఞుడు బ్రహ్మవిదుడైన సత్పురుషుని సాంగత్యమున నెఱుగగలడు. బ్రహ్మజ్ఞుని దర్శన స్పర్శన సంభాషణములచే, వారి నామస్మరణచే వారి మూర్తిధ్యానముచే సాధింపగలడు. లేక అట్టి బ్రహ్మవిదుడు ఆ జీవిపై కరుణార్ద్రదృష్టి ప్రసరించిన మాత్రమున వానియందు సత్పరివర్తనము గలిగితీరును. అట్టి సత్పురుష సాంగత్య సంసేవనా మహాభాగ్యము పురాకృత సుకృత విశేషమే యగును. ఆశ్రితుడగువా డా జన్మము నెంతవరకు పురోగమించగలడో అంతదనుక గొనిపోయి, మఱెన్ని జన్మలకైన వానిని విడువక రక్షించుచు సమర్థ సద్గురువు 'అపనాసరికాకరితత్'-

తనయంత వానిని గావించి తీరును. శ్రేయస్కామికి సద్గురు సమాశ్రయము కర్తవ్యము.

శ్రీ సమర్థ సద్గురుదేవుడగు శ్రీ సాయీ మహాప్రభువును సమాశ్రయించి యనుసరించి సాధకుడు లౌకిక పారలౌకిక విషయములందు దేనినిగూర్చిగాని ఆందోళన చెందవలసిన పనిలేదు. అట్టి ఆశ్రితుల సకల భారములను బాబా వహించి వారిని శుభ్రస్నిగ్ధ మార్గమున నడిపించుకొని గమ్యమును - పరంధామమును జేర్చితీరును.

ప్రార్థన:—

నీ పదాబ్జములందు నిశ్చలభక్తి బ్రొ
సాదింపగాగదె! సాయినాథ!
నిరతంబు నా మది నీ రూపమును నిల్పి
ధ్యానించు భాగ్యమీయగదె! తండ్రి!
నిఖిల కర్మంబుల నీ ప్రీతి కొఱకు గా
వించు బుద్ధిని ప్రసాదించు మప్ప!
త్రికరణముల సల్పు కృతుల ఫలంబు నీ
కర్పన మొనగ నీయగదె సామి!
సాధనాంతరముల నెల్ల సంత్యజించి
యిందు నిన్ను మాత్రమే శరణొందినాడు;
సకలబంధవిమోచను సలిపి నీదు
పదమునన్ జేర్చుకొనవె! బాబా! సమర్థ!

2. ఈ విశ్వమున గురుదేవుడగు శ్రీ సాయీ ప్రభువునే
ప్రియతమునిగ ప్రేమింపవలయును:

"శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత
స్తౌసంపరీత్య వివినక్తి ధీరః

శ్రేయోహిధీరోఽభి ప్రేయసోవృణీతే
ప్రేయోమందో యోగక్షేమాద్వృణీతే."

(కఠో. 1-2-2)

శ్రేయస్సు - ప్రేయస్సు - (శ్రేయమైనది - ప్రియమైనది) ఈ రెండును మానవుని జేరుచుండును. జ్ఞానియగు వాడీ రెంటిని చక్కగ పరిశీలించి, మంచి చెడుగులను విభజించి చూచుకొనును. ధీరుడు, జ్ఞానియగువాడు (ప్రేయస్సు) ప్రియమగు దానికంటె (శ్రేయస్సు) శ్రేయమగుదానినే చక్కగ వరించుచున్నాడు. (మందుడు) బుద్ధిహీనుడు లౌకిక యోగక్షేమము నందలి అసక్తివలన (ప్రేయస్సు) ప్రియమగుదానినే వరించుచున్నాడు.

శ్రీ సాయీమహా ప్రభువు ఈ లౌకిక వ్యవహారములకు రాజకీయ సాంఘిక వివాదములకు దూరమైనవాడు. భౌతిక శాస్త్రము లనుగాని, తత్త్వశాస్త్రములనుగాని పఠనపాఠన రూపములగు కృషినలిపి యెఱుగడు. ఏ గురువుల దగ్గఱ నే విధములగు విద్యల నభ్యసించి యెఱుగడు. తనను జేరి సమాశ్రయించిన బిడ్డలకు, విశ్వమానవ సమాజమునకు బాబా స్వకీయ ఆచరణపూర్వకముగ దెలిపినది. "దేవుడున్నాడు" అల్లా మాలిక్ - అతడే మహాప్రభువు; 'అల్లా మిలనా బేడా పార్ కర్‌నా - సప్తసముద్ర నిహాల్ కర్‌నా" - ఆ దేవుని జేరుట సకల బంధ నివృత్తి నొందుట - సప్తసముద్రములను తరించు టయే అగుచున్నది. దేవు నెఱుగుట, సాక్షాత్కరించుట మానవ జీవిత పరమావధి- ఏకైక లక్ష్యము కావలయును.

దానికి ఏకైక సాధనము మానవుడు త్రికరణశుద్ధిగ విశ్వ సించి, సమాశ్రయించు గురుదేవుని ప్రత్యక్షదైవముగ భావించి, సంపూర్ణ శరణాగతి జేసి, "నిష్ఠ - సబూరి" - (ప్రగాఢవిశ్వాసము, ధైర్య-సాహ సములతోగూడిన ఓర్పు) అను రెండుకానుకలను గురుదక్షిణగ సమ ర్పించి తన ఏకైక లక్ష్యముగ తన జీవగఱ్ఱగ హృదయమున పాదు కొలుపుకొనవలయును. తన గురుదేవుని చేతిలోని ఉపకరణముగ

మెలగ నేర్వవలయును. శ్రీ సాయీమహాప్రభువు సమాశ్రయమున, శ్రీసాయీభక్తిసిద్ధాంతమున ఇదియే ఏకైక మార్గము. బాబా స్వయముగ సమాచరించి మనకు అందించిన మార్గము - 'గురుమార్గము' ఎన్ని అవాంతరములు, ఎన్ని ప్రతిబంధకములు మనల నలముకొను చున్నటుల గోచరించినను భూమ్యాకాశములు తలక్రిందులగుచున్నను, మన మార్గము, మన స్థానమునుండి తొలగరాదు.

శ్రేయస్కాముడగు సాధకుడు అపాంతరాత్మ (ప్రకటమైన అంతరాత్మ) తన ఆత్మలోని ఆత్మ, అని స్వానుభవపూర్వకముగ (ఇతరులు చెప్పుట, ఇతరులవలన వినుటకాదు) గుర్తింపజాలిన వస్తువునే గురుదైవముగ విశ్వసించి సమాశ్రయింపవలయును. అటుల విశ్వసించి తనను సంపూర్ణశరణము [తన యోగ క్షేమభర న్యాసము] గావించుకొనిన గురుదైవమునకంటె ప్రియతమము, శ్రేయస్కరము నగు వస్తువు ఇతరము విశ్వమున లేదు - అనియే భావింపవలయును. ఈ విశ్వవ్యాప్తమైన వస్తువదియే యని గుర్తించవలయును.

ప్రేయః పుత్రాద్విత్తాత్ప్రేయోఽన్యస్మాచ్చ సర్వస్మాత్
అంతరతరం యదాత్మేత్యుపనిషదః సత్యతాభిహితాః

నందనునికంటె స్వీయధనంబుకంటె
నితరమునకంటె మఱియునన్నింటికంటె
ఆత్మ ప్రియతరంబును మఱి యాంతరికము
ననెడి నిగమోక్తి ప్రకటితంబయ్యెనిందు.

[ ప్రబోధసుధాకరము - సగుణనిర్గుణైక్య ప్రకరణము ]

శ్రేయస్కాముడగు సాధకుడు తన అంతరాత్మయైయున్న గురుదేవుడుగ నెదుట బొడముచు నాతడే సర్వభూతాంతరాత్మగ నున్న వాడని, ఆ వస్తువే 'విశ్వాత్మ'యని గ్రహించి సేవించదగును.

ఈ సందర్భమున శ్రీ రేగే మహారాజు - శ్రీసాయిబాబా

అన్యోన్యప్రేమలు. 2. బొంబాయినుండి వచ్చిన మాస్టరు టి. బాబా అన్యోన్య ప్రేమలు - శ్రీసాయీనాథబోధామృతము పేరాలు 17, 578, 97 చూడుడు. ఆశ్రితుడైన భక్తుడు, తన గురుదేవు డెన్నెన్ని కామితములను ప్రసాదింతునని లోభపఱచినను తన గురుదైవముకంటె, ఆ తండ్రి కరుణకంటె నితరమును ఎంత అమూల్యవస్తువైనను కాంక్షింపరాదు. అను విషయము మనకు స్పష్టమగును.

శ్రీసాయీనాథు నంతటి పరిపూర్ణుడైన వ్యక్తి మఱియొకడు లేడు. బాబాయొక్క శీలవ్యక్తిత్వములనే మనము ఆశ్రయింపవలయును. మనలో ప్రతి వ్యక్తియు తన దృక్పథము ననుసరించి శ్రీసాయిబాబాను భగవానునిగనో - రక్షకునిగనో - సద్గురువుగనో - ఆదర్శమూర్తిగనో - మహాపురుషునిగనో పరిగణించి, యనుసరింపదగును. ఏదృష్టితో బాబాను సమాశ్రయించినను లోపము లేదు. పూర్వఋషులు, అవతార పురుషులు, బోధించినదానినే బాబా తన జీవితము ద్వారా, తన వారికి స్వానుభవ రూపమున ప్రదర్శించి ప్రబోధ కల్పించినాడు. శ్రీసాయీ ప్రేమప్రవాహము ఎల్ల విభేదములను ముంచివైచినది. ఎల్ల జాతుల, ఎల్ల మతముల, శాఖోపశాఖల వారలు ఏకైక ప్రేమసూత్రమున గ్రువ్వబడినారు.

శ్రీసాయీ ప్రభువెట్టి నూతన మతధర్మములను బోధించుటకవతరించినవాడు కాడు. సనాతన ధర్మమునే ఆచరణపూర్వకముగ తన బిడ్డలకు వారివారి అనుభవములను పురస్కరించుకొని గ్రహించుకొనజేయుటకే అవతరించినాడు. సనాతనాధ్యాత్మిక భావసందోహమే "శ్రీసాయీబాబాగా మూర్తీభవించినది. కాకాదీక్షిత్ (హరిసీతారాం దీక్షిత్) ద్వారా బాబా మనకు దెలిపిన రహస్యమును గమనింపుడు!

"నీవు పఠించునది లెస్సగ గ్రహింపుము - గ్రహించినదానిని మననము గావింపుము - దానిని ఆచరణమందుంచుము."

శ్రీరామ, కృష్ణ, బుద్ధ, చైతన్య, కబీర్, పరమహంస మొదలగు అవతారమూర్తులవలె, అంతకంటె విశాలమగు హృదయముగల

వాడు శ్రీసాయీప్రభువు. "మీరు సమాశ్రయించిన గురువును. మీరవ లంబించిన మతమును మార్చుకొన వలసిన పనిలేదు. గురువొక్కడే, ఆ గురువునందు గల విశ్వాసమే మిమ్ము రక్షించునది. అన్ని మత ములు సమ్మతములే. దైవమును జేర్ప సమర్థములైనవే" - అని బాబా తన బిడ్డలకు బోధించినాడు.

చరాచరాత్మకమైన యీ విశ్వమునకు ఏకైకస్థానము, విశ్రామ మైన స్థానము భగవానుడు. కావున భగవానుడైన శ్రీసాయీనాథునందే విశ్రమింప జూడవలయును. అట్టిస్థితి, భాగ్యమును ప్రసాదింపుమని బాబాను మనము ప్రతినిత్యము ప్రార్థించుచుండ వలయును. సకల భోగభాగ్యములు, కీర్తి ప్రతిష్ఠలు, సుఖానందములు మరియు మానవ దైహికముగ ఉత్తమోత్తమములని భావించునవి యన్నియు క్షణికములు. పరిణామ శీలములు, అల్పములని గుర్తించి నిత్యము, సత్యము, శ్రేయ స్కరము. పరమధామమగు శ్రీసాయీనాథుని నిండు హృదయముతో ప్రేమించి, ఆ తండ్రి పదమునందే చిరస్థిర సుఖశాంతులను బడయ నేర్వవలయును.

శ్రీసాయీప్రభువు మనకు దూరమైన, ఆ తండ్రి మనకు ప్రసాదించు త్రైలోక్య సామ్రాజ్యమైనను వ్యర్థమే. బాబా మన చెంత నుండెనా, ఇహపరముల సకలము మనకు లభ్యమైనదిదే యగును. బాబా మనకు దూరమై యెన్నెన్ని అమూల్య పదార్థములను ప్రసా దించినవియన్నియు తృణప్రాయములే యగును. మనకు సంతుష్టి, సంతృప్తి, ప్రశాంతులను ప్రసాదింపజాలవు. శ్రీసాయి మన హృదయ స్థాయియగునపుడే మనకు "అకుతో భయత్వము" సిద్ధించును. ఈ విశ్వమున దేనివలన భయములేని స్థితి సిద్ధించును. సకలము లభ్య మైనదగును.

ప్రార్థన:—

హృదయాంధకారము నెడబాపగా గదే!

సత్యప్రకాశ! విశ్వాత్మ! సాయి!
సంతత మలయించు శత్రు షట్కంబును
పరిమార్పవే! దయాశరధి! సాయి!
చలచిత్తకలితదుస్సంకల్పశతముల
నపనయింపగదె! సమర్థ! సాయి!
విషయగ్రీష్మాతప పీడిత జీవిని
దేర్పవే! కరుణార్ద్ర దృష్టి, సాయి!
నీవులేని యీ సకలంబు నిష్ఫలంబు;
వ్యసన పాపభరంబుల నడగిపడిన
జీవి బ్రేమమై నీ యెడ జేర్చికొనవె!
సత్యకరుణాస్వభావ! శ్రీసాయిదేవ!

3. శ్రీసాయీ భగవానుని వివిధ బహూకృతులను జ్ఞప్తియం దుంచుకొన దగును:

పీఛే చాహే చాకరీ - పహిలే మహినాదేయ్
తా సాహిబ శిర సాంపతే - క్యోం కస్కా తాదేయ్.

మొదట నే నెలబత్తెమును నిచ్చువాడు
పిదప నీ సేవ నపేక్షించువాడు
శ్రీసాయి; అతనికి శిరమిడి బేల!
మోసబుద్ధిని దేహమును దాచుదేల?

(శ్రీసాయీ కబీరుసూక్తులు)

శ్రీసాయీనాథుని మన హృదయ పీఠమున నిలిపికొని, ఆ తండ్రి విధించు ఆజ్ఞలను విధేయులమై అనుసరింపగల శక్తినీయుమని బాబాను మనము నిత్యము ప్రార్థింపవలయును. బాబా తలంపులను గుర్తించి, విధేయత, జాగృతి, ఉత్సాహములతో సమష్టిగను, వ్యక్తిగతముగను ఆ తండ్రి ప్రసాదించిన బహూకృతులను మఱువక కృతజ్ఞత

తెలుపుకొనుచుండవలయును. మనమెంత ప్రయత్నించినను బాబా బహూకృతులకు తుల్యముగ మన కృతజ్ఞత దెలుపుకొనజాలము. మానసికముగ - దైహికముగ - లోపల వెలుపల శ్రీసాయీశుడు ప్రసాదించిన సహజ, సహజాతీతములగు సకల శుభములను మనము తగిన కృతజ్ఞతతో పరిశీలించు కొనిన ఆ తండ్రి యెంత ఉదారుడో - ఎంత దయామయుడో మన మూహింప గలము. మనలో నొకరు అధికముగ బడయనీ - మఱియొకరు స్వల్పముగ బడయనీ ఆ తండ్రి ప్రసాదించినదే. బాబా కాక, మన కేలవమేని ప్రసాదింపజాలువారు లేరనియే మనము విశ్వసింపవలయును.

మనలో నెవరేని మహోన్నతములగు బహూకృతులను పొందిన వారు తమ అర్హతలను ఆధిక్యతలనుగూర్చి గర్వించుచు తగ్గు స్థితిలోనున్న వారిని గూర్చి క్రిందిచూపు చూడరాదు. తన అర్హతలను మిక్కిలి తక్కువజేసికొని ఏ స్వల్పబహూకృతులకేని సంతుష్టి సంతృప్తులను పడసి, శ్రీసాయీ ప్రభువునకు నిండు మనస్సుతో వినయత కృతజ్ఞతలను దెలుపుకొన నేర్చువాడు భగవానుని దృష్టియందు ఉత్తమోత్తమ భక్తుడగు చున్నాడు, ఎల్లఱకంటె మిక్కిలి అల్పుడుగ భావించుకొనువాడు ఉత్తమ బహూకృతులకు అర్హతగలవాడగుచున్నాడు. ఏ స్వల్పమో బహూకరింపబడినపుడు మనలో నెవరును నిస్పృహ పొందరాదు. వ్యసన పడరాదు. విశేషబహూకృతుల పొందినవారియెడ ఈసు వహింపరాదు. తన హృదయమును బాబావైపునకు మఱలించి, ఆ తండ్రి ఔదార్యము, ప్రేమ, కరుణ లేపాటివో, వారు వీరు అను విచక్షణలేక ఎంత వితరణబుద్ధితో బాబా తన బిడ్డల ననుగ్రహించుచున్నాడో గుర్తించుకొనవలయును.

సకలము శ్రీ సాయీప్రభువు నుండియే ప్రసరించును గావున సకలమున బాబానే మనము కీర్తింప వలయును. ఏ యే వ్యక్తి కెపుడే మాత్ర మెటులీయదగునో ఆ తండ్రి యెఱుగును. ఈతని కీ స్వల్పమేమి? అతని కా అధిక మేమి? - అని విచారింపవలసిన పని మనది కాదు. ఆ విచారణ మా మహాప్రభువుదే. ఆ స్వామి కాకున్న మఱి

ఎవ్వారు ఏ వ్యక్తి కేమి అవసరమో తెలిసికొన గలరు? కావున శ్రీ సాయీ పదాశ్రితుడైన సాధకుడు లౌకిక దృష్టిలో మహోన్నత భోగ భాగ్యసంపదలు - మానవ ప్రశంసలు కీర్తిప్రతిష్ఠలు లేకుంతుటయే శ్రీసాయీనాథుని కరుణా విశేషముగ భావించుకొని ఆ తండ్రికి కృతజ్ఞత దెలుపుకొన దగును. లోక దృష్టియందు నిరుపేదగ, అనర్హుడుగ నెంచబడువాడు తన దారిద్ర్య దుఃఖస్థితిని గూర్చి ఖేదపడరాదు. అటుల కాక ధైర్య సాహసములతో సంతుష్టి నొందవలయును. ఏలయన - సాయీభగవానుడు ఎల్లవేళల దీనులు - విధేయులు - అకించనులు - ప్రాపంచక దృష్టియందు తృణీకరింపబడినవారినే తన అంతరంగికులుగ - తన పరివారముగ స్వీకరించును. ఈ విషయము సాధకులు మఱువరాదు.

ఈ విషయమున మనకు సాక్షులు - మహల్సాపతి, శ్యామా (మాధవరావు దేశపాండే), భగోజి, అబ్దుల్ (బడేబాబా) దాస్‌గణూ మహారాజు, పురందర్, రాధాకృష్ణఆయీ, రేగే మహారాజు మొదలగు వారు కలరు. వారి విషయములు సోదర సోదరీ భక్తులు లెస్సగ గుర్తించుకొనవలయును.

ఈ ప్రపంచ మెద్దానికి (దైన్యహైన్యములకు) వెఱపు గనునో అట్టి స్థితిని వారు సంతోషముగ స్వీకరించిరి కావున శ్రీసాయీ ప్రభువును ప్రేమించువారు ఆ తండ్రి ప్రసాదించు మాత్రము స్వీకరించుచు వారు కోరదగినది బాబాతోడ ఎడతెగని సంబంధము ఆ తండ్రి ప్రేమ మాత్రమే. ఇతర భక్తులు మహోన్నత స్థానమందుండగోరగ వీరు బాబా ఆశ్రితులలో కడసారివారుగ నుండ నభిలషించినారు. అట్టివారలు మహోన్నత స్థానము నొసగిన ఎట్లుందురో మిక్కిలి హైన్య స్థానము నందుంచినను అంత సంతోష సంతృప్తుల నొందగలిగినారు. ఇట్టి మహాభక్తుల దృష్టియందు ఈ విశ్వమున నితరులు పొందు మహోన్నత బహూకృతు లన్నిటికంటె వారు త్రికరణశుద్ధిగ కోరినది శ్రీసాయీమహాప్రభువు - శ్రీసాయీ ప్రేమ - శ్రీసాయీభక్తి - శ్రీసాయీ సేవ మాత్రమే.

మనశ్శాంతిని గలిగించు ముఖ్యవిషయములు బాబా తెలిపిన యీ నాలుగు మన మెల్లప్పుడు జ్ఞప్తియందుంచుకొన దగును.

1. మనలో ప్రతి వ్యక్తియు స్వేచ్ఛానుసారముగ కాక శ్రేయస్కాముడగువాడు సూచించిన మార్గమున ప్రవర్తింప నేర్వవలయును.

2. ప్రపంచమున నేదేని అత్యధికముగ గాక తగు మాత్రము - ఎంత అవసరమో ఆ మాత్రమే కూర్చుకొనవలయును. ఆహార నిద్రాదులందు సైతము నియమము పాటించవలయును.

3. ఎల్లరకంటె తగ్గు స్థానమునే వరించుచు, అందరి కంటె కడసారివానిగ నెవనికి వాడు భావించుకొనవలయును.

4. దైవేచ్ఛ ననుసరించి మన హృదయస్థాయియైన, గురు దేవసాయి నడిపించు విధమున నడువనేర్వవలయును. ఆ విధముగ ప్రవర్తింప జేయుచున్నాడనియే భావింపవలయును.

ఈ నాలుగు సూత్రములు పాటించి, ప్రవర్తింప గలవాడు ప్రశాంత మందిరావరణమునకు జేరగలడు. ఈ నాలుగు అంశములు వెలికి మాత్రము సులువుగ గనబడుచున్నను సాధకుడు ఆచరణ మందుకొనుకొలది మహాఫలముల బ్రసాదించి తీరును. వీనిని మన హృదయమున భద్రము చేసికొందుమేని, ఎట్టి పరిస్థితులందుగాని మనము తొణకవలసిన పనిలేదు. ఏ సమయముననేని మనము అశాంతి - నిస్పృహలను పొందితిమా బాబా ఆజ్ఞలను మఱచిన వారమే అగుదుము. కావున బాబా బోధలను మఱువనీయక, ఆచరణ మందుంచుకొనునట్లు అనుగ్రహింపవే! - యని శ్రీసాయీ కరుణను సర్వదా మనము ప్రార్థించుచుండవలయును.

ప్రార్థన :—

సద్గురుదేవ! నా సన్నిధిఁ నిల్చి, దు
స్సంకల్పముల నడంచంగ! గదవె!

స్వామి! నీదు పదానువర్తినై పయనింప
దివ్యకాంతిని ప్రసాదింప గదవె!
తండ్రి! నీ బిడ్డలందఱిలోన కడసారి
వానిగా నను గణింపంగ గదవె!
దేవ నీ శ్రితునకే స్థితినేన్ మనశ్శాంతి
తలగిన నిను జేఱు తలపు నిడవె!

ఇదియ తుదికోర్కి - నీవు నా హృదిని నిలుము -
సతము నీ పదాబ్జముల విశ్వాసమిడుము -
కరుణ బఱపుచు ధృతి క్షమల నిమ్ము -
సత్యకరుణా స్వభావ! శ్రీసాయి దేవ!

4. ఇతర మానవుల ప్రవర్తనల గూర్చి పలుకుట -
వినుట తగదు:

"పిశునైః ప్రకామ ముదితాం
పరస్య నిందాం శృణోతి కర్ణాభ్యామ్
తేన పరః కిం మ్రియతే
వ్యర్థం మనుజోఽతి పాపభాగ్భవతి.

అనృతం పరాపవాదం
రసానావదతి ప్రతిక్షణం తేన
పరహానిర్లబ్ధః కా
వ్యర్థం మనుజోఽతి పాపభాగ్భవతి.

పాపజనులు పలుకు పరదూషణంబు ల
త్యాదరమున జెవుల నాలకించు
నిట్టిదాన బరుడు గిట్టునే? మనుజుడు
వ్యర్థముగను పాపభాజనుడగు.

అన్యదూషణంబు ననృతభాషణముల
బలుకుచుండు నాల్క ప్రతినిమేష
మేమి హాని పరున? కేలబ్ధి తనకగు?
వ్యర్థముగను నరుడు పాపమొందు.

(ప్రబోధసుధాకరము - విషయ నిగ్రహము)

శ్రేయస్కాముడు, శ్రీసాయీపదాంకితుడగువాడు తన దృష్టి పథమున పొడము ప్రతి విషయమును గూర్చి తెలిసికొనవలయును. అభిలాష విడవదగును. అలసభావముతో ఇతర ప్రవర్తనాన్వేష బుద్ధి వహింపరాదు. ఆ విషయ మేమి? ఈ విషయ మేమి? యని వెదకి చూడక శ్రీ సాయీప్రభువును అనుసరింపదగును. ఇతరుడేమి పలుకుచున్న - ఏమి చేయుచున్న ఎట్టివాడైన మనకేమి? ఇతరుల పలుకులకు పనులకు బాధ్యత వహింపవలసిన పని మనకు లేదు. ఎవనికి వాడు తన పలుకులకు పనులకు మాత్రమే బాధ్యత వహింపవలయును. కావున నితరుల విషయముల శ్రేయస్కాముడు చిక్కుకొనరాదు.

ఈ విశ్వమునగల సకల జీవులవర్తనముల తలంపులను, కామితములను, ఆశయములను శ్రీసాయీప్రభువు తెలిసికొన జాలును. కావున మన తలపులు పనులు ఆశయములు శ్రీ సాయీనాథునందే హత్తుకొన వలయును. కావున మన అశాంతి, అందోళనములను దూరము కావించి ప్రతిపదమున నమ్రత శాంతులను హృదయమున పాదుకొలుపుకొన దగును. ఇతరుల తలపులు, పలుకులు, పనులు వారినే కలంచును. శ్రీసాయీనాథు నెవడు కనుబ్రాామి మెలగ జాలడు. కావున సాధకుడగువాడు లౌకికములగు పేరుప్రతిష్ఠలకు - పలువుర మిత్రులగూర్చుకొని వీరి వారి సంకుచిత ప్రేమలకు ప్రశంసలకు ప్రాకులాడ దగదు. ఇట్టివి హృదయమును కలంచి కళంకితము గావించును. శ్రీసాయీశుడే స్వయముగ తన ఆశ్రితునకు శ్రేయో విధానము నెఱుక పఱచును. తనను గూర్చిన గోప్యవిషయమును దెలుపును. నమ హృదయకవాటమును తెఱచియుంచుకొని ఆ ప్రభువు

రాకను గమనించి స్వాగతమీయ నేర్వవలయును. సకల విధముల జాగ్రత వహించుచుండవలయును.

ఎట్టి కఠిన సమయములందైనను స్వార్థపరత - స్వాత్మ ప్రశంస- పరనిందాదులకు పాల్పడరాదు. ఈ సందర్భమున పాఠకులగు సోదరసోదరీభక్తులు - 'శ్రీసాయీనాథ బోధామృతము' S. C. S. పేరా 295, 296 సావధానముగ జూడ దగును.

ప్రార్థన :—

పరవృత్తంబుల నాలకించుటయు, సంభాషించుటల్ దూరుటల్
పరభాగ్యోన్నతి కీసు, దుస్సహన భావంబూనుటల్ వాపి, నీ
చరణాబ్జంబులయందు దృష్టినిడి, నీ జాడల్ విలోకించుచున్
చరియింపందగు బుద్ధిశక్తు లిడవే! సాయీశ! భక్తప్రియా!

5. హృదయమున శాంతి - సత్యమగు ఆధ్యాత్మిక భావోదయము:

సాధూ ఐసా చాహియే - జాకాపూరనమంగ్
విపతిపడే ఛాడే నహి చఢే చౌగుణా రంగ్.

పరిపూర్ణ సంతోషవారిధి మునిగి
పొరిపొరి నాపదల్ పొసగిన జెలగి
ఒనర నాల్గు మడుంగు లుత్సాహ మూని
తన పూన్కి నెఱపు నాతడె సుమ్మి జ్ఞాని.

(శ్రీసాయీ కబీరు సూక్తులు)

శ్రీసాయీ మహాప్రభువు ప్రసాదించు శాంతి శాశ్వతము - సత్యము, సంపూర్ణము. అది ప్రాపంచక విషయము లొసంగునట్టి సుఖ శాంతి కాదు. సకల జీవములు కోరునవి సుఖ - శాంతి - ఆనందములే కాని, సత్య శాంతికి సంబంధించిన విషయములను జనములు పరిగణింపజాలరు. వినయ విధేయతలు కలిగిన నిర్మలహృదయులకే బాబా పరమశాంతిని ప్రసాదించును. శ్రీసాయీనాథుని ప్రబోధములను

పాటించి ఆస్వామి పిలుపు నాదరించి అనుసరించు సాధకునకే అట్టి సత్యశాంతి లభ్యమగును.

ఈ విషయమున బాబా బోధను గమనింపుడు! "ప్రతిపద మున నిన్ను నీవే పరీక్షించుకొనుము. నీవు త్రికరణముల నేమి కావించుచున్న నన్ను సంతోషపెట్టునదియే కావలయును. నిరంతరము ప్రతివిషయమున నన్ను సంతృప్తి పఱచుటయే నీ యేకైక లక్ష్యమై యుండవలెను. నన్ను కాదని నీవితరమును దేనినైన ఆశింపకుము. ఆసక్తి వహింపకుము.

ఇతరుల పలుకులను పనులను గూర్చి త్వరపడి నిర్ణయించు కొనకుము. నీకు విధింపబడనివియు నితరులకు సంబంధించిన పను లందు నీవు జోక్యము గల్పించుకొనకుము. ఈ విధముగ నీవు ప్రవ ర్తింతువేని నీవు కందవు - కుందవు - పడవు - చెడవు. ఎట్టి సంద ర్భముననేని మానసిక, దైహిక వ్యాకులత వహింపదగదు. నీ దృష్టి యెల్లవేళల శాశ్వతసుఖ శాంతులందే లగ్నము కావలయును. ఆపద లందు లేములందు పరమశాంతిని బొందితినని కాని, నీ తలంపు ననుస రించి సకలము జరుగుచున్న పట్టున పరిపూర్ణత బొందితినని కాని, నీవు భావించుకొనరాదు. మిక్కిలి భక్తితత్పరత నీయందు స్ఫురించిన నిన్నుగూర్చి నీవు మిక్కిలిగ శ్లాఘించుకొనరాదు. భగవానుని దృష్టి యందు ప్రత్యేక ప్రేమపాత్రుడవైతివని గర్వము వహింపరాదు. ఏలన- ఇట్టి పరిణామముల వలన సత్యప్రబోధము గలిగి, పరమశాంతి స్థాన మును జేరుకొని సద్గుణ విశిష్టుడవైనటుల నిర్ణయించుకొనరాదు. ఆధ్యాత్మికోన్నత స్థితి-పరిపూర్ణత లిట్టి యనుభూతులందు లేవు.

ఆధ్యాత్మికోన్నతస్థితి - పరిపూర్ణత్వమెందు గలవనిన ఇహ పరములందే విషయమున (స్వల్పముగాని, అధికముగాని) స్వార్థ ప్రయోజనాసక్తి నిశ్శేషముగ విడనాడగలిగి, నిండు మనస్సుతో నాకే చ్ఛకు సర్వసమర్పణము గావించి, కష్టసుఖములందు, కలిమిలేము

లందు సమదృష్టిగలిగి, దైవవిధానములను కృతజ్ఞతాపూర్వకముగ స్వీకరించుచు చలింపబోనివానికి కలదు. అట్టి ధృతి క్షమలు కలిగి, ఆంతరంగిక సుఖశాంతు లుపసంహరింపబడినపుడు, నంతకంటె నధికములగు పరిస్థితుల నెదుర్కొనుటకు సిద్ధపడుచున్నను నిన్ను నీవు సమర్థించుకొనక (సాత్విక ప్రవర్తనము గలిగియున్నను దైవము అక్రమముగ కష్టములు గలిగించుచున్నాడని తలంపక) యేది యెటుల పరిణమింప జేయుచున్నను దైవవిధానమునే సమర్థించుచు, పరమ పవిత్రమైన దైవనామమునే గీర్తింప నేర్వవలయును. అపుడు నీవు ఋజువైన సత్యశాంతి పథమున జరించుచున్నవాడగుదువు, పిదప నీవు యథార్థముగ నన్ను జేరుకొని ఆనందింతువు. 'నేను' అను భావము నిర్మూలించుకొన నేర్చితివా నీవు ఇంత దనుక శ్రమించిన యాత్రాఫలము, పరమ సచ్చిదానంద సుఖశాంతి ధామమును బడయ గలవు. శ్రీసాయీప్రభువు పదాశ్రితు లీవిషయముల మనస్సున స్థిరముగ నిలుపుకొనదగును.

6. ప్రాకృత (లౌకిక) ప్రేమ - పరమశ్రేయస్సునకు ప్రతిబంధకము:

"నకర్మణా - నప్రజాయా ధనేన
త్యాగేనైకే అమృతత్వ మానసుః" (కైవల్యోపనిషత్తు - 3)

కర్మములచేత, ఉన్నత జన్మముచేత (ప్రజలవలన) ధనముచేత పరతత్త్వ ప్రాప్తి కలుగదు. త్యాగముచేతనే అది లభ్యమగును.

సర్వము బడయుటకు సర్వమును గురుదేవునకు సమర్పణము గావింపవలయును. ఈ సమర్పణమున నేవేని కొన్ని మన అధీనమందున్నటుల తలంచరాదు. సర్వకర్మ ఫలత్యాగము - సర్వ సంగ పరిత్యాగము కావలయును,

స్వార్థప్రయోజనాత్మకమైన ప్రేమ యీ ప్రపంచమున నన్నిటికంటె మనకు హాని గూర్చును. లౌకికమగు నే వస్తువునందైన

మనము పఱవు వాత్సల్యములు, అవి మనల విడనాడక అంటుకొని యుండునట్లు చేయును. మన ప్రేమ పవిత్రము, సహజము, సామాన్యము, క్రమబద్ధమైనయెడ ఆయా వస్తుబంధములందు దగుల్కొనము. మనకు తగని, అర్హతలేని, ధర్మవిరుద్ధమైనదానిని గూర్చుకొన జూడరాదు. అంతరంగికస్వాతంత్ర్యమును జెఱచి, మనల వశీకరించువాని యందాసక్తి వహించరాదు. మనకు దగని, సాధ్యముగాని వాని యందాసక్తి వహించితిమా, నిండు మనస్సుతో గురుదేవునకు శ్రీసాయీ ప్రభువునకు సంపూర్ణ శరణాగతి, సమర్పణము గావింపజాలము. ఇటుల జేయలేక పోవుటే ఆశ్చర్యము! వ్యసనములకు లోగి మనల నిరసించుకొన నేల?

సకలము శ్రీసాయీ ప్రభువునందు నిలిపి, ఆ తండ్రి యిచ్ఛను గ్రహించగలిగిన మనకెట్టి యిక్కట్టులు ప్రతిబంధకములు కలుగవు. దీనిని, దానిని లాభసుఖానందముల బడయ జూచితిమా మానసిక వ్యథలు వీడవు. శాంతి గనలేము. ఏలన ప్రతి విషయమున ఏదొక కొఱత, లోటు పొడముచునేయుండును. ప్రతిస్థానమున మనల ప్రతిఘటించు వారలుండనే యుందురు. మానవుని శ్రేయము బాహ్యవస్తుజాలమును సేకరించుకొని పెంచుకొనుచుండుటలో లేదు. దానియందు విరక్తి బూని, హృదయమునుండి యా వస్తుసేకరణ కాంక్షను నిర్మూలించుకొనుటలో కలదు. సంపదలందు, కీర్తిప్రతిష్ఠలందు లోకమున జనుల ప్రశంసల బొందుటయందు మనము తలంపుల నిలుపుకొనరాదు. తుదకీ ప్రపంచముననే యివియన్నియు నిలిచిపోవును. ఈ వెలుపలి ప్రపంచమునుండి మనము పడయజూచు సుఖశాంతులు అస్థిరములు. మనము దృఢములైన పునాదులను నిర్మించుకొనజూడమేని, మనము సర్వస్వముగ, సర్వవిధముల ఆధారముగ శ్రీసాయీనాథుని నిల్పుకొనజాలమేని లౌకికముగ నేవేని తాత్కాలిక ఫలములను బడయగలమేమోకాని, ఆధ్యాత్మికౌన్నత్యము, శ్రేయోధామము జేరుకొనజాలము. అటులగానిచో చరమస్థితియందు మనము పరీక్షించుకొనిన మన గమ్యమును సమీపించుటకు మాఱుగ దూరమైతిమని తెలిసికొని విచారపడుదుము.

ప్రార్థన :—

శ్రీకరా! శ్రీసాయి! నీ కరుణామృతం
బీ దీనునిపై ప్రసరించగదవె!
క్షణిక ఫలానుషంగములైన యైహిక
వాంఛల హృదినుండి పాప గదవె!
వ్యర్థము లాత్మకు ప్రతిబంధకమ్ములౌ
వస్తుసంగతి నెడపంగ గదవె!
నిన్ను గుర్తించుచు నిన్ను ప్రేమించుచు
నీయందు లయమొంద నీయగదవె!
చేరి పొగడు వారికి దివ్వ్యచేయగదవె!
తెగడు వారి నోర్పున సైచు తెలివి నిడవె!
తగు విధాన ఆధ్యాత్మిక ప్రగతి నిడవె!
సత్యకరుణాస్వభావ! శ్రీసాయిదేవ!

7. వ్యసనములు కష్టములు దాపరించినపుడు శ్రీ సాయీ ప్రభువునే చేరి ప్రార్థింపవలయును:

"స్వర్గ మృత్యు పాతాళమే పూరతీ న సుఖ నాహి
సుఖ సాహేబకే భజనమే అరుసంతనకే మాహి."

తగ, స్వర్గమర్త్యపాతాళ లోకముల
నెగడదు సుఖము గణింపవేగతుల;
సాయి చింతనమున సాధుసంగమమున
బాయని సుఖము చొప్పడు నెందు జనిన.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

శ్రీ సాయీబాబా మహాప్రభువు, శ్రీ సాయీ నామము ధన్యము. శ్రీ సాయీభక్తులు ధన్యులు. ఆ స్వామి యిచ్చు శనుస

రించియే మనకీ లౌకికాకర్షణలు, కష్టములు ప్రాప్తించినవి. వానినుండి తప్పుకొనుటకు ఏ యితర తావులకు, ఎక్కడకు పాటిపోవజాలము. బాబా దగ్గఱకే పఱువెత్తవలయును. ఆ తండ్రియే కరుణించి వారింప దలచిన వారింపవలయును. అ వ్యసన కష్టములను మనకు శ్రేయస్కరములైన వానిగ పరివర్తనము చేసికొనవలయును. మనము భరింపజాలని కష్టములచే క్రుంగి కృశించుచున్నపుడు చేయూతనిచ్చి, అదుకొని రక్షింపదగిన సర్వశక్తివంతుడైన సమర్థ సద్గురుదేవుడు శ్రీసాయీ ప్రభువొక్కడే. ఈ రహస్యము గుర్తింపనేరక మనకీవ్యసనములు కలిగినపుడు వీనిని - నివారించుకొను తలంపున బాహ్యప్రపంచము వైపునకు పరుగెత్తుచు వారిని వీరిని జేరి రక్షింపుడని ప్రార్థింతుము. కాని ఆర్తితో - గాఢవిశ్వాసముతో మన హృదయస్థాయియైన శ్రీసాయిని ప్రార్థింప దలపము. ఆ కారణముననే వెలుపల ప్రపంచమునుండి పొందగలిగిన సుఖశాంతు లత్యల్పములు. ఇతరాశ్రయముల వలన నేవేని లభించిన అది శక్తివంతము - శ్రేయస్కరము, శాశ్వతములైన రక్షణము కానేరదు. నిండు మనస్సుతో - గాఢవిశ్వాసముతో సమాశ్రయించు బిడ్డలను కంటిని ఱెప్పవలె ఆదుకొని రక్షింపగల సమర్థుడు శ్రీసాయీప్రభువొక్కడే. బాబాకు సాధ్యము కానిది లేదు. మాట నిచ్చి తప్పుకొనువాడుకాడు. తలనేని వెచ్చపెట్టి అభయమిచ్చి కాతు" - నని అభయ ప్రదానము కావించినాడు.

[S. C. S. శ్రీసాయీనాథ బోధామృతము పేరాలు 9-52-చూడుడు!]

కాని, మనకు తగిన విశ్వాసము లేదు. తగిన పూనికతో నిలువ నేర్వవలయును. ధైర్యోత్సాహములను వహింపవలయును. సహనశక్తి పెంపొందించుకొనవలయును. అపుడు బాబా కరుణను ప్రసరించితీరును. ఓర్పుతో వేచియుండుము! వేచి యుండుము!" - నేను వచ్చి నీ రక్షణ భారము వహింతును." - అని బాబా పలుకుచున్నాడు. కాని యితరాకర్షణలు - అసహనము మనకు విసుగు కలిగించుచున్నది. వ్యర్థభయము మనల నలముకొని పీడించుచున్నది. భవిష్యత్కాలమునకు సంబంధించిన విషయములనుగూర్చి ఆలోచించుకొనుటవలన మనకు లాభము లేదు. వ్యసనములపై వ్యసన

ములే అలముకొనుచుండును. కలుగనున్నవానినిగూర్చి ఆందోళన చెందుటగాని, ఆనందించుట వలనగాని ప్రయోజనము మృగ్యము- అని మన తలంపుల ననుసరించి జరుగనేరవు.

అట్టి ఊహలతో భ్రమనొందుట మానవ స్వభావము. అది మానసిక దౌర్బల్యము కామక్రోధాది శత్రువులచే వంచితులమై పెడ దారుల కాకర్షింపబడుటయే యగును. కావున మనహృదయమున ఆందోళనము, భీతినొందుట తగదు. శ్రీసాయీ ప్రభువునందు, ఆ తండ్రి కరుణయందు గాఢవిశ్వాసము గలిగియుండ వలయును. మనకు నిత్య సన్నిహితుడు హృదయస్థాయియైన సాయిని జేరక, కనజాలక, దూరదూర విషయములగూర్చి ఆలోచించుటవలన ప్రయోజనము శూన్యము. ఈ నాటి తలంపుల గూర్చి మనము భవిష్యత్తును నిర్ణ యించు కొనరాదు. ప్రాప్తించు వ్యసన కష్టములకు కృంగరాదు. వానినుండి తప్పుకొను మార్గములేదని భీతినొందరాదు.

తాత్కాలికముగ మనల కొన్ని కష్టములు అలముకొనినను మనకు గల సుఖ సంతోషములు చెడినను మనము దిక్కులేనివారమని, నిరాధారులమని క్రుంగుపడరాదు. శ్రీసాయీ కరుణా సామ్రాజ్యము జేరుటకు మార్గమిదియే. మనకు కష్టసహనశక్తి పెంపొందించుటకొఱకే శ్రీ సాయీ ప్రభువు వీనిని మనకు గూర్చుచున్నాడని తలంచవల యును. ఇచ్చువాడు తిరిగి తీసికొనువాడు ఆ తండ్రియే. అంతయు ఆ తండ్రి లీల. ("దదాతి ప్రతిగృహ్ణాతి")

మన హృదయస్థాయియైన సాయీప్రభువునకు తెలియని విషయము లేదు. మన మా తండ్రి కనుగప్పి పుచ్చి యేమియు దలంప జాలము. పలుకజాలము. చేయజాలము. బాబా మన లౌకిక ఆధ్యా త్మిక విధానముల దేని నెటుల పరివర్తనము గావించుచున్నను అది మన గర్వాహంకారములను శమింపజేసి, వినయవిధేయతలను పాదు కొలిపి, చక్కదిద్ది మనల తన అంకిత సంతతిగ స్వీకరించుటకేయని గుర్తించవలయును. బాబా మనకు ప్రసాదించినదానిని తీసికొనగలడు, మరల ఆ తండ్రికి దయ గలిగినపుడు తిరిగి ప్రసాదింపగలడు.

శ్రీసాయీనాథుడు మనకేది ప్రసాదించియున్నను అది స్వామిదే. తిరిగి స్వీకరించుకొనునపుడు మనది తీసికొనుటలేదు. ఆ తండ్రి ప్రసాదించునది ప్రతిదియు మంచి బహుమతియే. పూర్ణమైన బహూకృతియే. కావున ఆ స్వామి మనకు కష్టనష్టములు ప్రసాదించిన మనము వ్యసనపడరాదు. హృదయమును దిగజారనీయరాదు. ఆ దయామయుడగు బాబా ఆ వ్యసనభరము నంతయు ఆనందమయముగ పరివర్తనము జేయగలడు. బాబా యేది యెట్లు ప్రవర్తింపజేయుచున్నను అది మన శ్రేయమునకే అని, శ్రీసాయీ ప్రభువునకు కృతజ్ఞతా పూర్వక నమస్కృతులర్పించుకొనుచుండ వలయును.

మనము వివేకవంతులము. సత్యము గ్రహింపగలవారమైన మనకు ప్రాప్తించు వ్యసన సంకటములకు నిరాశ, నిస్పృహలను పొంది క్రుంగుపడరాదు. శ్రీసాయీశునకు కృతజ్ఞులమై సంతుష్టి సంతృప్తుల నొంద నేర్వవలయును. శ్రీసాయీ కరుణ తాత్కాలిక సుఖసంతోషములగాదు ప్రసాదించునది. గొప్పకష్టములను మాత్రమే; ప్రశంసలను, గౌరవములను గాదు. నిరశనల, నిరాదరణలను మాత్రమే; అలసత్వమున కాలము వ్యర్థము చేయుటకాదు. సహన సహితసత్క్రియా ఫలములను మాత్రమే అని మనము నిరంతరము జ్ఞప్తియందుంచుకొన వలయును.

ప్రార్థన:—

ఓ కరుణామయా! శ్రీసాయీ మహాప్రభూ! నిన్ను విడనాడి నే నెచటకు బోజాలను. నాకు నీ యందు గాఢవిశ్వాసము - ధైర్యోత్సాహములతో గూడిన సహనశక్తిని ప్రసాదించుము. అభయప్రదాన ప్రశస్తమైన నీ దివ్యహస్తము నూతగనిమ్ము. నిన్ను జేరుటకు వెలుగును ప్రసరించి భీతిని బోకార్పుము. నా యిష్టముకాదు ఈ వ్యసన కష్టములన్నియు నీవాడైన వీని కెంతయు దగినవి. వీని నన్నిటిని సహించి తీరవలయును. ఇవే - నీకు కృతజ్ఞతా పూర్వక సాష్టాంగ వందన సహస్రము లర్పించుచున్నవాడను.

8. విశ్వకర్తయగు శ్రీ సాయీప్రభువును గుర్తించి పొందు విధము:

"మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగ వర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ!"

నాకుగా గర్మముల సల్పి నన్ను పరమ
గతియనుచు నమ్మి, మద్భక్తి గలిగి, సంగ
మమును విడనాడి, సర్వభూతముల వైర
ముడుగు నాత డెఱింగి నన్ బడయు; విజయ.

(భ. గీత. 11-55)

మానవుడై జనించిన పిదప ప్రతి వ్యక్తి నిరంతర మేదొక పని చేయుచునే యుండును. ఏమి చేయుచున్నను ఆ పని శ్రీసాయీ ప్రీతి కొఱకు బాబా సేవగ జేయ నేరువవలయును. శ్రీ సాయీశున కంటె ఉత్తమోత్తమవస్తు వీ విశ్వమున లేదని విశ్వసింపవలయును. శ్రీసాయీప్రభుపునందచంచల భక్తి నెఱుపవలయును. సకల లౌకిక బంధములనుండి విడివడవలయును. ఏ ప్రాణియందు ద్వేషబుద్ధి వహింపరాదు. అట్టి స్థితి నొందినవాడు శ్రీసాయీశ్వరుని గుర్తించి పడయ గలడు.

ఈ ప్రపంచమున నేవస్తువైనను మనల వెనుకకు లాగుచున్న యెడ మనము స్వేచ్ఛగా బాబాను సమీపింపజాలము. వైరాగ్యత్యాగము లను రెండు ఱెక్కల నాధారము చేసికొని జీవి బాబా దగ్గఱకు ఎగిరి వెళ్ళవలయును. ఈ ప్రపంచమున దేనియందు సంసక్తి వహించని వాడే స్వతంత్రుడు. అట్టివానికే సత్యమైన స్వేచ్ఛ గలదు. "నిస్పృహస్య తృణం జగత్" - ఏకదృష్టిగలవానికే విశ్రాంతి గలదు. ఈ ప్రపంచమునగల వస్తు వితానములందాయా భిన్న రూపములు గోచ రించు చున్నంతవరకు మానవునకు విశ్రాంతిలేదు. ఒకదాని తరువాత మఱియొకటి వీనిని ఆకర్షించుచుండును. ప్రతివస్తువునందు ఆసక్తి గలిగి యొకదాని పిదప మఱియొకదానిని సమకూరుకొన యత్నించు

చునే యుండును. ఈ వస్తుసేకరణకు అంతము లేదు. ఈ విశ్వమును సృజించి ప్రతి జీవియందంతర్యామియై దేనితోడను సంబంధము లేక నిర్లిప్తుడై దేనినంటకయున్న, పరతత్త్వమైన శ్రీసాయీప్రభువునందు మనస్సును లగ్నము చేయుచుండవలయును. దృశ్యవస్తుజాలమున సంసక్తి విడిచినగాని మానవుడు దైవానుభూతి బడయనేరడు. మానసిక స్వేచ్ఛ గనజాలడు. ఏ జీవితో నెట్టి సంబంధము గూర్చుకొనుచున్నను అది సాయీ సంబంధముగ నుండవలయును. శ్రీసాయీ ప్రభువం దిధిష్ఠించి యున్నవాడను తలంపుతో మనము చేయగల మేలు- సేవ చేయుచుండదగును. దానిని మన కుపభోగ్య వస్తువుగ గణింపరాదు.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి సచమే న ప్రణశ్యతి.

ఎవడు సకలంబునందు నీక్షించు నన్ను
నెవడు నాయందు సకల మీక్షించుచుండు
జగతి వానికి నే బరోక్షంబుగాను
వాడు నాకు బరోక్షంబుగాడు; పార్థ!

(భ. గీత - 6-30)

అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు బోధించినాడు. దైవము నెట్లు పొందగలమో శ్రీ సాయీభగవానుడు తెలిపిన విధానములను [శ్రీసాయీనాథ బోధామృతము **S. C. S.** పేరా 18, 124, 137, 137ఎ, 138 చూడుడు.] 138 పేరా .... "మా విధానములు ప్రత్యేకములు .... ఆత్మజ్ఞానము బడయుటకు ధ్యాన మవసరము .... కావున సకల కామితములను పరిత్యజించి సకలమున అధివసించియున్న దైవమునందు నీ మనస్సు నిలుపుము. మనస్సు ఆవిధముగ కేంద్రీకరింపబడిన, గమ్యము దీపించును.

ధ్యానమునకు నా సగుణ రూపముగాని, లేక నా నిర్గుణ (ఆనంద) స్వరూపమునుగాని చింతింపుము. అట్టి నిరాకార ధ్యానము

కష్టమని తోచిన నీ విచట జూచు నా రూపమును ధ్యానింపుము. రేయింబవళ్లు దానిని తలంచుము. అట్టి నిరంతర ధ్యానమున మనస్సు (పరతత్త్వమున) లయించును. అపుడు ధ్యేయము - ధ్యాత - భేదము, తుదకు ధ్యానక్రియయు శమించును. ఇదియే చైతన్య ఘనత - బ్రహ్మసమరసతగ పరిణమించును. గురుదేవుని కరుణారసార్ద్ర దృష్టియే ఆశ్రితుడగు శిష్యునకు షడ్రసోపేత భోజనము."

ఇట్టి మానసిక స్వాతంత్ర్యము బడయుటకు క్రమక్రమముగ ఆధ్యాత్మికోన్నత స్థితికి జేరుకొనుటకు శ్రీసాయీ సద్గురుదేవుని కరుణ ఎంతయు అవసరము. మానవుడెన్నెన్ని శాస్త్రగ్రంథముల బఠించి యెంతలెంతలు విద్యానైపుణ్యముల సంపాదించినను, వాడేవేవి కలిగి యున్నను, ఆధ్యాత్మికముగ పురోగతిబడసి, యీ లౌకిక బంధముల నుండి విడివడి దైవసంబంధము గూర్చుకొనడేని తక్కిన వన్నియు వ్యర్థములే యగును. నిత్యసత్యవస్తువైన శ్రీసాయీ ప్రభువునకంటె నితరమగు ఏవస్తువునేని అధికముగ భావించు చున్నంతవరకు అట్టి వాడు అల్పుడే యగును. అధోగతి యందుండి అటమటించు వాడే యగుచున్నాడు.

ఆత్మజ్ఞుడైన పరమభాగవతుని వివేకమునకు - వివిధ శాస్త్ర పురాణాదుల వల్లెవేసిన విద్యావంతుని వైదుష్యమునకు హస్తిమశకాంత రము కలదు. దైవప్రేరణమున, గురుదేవుని కరుణచే బడసిన ఎఱుక శ్రమించి సముపార్జించిన విద్యానైపుణ్యతలకంటె మిక్కలి ఉదాత్త మైనది.

ధ్యాన నిష్ఠయందుండ బలువురు కోరుదురు. దాని కవస రములగు వానిని గూర్చుకొనుటకు బుద్ధి కుదురదు. బాహ్యాడంబరము లకు ప్రాధాన్య మీయజూతురేకాని, నిరహంకృతి, వైరాగ్య త్యాగ శీలములను పాటింపరు. ఆ నిత్యసత్యవస్తువేదియో మన మెఱుగము, ఏ చైతన్యవస్తువు మనల బ్రవర్తింప జేయుచున్నదో మనము తెలిసికొన లేకున్నారము. ఏవియో వెలుపలకు ఆధ్యాత్మికము - పరతత్వము - ఇత్యాది పదములను బూటకముగ పలుకుచు, పలువిధములగు

శ్రమలకోర్చి కష్టించుచు. అత్యాతురతతో స్వల్పములు అనిత్యములగు వస్తువుల సముపార్జించుకొనుటకు పాటుపడుచుందుము. కాని, ఒకప్పు డేని, ఒక క్షణమేని, మనస్సును అంతర్ముఖము గావించి, మన అంత రాత్మను గమనింప జూడము. ఇంచుక స్మృతి బడసి మనము కావిం చిన పనులను వివేకముతో పరీక్షించుకొనజాలము. శ్రీసాయీ భక్తుల మని చెప్పుకొనుచున్నను మన ప్రేమ యెక్కడ కేంద్రీకరింప బడినదో కానము,

మనము కావించు పనులలోగల మాలిన్యములను గూర్చి విచారపడము. సర్వసాధారణముగ మానవులమగు మనమిట్టులే భ్రష్టులమై మోహ ప్రవాహమున మునిగిపోవు చున్నారము. మన అంత రంగిక ప్రేమ మిట్టుల మలిన మగుటచే, మనము కావించు పను లును మలినములగుచు మన ఆధ్యాత్మిక దౌర్బల్యమునకు నిదర్శనము లగుచున్నవి,

ఎందు నిర్మల హృదయము ప్రకాశించునో అందుండి సాధు జీవిత ఫలము ప్రకటమగును. మానవు డేవేవి యెన్నెన్ని పనులు కావించినాడని ప్రశ్నించుదుమేకాని, ఎంత లెంతలు నిర్మలాశయము లతో - త్యాగనిస్స్వార్థ బుద్ధితో గావించినవాడో గమనింపము. ఆతడు ధైర్యశాలియా ధనికుడా - సుందరుడా - శక్తివంతుడా - రచయితయా- మంచి గాయకుడా - పారిశ్రామికుడా అని విచారించుదుమేకాని, ఎంత సహనము - విధేయత - భక్తి - అధ్యాత్మిక సంపదలు గలవాడో తెలిసి కొనగోరము.

ప్రకృతి - సాధారణముగ మానవుని బాహ్య విషయ రూప ముల ప్రకటమగును. శ్రీసాయీకరుణ - మానవుని అంతరంగికముగ పరివర్తనము గావించును. ప్రకృతి తఱచుగ నిరాశ పొంది వంచిత మగును. కరుణ శ్రీసాయీ భగవానునందు విశ్వాసము గలది కావున వంచింప బడదు. క్రమక్రమముగ ఆధ్యాత్మిక పురోభివృద్ధి నొందుచు సాధకుని గమ్యమును జేర్పించును.

ప్రార్థన :-

ప్రతి జీవంబున జేరి చాటుపడి, సర్వవ్యాపియై యీశుడై
అతుల ప్రాణిచయాంతరాత్మయయి, కర్మాధ్యక్షుడై, సంతతా
శ్రితభక్తావన దక్షుడై, హృదయసాక్షీభూతుడై సత్కృపాం
చితుడౌ సద్గురుదేవు సాయివిభునిన్ జింతింతు నశ్రాంతమున్.

9. అహంతను - దుస్సంకల్పములను త్యజింపవలయును.

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి.

సర్వకామములను సమయంగజేసి, తా
నాశలేనివాడు నగుచు, మిగుల
నిర్మమత్వము మఱి నిరహంకృతిని గల్గి
సంచరించు నతడు శాంతిబొందు.

(భగవద్గీతామృతము - 2 - 70)

అహంతను నిశ్శేషముగ త్యజించినగాని సంపూర్ణ స్వాతంత్ర్యము - బంధవిముక్తి గలుగదు. స్వార్థప్రయోజనాసక్తి కలిగి స్వార్థప్రియులైన వారు బంధములందు జిక్కుకొనువారలే యగుదురు. శ్రీసాయీ గురుదేవునకు సంబంధించిన విషయములనుగాక యితర మానవులలోని అవగుణములనుగూర్చి చర్చించుచు, వ్యర్థసంభాషణములందు బాల్గొనుచు అలసస్వభావమున పరిశ్రమింపనేరక, నిలుకడలేనియోచనతో ఆకాశ సౌధముల నిర్మించుకొని ఆనందింప జూచువారు దురాశాపరులు. ఏలన - శ్రీ సాయీనాథునకు సంబంధించని దంతయు నశ్వరము. నశించునదియే యగును. సోదరీసోదర భక్తులీ రహస్యమును నిరంతరము జ్ఞప్తియందుంచుకొన దగును.

"సర్వమును త్యజింపజాలువాడు సకలమును బడయగలడు."

"కామవికారమును పోదట్టగలవాడు పరమశాంతిని బడయును."

సాధకుడీ విషయమును మనస్సున లెస్సగ చర్చించుకొని, పూర్ణముగ సుస్థిరము జేసికొనవేర్చిన సకలము విదితమగును.

ఇది ఒక క్షణమున - ఒక దినమున లభ్యమగునది కాదు. బాలకుల క్రీడకాదు. ఇది ఆధ్యాత్మిక విద్యాప్రపూర్ణులైన సాధుసత్పురుషుల సంపూర్ణస్థితి. ఒక మాటలో తెలుపబడినదిగ సాధకుడు తలంపవచ్చును. అంతమాత్రమున నిరాశ, నిస్పృహ నొందరాదు. త్రోసివేయరాదు. ఈ ఉన్నతాశయము దృష్టియందుంచుకొని, ధృత్యుత్సాహములతో నిలబడి సాధనకు గడంగవలయును. వైరాగ్యాభ్యాసముల బురస్కరించుకొని, యీ స్థితి బడయగల సాధకుడు శ్రీసాయీ ప్రభువునకు తదీయులకు ప్రేమపాత్రుడు కాగలడు. అట్టివాని ఇహపర జీవితము ప్రశాంతమయము. ఆనందమయము కాగలదు. మనము పరిత్యజింప దగినవి యింకను అనేకములు కలవు. శ్రీ సాయీ నాథుని పదపద్మములందు సకలము సమర్పణము గావించి, సంపూర్ణ శరణాగతి జేసినగాని, మనము అభిలషించు స్థానము - స్థితి బడయ జాలము.

శ్రీసాయీ ప్రభువువద్దనుండి అగ్నిపుటముపెట్టి పరిశుద్ధము గావింపబడిన బంగారము (ఆధ్యాత్మికజ్ఞానము) మనము విలుచవలయును. మన సత్ప్రవర్తనము - సంపూర్ణ శరణాగతియే దాని మూల్యము. ఆ మేలిమి మనకు లభించెనా యీ ప్రపంచమున మనల లోభపఱచు సకలము అల్పములు, నీచములుగ భావింపబడి త్రొక్కివేయబడును.

శ్రీ సాయీనాథుడు మనకు ప్రసాదించిన యీ మాత్రము జ్ఞానము నేని ఆధారము చేసికొని, యితరుల మెప్పుకోరక ఇతరుల సంతోష పఱచుటగాని అపేక్షింపరాదు. ఈ లౌకికసంబంధములైన అల్పవస్తువులను - మానవులు అమూల్యములు అని కూడబెట్టుకొనిన వానిని వెచ్చించి పడయజూతురు. సత్యమైన ఆధ్యాత్మిక జ్ఞానము

లోక విషయ లంపటులకు అల్పముగ వ్యర్థముగ తోచును. వారి సత్య విషయమును మఱచిన మఱువవచ్చును. కొందఱు అట్టి అధ్యాత్మిక జ్ఞానమును వాగ్రూపమున ప్రకాశించు వారైనను వారి దైనందిన జీవితమున దానికి మిక్కిలి దూరమై యుందురు. ఈ సత్యజ్ఞానము లోక విషయ లంపటులకు గానరాక మఱుగుపడి యున్న అమూల్యరత్నము.

[ ఈ సందర్భమున Life of Sai Baba (Telugu) "ఏమీ, నిన్ను పేక్షింతునా?" గ్రంథము పుట 315 చూడుడు. శ్రీ కాశీనాథ గోవింద ఉపాసనీ వృత్తాంతమున - అహంకార మమకారములు తగవని బాబా కావించిన బోధ. ]

.... ప్రాపంచికాభిముఖుడగు కాశీనాథుని దైవస్వరూపునిగ పరివర్తనము గావింప బాబా మఱియొక దృశ్యమతనికి బొడమజేసెను. ఒకనాటి సాయంసమయమున కాశీనాథుని తాత గోపాలశాస్త్రి అతని యెదుట బొడమెను. మనుమని జేరబిలుచుచున్నట్లు రెండుచేతుల జాచి "అహం - మదన్ - గార్" - అని యిరుమారులు పలికి అదృశ్యుడయ్యెను. ఉపాసనీ దాని భావము గ్రహింపజాలక ఆ మాటలను మననము చేసి చేసి [అహం = అహంకారము, మదన్ = కామ వికారము (మమకారము) గార్ = విషము] అహంకార మమకారములు విషము అనుభావమును గ్రహించుకొనెను.

[ఉపాసనీ మహారాజు సకోరియందుండగ పూజ్యశ్రీ బి. వి. నరసింహస్వామిగారితో స్వయముగ నిటుల దెల్పెను. ("శిరిడి యందున్న కాలముననే బాబా తన అద్భుత శక్తివలన కాయికముగ అసమర్థత, మానసికముగ నిరీహ కల్పించి నన్ను కామ విముఖుని గావించినాడు"]

ప్రార్థన :-

తనువే 'నే' నని యెంచి, సంతతము దత్కార్యాళికిన్ 'నేను'-క
ర్తనటంచున్ గని, కామితార్థచయ బంధంబందునన్ జిక్కి, మా
యను తారాడుచు నిన్ను గాన; మమతాహంకారముల్ ద్రుంచి, ని
న్ననువర్తింప స్వతంత్రశక్తి నిడుమప్పా! సాయినాథప్రభూ!

10. మనస్సు చంచల; మన ఆశయము, దృష్టి శ్రీసాయీ ప్రభువునందు నిలుపదగును:

"హసతి కదాచిద్రౌతి భ్రాంతం సద్దశదిశో భ్రమతి
హృష్టం కదాపి దుఃష్టం - శిష్టం దుష్టంచ నిందతిస్తౌతి.
కమపి ద్వేష్టి స రోషం హ్యాత్మానం శ్లాఘతే కదాచిదపి
చిత్తం పిశాచమభవ ద్ద్రాక్షస్యా తృష్ణయా వ్యాప్తమ్.

దంభాభిమానలోభైః క్రామక్రోధోరు మత్సరేర్ష్యేతః
అకృష్యతే సమంతాచ్ఛ్వభిరివ పతితాస్థివన్మార్గే
తస్మాచ్ఛుద్ధ విరాగో మనోఽభిలషితంత్యజేదర్థం
తదన భిలషితం కుర్యాన్నిర్వ్యాపారంతతోభవతి."

ఒకట నవ్వు మఱియు నొక్కట నేడుచు
భ్రాంతి దశదిశలను పఱుగులెత్తు
మోదమొందు, కోపపూర్ణమౌ, నిందించు
శిష్టజనుల మెచ్చు దుష్టమతుల.

ద్వేషమొకటబఱపు రోషమొక్కటజూపు
దనకుదాన పొగడుకొను నొకప్పు
డాశయనెడి అసుర యావరించిన యంత
మానసము పిశాచమైన కతన.

త్రోవబడిన యెముకతునకను శునకబృం
దంబు పగిది మతిని దంభమత్స
రాభిమాన కామలోభ రోషంబులు
నటులిటుల లాగి పట్టివేచు.

కాగ శుద్ధవిరక్తికై కడగువాడు
చిత్తకామితములను త్యజించి, యద్ధి
కోరని పదార్థముల సమకూర్చునేని
నఖిల సంకల్ప శూన్యతనొందు మనసు.

(ప్రబోధ సుధాకరము - మనోనింద)

మన మానసిక సంకల్పములను విశ్వసింపదగదు. ఈక్షణ మున నున్న తలంపు మఱుక్షణమున మాఱిపోవును. మనకు అనిష్ట మైనను మనము బ్రతికియున్నంతవరకీ క్షణిక మానసిక పరివర్తనము లకు గురికావలసినవారమే. ఒక సమయమున సంతోషము మఱొకట దుఃఖము - ఒకపరి శాంతి - మరొకపరి అశాంతి - ఒకట ఆస్తిక్యత - మఱొకట నాస్తికత - ఒక క్షణము ఉత్సాహము - మఱొకక్షణము నిరుత్సాహము; అంధకార మొకట - ప్రశాంతము వేఱొకట - ఈ మనస్సు కూర్చుచుండును. వివేకవంతులై ఆధ్యాత్మిక నిష్ఠగలవారు ఈ మార్పులకు లొంగరు. ఆయా తాత్కాలిక వాతావరణములకు చలింపరు. వారి ఆశయము - దృష్టి సత్యము - నిత్యమైన గమ్యమునందే హత్తు కొని యుండును. అనగా వారి దృష్టి శ్రీసాయీప్రభువునందే లగ్న మగును. సాధకుని ఆశయము - దృష్టి ఎంతెంత పవిత్రమగునో అంతంత నిశ్చలముగ వాడు తన నలముకొను తుపానుల పాటింపక పురోగమింప గలడు. కాని కొందఱు సాధకులం దా ఆశయము, దృష్టి, మసక మసకగ నుండి, మధ్యే మార్గమున నేదేని యొక అసాధారణ విషయము - దృశ్యము గోచరించిన, దానిచే నాకర్షింపబడి గమ్య మును విస్మరింతురు.

స్వార్థపరత - స్వార్థసుఖాభిలాషలనుండి విడివడినవారు మిక్కిలి అరుదు. శ్రీసాయీ ప్రభువును సమాశ్రయించిన వారిలోనే కొలదిమంది తప్ప తక్కినవారందఱు లౌకిక కామితముల కోరి చేరిన వారే. బాబా అట్టి లౌకిక కామితములను ప్రసాదించుచున్నను అంతో యింతో ఆధ్యాత్మిక ప్రబోధయు జతపఱచువాడు. ఏకారణము పురస్క రించుకొని శ్రీసాయీప్రభువును సమాశ్రయించినను సాధకుని నలము

కొనిన ప్రతిబంధము లొక్కొక్కటి తొలగి తీరును. మహదాశ్రయము ఏనాడును వ్యర్థము కాదు. ఎన్ని జన్మములకేనియు అది గమ్యమును జెర్చి తీరును. బాబా కరుణాకటాక్ష మొకపరి ఆశ్రితునిపై ప్రసరించిన చాలును. ఇక వాడు చెడడు, విడడు.

ఏకతమున నేని నాపదల కందరు - కుందరు మత్పదాశ్రితుల్.

అని బాబా శపథము చేసినాడు. కావున మానస చంచలత్వమును నివారించుకొనుటకు శ్రీ సాయీ పదసమాశ్రయము తప్ప వేఱొక సాధనము లేదు.

ప్రార్థన:—

క్షణమేన్ నిల్వదు చిత్తమేకగతి, జీకాకున్ బడన్‌జేసి, బు
ద్ధిని గాఱించెడి, నిట్టి చంచల నిరోధింపంగ మార్గాంతరం
బును నే గానను, నీ పదంబు శరణంబున్ గంటి, నిద్దాని మె
ల్పున నీ చెంగటజేర్చుకో గదవె! బాబూ! సాయినాథప్రభూ!

11. శ్రీ కృష్ణసాయి మధురతమము - శ్రీ సాయీ సంబంధము గలిగి ప్రేమించి సేవించు జడ చేతనములు మధురతమములు:

వదనం మధురం వచనం మధురం
నయనం మధురం హసితం మధురం
హృదయం మధురం గమనం మధురం
మధురాధిపతే రఖిలం మధురమ్.

మనమీ విశ్వమున కోరతగిన మధురాతి మధురమైన వస్తువు శ్రీ కృష్ణసాయికంటె నితరమేదియు లేదు. ఈ విశ్వము - విశ్వమునందలి వస్తుజాలము మధురము కాదు. శ్రీ సాయి - అక్షరద్వయము, సాయీ శబ్దమొక్కటి మాత్రమే మధురాతిమధురము. ఆ నామ

ప్రతిపాదించు రూపము మధురతమములు. ఆ వస్తు సంబంధమైన ప్రతి లీలయు మధురము. శ్రీ సాయిని ప్రేమించి యే విధమైన సంబంధముగల జడచేతనములు మధురములు.

శ్రీ సాయీ ప్రభువునకు ఆశ్రయమిచ్చిన 'ద్వారకామాయి' మసీదు మధురము. నీడ నిచ్చిన నింబ వృక్షము మధురము (మధుర నింబవృక్షము.) ఆసనమైన ఆ ఊతిబండ మధురము. బాబా పెంచి పోషించిన లెండివనము మధురము. బాబా భౌతిక తనువును భద్రముచేయు సమాధి మందిరము (బూటివాడ) మధురము. బాబాపాద స్పర్శ సోకిన శిరిడి గ్రామమున ప్రతి అణువు (రేణువు) మధురము. బాబాకు భిక్ష సమర్పించి సేవించిన తల్లులు తండ్రులు మధురములు. శ్రీసాయీ సంబంధముగల చేతనాచేతనముల మహత్త్వమత్యద్భుతము. ఆ తండ్రి స్పర్శ - అనుభూతి యెందెందు గలదో, అది ఆనంద మయము. చేతనము, బాబాకు దూరమైనది నిస్సారము జడము అగును.

శ్రీసాయీ నాథుడు హృదయశాంతి-సంతోషము-సంతృప్తిని-ఆనందమును ప్రసాదించును. శ్రీసాయి మన చెంత నుండెనా మనకు పరిసరములను గురించిన చక్కని యోచనాసక్తిని ప్రసాదించును. బాబా సంబంధము గాంచనిదేదియు రుచికరము - ఆనందదాయకము కాదు. శ్రీ సాయీ కరుణ మన బుద్ధులను ప్రేరేచి సన్మార్గ గాముల జేయును. బాబాకొఱకై సాధకుడగువాడు క్షుత్పిపాసల (ఆకలి దప్పుల) పొందవలయును. అట్టి జీవి యేమి తినిన నేమి త్రాగిన, నితరుల కేమి త్రావబెట్టిన మధురముగ నుండును. ఈ విశ్వమున నెంత తెలివిగల వారైనను దృగ్గోచరములగు భౌతిక తనువులందు మాత్రమే ప్రేమ గలిగియున్నను వానికై ఆసించి కామించుచున్నను వారు బాబా కరుణకు దూరమైనవారే. వారి తెలివి గర్వకారణము. వారి భౌతిక దృష్టి పతనహేతువు. భౌతిక వికారములను తృణీకరించి, తదంతర్గతమగు వస్తువు - శ్రీసాయియందు దృష్టి నిలిపి యనుసరించువారు సత్యమైన వివేకముగలవారు.

[ ఈ సందర్భమున శ్రీ సాయీనాథ బోధామృతము - (యస్. సి. యస్. పేరా 206) పాఠము సావధానముగ జూడదగును. మోహము - మోహజయము ]

ఏ జడ - చేతనములందేని యెట్టి మహత్త్వము, ఔన్నత్యము గోచరించిన నట్టి వస్తు సృష్టి కర్తయైన శ్రీ సాయీ ప్రభువునే వివేకి యగువాడు ప్రశంసించును. ఈ విశ్వసృష్టికర్తయైన శ్రీ సాయీమహా ప్రభువు మాధుర్యమునకు, ఈ ప్రపంచమున గోచరించు చేతనా చేతనముల మాధుర్యమునకు హస్తిమశకాంతరము గలదు. ఆ ప్రభువు కరుణ, యందు ప్రసరించుట చేతనే దానికట్టి శోభ కలిగినదిగ మనము గుర్తించవలయును.

శ్రీసాయీ ప్రభువునందు మనము హత్తుకొని, సచ్చిదానంద ములను బడయుటకు మన ఆత్మను పవిత్రము చేసి ఉత్సేకము కలి గించి, సచేతనము - శక్తివంతము గావింపుమని మనము నిరంతరము బాబాను ప్రార్థింపవలయును. మనకు సంతృప్తి సంతుష్టి శాంతులను ప్రసాదించి, సకలమున ఆ మహాప్రభువును జూచి, ఆనందింప గలుగు గడియ యెప్పుడు సమకూరునా! - అని, మనము నిరీక్షింపవలయును.

ఇట్టి స్థితిని మనము పొందలేదని భావించి ఆందోళన మొందుచున్నను - ఆ వృద్ధుడు - శ్రీసాయిబాబా - యెక్కడకు బోలేదు. మనలో ప్రతివ్యక్తిని విడనాడక మనచెంత - మనలోనే యున్నాడు. మన బుద్ధిని ప్రేరేపించుచునే యున్నాడు. అన ఆత్మను అలముకొని బాధించుచున్న శత్రువును ప్రతిఘటించుచునే యున్నాడు. జ్ఞానజ్యోతిని బఱపుచు క్షేమకర మార్గమును జూపుచునేయున్నాడు. పంచభూత నియామకుడైన బాబా ఈ పంచభూతాత్మకమైన యీ సంసార సాగర మున జెలరేగు తుపానులను - వివిధ మోహోర్ములను శమింప జేయు చునే యున్నాడు. మనము గమనించుచున్నను, గమనింపకున్నను శ్రీ సాయీ కరుణ ప్రతిక్షణము దానిపని అది గమనించుచునే యున్నది.

ప్రార్థన :-

తలపుల్ పల్కులు చెయ్వు లేకసరణిన్ దైవార నీ కంకితం
బులు గానీయవె! నీదు కల్మికతనన్ భూతప్రపంచంబు వ
ర్తిలుచుంటన్గను జ్ఞానదృష్టి నిడవే! దేవేశ! నీ కంటె న
న్యులు ప్రాపెవ్వరు నాకు లేరు; శ్రితబంధూ! సాయినాథ ప్రభూ!

12. మానవ జీవితమున లౌకికాకర్షణములనుండి భద్రత లేదు:

"హస్తి చఢియే జ్ఞానకా - సహజ దులీచాడార్
శ్వానరూప సంసారహై - ఝుంక సటేఝుక్ మార్"

అరయ నిజస్థితి యనెడి యంబారి
పఱగు వివేక ద్విపంబుపై జేరి
సంచరింపుము! ప్రపంచ శ్వానభయము
గాంచ; నానంద సద్గతి గందు ధ్రువము.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు)

సహజస్థితి యనెడి అంబారి పూన్చిన వివేకమను దంతావళముపై నెక్కి మానవుడు ప్రవర్తింప నేర్వవలయును. అపుడు లౌకిక ఆకర్షణలనెడి కుక్కలవలని భయము పొందక భద్రముగ తన జీవయాత్ర జేయగలడు. మనుష్యుడు ఆధ్యాత్మిక కవచము ధరించిన తప్ప వాడు జీవించియున్నంతదనుక క్షేమముగ జీవయాత్ర గడుపజాలడు. నరుడు తన నిరువైపుల దాఁగొనుచున్న శత్రువులమధ్యనున్నపుడు ధైర్యోత్సాహములతో గూడిన ఓర్పు (సబూరి) అనెడి డాలు (డెము) నొకచేతను - శ్రీసాయీ సద్గురు దేవునందు గాఢవిశ్వాసము (నిష్ఠ) అను జ్ఞానఖడ్గము - నొక కేలను ధరించి యిరుకెలంకుల గ్రమ్ముకొను శత్రువులను ప్రతిఘటించుచు జీవిత యుద్ధ రంగమున పురోగమించు చుండవలయును. అట్టివానికే అమృతభోజనము లబ్ధమగును. సోమరులకు, అలసులకు లభించునది వ్యసనము మాత్రమే.

విశ్రాంతి పొందజూచుటకంటె ఓర్పు వహింపనేర్వవలయును. ఈ భూమిపై ఏ యితర జీవములపై ఆధారపడి యుండుటవలన శాంతి సమకూడదు. సత్యసుఖశాంతులు శ్రీసాయీ భగవానునిపై అధారపడి యుండువానికే కలుగును. శ్రీసాయీ సద్గురుదేవునందు అచంచల విశ్వాస ప్రేమల వహించి, ఆ తండ్రికొఱకే సకల కష్టములను బాధలను - వ్యసనములను - అవమతులను తిరస్కారములను సాధకుడగువాడు సహింపవలయును. తాత్కాలిక కష్టసహనముచే శాశ్వత ఆనంద సుఖశాంతులను శ్రీసాయీపదాంకితుడు పడయగలడు. మన శక్తి సమర్థతల విశ్వసించి ఆధారపడజూడరాదు.

శ్రీ సాయీ భగవానునికొఱకు నిరీక్షించుచు ధైర్యోత్సాహముతో గూడిన ఓర్పు గలిగి, ఆ తండ్రి సమర్థతను సందేహింపక - సాధకుడు తన స్థానమునుండి చలింపక మనోబుద్ధులను శ్రీసాయీ ప్రభువునకు సమర్పించి, తనవిధ్యుక్త ధర్మములను సమాచరించు భక్తుడు సకల దుర్గములను సంతరించి శాశ్వత సుఖానందములను బడయగలడు.

ప్రార్థన :—

ధృతియొక్కింతయు లేదు; విశ్వమున నట్టిట్లీడ్చు నీ శత్రు సంతతినిన్ దార్కొన శక్తిలేదు; నిను నా దైవంబుగా విశ్వసించితి, సుక్షేమ పథంబునన్ మెలపి, నీ శ్రీపాద పద్మాంతర స్థితి జేకూర్పవె! నీ పదాశ్రితునకున్; శ్రీసాయినాథ ప్రభూ!

13. బంధవిముక్తి నొందుటకు అహంకార మమకారములను సంపూర్ణముగ త్యజింపవలయును:

విహాయ కామాన్ య స్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి.

సర్వకాలములను సమయంగజేసి, తా
నాశలేనివాడునగుచు, మిగుల
నిర్మమత్వము - మఱి, నిరహంకృతిని గల్గి
సంచరించునతడు శాంతిబొందు.

(శ్రీమద్భగవద్గీతామృతము 2 - 71)

శ్రీ సాయీభగవానుని గుర్తింపదలచినవాడు అహంకార (దేహమే నేను అను బుద్ధిని) మమకారము (నా గృహము-నా బంధువు-నా ధనము ఇత్యాదులు) లను పూర్తిగ త్యజింపవలెను. ఇది కాదు - అది - అనుకొనుచు ఇతర వస్తువులందపేక్ష వహింపక తన సత్యాన్వేషణమున జలింపకయుండనేర్చు సాధకుడు సకలము బడయగలడు. తనదృష్టి నటునిటు మరల్చి అహంత మమతల నాదరింపజూడక పురోగమించుచున్నకొలది అధికముగ శ్రీసాయీ కరుణ బడయగలడు.

ఈ అహంతను ఎంతకాలము పరిత్యజించవలయును? ఎందు దీనిని విసర్జింప వలయును? అను సందేహము సాధకునకు గలుగ వచ్చును.

ఎల్లవేళల ప్రతి గడియ - ప్రతి నిమేషము - ప్రతి క్షణమున స్వల్ప విషయముల అత్యధిక విషయములసైతము ఈ అహంతను విడనాడవలయును. దేనిని ఏ లవమేని అంటుకొని యుండరాదు. అట్టి వాడుకాని శ్రీసాయీపదాంకితుడు కాజాలడు. శ్రీసాయీ ప్రభువు వానికి జెందినవాడు కాడు. లోపల వెలుపలగల సకల సంబంధములను డులిచివేయవలయును. ఎంతత్వరలో యీ స్థితిని సాధకుడు పొందగలడో అంత అధికముగ శ్రీసాయిప్రభువు వానినంటుకొని యుండును. ఎంత త్రికరణ శుద్ధిగ ఈ నిరహంకృతిని - నిర్మమతలను సాధించగలడో ఆ తండ్రి అంత అధికముగ వానికి సత్ఫలముల ప్రసాదించుచుండును.

కొన్ని పరిమితులలో ఆ అహంతను కొందఱు త్రోసిపుచ్చుచుందురు. కారణము శ్రీ సాయీ ప్రభునందు గాఢమగు విశ్వాసము (నమ్మకము) లేకపోవుటయే, అందుచే వారి అవసరములను సమకూర్చుకొనుట యెట్టులా? - అని ఆలోచనల పాలగుదురు. కొందఱు తొలుత సర్వ సమర్పణము - సంపూర్ణ శరణాగతి జేసియు - పిదప లౌకికార్షణలచే పీడితులై వెనుకదారి పట్టి, పూర్వాభ్యాసములకు లోగి, ఫరోగమింప జాలకుందురు, ప్రప్రథమమున అహంతమమతలను తిరుగులేని సర్వసమర్పణము కావించి సంపూర్ణ శరణాగతి జేయుటయే కాక, నిత్యము ప్రపత్తి జేయుచుండ వలయును. అట్టులొనరించినగాని సాధకుడు సంపూర్ణ స్వేచ్ఛ, బంధవిముక్తి - శ్రీ సాయీ ప్రభువునందు సమైక్యత బడయజాలడు.

శ్రీ సాయీనాథుడు తన బిడ్డలకు పలుమాఱులు హెచ్చరిక చేసి, ప్రతిపదమున దెలుపుచున్న పరమ రహస్యమిదియే. "నీ అహంతను త్రోసిరాజనుము - విస్మరింపుము. అపుడు నీవు అధికముగ ఆంతరంగిక శాంతి పడయగలవు. సర్వసమర్పణము గావింపుము. దేనిని అంటుకొని దాచికొనకుము. దేనిని తిరిగి ఆసింపకుము. సంకోచింపక నిర్మలహృదయముతో నా యందు హత్తుకొనుము. అపుడు నేను నీవాడ నగుదును. నీవు ముక్తుడవగుదువు. మోహాంధకారము నిన్నావరింపదు.

నీ సర్వప్రయత్నములు - నీ కోరిక - నీ ప్రార్థనము స్వార్థపరత నశింప వలయునను తలంపుతో, నిరాడంబరముగ అకించనత్వముతో (శ్రీసాయినగు) నన్ను అనుసరించుచు అహంతను నిర్మూలించుచు దానిని శ్రీసాయియందు సంస్థాపితము గావించుము. అపుడు వ్యర్థములగు ఊహలు - ఆశయములు - నిష్కారణములైన వ్యసనములు - అనంతములగు ఆందోళనములు సంకుచితప్రేమలు నశించును. అపుడీ విశ్వమున దేనివలన భయము పొడమదు. సచ్చిదానంద సుఖశాంతిధామము బడయగలవు." అని శ్రీ సాయీప్రభువు బోధించినాడు.

ప్రార్థన:—

'మమత'-నీ పదాబ్జములంద మనగనిమ్ము
నెఱి 'నహంకృతి' 'నీవు'గా నెగడ నిమ్ము.
అటుల 'నీ-నా' విభేదంబు లడగజేసి
ఐక్యత ఘటింపు! సాయినాథా! సమర్థ!

14. క్రమశిక్షణ కలిగిన బుద్ధితో స్వకర్మముల నాచరించుచు ఎల్ల వేళల శ్రీసాయీ ప్రభువును సమాశ్రయింపవలయును:

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా
నిరాశీ నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః.

అఖిల కర్మముల్ భక్తి నాయందు నిలిపి
జ్ఞానచిత్తంబునన్ ఫలాసక్తి వదలి
మమత బోనాడి హృదయతాపమును విడిచి
శ్వేతవాహన! యుద్ధంబు జేయు మిపుడు.

(శ్రీమద్భగవద్గీతామృతము 3-30)

శ్రీ సాయీనాథ పదాశ్రితుడైన సాధకుడు దైవము తనకు విధించిన కర్మములను, ఫలాసక్తి వదలి సుశిక్షితమైన బుద్ధితో (వ్యవసాయాత్మక బుద్ధితో) తాను కర్తను అను భావము విడిచి, త్రికరణముల ఉద్వేగములేక యథాశక్తి సమాచరింప వలయును. అటుల కావించుచున్న కర్మములు తన విధ్యుక్త ధర్మములనియే భావించ వలయును కాని, ఇతరులకు బానిసీడుగను అన్యుల ప్రేరేపణము - ప్రోద్బలములచేత కావించుచున్నట్లు తలంపరాదు. ఆంతరంగిక స్వాతంత్ర్యమును విడనాడరాదు. భక్తి భావమును తొలగనీయరాదు. సాధకుడైన భక్తుడు ఎడమకంట లౌకిక విషయములను గమనించుచున్నను పారమార్థిక సత్యమునుండి - శ్రీసాయీ ప్రభువునుండి కుడి కన్ను మరల్చడు. లౌకికార్థములకు వశుడుకాడు.

ఏ ఐహిక విషయమైన సర్వ నియంతయైనను శ్రీ సాయీ భగవానుడేవి యెందుకు గల్పించెనో ఆ విషయమును ఆ స్వామి ప్రీతి కొఱకు తన ఆధ్యాత్మిక పురోభివృద్ధికొఱకు వినియోగించుకొన జూచును. ఏ ప్రాకృత విషయానుభూతియెడ నెట్టి సందేహము భక్తుడైన సాధకునకు గలిగిన వాడు తన దృష్టిని హృదయస్థాయివైపునకు మరల్చి ప్రార్థింపవలయును. వాని అంతరాత్మయైన స్వామి తత్ క్షణము యుక్త విధానమును స్ఫురింప జేయును. సాధకుడు గమనించు లౌకిక విషయములేవియైనను ప్రాకృత దృష్టితో విశ్వసింపక తన అంతరాత్మయైన శ్రీసాయీప్రబోధను గుర్తింపవలయును. అపుడెదుర్కొనుచున్న - ఇక మీద ఎదుర్కొనవలసిన సమస్యలనుగూర్చి సందేహనివృత్తి బడయగలడు.

శ్రీసాయీప్రభుపు భక్తులు - చందోర్కరు, కాకాదీక్షిత్తు, యస్. బి. ధుమాల్, చంద్రాబాయి మొదలగువారి వృత్తాంతములను సావధానముగ బరిశీలించి వారి వారి సందేహ సంకటాస్పదములైన పట్టులందు తమ దృష్టిని తమ హృదయ స్థాయియైన సాయివైపునకు మరలించి, తగిన ప్రభోధము పడసి, క్షేమకరమార్గమున నడచిన విషయములు విదితములు కాగలవు. కావున సాధకుడగువాడు తన కెట్టి సందేహ స్థితి తారొ్కనినను ఉద్వేగపడక దానిని తన నియంతయైన శ్రీసాయీనాథునకే వదలి, బాబా ఆయా విషయముల నెట్లు పరిష్కరించునో విశ్వాసముతో ధైర్యోత్సాహములతోగూడిన ఓర్పుతో వేచి యుండవలయును. అపుడాస్వామి నిర్ణయించు మార్గము తనకు క్షేమ కరమైనదిగ గుర్తింపగలడు.

శ్రీసాయీప్రభువును ఆశ్రయించియు లోకవిషయ లంపటుడైన మానవుడు బాబా అజ్ఞనిడువరకు వేచియుండ జాలడు. నరుడు సాధారణముగ నేదొక్క దానిని గూర్చి యోజించు చుండును. దానిని పొంద యత్నించును. అట్టి దానిని పొందినను స్థిమితపడక మఱియొకదానిని ఆసించును. అనగ మానివుని ప్రేమ, ఆసక్తి - ఏ యొక

దానియందే హత్తుకొని యుండదు. ఈ విధముగ నొకదాని పిదప మఱియొకదానికై పరితపించుచు విశ్రాంతిని బడయలేడు. కావున సాధకుడగు మానవుడు విషయముల నెంతలెంతలు త్యజింపనేర్చిన అంతలంతలు వానికి క్షేమకరము; స్వాతంత్ర్యము కలుగును. అటులగాక వివిధలౌకికార్థములకై పరుగులు వాఱుచుండెనా వాని కతడు బానిసీడగును. శ్రేయస్కామియైన మానవునకు పరమశత్రువైన ఆశాపిశాచి సద్విషయమును గాననీయక తన అశావాగురల నెల్లెడ పఱపి, దివారాత్రముల వంచించుచు సన్మార్గమునుండి తప్పించి, బంధింపయత్నించు చుండును. ఆ కారణముననే శ్రీసాయీప్రభువు తనవానికిటుల దెలిపినాడు.

మేలుకొలుపు :—

"జాగరిత బొందు! - బిడ్డ!" శ్రీసాయిపలుకు;
"అదియె కనుదూరమందు మాయాపిశాచి
పఱుగువాఱుచు నిను లోభపఱచుచుండె
ఆశపడితివా? యగు - సర్వనాశనంబు.

ద్వారకామాయిసౌధ కవాట మెపుడు
దిక్కులేనివారలు చేర దెఱచియుండు.
వస్తు సంభారములు చూడ స్వల్పమైన
ప్రేమపూర్వకముగ నివి పెట్టబడును.

గములు కట్టి కసాయి ప్రాంగణము జొచ్చు
నోరులేని యీ జీవుల తీరుగాంచి,
కరుణ వర్షించు నా పరాత్పరుని శక్తి
కతన వీనికై మది జాలి గాంచుచుంటి.

పథికుడా! నీదు చింత లావలకు ద్రోయు
మైహిక విచారములను మిథ్యలుగ గనుము!

ఇందు నీకు గావలసిన దే లవంబొ!
కాలపరిమితియే నధికంబుగాదు.

అకట! ఈ భాగ్యకలిత సౌఖ్యంబులెల్ల
స్వల్పములును ప్రతిక్షణ క్షయకరములు;
అల్పమగువాని గొండాడునట్టి జడుడు
వానికంటెను మిక్కిలి స్వల్పుడగును.

కుదురుగా నిన్నెడద జేర్చుకొనగనిమ్ము,
కల విచారంబులెల్ల నావలకు విడుము,
ఒనర నెడబాటు మనకు లేకుండుగాత!
నాదు సర్వస్వమును - నేను - నాది - నీవ!

అని శ్రీసాయీనాథుడు బోధించుచున్నాడు.

శ్రీసాయీనాథుని అనుసరింప దలచు సాధకుడైన భక్తుడు ఈ రహస్యమును నిరంతరము జ్ఞప్తియందుంచుకొనదగును. ఏమానవుని గలిసి సాంగత్యము చేసిన ఏ జీవిని ప్రేమించిన సేవించిన అది శ్రీ సాయీ పరముగ నుండవలయును. ప్రతి జీవియందు అధివసించిన శ్రీ సాయీప్రభువునే ప్రేమించి సేవించుచున్నవాడనని యతడు భావించవలయును. బాహ్యావేషమును పాటింపరాదు. మన ఆదరణ ప్రేమలు శ్రీసాయీ పరములుగ నుండవలయును. అపుడా జీవి (వస్తువు) మనల నిరసించిన, మన దృష్టిపథమునుండి తొలగిన మనము వ్యాకులత గనము. ఏ పనులను ఎవరికొఱకు గావించుచున్నను అవి యన్నియు శ్రీ సాయీప్రభు సేవలుగనే భావింపగలము. మన గురుదైవమైన శ్రీ సాయీనాథుడు సర్వభూతాత్మ - భూతాత్మయై యున్నవాడను విషయము మఱువరాదు.

శ్రీసాయీ సంబంధముగాని మైత్రి, ప్రేమ, సేవలు స్థిరము, బలీయము, సత్యము పవిత్రములు గావు. మానవుడు ప్రపంచదృష్టి

నెంతెంత దూరము చేసికొనునో దైవమున కంత సన్నిహితుడగును. స్వాతిశయ గర్వములు, అహంత మమతలు నిత్యకర్మాచరణమునందు ఏ లవమేని గలిగినవాడు శ్రీసాయీ కరుణాప్రసాదమును నిరోధించు చున్నవాడగును. ఏ జీవినేని ప్రాకృత దృష్టితో జూచుచు ప్రేమించు చున్నంతవరకు శ్రీసాయీ కరుణకు వాడు దూరమగును. సాధకుడగు భక్తుడీ విశ్వమంతయు తనకు ప్రబోధార్థము శ్రీసాయీ భగవానుడు కల్పించినదిగా భావించవలయునేకాని భిన్నముగా గనరాదు. అటుల నిస్స్వార్థబుద్ధికలిగి అహంకార మమకారములను త్యజించువాని హృదయమున శ్రీసాయీనాథుడు నిత్యనివాస మేర్పఱచుకొనును.

ప్రార్థన :—

ఈమాయాజగమందు గాననగు నాయీ ప్రాణిసందోహమున్
వ్యామోహంబున స్వీయకామపరితృప్త్యర్థంబుగా నెంచుచు
ద్దామ భ్రాంతిని జూచుచుంటి బరతత్త్వ జ్ఞానబోధార్థమౌ
నీ మూర్త్యంతరమౌట నేమఱితి దండ్రీ! సాయినాథప్రభూ!

చీమన్ దోమ సరీసృపంబులను బక్షివ్రాతమందున్ మృగ
స్తోమంబందున మానవప్రకరమందున్ జేతనాచేతన
గ్రామంబందున మాపురేపులను జాగ్రత్స్వప్న కాలంబులన్
నీ మూర్తిన్ గను బుద్ధి నాకిడవె; తండ్రీ! సాయినాథప్రభూ!

15. మానవుడు తన అధిక్యతను గర్వింపదగినది లేదు:

'భక్తి సుతంత్ర సకల గుణఖానీ
బిను సతసంగ నపావహి ప్రాణి
పుణ్యపుంజ బిను మిలహి న సంతా
సతసంగతి సంసృతి కర అంతా'

(శ్రీతులసీ రామాయణము)

సకల సద్గుణములను ప్రసాదించునది భక్తి. అది స్వతంత్ర, ఇతర సాయము దాని కవసరము లేదు. మానవు డట్టి భక్తిని సజ్జన (సాధు) సాంగత్యము లేక పడయజాలడు. పురాకృతసుకృత విశేషము కలిగినగాని సత్పురుష సాంగత్యము కలుగదు. అట్టి సమర్థసాధువుల జేరి వారి ననుసరింప గలిగినవాడు ఇక జనన మరణ రూప సంసార చక్రమున భ్రమింపడు.

శ్రీ సాయీభగవానుడు దయామయుడై అనుగ్రహించినదాని కంటె అధికమైన విషయము మానవునియందు లేదు. ఈమాత్రమున కేని వీడు తగడు. దీనికి కారణము ఆ తండ్రి కరుణయే. బాబా త్రోసి పుచ్చిన వీడేమి చెప్పుకొనగలడు? దీనిని ప్రసాదింపవే?, దానిని ప్రసాదింపవే! అని యేమి మొఱపెట్టుకొన గలడు? ఈ జీవితమున దయా సముద్రుడగు శ్రీసాయీప్రభువు ప్రసాదించిన దానితో సంతృప్తి సంతుష్టులను గలిగి యిటుల విన్నవించుకొనదగును.

"బాబా వాస్తవముగ నేను శూన్యుడను. ఎందులకు గొఱగాని వాడను. ఏమియు జేయజాలనివాడను. 'మంచి', అనునది నాలో లేనే లేదు. సర్వవిధముల అసమర్థుడను. నీవు చేయూత నీయవేని, అంత రంగిక ప్రబోధ కల్పింపవేని నేనొక కీటకమను. శతథాభిన్నములగు టకు సిద్ధముగ నున్నవాడను. కాని బాబా! నీవో సర్వదా నిర్వికారుడవు, సహనశీలుడవు. శ్రేయోవిధాయకుడవు, పవిత్రుడవు, న్యాయమూర్తివి, సకలమును ధర్మబద్ధముగ బ్రవర్తింపజేయువాడవు.

ఇక నా విషయమనిన, తిరోగమనముతప్ప పురోగతి నెఱుంగను. ఏ యొకచోటను స్థిమితపడియుండ నెఱుగను. ఇతర మానవులవలన ఊరటనొందగోరుటవ్యర్థము. నా దృష్టిని నిరంతరము నీయంద నిలుపనిమ్ము. నీ కరుణ ప్రసరింపబడినపుడే సత్య శాంతి సుఖములు ప్రాప్తమగును. నన్ను శ్లాఘించుకొనుటగాని యితరుల ప్రశంస కావించుటగాని వ్యర్థములు. సకలము నీ నుండియే వెలువడును. నీ యందే డిందును." అని, మొఱపెట్టుకొనవలయును.

మానవుడు తన విద్యాధన పదవీ గౌరవ స్వాతిశయములను దలంచుకొనుచు ఉబ్బితబ్బిబ్బులైన, శ్రీసాయీభగవానుని కరుణకు దూరుడగును. ఇతర మానవుల ప్రశంసల కాసించిన సుగుణ సంపదల గోల్పోవును. సద్గురుదేవుని గీర్తించుటయందే మానవుని ఘనత కలదు. సకల భూతాత్మ, భూతాత్మయైన శ్రీ సాయీ నామమును గీర్తించుట వలననే సాధకునకు శ్లాఘనీయస్థానము చేకూరును. హృదయానంద సంధాయి అయిన శ్రీ సాయిలీలలను భక్తి బలుకుచు, వినుచు, ఆ తండ్రి నామము సర్వదా స్మరించుచుండవలయును. ఐశ్వర్యయశోవీర్య శక్తిమహత్త్వము లన్నియు త్రిసత్యముగ శ్రీసాయీభగవానునియందే కలవు.

సాధారణముగ మానవుడు అంధప్రాయుడు. వీని గర్వాహంకారములు ఇరువైపులజేరి వీనిని పట్టుకొని పోవుచుండును. సత్య దృష్టితో పరిశీలించిన ఈ విశ్వమున ఏ జీవియు వీనికి హాని చేసినది, చేయునది లేదు. దేనినిగూర్చియేని శ్రీసాయీ ప్రభువుతో "ఇది నాకు అనిష్టము గూర్చినది", అని చెప్పుకొనుటకు అవకాశము లేదు. బాబా ఆజ్ఞల నుల్లంఘించుచున్న వీనికిట్టి అగౌరవకష్టవ్యసనములు తగును. వీనినన్నిటిని సహించి సాధకుడగు మానవుడు తన అకించనత్వమును గుర్తించుకొని శ్రీసాయీనాథునకు విధేయుడైయున్నగాని హృదయమున శాంతి సుఖ సంతృప్తులను బడయజాలడు.

శ్రేయస్కాముడగు సాధకుడు ఏమియు నెఱుగని తెలివిలేని వానివలె మెలగదగును. ఈ ప్రపంచమున నుండియు లేనివాడుగ భావింపదగును. ఈ ప్రపంచమునకు తాను తన కీ ప్రపంచము లేనిదిగ గ్రహించుకొన వలయును. వివిధములగు విషయముల కనియు కననియటుల, వినియు విననియటుల (నిర్లిప్తస్థితి, దేనితో బంధము గూర్చుకొనక) ప్రవర్తించుచు ప్రశాంతి ధామమున తనదృష్టి నిలుప వలయును. ఇతర మానవుల నెవరి త్రోవన వారిని బోనీయుచు, ఏ విషయమునుగూర్చి వాదోపవాదములకు గడంగరాదు. తనకు హితములు గానివానియందు బుద్ధి బోనుపరాదు. ఎల్లరు తనకు దైవము

నకు మధ్య నిలిచినను దైవనిర్ణయమును దృష్టియందుంచుకొని సాధకు డగువాడు పరాజితుడుగ భావించినను లోపము లేదు.

ఇంతకాలము ఏ స్వల్పమునకై ఆసించి శ్రమించుచుంటిమో అట్టి అత్యల్పమైనది నష్టమయ్యెనని మనము విలపించుచున్నారము కాని, ఆధ్యాత్మిక సుఖశాంతులకు హాని కలిగెనని చింతించుట లేదు. అత్యంత హితము, శ్రేయస్కరమైనదానిని త్రోసిరాజనినారము. కావున మెలకువ గలిగి మోహనిద్ర విడిచి, మనస్సును శ్రీసాయీ ప్రభువు నందు నిలిపి, స్థిమితపడవలయును.

ప్రార్థన:—

ఎఱుగన్ జాల హితంబు; స్వల్పములకై యిందందు మోహభ్రమన్
పఱుగుల్ వాఱుచు సోలి స్రుక్కితిని, నీపాదాబ్జసంసేవనా
పరతన్గాన; శరణ్యమీవ - యను సద్భావంబు హత్తించి, నీ
దఱికిన్ వీని మరల్చుకోగదె! సమర్థా! సాయినాథప్రభూ!

షష్ఠ పాదము సమాప్తము.

ఓమ్

# శ్రీ సాయీ అనుసరణము

## సప్తమ పాదము

1. మానవ జన్మము - ప్రాముఖ్యత:

"దుర్లభం త్రయ మే వైతే దైవానుగ్రహహేతుకమ్
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయమ్."

అని శ్రీ శంకర భగవత్పాదులు ప్రవచించినారు. ఈశ్వర లీలావిశేషములను గ్రహించు వివేకముగల జీవి - మనుష్యుడై జన్మించుట గొప్ప సుకృతము. ఇట్టి నరజన్మము కలిగినపిదప జనన మరణ చక్ర భ్రమణమునుండి - సంసారమునుండి విముక్తి నొందవలయునను వాంఛ గలుగుట మిక్కిలి గొప్ప సుకృతము. ఆ వాంఛ సిద్ధింప జేసికొనుటకు సమర్థుడగు సద్గురువును - ఆత్మజ్ఞుడైన మహాత్ముని ఆశ్రయము పడయ గలుగుట మహోన్నత సుకృతము అనక తప్పదు. శాస్త్రగురు బోధలచేత స్వానుభవమునను ఆత్మా-నాత్మ వివేకము గడించి క్షిప్రప్రదుడను - అపాంతరాత్మయు, పరమ శ్రేయోధామము గూర్ప సమర్థుడునగు గురుదేవుడైన శ్రీ సాయీ మహా ప్రభువు పదాశ్రయము గనుట బహుజన్మ సుకృత విశేషమగుచున్నది.

ప్రయత్నము :

ఈ శరీర మెప్పుడో యేనిమునమో మృత్యువు వాతబడునని తెన్నగ గ్రహించి ప్రతిక్షణము జీవిత పరమార్థమును పొందుటకు జాగ్రత్తపడ వలయును. ప్రాకృత మానవుడు లౌకిక వస్తువుల సమకూర్చుకొనుటకు ఎటుల పరుగులెత్తునో వివేకియగువాడు పరమార్థ ప్రాప్తి కంతత్వరపడవలయును. అటులగాక లోక విషయలంపటుడైన హీన జన్మములు తప్పవు. ఉపన్యాసములను వినినను, ధర్మశాస్త్రము

లను బెక్కు బఠించినను యోగములభ్యసించినను వివిధ సత్కర్మాదులాచరించినను పడయజాలనిపదవి సద్గురు సన్నిధిప్రభావముననే మన హృదయములు పరివర్తనములై నిర్మలము లగును. సద్గురువుల పలుకులు, చర్యలు మన దృష్టికి సామాన్యములుగ తోచుచున్నను సత్ప్రబోధము గలిగింప సమర్థములు. అట్టి మహాత్ముల సాంగత్యము, అనుసరణము, ఆశ్రితులకు క్షమ, శాంతి, విరక్తి, దాన, దయ శమదమాదులగూర్చి మోహనివృత్తిని గలిగించును. సద్గురువు నాశ్రయించి యనుసరించు నరుడు స్వానుభవమున ప్రతిక్షణము తలంపులలో చెయ్యులలో కలుగుచున్న మంచిమార్పులను గ్రహించగలడు, అగ్నిని సమీపించువానికి చలిభయము కలుగని విధమున సద్గురుదేవు నాశ్రయించువానికి పతన భయము లేదు. "అకుతో భయత్వము", సిద్ధించును.

ప్రార్థన :—

ఐహిక భోగ లంపటులునై ధనధాన్య సతీసుతాప్త సం
దోహము సేకరింపగ జనుల్ నిరతంబును గాంక్షసేయు న
ట్లీహ - భవత్పదంబుల వహింపగ జేయుము; కర్మబంధ దు
ర్మోహలతా లవిత్ర! గురుపుంగవ! సాయిభవాంబుధిప్లవా!

2. సమర్థ సద్గురు చేయూత అవసరము:

హరి కృపా తబ జానియే జేమానవ అవధార్
గురుకృపాతబ జానియే ఛుడావే సంసార్.

హరి కృపన్ మనుజున కవతారుడైన
పరమాత్మ గురువు చొప్పడును జగాన
గురుకృపన్ గనదేని గురుభవార్ణవము
దరియింపలేడు సుంతయు - నిది ధ్రువము.

[శ్రీసాయీ కబీరు సూక్తులు]

మానవులగు మనము సాధారణముగ మన పాపకర్మముల గష్టముల భరించి అనుభవింపవలయును. అవి మనము మోయలే నంత భారములైనవి. ఆధ్యాత్మిక దృష్టితో గాక లోకదృష్టితో వాని నెదుర్కొనవలయును. మనము బలహీనులము, అజ్ఞానులమగు జీవులము. సందేహములను బాపుకొనలేము. ఒక అడుగేనియు ముందునకు సాగింపజాలము. ఎంత వివేకియైన నొక్క దినముననే గగనమున కెగుర లేడు. మన మనస్సులో యుద్ధములు చెలరేగుచుండును. తొలుత మనయందుగల దోషములలో, ఆ పిదప మనమింతదనుక 'గుణములు' అని విశ్వసించిన వానితో స్పర్థించవలయును. మానవు డిన్నిటినుండి తేలికగ బైటపడజాలడు. కావున వీనికి సంఘర్షణము తప్పదు. మన భారము మోసికొను శక్తి గలుగువరకు, నిర్భయముగ క్షేమముగ జీవయాత్ర సాగించుటకు ఆధారము, సహాయము, కావల యును. అవలంబన మవసరము. నిర్జల కూపమున గూలిన మండూ కములగు మనము "ఇట్టి నిస్సహాయస్థితినుండి యెవరు వెలుపలకు చేర్చి రక్షింతురా! అని యెదురు చూచుచుందుము. కష్టపరంపరలు, దైనికసమస్యలు స్వశక్తిపై నాధారపడి పురోగమింపజాలమని తెలుపు చుండును. మన దేహ బుద్ధి బలములు చాలవు. ఉన్నతశక్తి సామర్థ్య ములు గలవారి సహాయము కావలయును. ఇట్టి విషమ జీవిత రంగ మున క్షేమముగ వర్తించుటకు సమర్థ సద్గురువు చేయూత అవసరము.

ఇది సాధారణ మనుష్యుల విధము. సాధన చతుష్టయము గడించి, ఆత్మాన్వేషణపరులై ఆధ్యాత్మిక మార్గమున గొంతదనుక పురోగమించి, కొంత అనుభవము గడించినవారు సైతము సమర్థ సద్గురువుల చేయూత నర్థింపక తప్పదు. (ఉపాసనీ మహారాజు మొదలగువారి వృత్తాంతములు "ఏమీ, నిన్నుపేక్షింతునా?" గ్రంథ మున జూడుడు) మన జాతి, కులమత దేహాత్మబుద్ధులు మనల విడువవు. మన పురాకృతకర్మఫల రూపములగు పెద్దబండలు మనల క్రుంగదీయుచుండును. మన స్వశక్తిపై నాధారపడిన లాభము లేదు, తృప్తిలేదు. సత్యాఽసత్యములు కార్యాఽకార్యములు, యుక్తాయుక్తము లను గుర్తింపగల బుద్ధిపాటవము మనకు లేదు. మనమీ కష్టముల

తప్పుకొనుటకై, దైవము, తదభిన్నుడగు అవతార పురుషుడు, సమర్థ సద్గురువు చేయ్యూత అవసరము అదియే దైవానుగ్రహము, లేక కరుణ.

'మానసికోత్సేకము కలిగించినను తాత్త్వికముగ ప్రయోజనకారి కాదు." అని ఆ కరుణనుగూర్చి లాఘవముగ భావించు విద్యాగర్వితులు కలరు. భౌతికవాదులు నవ్వుదురు. నైతికానుయాయులు నిరసింతురు. నాస్తికులు తెగడుదురు. అది వారల పొరపాటు. ఏ పరమాత్మ, దైవము ఆధారముగ ఈ జీవకోట్లు వర్థిల్లుచున్నవో అట్టి దైవ సహాయమును ప్రతిజీవియు పొందునవకాశము కలదు. మానవులు తమ తమ అనుభవముల బరిశీలించుకొందురేని ఆ కరుణ అనునది ప్రతిసత్యముగ గలదని యెల్లరకు బోధపడును.

కరుణ అననేమి? పరమాత్మ జీవాత్మ దరికి అవతరించుటయే కరుణ. అచింత్యము, అనూహ్యమునై సంతృప్తి సంతుష్టులను కలిగించు దివ్యశక్తిని జీవిపై ప్రసరించుట కరుణ. ఈ అంధకార ప్రపంచమున నిలుకడలేక అటునిటు అటమటించు జీవికి అదృశ్యమగు కరము నందించుటయే కరుణ. జీవిని ఆవరించియున్న నిశ్శబ్ద విశ్వమునుండి అకస్మాత్తుగా ఆ పరమాత్మ పలికిన పలుకు, కరుణ. నిరాశనొందిన జీవి చాతకమునకు గోచరించు ఇంద్రధనస్సు, కరుణ. నిబిడాంధకారమున నాకసమునకు కెగురు ప్రాణిచకోరము నెదుట తోచు చంద్రమండలము కరుణ.

అదియొక ప్రక్కన మానవసంకల్పము; అనుభూతి తనువుల మీదను, మఱియొకదెస మానవకర్మాదులపైనను ప్రసరించి, తన ప్రభావమును నెఱపి అద్భుతఫలము లొసంగు అపరాత్పరుని నిగూఢ శక్తి అది సర్వేశ్వరుని ఇచ్ఛ. కేవలము పవిత్రమగు కోరిక. అది యెఱుకపడని మార్గమున అద్భుతకార్యములను జరుప సమర్థమైనది. మూగను వాచాలునిగను, కుంటిని కొండలు దాటువానిగను మృతుని జీవితునిగ, పతితుని పరమపావనునిగ చేసి, మానవునకంతర్దృష్టిని ప్రసాదింప సమర్థమైనది కరుణ.

ప్రతిజీవియందు ఆ పరమాత్మ అధివసించినట్లు ఆ స్వామి కరుణయు కలదు, ఆ శక్తి మేల్కొలుపబడినపుడే - అది మానసికము గానిండు - దైహికముగానిండు - భావప్రేరితముగానిండు-బహుకార్యతో ముఖముగానిండు దాని విధానమును గుర్తింపగలము. ఆ కరుణాశక్తి అద్భుతము, మనోబుద్ధి మార్గముల స్పృశించి, జీవి నుత్సాహపూరితుని జేసి, చక్కని మార్పు గూర్చజాలినది. ఆ పరమాత్మ - దైవము ఎక్కడో లేడు. హృదయముననే - ప్రాణసన్నిహితవర్తి యగుచునే యున్నాడు. దైవ మెక్కడనో యున్నయటుల తలంచుట కేవలము భ్రాంతి. యోగాభ్యాసమున - తత్త్వవిచారమున - సద్గురువు ననుగ్రహమున మానవు డీ రహస్యమును తెలిసికొనగలడు. సర్వభూత హృదయాంతర్వర్తి" ఈశ్వరుడను నుడి కేవలము కవితాచమత్కృతి కాదు. అది శాస్త్రీయమైనది. సత్యము - హృదయమే ఆ దైవము నివాసస్థానము. కావున అనుగ్రహప్రభువు కరుణయు హృదయముననే మనకు గోచరించును.

దైవకరుణ రెండువిధముల ప్రకటమగును. బాహ్యజీవితమునందు అసంతుష్టి- అసంతృప్తి జనించుట - మొదటిది (వైరాగ్యము.) అధ్యాత్మిక సత్యమెఱుగ వలయునను ఆసక్తి (జిజ్ఞాస) రెండవది. మన బుద్ధిని మెల్లగ హృదయము వైపున కాకర్షించుటతో కరుణ ఉదయమొందును. బుద్ధిని బాహ్యప్రపంచమునుండి మధ్యగామియైన ఒకశక్తి లోనికి ఆకర్షించుచుండును. ఆ విధముగ ఆకర్షింపబడిన జీవి ఆశక్తి కనుగుణముగ నెంతెంత అంతర్ముఖస్థితి నొందుచుండునో అంతంత ఫలము నొందజాలును. ఏదియో తనముందు దాగియుండెనని దాని నెఱుగ వలయునని భావించును. అది వాని బుద్ధికి స్పష్టముగ తోచదు. కాని అదియొక పవిత్రవస్తువని అతని అంతర్దృష్టికి యించుక ద్యోతక మగుచుండును. అంతిమఫలము "నేనెవడను?" అను ప్రత్యేక స్థితిని - సాధకుని హృదయమున స్థిరీభూతము జేయును. అటుల మార్గము నిర్దేశించు అంతిమ సత్యమునందు సాధకుడు లయము నొందును. మొదటి స్థితి క్రమక్రమముగ రెండవస్థితికి జేర్చుచు నెప్పటికప్పుడు సత్ఫలితముల నందించుచుండును.

హృదయమున రేకెత్తు ఆధ్యాత్మిక పిపాసచేత జిజ్ఞాసువు తల్లడిల్లుటకు నిరంతరము బాష్పములు స్రవించును. భావప్రేరితము లైన సంతత బాహ్యాంతర మనోవృత్తుల సంఘర్షణ ఫలితముగ ఆ కరుణ తోచును. కొన్ని యెడల నది నిగూఢముగ వెలుగుగ - కొన్నిట సమర్థ సద్గురురూపమున ద్యోతకమగును. అది క్షణమే కావచ్చును. మరల తోచక పోవచ్చును. ఆ పవిత్ర క్షణములు ఆ పరాశక్తి వీని అహంతను స్వాధీనపరచుకొని తన వశము జేసికొనును. దైవకరుణ ప్రసరింపబడినట్లు సాధకు డెఱుగును, ఆ స్థితికి జీవి నిస్సందేహముగ లొంగి, దాసుడై యనుసరింపవలయును. ఆ కరుణాప్రసారము క్షణికమే యైనను దాని ప్రభావము వారములు - నెలలు - సంవత్సరముల తరబడి జీవిని సక్రమ పథమున నడుపుచుండును. అంతర్ధనుక గోచరింపని అవకాశములు వానికి బొడగట్టుచుండును.

కరుణా స్పర్శ జీవి నైతిక విధానమును తొలుత గోచరించును. పిదప తలవని తలంపుగ ఆ శక్తి వీని జీవితపథమున పూర్తిగ మార్పుగొనివచ్చును. ఘోరపాతకి యగువాని హృదయమందున నిష్కళంకము నిరామయమైన ఆ పరమాత్మ అధివసించి యా జీవిని "తెలివిగలిగి మంచిమార్గమున ప్రవర్తింపు" మని మెల్లగ పలుకుచునే యుండును. 'మేము పవిత్రులము - మేము పుణ్యాత్ములము' అని స్వాభిమానులై గర్వించు మానవులచే నట్టివాడు నిరసింపబడినను - అట్టి పాపియెడలనే పరమాత్మ ప్రేమ మధికముగ ప్రసరించును. చెడిపోయిన బిడ్డ ఎటుల బాగుపడునా!" అను చింత తండ్రికెప్పుడు నుండుట సహజము, అనుభవసిద్ధము. దరిజేరువారి కందఱకు కుసుమము సువాసనల బ్రసరించుచుండును. ఎవరిని కాదనదు. ఇక పరమాత్మ కరుణ జీవులపై ప్రసరింప కుండునా? - స్వాభిమాన మానవ సంఘము త్రోసిపుచ్చిన మాత్రమున ఈశ్వరుడు పాపులపై కరుణ జూపకుండునా? ఎన్నడు నటుల జరుగదు. ఆ పాపికిని తండ్రి తనను జేరు అవకాశమును గల్పించును. వానిని దుష్పథము నుండి మరల్చును. తన కభిముఖము గావించుకొనును. తన కరుణను ప్రసరించును.

ఆ కరుణా స్పర్శ ప్రభావమున పాపి పాపము సర్వము పటా పంచలగును. త్రివిధ తాపములు శమించును. అసహ్యమగు గతము గతించును. నింద శమించును. నిరాశ నిర్ధూతమగును. బలహీనులు తేరికొందురు. బాధితు లోదార్పబడుదురు. మానవు డే మార్గముననైని - ఐహికముగగానీ - అధ్యాత్మికముగగానీ ఏ ఉన్నతస్థాన మాక్రమించి నను - అది యీ కరుణా ప్రభావమే. అది - సచ్చిదానంద పరబ్రహ్మము అను ధనపేటికకు బీగము.

ఈశ్వరుని కరుణ అందఱిపై ఒక్కసారిగ ప్రసరించి, అంద అను సన్మార్గవర్తులుగ నేల చేయదు? - అనిన - అది దాని యిష్టము ననుసరించి ప్రసరించును. కాని మన యిష్టప్రకారము కాదు. అది తలవని తలంపుగ ఆకస్మికముగ ప్రసరించును. అది యొక బహు మానము. ఉపాయములను పన్ని, కలహించి దానిని బడయలేము. దానికి దగిన పాత్రులమగుటకు ప్రయత్నము చేయవలయును.

ఆ 'కరుణ' గర్వితులకు లభింపదు. దీనులకు విధేయులకు మాత్రము ప్రాప్తించును. మానవుని సమస్త శక్తులుడిగి, అతని ప్రయత్న ములు విఫలములై వేఱుగతి లేదు - అను భావము వానికి స్ఫురించి నపుడే ఆ కరుణ దోచును. ఆసించి అపేక్షించి ప్రార్థించినపుడే ఆ కరుణ పొడమును. ఇచ్చిపుచ్చుకొనువారికి సంబంధమునుగూర్చి ఆక ర్షించుటకు ఆధారభూతములు "విశ్వాసప్రేమలు", సర్వనియంతయైన పరమాత్మ కలడు. అంతకంటె ప్రేమపాత్రము మఱియొకటి లేదు. అని ఆ పరమాత్మయందు గాఢమగు ప్రేమ, సాధకుని హృదయమున పాదుకొనవలయును. ఆ సత్యవస్తువు నెఱిగి పొందుటయే మానవ జీవిత లక్ష్యమని సాధకుడు స్పష్టముగ గ్రహించవలయును.

మన భావము మార్చుకొని - ప్రాకృతవిషయముల బ్రేమిం చుట మాని, ఆ పరమాత్మను - అవతారపురుషుడగు సద్గురుదేవుని - ప్రేమతో జూడవలయును. ఆ సిద్ధ వస్తువునకు భక్తులము కావలయును. సర్వజ్ఞత - సర్వసమర్థత - సర్వనియంతృత - లా వస్తువునకు గలవని గాఢముగ విశ్వసింపవలయును, ఆ వస్తువును భావించి, అనుభవించి

మన విధులను నిర్వర్తించునటుల జేసికొనవలయును. "నీ యిష్టమే కానిమ్ము - నా యిష్టము కాదు"- అని చెప్పుకొనవలయును. అటుల జరువుట కంగీకరింపవలయును. వాస్తవముగ మంచు ఆకాశమునుండి అంతట నేలపై బడునటుల ఈశ్వరుడు తన కరుణ నంతట వర్షించు చునే యున్నాడు. కాని మానవులు దానిని స్వీకరింపజాలకున్నారు.

ఆ పరమాత్మవసించు మహెూత్కృష్ట రాజసౌధమును ప్రవేశించుటకు - దాని గడియ దొలగింపజాలినది మన విధేయత- అడకువ. గర్వపూరిత అహంతను - స్వార్థపరతను మోహబుద్ధిని త్యజించినగాని ఆ మందిరమును ప్రవేశించు అర్హత మనకు లేదు. ఆ కరుణాసారము మనపై వర్షించుటకు సర్వసమర్పణము గావింపవలయును.

కరుణాప్రసారము సర్వేశ్వరుని కార్యము. జీవి దానికై ప్రార్థించి నిరీక్షించవలయును. సంకుచిత బుద్ధిని విడిచి దృష్టిని పరమాత్మవైపునకు మరల్చవలయును. నిశ్చల నిర్వంచిత బుద్ధితో గావించు ప్రార్థన మెన్నడు వ్యర్థము కాదు. అంతర్యామియగు సర్వేశ్వరుడు శ్రీ సాయీనాథుడు తప్పక వినును. మన ప్రార్థనము తలంపుతోడనేకాక, కార్యరూపమున ప్రకటము గావలయును. ఏదో యొకపట్టునగాక, నిరంతరముగ నుండవలయును. నిండుప్రేమతో గావించు ప్రార్థనము సద్యోఫలిత మొసంగును. అది మనకిష్టమైనను లేక అనిష్టమైనను తాత్కాలిక ఫలముల గలిగించునది యైనను అట్టి ఫలితములు మున్ముందు హితకరములైనవై మనకు శ్రేయము కలుగ జేయునవి యగును.

ప్రార్థన:-

ఎల్ల జీవంబుల హృదయంబులన్ నిల్చి
వెలయించు దీవను తలపు నిమ్ము,
సర్వేశ్వరుండవు సర్వనియంత వా
శ్రయ మీవ యనెడి విశ్వాసమిమ్ము,

ఈ జీవి కావించు కృతులు సర్వంబు నీ
ప్రీత్యర్థములుగ భావింపనిమ్ము,
నీ కరుణనుగాక ఆకేనియు జలింప
జంకునన్ నిశ్చయ జ్ఞానమిమ్ము,
అడకువయు నిరహంకృతి దొడరనిమ్ము,
భక్తియును ప్రేమ నీ యంద పఱగనిమ్ము,
మనసు బుద్ధిని నీయంద చొనుపనిమ్ము,
సత్యకరుణాస్వభావ! శ్రీ సాయిదేవ!

3. శ్రీ సాయీ కరుణ లోకవిషయలంపటులకు లభించదు.

విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే
మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే.

తఱచు విషయములను ధ్యానించు చిత్తంబు
అట్టివానియంద హత్తుకొనును;
ఏక భక్తి నన్ స్మరించు మానసము నా
యంద తుది లయంబ నొందు.

(శ్రీమద్భాగవతము)

శ్రీసాయీ మహాప్రభువు కరుణ అమూల్యము. లౌకికవస్తువులతో నది కలియదు. ప్రాపంచక సుఖసంపదలతో దానికి సంబంధము లేదు. ఆ తండ్రి కరుణ మనకు మనయందు ప్రసరించుటకు నిరోధములగువానిని తొలగించుకొన వలయును.

'ఆసలీహలు లోభము నన్యనింద
కపటమున నసత్యమును కాముకప్రవృత్తి
ఆగ్రహంబను నెనిమిది యవగుణముల
నవల ద్రోయునో సాయి పదాంకితుండు,

సాధకుడగు జీవి వీని నెంతెంత అవలకుఁ ద్రోయునో అంతంత అధిక ముగ శ్రీసాయి కరుణకు పాత్రుడగును. అంతంత స్వేచ్ఛ మనశ్శాంతి సంతృప్తి సంతుష్టు లాతఁడు పొందు చుండును. ఏ విషయమును గూర్చియైన ఇతరులతో వాదోపవాద సంభాషణము లుడిగి, యేకాంత స్థలముఁ జేరి, ఆత్మనిష్ఠుఁడై శ్రీసాయీ భగవానుని ప్రార్థింపవలయును. మనస్సు నిశ్చలమై బుద్ధి నిర్మలమగుటకు ప్రార్థన మవసరము. ఈ సమస్త విశ్వము అస్థిరమైనదిగ భావింపవలయును. ఇతరముల నన్నిటికంటె భగవానుడగు శ్రీసాయీనాథు నధికముగ ప్రేమింప వలయును. సద్గురుదేవునందు లోకవిషయములందు నేక కాలమున మనస్సు నిలుపుట దుర్లభము. మనకు ఆధ్యాత్మిక పరాప్రేమ యెంతెంత వృద్ధి పొందునో బాహ్యప్రపంచ మంతంత సడలును. స్వార్థపరత స్వలాభకాంక్షయే యీ బంధములకు మూలకారణము. కావున దాని మూలమును భేదింపవలయును. ఈ స్వార్థపరతను నిర్మూలించిన, తక్కినవానిని తేలికగ జయింపనగును.

దైవీ హ్యేషాగుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే.

దేవ సంబంధియును మఱి త్రిగుణమయము
నైన నా మాయదాటగా నలవికాదు;
ఎవరు ననుమాత్రము సమాశ్రయింపగలరొ
వారలీ మాయను తరింత్రు; పాండవేయ.

(శ్రీమద్భగవద్గీతామృతము 7-14)

ఈ ప్రపంచమంతయు త్రిగుణాత్మకమైన మాయామయ మైనది. అట్టి మాయా మోహితులై సకల ప్రాణులు చరించు చుండును. ఎవరు నన్ను సమాశ్రయించి సంపూర్ణ శరణాగతి జేయుదురో వారు మాత్రమే యీ మాయను తరింపఁగలరు, అని శ్రీకృష్ణభగవానుడు బోధించినాడు. దైవమును సమాశ్రయించిన జీవియెడ పరమాత్మ తన కరుణను ప్రసరించి మాయాబంధములనుండి ఆ జీవిని దప్పిం

చును. మన భక్తి ప్రపత్తు లెంతెంత వృద్ధియగుచుండునో మాయా బంధము లంతంత సడలును.

మనము ప్రశాంతముగ పరిశీలింతుమేని మన మనస్సులో మంచి - చెడు తలంపులకు ప్రతిక్షణము సంఘర్షణము జరుగుచునే యుండును. చెడును నిరోధించుటకు సద్గురుదేవుని కరుణ అవసరము. ఆ కరుణావేశమునఁ బడసిన జీవి చెడును విడిచి మంచిని చేపట్టును, ఈ మాయాప్రభావమును - శ్రీ సాయీనాథుని కరుణాప్రభావమును పరిశీలనము చేసికొనుట లెంతయు నవసరము.

ప్రార్థన:—

సాయీ! నా యపరాధముల్ సయిచి, నా స్వాంతంబు జక్కంబడన్
జేయంజాలుదటంచు నెంచెదను; దుశ్చింతల్ తొలగింపుమీ,
మాయం ద్రోయకు - నీ పదాబ్జముల సంభావింపగా నిమ్ము, దే
వా! యీ నీదు పరీక్షకున్ నిలువ నాకౌనే? దయాంభోనిధీ?

4. మాయ (లేక ప్రకృతి) - కరుణ.

ధీవరదత్త మహామిషమశ్నన్ వైశారిణో ౽ మ్రియతే
తద్వద్విషయాన్ భుంజన్ కాలాకృష్టో నరః పతతి.

మొఱకు జాలరి తినజూపు నెఱను గఱచి
ప్రాణములు గోలుపోయెడి మీను కరణి
క్షణికమాత్ర విషముల ననుభవించి
కాలబద్ధుడై మనుజుడు కూలుచుండు.

ఉరగగ్రస్తార్ధతను ర్భేకో ౽ శ్నాతీహ మక్షికాః శతశః
ఏనం గతాయు రపిస న్విషయానముపార్జియత్యంధః

సగము మేనివరకు సర్పంబు మ్రింగిన
కప్ప మక్షికాళి నప్పళించు;

జగతి నాయువిటుల సమయుచున్నను నిక
యముల మూఢబుద్ధి యాససేయు.

(ప్రబోధసుధాకరము - విషయనిగ్రహ ప్రకరణము)

మాయ (లేక ప్రకృతి) ఆకర్షణము - కరుణ ప్రభావమును గూర్చి విచారించుదము. పరమాత్మ - దైవమునుగూర్చి పలుకునెడ 'మాయ' యందుము. జీవినిగూర్చి చెప్పునపుడు 'అవిద్య'(అజ్ఞానము) అందుము. జీవినిగూర్చి తెలుపుచున్న 'మాయ' అను పదము వాడినను అది 'అవిద్య' (లేక అజ్ఞానము) అనియే మనము గ్రహించవలసియున్నది.

'మాయ' - 'కరుణ' - ఈ రెండును ఒకదానికొకటి విరుద్ధములు. మాయా మార్గమునకు వ్యతిరేకమైనది కరుణామార్గము. అంతర్దృష్టి - ఆధ్యాత్మిక చింతనము అంతర్జ్యోతి గలవానికిగాని ఈ రెండింటి జాడలు వేద్యములు కావు. మనుష్యులెల్లరు మంచినే యన్వేషించుచుందురు. వారు పలుకు మాటలందును - చేయుచున్న పనులందును మంచియున్నట్టుతే తలంతురు. అట్టి 'మంచి' అను భావనలోపడి పలువురు వంచితులగుదురు.

మాయ:- మిక్కిలి టక్కరి. పలువుర నాకర్షించును. తన యురులలో జిక్కించుకొనును. వంచించును. తుదకు స్వార్థముకై వారిని వినియోగించును.

కరుణ:- నిరాడంబరమగు నడక గలది. దుష్టవేషధారులు దాని దగ్గఱ లేవు. ఎవరిని వంచింపదు. ఈశ్వరార్థ మెల్లపనులను గావించును. ఈశ్వరునియందే అది తుది లీనమొందును.

మాయ:- నిరోధింపనీయదు. సాధ్యము కాదు. దాని నతిక్రమింపనీయదు. ఒకరికి లొంగదు. తనకు తాన అణగు స్వభావము కలది కాదు.

కరుణ:- గ్రహింపగలదు. విధేయత ప్రకటించును. ఇంద్రియముల నిరోధించును. ఉన్నతాదర్శములకు లోబడును.

స్వేచ్ఛాప్రవర్తనము ప్రకటింపదు. కోరువారికి సాధ్యమగును. ఎవరి పైనను స్వాధికారము ప్రయోగింప దలపదు. దైవమున కధీనమై, దైవము నాశ్రయించి, దైవము నాజ్ఞమేరకు ఎల్ల ప్రాణులకు లొంగి యుండును.

మాయ:— స్వార్థాభిలాష కలది. ఇతరులనుండి ఏమి లాభము పొందగలమా? - అని అవకాశమునకై వేచియుండును,

కరుణ:— స్వార్థచింత లేనిది. పలువురకెట్టుల లాభము కలిగింతునా? - అను తలంపు కలది,

మాయ:— ప్రశంసలను, గౌరవములను సంతోషముతో స్వీకరించును,

కరుణ:— ఎల్లకీర్తిగౌరవములను దైవపరములుగ దలంచును.

మాయ:— అవమాన లాఘవములకు జంకును.

కరుణ:— దైవము నిమిత్తమై అవమతిని సహించును.

మాయ:— అలసత - దేహవిశ్రాంతులను కోరును.

కరుణ:— సోమరితనము సహింపదు., సంతోషపూర్వకముగ కష్టించును.

మాయ:— అద్భుతసుందరవస్తువులను కూర్చుకొనజూచును, కాని సామాన్యములు - మొరటు వస్తువుల కాసపడదు.

కరుణ:— సామాన్యములు అల్పములగు వస్తువులచే సంతోషించును. ముతకవానిని నిరాకరింపదు. చినుగుప్రాతల ధరించుటకు కోపగింపదు.

మాయ:— అశ్వరపదార్థముల నాదరించును. ప్రాపంచక లాభముల కుప్పొంగును. నష్టములకై శోకించును. స్వల్పనిరసన వాక్కులకు ఉద్రేకము ప్రకటించును.

కరుణ:— శాశ్వతములను కాంక్షించును. దేశకాల పరిమితులకై ప్రాకులాడదు. అవి నశించిన చలింపదు కటువుల కాగ్రహింపదు. తనసర్వస్వము ఆనందమయము నాశరహితమునగు శ్రీసాయీ పదములందే వదిలపఱచుకొనును.

మాయ:— మిక్కిలి లోభి. కరుణ - ఎంతసేపు తీసికొన జూచునేకాని యీయదు. సకలము దనకై వినియోగించుకొన జూచును.

కరుణ:— ఔదార్యము గలది. నిష్కల్మషహృదయ - స్వల్ప సంతోషి. స్వార్థప్రయోజనము లేనిది, తీసికొనుటకంటె నిచ్చుటకే ముందంజ వేయును.

మాయ:— జీవములకు హత్తుకొనును. స్వకీయముల వైపునకే మ్రొగ్గును. గర్వప్రవృత్తి కలది. కాలు నిలకడ లేనిది.

కరుణ:— సద్గుణ సంపదవైపునకు - భగవంతుని దరికి జీవిని ఆకర్షించును. ఇతర జీవులకై ప్రాకులాడదు. ప్రపంచమంతట నావరించును. మాంసవసాది వికారములకు ఆసింపదు. సంతాపశీల గాదు. పలువురలో జొఱబడుటకు సిగ్గునొందును.

మాయ:— బాహ్యసుఖముల నాసక్తితో గ్రహించును. ఇంద్రియ సంతృప్తి గూర్చుకొనును.

కరుణ:— భగవానునందే రమించును. ప్రపంచాతీత సామ్రాజ్యమునందు ఆనందించును.

మాయ:— స్వార్థలాభములకై పనుల గావించును. పనుల గారవించును. ఉచితముగ దేనిని జేయదు. తాను గావించు పనులకు సమానముగ - అంతకధికముగ ప్రతిఫల గౌరవాదుల గాంక్షించును. తన కృతులను-బహూకృతులను పలువురు కొండాడవలయునని కోరుచుండును.

కరుణ:— అశ్వరముల కోరదు. ప్రతిఫలకాంక్ష కనదు. అది కోరు ప్రతిఫలము భగవానుడే. శ్రీసాయీ ప్రభువుయొక్క

సచ్చిదానందధామము బడయువరకు జీవితమున నెంత అవసరమో ఆమాత్ర మది స్వీకరించును.

మాయ:— జనకూటములు - బంధుమిత్ర వర్గములలో నానందింపజూచును. తన వస్తువాహన సంపదలను వంశౌన్నత్యమును గాంచి విఱ్ఱవీగుచుండును ఉన్నతాధికారములందున్నవారిని ధనికులను తనకు దీటైనవారిని వేనోళ్ళ బొగడును.

కరుణ:— తన శత్రువులనుగూడ ప్రేమించును. మిత్రులున్న నుబ్బదు. గొప్పగుణవిశేషములున్నదప్ప తన బంధు మిత్రాదులనైన పాటింపదు. ధనికులకంటె పేదలనే ఆదరించును. అధికారులకంటె సామాన్యులనే ప్రేమించును. మోసగాండ్రను జేరదు. సత్యమార్గాను వర్తుల గౌరవించును. సాధువర్తులనితోఽధిక సుగుణసంపద సేకరింపుమని ప్రోత్సహించును

మాయ;— తన కష్టనష్ట దారిద్ర్యములను వెడలబోసికొని విలపించును.

కరుణ:— దారిద్ర్యాదులను ధైర్యోత్సాహములతో గూడిన ఓర్పు గలిగి సహించును.

మాయ:— సకలము తన కైవసము జేసికొన జూచును. స్వప్రయోజనార్థము శ్రమించును. కలహించును.

కరుణ:— సకల వస్తువులను జనకస్థానమైన దైవమునకే విడచును. ఏ మంచి పనియేని తనదిగ భావించదు. స్వాతిశయము ప్రకటించుకొనదు. కలహించదు. తనమాటే చెల్లవలయునని పట్టు పట్టదు. ఎఱుకగలిగి యెదుటివాని వివేకమునకు దైవపరీక్షలకు దలయొగ్గును.

మాయ:— గోప్యము తెలియగ వేగిరపడును. క్రొత్తక్రొత్తవారలకై నిరీక్షించును. ఎల్లెడల సంచరించి వివిధ విషయానుభవములచే ఇంద్రియములకు సంతృప్తి గూర్చుకొనును. తన నెల్లరెఱిగి తనచెయ్వుల నెల్లరగ్గించి, ఆశ్చర్యము ప్రకటించ వలయునని కోరుచుండును,

కరుణ:— లోకవార్తల కాసపడదు వింతలు వినోదములకై ఉత్సుకత వహింపదు. దానికి 'క్రొత్త' అనునదిలేదు. ప్రాతవికారములే యని - సకలము అస్థిరమని అది యెఱుగును. ఇంద్రియముల నిగ్రహించి, వ్యర్థసంతోష స్వాతిశయముల పరిత్యజించి, యేవేని మెచ్చుకొనదగిన గుణాతిశయము లున్నచో నడకువతో వానిని గోప్య పఱచుకొనుమని అది బోధించును. ప్రతి విషయమును - ప్రతి అనుభవమును అధ్యాత్మిక బుద్ధితో బరిశీలించి, దైవప్రభావమును గ్రహింపుమని అది యెఱుక పఱచును. తనకుగలదానిని కొండాడుకొన గోరదు. ఆ దైవము తన బిడ్డలందుగల అపార ప్రేమచే బహూకరించి నదిగ దలంచును.

ఈ 'కరుణ' ఆ ప్రాకృతతేజము. దైవమనుగ్రహించిన ప్రత్యేక 'బహుమతి' - "ఈతడు నావాడు" - అని దైవము నిర్దేశించు విశిష్ట చిహ్నము. లౌకిక విషయములనుండి జీవిని మఱలించి, అధ్యాత్మిక మార్గమున నడిపించి, సచ్చిదానంద పరమధామమునకు ఈ జీవిని జేర్పింతునని దైవము కావించు వాగ్దానము; ప్రదర్శించు 'అభయహస్తము'.

కావున ఈ 'మాయ' యెంతెంతదనుక నిర్జింపబడి యెంతెంత దూరము చేయబడుచుండునో శ్రీ సాయీ కరుణ మనుజునందంత వృద్ధి పొందుచుండును. ఆ జీవి నిత్యనూతనానుభవములచే చక్కగ మార్పు నొంది శ్రీసాయి సాయుజ్య పదముపొంద నర్హత గాంచును.

ప్రార్థన:—

సర్వభూతాంతర స్థాయివైయున్న నీ
సహజ స్వరూప మాచ్ఛాదపఱచి,
బహువిధానేక రూపముల జొప్పడజేసి
స్వపర భేదంబుల బాదుకొలిపి,

ప్రాణికోట్లను శత్రువర్గంబు పాల్సేసి
సతత రాగద్వేషగతుల మెలపి
జనన మరణరూప చక్ర భ్రమణమున
త్రిప్పి కలంచుచు క్రీడసలుపు
నీదు మాయను గడవంగ నేరనెందు
శరణు జొచ్చితి నీ పదాబ్జములు నమ్మి
అనుసరించు నీ బిడ్డడ; అభయమిమ్ము!
సత్యకరుణా స్వభావ! శ్రీసాయిదేవ!

5. అహంత మమతలను (నేను - నాది అను భావమును) త్రోసి పుచ్చి శ్రీసాయీ మహాప్రభువు అడుగుజాడలను మాత్రమే గుర్తించుచు అనుసరింపవలయును.

"పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూ
స్తస్మాత్పరాన్ పశ్యతి నాంతరాత్మన్
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మా నమైక్ష
దావృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్.
పరాచః కామా ననుసయంతి బాలాః
తే మృత్యోర్యంతి వితతస్య పాశమ్
అథధీరా అమృతత్వం విదిత్వా
ధ్రువమధ్రువే ష్విహ నప్రార్థయంతే."

కఠోపనిషత్తు - 2 - 4 - 1,2

పరమాత్మ స్వవిషయములైన యింద్రియములను దండించుచున్నాడు. ఆత్మజ్ఞానముచేత మాత్రమే యింద్రియములను స్వాధీనము చేసికొనుటకు సాధ్యమగును. కావున లోకులు సాధారణముగ అనాత్మ భూతములను (లోకవిషయములను) చూచుచున్నారేకాని, అంతరాత్మను (పరమాత్మను) చూచుటలేదు. ఎందేని ఒక ధీరుడు (వివేకి) అమృతత్వమును కోరినవాడుగను చక్షురాది ఇంద్రియములను

నిగ్రహించిన వాడుగనుండి ప్రత్యగాత్మను - పరమాత్మను చూచుచున్నాడు. అవివేకులు అనాత్మభూతములైన విషయములను అనుసరించుచున్నారు. కావున వారు సర్వత్ర వ్యాపించియున్న మృత్యు పాశమునకు లోనయ్యెదరు. వివేకులు మాత్రము శాశ్వతమైన అమృతత్వమును - బ్రహ్మమును తెలిసికొని అనిత్యవస్తువులను త్రోసిపుచ్చుచున్నారు. కోరుటలేదు.

మనమెంతలెంతలు వెలుపల సంచారముమాని అంతర్ముఖులమగుచుందుమో అంతలంతలు శ్రీసాయీమహాప్రభువును సమీపించుచుందుము లౌకిక విషయములను విడిచినకొలది ఆంతరంగిక శాంతి కలుగును. అహంకారము- (నేను అను భావము) మఱచుకొలది శ్రీసాయీ భగవానుని సమీపించుచుందుము. సాధకుడు అహంతను సంపూర్ణముగ నిర్మూలించి ఏ విధమైన పరిమితి, సంకోచము లేక శ్రీసాయీశుని ఇచ్ఛకు సకలము సమర్పించవలయును. "బాబా! నీ యిచ్ఛయే కానిమ్ము!" అని! త్రికరణశుద్ధిగ జెప్పుకొనవలయును.

అపుడు సర్వసమర్థ సద్గురుదేవుడైన శ్రీసాయీనాథుని అనుసరింపవలయును. సాధకుడగు భక్తునకు శ్రీసాయియే - మార్గము - సత్యము - జీవము (ప్రాణము) 'మార్గము' లేనిదే గమనము లేదు. 'సత్యము' లేనిదే ఎఱుకలేదు. 'ప్రాణము లేనిదే జీవితము లేదు. సాధకుడగువాడు అనుసరింపదగిన మార్గము-శ్రీసాయి; విశ్వసించి యెఱుగదగిన సత్యము శ్రీసాయి; ఆసించదగిన ప్రాణము (జీవము) శ్రీసాయి; శ్రీసాయి సకల మార్గములకంటె పతన భయములేనిది. దగ్గరదైన సూటిమార్గము. శ్రీసాయి పొఱపడనీయని, భ్రాంతి కలుగనీయని సత్యము శ్రీసాయి. కల్పశతములైన నశింపని ప్రాణము.

శ్రీసాయీమార్గము ననుసరించువాడు సత్యము నెఱుగగలడు. సత్యము నెఱుగ జాలినవాడు శాశ్వత జీవము పడయగలడు. అట్టివాడు శ్రీసాయీ మహాప్రభువు ఆజ్ఞలను పాటించవలయును. సత్యమెఱుగ

దలచువాడు శ్రీసాయీశుని గాఢముగ విశ్వసింపవలయును. పరిపూర్ణత నొందగోరువాడు శ్రీసాయీ సద్గురుదేవునకు సర్వసమర్పణము గావింప వలయును. శ్రీసాయీ ప్రభువరేణ్యు ననుసరింప దలచువాడు అహం తను సంపూర్ణముగ నిర్మూలించవలయును. ధన్యజీవితము పొందగోరు వాడు ఈ లౌకిక జీవితము నేవగింపవలయును. శ్రీసాయీ మహా ప్రభువు పదమున - పరంధామమున వసింపగోరువాడు ఈ ప్రపంచ మున వినయవిధేయతలతో అడకువ, మెలకువ గలిగియుండవలయును.

చూడుడు - (S. C. C. Para 203 - శ్రీసాయీనాథబోధామృతము)

బాపూసాహేబ్ జోగ్:— బాబా! అనన్యభావమున నేనింత కాలమునుండి నీసేవ చేయుచున్నాడను. నా సేవ ఫలించినదని నేనెట్లు తెలిసికోగలను?

సా. బా:— నీవు నావలె సర్వబంధములనుండి విడివడి నా భావముపొంది, నావలె 'కుఫ్నీ' ధరించి, భిక్షించి జీవింపనేర్చినపుడు మన యిరువురి హృదయములను ఆనందింపజేయు నీ సేవ సఫల మైనది - అని నీవు గ్రహింపుము.

శ్రీసాయిమహాప్రభువు బాపూసాహేబ్ జోగునకు తెలిపిన రహస్యము - మమత అహంతలను విడనాడి, లోకవిషయముల జాడబోవక వైరాగ్యకలితుడై, లోకవస్తు సేకరణ వాంఛనుడిగి, నిర్లిప్తుడై లభించిన దానితో దేహపోషణము జరుపుకొనుచు జీవయాత్ర నెఱపువాడు ధన్యుడు. వాని భగవత్సేవలు సఫలములగును అని మనము గ్రహించవలయును.

ప్రార్థన:—

విశ్వరంగమున నివృత్తి మార్గంబు - ప్ర
వృత్తి మార్గమదేమో యెఱుగజాల
సత్యవస్తువ యేదొ యసత్యవస్తు వదేమొ
యీ లోకమందు నే నెఱుగజాల

నిత్యజీవనమెదో యనిత్యజీవనమేమొ
యిసుమంతయేని నే నెఱుగజాల
అంతరింపని మమతాహంకృతులను దూ
లించు విధంబు నేనెఱుగజాల
ఇందు పథము - సత్యము - ప్రాణ మీవయనెడి
గాఢవిశ్వాస మొసగి, యాజ్ఞలను మేర
నీక, నీ పదాంకితుని గావించుకొనవె!
సత్యకరుణాస్వభావ! శ్రీసాయిదేవ!

6. మానవుడు తన బుద్ధికి అందని దైవ నిర్ణయమునుగూర్చి చర్చించుట తగని పని;

జబతూ ఆయా జగతుమే - లోగ్ హసే తూ రోమ్
ఐసీ కరనీ నాకరే - పీఛే హసే సబ్ కోమ్

నవ్విరెల్లరు రోదనము సేయుగంటి
విశ్వసుధను జనియించుచు; కొంటి
కరణి నల్వురు నవ్వగాబోని చొప్పు
బరికించి, యింతనేన్ బనియంచు టొప్పు.

(శ్రీసాయీ కబీరు సూక్తులు)

మానవుడు తన బుద్ధికి అందని దైవనిర్ణయములగూర్చి చర్చించుటవలన పరిహాసాస్పదుడగును. ఈ విశ్వమున నతడు కావింపదగని విషయములలో నిది మొదటిది. సాధకుడైన భక్తుడు అగమ్యములు - లోకాతీతములైన శ్రీసాయీభగవానుని నిర్ణయములు - తీర్పులగూర్చి విమర్శింపదగదు.

"ఈమానవుడేల ఉపేక్షితుడై నిరాకరింపబడెను. ఆ నరుడేల మిక్కుటి ఆదరింపబడెను. ఇతడేల నిర్దాక్షిణ్యముగ ద్రోసివేయబడెను.

అతడేల లౌకికముగ గొప్ప పదవికి జేర్పబడెను. ఇట్టి విషయములు మానవబుద్ధికి అగోచరములు, అతీతములు. ఊహించి, చర్చించి గ్రహించుటకు మన బుద్ధిబలము చాలదు. ఇవి హేతువాదములకు భగవానుని తీర్మానములు విశదములుకావు.

ప్రతిపక్షులగువారుకాని లేక వినోద వాగ్వివాదమునకు ఊబుసు పోకకుగాని యిట్టి ప్రశ్నలడుగు వారికి సాధకుడైన భక్తుడు తెలుపదగిన సమాధాన మొక్కటే. "ఓ స్వామీ! నీవు ధర్మమూర్తివి, సమవర్తివి. శ్రీసాయీమహాప్రభూ! నీ నిర్ణయము సక్రమమైనది-" అని మాత్రమే. సమర్థ సద్గురుదేవుడైన శ్రీసాయీ మహాప్రభువు తీర్పు-సత్యము - ధర్మము - న్యాయబద్ధమైనది - యని మాత్రమే తెలుప వలయును. భగవానుని నిర్ణయమునకు భయపడవలసినదే కాని, చర్చించుట కెట్టి అవకాశములేదు. మానవమాత్రునకు అవగాహనము కానిది.

అ విధముగనే సాధుసత్పురుషులగూర్చి వారివారి తారతమ్య ప్రస్తావనము తగనిది. దైవసామ్రాజ్యమున ఇందఱు సాధుసత్పురుషులలో ఉన్నతస్థాన మాక్రమించినవారెవరు?- ఇత్యాది ప్రశ్నలు తగవు. ఇట్టి ప్రస్తావములు కలహకారణములు - వ్యర్థములు - రాగద్వేష మూలములు. ఒకరు ఈ సత్పురుషుడు - ఈ సద్గురువు గొప్పవాడనిన-మఱియొకడు ఆ సత్పురుషుడు - ఆ సద్గురువు గొప్పవాడని ప్రతివాద మందుకొనును. అటుల ధ్రువతార సాధుసత్పురుషుల కొలందులగూర్చి వాదోపవాదములకు గడంగుటవలన తగిన సమాధానము దొరకక పోవుటయేగాక వారి తారతమ్య చర్చలవలన ఆ మహాపురుషులకు బాధ కలిగించినవార మగుదుము. సాధుసత్పురుష నిందకు బాల్పడినవారము నగుదుము. ఇట్టి చర్చలవలన ఈర్ష్య - అసూయ - ద్వేషములు పెంపొందును. శ్రీసాయీమహాప్రభువుయొక్క ప్రశాంతి ధామము గాంక్షించు సాధకుడైన భక్తుడు కలహకాముడు కారాదు. ఆ పరంధామము శాంతి వినయ విధేయతలచే సాధ్యమగునది కాని, మానవుల ఆధిక్యత - స్వాభిమాన ప్రశంసలచే లభ్యమగునది కాదు,

కొందఱొక అవతార పురుషుడైన సాధుసద్గురువునందు ప్రేమాధిక్యత గలిగి అంతకు మించినవాడు లేడని విశ్వసించి ప్రశం సింతురు. మఱికొందఱు వేఱొక సద్గురువునుగూర్చి శ్లాఘింతురు. అట్టి ప్రేమ మానవ పరిమితితోగూడిన ప్రేమకాని దైవప్రేమ కాదు. సకల అవతార సాధుసద్గురువులుగ అవతరించినవాడు సర్వేశ్వరుడగు దైవమే. ఆ సద్గురువులకుగల సర్వసమర్థతలు ఆ దైవదత్తములే. వారి నెల్లర కరుణాస్వరూపులుగ తీర్చిదిద్దినది దైవమే. దిగంత విశ్రాంత కీర్తి ప్రసాదించినది దైవమే.

ఏ మానవుని అర్హత యెట్టిదో దైవమునకు మాత్రమే వేద్యము. తదితరులకు ఎఱుగరానిది. అవతారపురుషులైన సాధు సద్గురువులు దైవస్వరూపులు. "చల్తే బోల్తే దేవ్"-పుడమిపై చరించుచు పలుకుచున్న దైవము - అనదగినవారు. జగద్రక్షణ కొఱకు దైవమే యేరికోరి వారిని తన దఱికి ఆకర్షించినాడు. దయాప్రపూర్ణుల గావించి నాడు. ప్రాకృతవిషయాతీతులుగ తీర్చిదిద్దినాడు. తనయంతవారిగ కావించినాడు. తనతో సమానస్థానమును ప్రసాదించినాడు. కావున ఈ విశ్వమునగల అవతార సాధుసత్పురుషులందు సమగతి నధివసిం చిన సర్వనియంతయగు ఆ భగవానునే మనము సమాశ్రయించి, ప్రార్థించి సేవించవలయును. ఆ నామి - నామము ఏకమే. ఆ నామి ఆ పాదమస్తకము సేవనీయడు. ఆ నామము సంసారసాగరమున నిమగ్నులైన మానవుల తరింపజేయ సమర్థమైనది. ఇంతదనుక పొంత మిన పాడమనున్న అవతార సాధు సద్గురువులలో ప్రాకృత మానవ దృష్టికి అతిస్వల్పుడుగ చూపట్టువానిని నిరాదరించినను మహోన్న తుడు అని భావింపబడువానిని ఆదరించి గౌరవించినవారు కాజాలరు- అను విషయము సాధకుడగు భక్తుడు గాఢముగ గుర్తించవలయును.

ఏ సాధుసత్పురుషుని నిరాదరించినను శ్రీ భగవానుని సన్నిధిని - దైవసామ్రాజ్యమున - ఆపరంధామమున నున్న సకల సాధు సద్గురువులను అగౌరవించినవారలే యగుచున్నారు.

ఈ అవతారులైన సాధుసత్పురుషులందఱు ఏకైక ప్రేమ సూత్రమును ఆధారము చేసికొనియున్నవారే. అందఱు మహోదారులే, వీరందఱి సంకల్పము ఏకమే. వారియందఱి లక్ష్యము - ఆశయము ఒక్కటే. వీరందఱు నొండొరుల సమానముగ ప్రేమించుకొనువారలే. వీరలందఱిలో తారతమ్య ప్రస్తావనము లేదు. అన్నిటికంటె విశేషము వీరు తమ తమ ఆధిక్యతలను పాటించక పరమేశ్వరుడగు భగవానునే తమ ఆత్మకంటె అధికముగ ప్రేమించి సేవించువారగుచున్నారు. ఆ భగవానునందే లయించి విశ్రమించువారగుచున్నారు ఈ ప్రపంచ మున నెట్టి వస్తువైనను అట్టి సాధుసత్పురుషులను వెనుకకు మరల్చ జాలదు. క్రిందు సేయలేదు వారందఱు నిత్యసత్యప్రపూర్ణులు. వారి యందుగల పరంజ్యోతి ఎన్నికల్పములకైనను తఱుగునది కాదు.

లౌకికములను అట్టి లౌకిక కాముకులను ప్రేమించు దేహ బద్ధులు, దేహాత్మబుద్ధిగల మానవు డే క్షణమందేని భగవద్భక్తులను సాధుసత్పురుషులైన సద్గురువులను గూర్చి లాఘవముగ పలుకరాదు. అట్టిలౌకిక విషయాసక్తులగు నరులు నిర్మలమైన ఆధ్యాత్మిక ప్రేమ దేనియందును పఱుపజాలరు. వారికి లౌకిక వాసనలు ఆ యా మానవ స్నేహబంధము ననుసరించి యుండును. వారి వారి లౌకికానుభవము లను పురస్కరించుకొని దైవిక విషయములయెడ నేవేవియో ఊహలను కల్పించుకొనుచుందురు.

కావున సాధకుడైన భక్తుడు తన బుద్ధికి అందబోవని విషయ ములగూర్చి వ్యర్థములైన ఆలోచనలతో - ఆశయములతో సదమదము కారాదు. ఎంతసేపు ఆ దైవ సామ్రాజ్యమున కట్టకడపటి స్థానమైన లభించిన చాలును. ధన్యుడనగుదును - అనుబుద్ధి - లక్ష్యము దృఢము చేసికొని, ఆ ప్రయత్నమున నుండుట శ్రేయస్కరము.

సాధకుడగు భక్తుడు సమర్థ సద్గురు దేవుడగు శ్రీసాయీ భగవానుని గాఢముగ విశ్వసించి, శ్రీసాయీనాథ పదాశ్రితులలో తానే అందరికంటె కనిష్ఠుడనని భావించి వినయవిధేయతల నలవఱచుకొని, శ్రీ సాయీనామమును కీర్తించుచు శ్రీ సాయీ తత్త్వమును స్మరించు

చున్న, జన్మసఫలత సిద్ధించునుగాని దైవసామ్రాజ్యమునందు ఏ సాధు సత్పురుషుడు మహోన్నతస్థాన మాక్రమించియున్నాడో తెలిసికొనుట వలన కలుగు ఫలము లవమేనియు లేదు. అట్టి యెఱుకవలన నొక అడుగేనియు మించలేడు.

సాధుసత్పురుషులైన సద్గురువుల తారతమ్యములగూర్చి అన్వేషించి చర్చించువానికంటె తన పాపబాహుళ్యమునుగూర్చి పశ్చాత్తాపపడుచు, తన చెడుప్రవర్తనమును తలచుకొని యేవగించుకొనుచు, తనలోగల దోసగుల యేవగించుకొనుచు, తనలోగల గుణవిశేషములను అత్యల్పములుగ భావించుకొనుచు, సాధుసత్పురుషుల పరిపూర్ణతకు తానెంతెంత దూరముగ నున్నవాడో పరీక్షించుకొన జాలినవాడు దైవదృష్టియందు ఉత్తముడు. శ్రేయస్కాములగు మానవులు దైవము తమకు దయతో ప్రసాదించిన దాని దలచికొని, సంతుష్టి సంతృప్తుల బొంది వ్యర్థములైన పరిశోధనలకు కాలము వ్యయపుచ్చకుండు వారు ఉత్తములు. అట్టివారు వారి ఆధిక్యతలను శ్లాఘించుకొనరు. తమ యందు ఏగుణవిశేషము, ఏ సుకృత లేశము కలిగినను ఆ మాత్రమేని ప్రసాదించిన దయామయుడైన శ్రీ సాయీనాథుని శ్లాఘించి కీర్తింతురు. అట్టి శ్రేయస్కాములు వారలెంతెంత ఉన్నతస్థానము లందుందురో అంతలంతలు వినయవిధేయతలు, నిర్గర్వము కలిగి శ్రీ సాయీ భగవానునికి సన్నిహితులు - మిక్కిలి ప్రియమైనవార లగుదురు. వారెల్లరు తమ మకుటములను (కీర్తి ప్రతిష్ఠలను) దూరముగ తొలగ బెట్టి సాగిలబడి నిత్యసత్యస్వరూపుడగు శ్రీ సాయీమహాప్రభువు పాద పద్మముల రేణువుగ భావించుకొని మ్రొక్కుదురు. శ్రీ భగవానుని సామ్రాజ్యమున కట్టకడపటి సేవకుడుగ స్వీకరింపబడినను చాలునని నిరీక్షించువారు. అట్టివారు శ్రీ సాయీ మహాప్రభువు అంకిత సంతతికి జెందినవారగుచున్నారు.

శ్రీ సాయీ భగవానుని దర్బారులో నెవడధికుడని యెవ రేని ప్రశ్నించిన "పసిబిడ్డకంటె అడకువగల వ్యక్తియే అధికుడు" - అని సమాధాన మీయదగును. అటుల పసిబిడ్డ స్థాయిని జేరజాలని గర్వో

న్నతులు - అభిజాత్య విద్యాధన పదవీ గర్వోన్నతులు - ద్వారాకా మాయిమందిర ద్వారము ప్రవేశింప జాలరు. వెలుపల వేచియుండ వలసిన వారలే యగుదురు. అకించనులు - దీనులు - బాల హృదయముగల భక్తులు ఆ ద్వారము ప్రవేశించి శ్రీ భగవానునిజేరి నిత్య సత్యశాంతి సుఖానందముల బడయచుందురు.

ప్రార్థన:—

అవతారంబులు సాధుసద్గురులు ప్రత్యక్షంబునౌ దైవ, మ
మ్మట్లవుటన్ వారి కొలందు లెన్నదగ, రవ్యాజానురాగాన నే
కవిధిన్ జీవుల నుద్ధరించుటకు లోకబందు వర్తింతు; వా
రెవరేన్ సేవ్యులటంచు దెల్పితివి: తండ్రీ సాయినాథప్రభూ!

అరయగ నామ - రూప విలయంబులు లేక, ప్రసాదకాంక్ష త
చ్చరణ సరోజ సేవలను సల్పు శ్రితప్రకరంబునోచు, సా
దరమున నామరూపముల దాల్చ స్వలీలల జాటు మేటియౌ
పరమదయాంబురాశి - భగవానుడు సాయి ప్రసన్నుడయ్యెడిన్.

7. మన సకల ఆశయములను అచంచల విశ్వాసమును
శ్రీసాయీమహాప్రభువునందు నిలుపుకొని అనుసరించవలయును:

గురుకో కీజై దండవత కోటి ప్రణిపతతన
కీక నజానై భృంగకో వహ కరలే అపసమాన

శ్రీగురుపాద రాజీవముల్ మ్రోల
సాగిలబడి నతుల్ సలుపు వేవేల,
కనగజాలద కీటకంబు లేశంబు,
దనకు సామ్యము సేసి తనువు భృంగంబు.

(శ్రీ సాయీ కబీరు సూక్తులు).

సాధకుడైన భక్తుడు తన భౌతిక జీవమున సమర్థసద్గురు దేవుడైన శ్రీసాయీ మహాప్రభువునందు విశ్వాసము గలిగి, లౌకిక, పారలౌకిక ఆశయము లన్నియు ఆ తండ్రియందు నిలిపి, ఆ స్వామినే ఆధారము (తోడు) చేసికొని నిర్భయముగ అనుసరింపవలయును. శ్రీసాయీ భగవానుడే నిత్యసత్యధామమునకు మార్గము - మార్గదర్శి. అంతకంటె సత్యకరుణాస్వభావుడు లేడు. బాబా మన తోడుగనున్న ఈ విశ్వమున మనకు వెరువు అనునది కలుగదు. ఆ స్వామి మనతోడ లేనిచో సుఖము లేదు. శ్రీసాయియే దూరమైన, సకల సంపన్నిక్షేపములు వ్యర్థములు, బాబా మన సన్నిహితుడుగనుండెనా ఘోర దారిద్ర్య జీవితమైనను సత్యశాంతి సుఖానంద దాయకమే యగును. శ్రీసాయీ భగవాను డెందుండునో అదియే పరమ పదము. శ్రీసాయీనాథుడు లేని స్వర్గమైన నరకప్రాయమే యగును. మనము గాఢముగ విశ్వసింపదగినవాడు, మన సకల వ్యసన సంకట పరిస్థితులందు ప్రాణ-జాపనై - ఆయా సమయములందు రక్షించి, ఓదార్చి, సముద్ధరింపగల సమర్థుడు మఱియొకడు లేడు. కావున ఆ తండ్రినే నెఱనమ్మి, పాదముల వ్రాలి, మొఱపెట్టుకొని అనన్య బుద్ధిని సేవించవలయును.

ఈ విశ్వమున సకలము తన పదాంకితునకు శ్రేయస్కరముగ పరిణమింపజేయగల దక్షుడు శ్రీసాయీనాథుడు. ఆయా సమయము లందు కష్ట నష్టములను గలిగించుచు, పెడమార్గముల మెలపుచున్నట్లు బాబా తన ఆశ్రితుని బుద్ధికి తోచినను ఇవన్నియు తన ప్రేమపాత్రుడు - పదాంకితుడైన బిడ్డను వేవిధముల పరిరక్షించుటకై కూర్చినను తుదకు ఇన్ని పరీక్షలు తనవానికి శ్రేయస్సునే ప్రసాదించు చుండును.

లౌకిక సుఖసంతోషానందములు మనకు సమకూరుచున్నను లేక ఎట్టి సంకట పరిస్థితులు మనల గ్రమ్ముకొనుచున్నను శ్రీసాయీ ప్రభువు నెడ ఆదరణ గౌరవములను సడలనీయరాదు.

మన సకల భారములను ఆ తండ్రియందే నిలిపి, మన ఆశ్రయము రక్షణము ప్రాపు కాపు బాబా ఒక్కడేయను అచంచల నా

విశ్వాసము కలిగి యుండవలయును. శ్రీసాయీ ప్రభువు అనుగ్రహింప దలచిన తప్ప ఎంతటి విద్యావంతులు - ఉన్నత పదస్థులు - ఉత్తమోత్తమ గ్రంథములు మన సంశయముల దీర్చి మనకు దాపరించు సంకటములను విచ్ఛేదము జేసి రక్షింపజాలవు. చేయూతనిచ్చి, తోడ్పడి, ధైర్యము గూర్చి, ఓదార్చి, ప్రబోధించి ఉజ్జీవనము గల్పింప సమర్థ సద్గురుదేవుడు శ్రీసాయీనాథుడొక్కడే కాని, మఱియొకడు లేడు.

ప్రార్థన:- ఓ సాయీమహాప్రభూ; సకల శ్రేయములకు జనక స్థానమీవు, జీవమునకు ఆధారమీవు, వాక్కునకు పరమావధి వీవు, నిన్ను ఉత్తమోత్తమ ఆశ్రయముగ నిశ్చయించుకొనుటే నీ సేవలకు అత్యుత్తమ ధర్మము.

ఓ కరుణానిధీ! ఏకైక ఆత్మబంధూ! శ్రీసాయీ మహాప్రభూ; కనులార నిను చూడనిమ్ము! నోరార నిన్ను ప్రార్థింపనిమ్ము! మనసార నిన్ను ధ్యానింపనిమ్ము! అచంచల విశ్వాసము నీయందు హత్తుకొన నిమ్ము! తండ్రీ!

పెక్కు కల్పములనుండి నిన్నెడబాసి దూరమై సంసార మరుభూమిని అటమటించుచు అయా దుష్కర్మములచే క్రుంగుచు దుష్ట సంస్కారములచే అణగద్రొక్కబడుచూ ఏదో సుకృతలేశమున నీ శరణుజొచ్చిన నీ పదాశ్రితుని. నీ సేవకుని వీని అనుగ్రహించి ఆశీర్వదింపుము. నీ పదాంకితుడైన ఈ దీనుని ప్రార్థన పాలింపుము. నీ పదభ్రాజితమైన పరంధామమునకు జేర్చికొమ్ము! దీనబంధూ! బాబా! వీని కట్టకడ ప్రార్థనమిదే!

"మై అపరాధీ జన్మకా - నఖశిఖభరా వివార్
తుమ దాతా దుఖ భంజనా - మేరీ కరో సంభార్.

పాపకర్ముడను దేవ! భవభవంబు,
నా పాదమస్తకం - బఘవికారంబు!
కడు వదాన్యుడవు - దుఃఖవిభంజనుడవు
కడతేర్పు సాయి! న - న్ననుడు నేడుగడవు.

(శ్రీసాయీ కబీరు సూక్తులు)

శ్రీసాయీ అనుసరణము సంపూర్ణము.

శ్రీ సాయీనాథార్పణమస్తు!

శ్రీసాయీ సమర్థ - శ్రీసాయీతి శరణ్.

సోదరసోదరీ భక్తులారా!

'సఖ్యం సాప్త పదీనం' అను నుడి జ్ఞప్తియందుంచు కొనుడు! మీరింత దనుక దయామయుడు దీనబంధువైన శ్రీసాయీ మహాప్రభువును అనుసరించుచు ( సప్త పాదములు ) ఏడడుగులు మెట్టినారు. కావున శ్రీసాయీనాథుడు మీకు స్నేహితుడైనాడు.

"నేహా నివాహైహీ బనే - సోచై బనేన ఆన్
తనదే మనదే శీశదే - స్నేహ నదీహైజాన్"

స్నేహంబు నిలువుట - నేర్పరితనము
ఐహిక సుఖములేవైన బోవిడు వట;
తనువేని మనమేని తలయేని దుడకు
జననిమ్ము, కాని నీ - సఖ్యంబు విడకు.

(శ్రీసాయీ కబీరు సూక్తులు)

స్నేహా భక్తిరితి ప్రోక్తః
"మాహాత్మ్యజ్ఞాన పూర్వస్తు సుదృఢః సర్వతోఽధికః,
స్నేహాభక్తి రితిప్రోక్తస్తయాముక్తిర్న చాన్యథా,"
జ్ఞానపూర్వః పరస్నేహా నిత్యభక్తి రితీర్యతే"

ప్రతి మానవునకు సర్వేశ్వరుడు అగు భగవానుడు ఒకే హృదయము ప్రసాదించినాడు. ఆ హృదయమున సాధకుడగువాడు శాస్త్రగురుబోధనలను స్వానుభవమును పురస్కరించుకొని తన గురు దేవుని మాహాత్మ్యము లెస్సగ గుర్తించి, తనకేడుగడ ఆ స్వామియొక్కడే అని విశ్వసించి, "రక్షిష్యతీతి విశ్వాసమ్" ఆ సత్తువునకు మాత్రమే

స్థాన మీయవలయును. ఆ ప్రభువే యీ విశ్వమున సకల చరాచర పరివ్యాప్తుడుగ నెఱుగ వలయును. అట్టి యెఱుకగలిగి మానవుడు పఱుపు భక్తి - అనురక్తియే - స్నేహము అనబడును. అట్టి స్నేహము వంతు స్వార్థపరత తగదు. ఇంత దనుక శ్రమించి శ్రీసాయీ మహా ప్రభువు వెంట (సప్తపాదములు) ఏడు అడుగులు మెట్టినారలు గాన మీరు శ్రీ సాయీబాబాకు సన్నిహితులు స్నేహతులైనవారలు, మీ యెల్లరకు సహస్ర ప్రణామము లర్పించు చున్నాడను.

 శ్రీసాయీ భక్త పాదరేణువు

 రచయిత.



శ్రీసాయీ శరణ్





# ఈ రచయితచే రచింపబడి పునర్ముద్రణ కావలసిన గ్రంథములు



1 శ్రీలక్ష్మీనృసింహస్తోత్రమంజరి.
2. శ్రీమద్భగవద్గీతామృతము (శ్లోకము—తెనుగు పద్యములు)
3. శ్రీప్రబోధ సుధాకరము (శ్రీశంకరభగవత్పాదరచిత—శ్లోకములు తెనుగుపద్యములు)
4. శ్రీకృష్ణకర్ణామృతము (శ్రీలీలాశుక సంస్కృత కృతికి — తెనుగుపద్యములు)
5. శ్రీనివాసదయాశతకము
6. శ్రీరామా! ఆపదుద్ధారకా! (శతకము)
7. శ్రీవేంకటేశ్వర సుప్రభాత గీతములు
8. శ్రీహనుమాన్‌చాలీసా! (ద్విపద)
9. శ్రీసాయీ మననము
10. శ్రీసాయీ కరుణ
11. శ్రీసాయీబాబాకూడా దేవుడేనా? ఉన్నదేవుళ్ళు చాలకనా? (సందేహ నివృత్తి)
12. శ్రీసాయీ కబీరుసూక్తులు
13. శ్రీసాయీ విజయము (జంగమకథ)
14. శ్రీసాయీనాథ బోధామృతము
15. శ్రీసాయీ ప్రేమకిరణములు
16. శ్రీసాయీగీత
17 శ్రీ ప్రేమామృతము (నారదభక్తి సూత్రములకు వ్యాఖ్య)